శ్రీః

# చిత్రహారిణి

(అద్భుతమైన నవల)


రచయిత:

గరిమెళ్ల సత్యగోదావరి శర్మ

(Retired, Senior Telugu Pandit, P. S. High School, Mylapore.)



ప్రకాశకులు:

శ్రీ అంబికా బ్రదర్సువారు

మైలాపూరు, మదరాసు

1947

దీనివెల 4-2-0.

# తొలిపలుకు

చిత్రాపూర్ణిమ యను నీ నవలను నేను గొన్ని సంవత్సరములకుఁ బూర్వము వ్రాసితిని. ఇంతవఱకు నిది ప్రకటించుటకు వీలు కలుగ దయ్యె. ఇప్పుడు, శ్రీ అంబికా బ్రదర్సువారి యాదరణముచే నిది ప్రకటింపఁబడియె. ఇందలి యితివృత్తములోని ముఖ్యభాగ మొక యాంగ్లేయ కథానికనుండి గైకొని యత్తదుచిత కథాసంవిధానములను గల్పించి చేర్చి వ్రాసితిని. కథాలహరి మైమూరు—ధర్మపర మార్గమునఁ బ్రవహించినది. ఇందలి పాత్రాభిధానము లన్నియుఁ గేవల కల్పితములు; భావ సరళ శైలీ సమేతము. అచ్చటచ్చట ఒండు రెండు వాడుక పదములు తమంతటఁ దొరలినవి యనుచితము లని యెంచి యట్లే యుంచినాఁడను.

ఈ నవల, విశ్వవిద్యాలయ విద్యార్థులకు వ్యాసరచన పాఠ్యముగా నుండఁదగు నని విశ్వసించుచున్నాఁడను. ఆంధ్ర మద్రపురీ విశ్వకళా పరిషత్తులవారు దీనిని పాఠ్యముగాఁ బరిగ్రహించి నా శ్రమను ఫలింపఁజేసి, ప్రకాశకుల సదుద్యమమునకుఁ బ్రోత్సాహము గలిగింతురు గావుత మని యెంతో యాశించుచున్నాఁడను.

ఇట్లు

గ్రంథకర్త

గరిమెళ్ళ సత్యగోదావరి శర్మ

మైలాపూరు,
5-9-1947

శ్రీ

సద్గురవే నమః

# చిత్రాపూర్ణిమ

## ౧.

## ప్రథమ భాగము

### భట్టు—1

చిత్రాపూర్ణిమనాఁటిరేయి నిండుజాబిల్లి వినువీధి నొకజాము పయనము గావించెను. పండువెన్నెల పిండి యారఁబోసినట్లు లెల్లెడలం బర్వియుండెను. చల్లగ మలయ మారుతము వీచుచుండెను. మైసూరు రాజవీధియం దలఁకుడు తగ్గుచుండెను. రాజమార్గమున కిరుగెలంకుల నచ్చటచ్చటఁ గొన్ని యంగడులందు మాత్రము మినుకు మినుకు మను దీపపు వెలుఁగులు గానవచ్చుచుండెను. గస్తు దిరుగు రాజ భటు లందందుఁ గనిపించుచుండిరి. అతి ప్రతాపశాలి యగు రాజ స్తమింపఁ జల్లని రాజ పరిపాలనంబున శ్రమవాసి రాజ ధానీ నగరము సుఖావస్థం జెందియుండెను. ప్రకృతి శాంతి యుతమై చెలంగుచుండెను.

అట్టి తరుణమున నొకపురుషుఁడు సందు వీధినుండి, రాజమార్గమున కరుదెంచి యటు నిటు పరికించుచు నిలువం బడెను. అతని వయస్సు ముప్పది వత్సరము లుండవచ్చును. అతఁ డంత పొడవరియుఁ గాఁడు; పొట్టివాఁడును గాఁడు; స్థూలకాయుఁడుఁ గాఁడు; శుష్కాంగుఁడును గాఁడు; సరి గంచుదోవతి కట్టి, చక్కని యుత్తరీయమును వల్లెవాటు వేసికొని యుండెను. అతనిశరీరము పరిశ్రమ విలసితమై కాంతి

వంతమై యలరారుచుండెను; నున్నగ దువ్వి వేసికొన్న జుట్టు ముడి మెడకొంకుల నిండియుండెను; నెన్నుదుట ముంగురుళ్ళు వ్రేలాడుచుండెను; ఫాలతలంబున నల్లని తిలక మొప్పు చుండెను; బొమ లలికభాగంబునఁ గలిసికొని యుండెను; కను లాకర్ణాంత విశాలములు గాకపోయినను గళావిలసితము లయి యుండెను; ముక్కుమాత్ర మొక్కింత పెద్దదై కొన వంపై యుండెను; చెవులును దౌడలు నొక్కింత పెద్దవి; మీసము నల్లనై మెలికలు దిరిగి యుండెను; మీఁది పెదవి చిన్నది; క్రింది పెదవి రవంత పెద్దది; గడ్డము తీర్చి దిద్దిన ట్లుండెను; మొగ మొకింత కోలగ నున్నను జక్కనిదే; చూపులు విలాసవంతములు; చూచువారి హృదయముల నాకర్షింపఁజాలినంత వేష మున్నది; బాహువులు సుదృఢములు; ఒడలిబందోబస్తు చక్కగ నున్నది. మొత్తముమీఁద నతఁ డందగాఁ డనిపించుకొనుచుండెను.

ఆ పురుషుఁ డట్టు లరుదెంచి నిలిచి, బంగారుకట్టు పొడికాయ మొలనుండి తీసి పట్టుకొని తలవంచి కూనరాగములు తీయుచు నా రాజవీథిని సాగిపోవుచుండెను. ఇంతలో వెనుక నుండి యొకపురుషుఁడు సరసర నరుగుదెంచి యతనిచేయి పట్టుకొనెను. త్రుళ్లిపడి మొదటివాఁడుకను లెత్తి రెండవవానిం జూచి నవ్వుచు, "ఓహో!, నీవఁటయ్యా! నమస్కారము. రామలింగయ్యా! నీకొఱకే వచ్చుచున్నాను. నేఁడే తయారు చేయించినా నీ పొడి. ఒక్కపట్టు పీల్చి పసందు చేయవల వలయును" అని పలుకుచు బిరడాతీసి రామలింగయ్యచేతిలో నింతపొడి వేసెను. రామలింగయ్య యొకపట్టు పీల్చి,

రెండవపట్టు పట్టుకొని చేయి మలువుకొని ముక్కుమాట లతో, "స్వామీ! దబ్బర లేల యాడెదరు? ఈ రాజ వీధిలోనా మాయి ల్లున్నది? నేటి సాయంత్రమే సొమ్మిచ్చెద మంటిరే యిటు సేయఁదగునా? మీ యాపద కడ్డపడిన వ న్నిన్ని చిక్కులు పెట్టి త్రిప్పవచ్చునా?" అని యడిగెను. "రామలింగయ్యా! నా సంగతి నీ వెఱుఁగవా? వచ్చునను కొన్నసొ మ్మింకను రాలేదు. వచ్చినవెంటనే వడ్డీతో నీబాకీ సీదాగా నిచ్చివేయుదును. భయము లేదులే" అని యా నాగ రకుఁ డన, నయ్యా! యబద్ధ మెందులకు? నిన్నరాతి రోడి పోయిన నన్నాలు రాక లెక్కడివి? ఆటకు డబ్బున్నది గాని, యప్పుతీర్చుటకు లేదా? ఇది న్యాయమునకుఁ గాలము గాదు బాబు! నా సొమ్మిచ్చి మఱి పొందు" అని రామ లింగయ్య పలికెను. "రామలింగయ్యా! కొంచె మోర్చుము. రావలసినది రాకున్న నీవు మాత్ర మేమి సేయుదువు? రెండు మూఁడుదినములలో నీ వడుగకున్నను నీసొమ్మిచ్చివేసెదను. ఇంత మొగమునూడ వేమోయి! మఱొక పొడిపట్టు తీసికో, పొడి మెట్లున్నదో చెప్పినావు కావు" అని నాగరకుఁ డనెను. పొడిపట్టు తీసికొని "భట్టుగారు! మీరు చేయించినదానికిఁ దిరుగా? నాని కేమిగాని, మిమ్ము నిక్కచ్చి పఱచుట నా కిష్టములేదు. నేఁడు శుక్రవారము. మీ మాటప్రకారము సోమవారమునాఁడు సొమ్మిచ్చివేయవలయును. మీ కడ వడ్డీ పుచ్చుకోను. మీ యౌదార్యము నెఱుఁగుదును. మఱి సెలవా?" అని రామలింగయ్య యడుగ, "అన్నా! నిన్ను దగా చేసెదనా? నే మాటతప్పిన సూర్యచంద్రులు గతులు

తప్పినట్లే. ఇంక సరియా? వెళ్లుము'' అని నాగరకుఁ డాతనిం బంపివై చెను.

''పాపము! అమాయిక బ్రాహ్మణుఁడు. నాలుగురాలు వడ్డీ కాశించి ముప్పు గడపిపెట్టినాఁడు. వీనిఋణ మెట్లు తీర్చుకోఁగల్గుదునో''అని భట్టాలోచించుచు నొకపొడి చిట్టా పీల్చి పొడికాయను జూచుచు, ''ఆహా! పొడిపాటి మంచివస్తు వింకొకటి లేదుగదా! 'నశ్యం సర్వజన వశ్య'మ్మని యొకఁడు చెప్పఁ 'బొడుము లేకున్న నేపని పొసఁగదన్న'యని యింకొకఁడు చెప్పెను. ఎంతటి మాంద్యావస్థయం దున్నను బుద్ధి కిది రవంత తగిలెనేని జలుదు పుట్టించును. శిరోరోగముల కిది చెప్పినమందు. పీనసల కిది పిడుగుఁదునుక. ఎట్టి సంప న్నులనైనం జేయి చాపించును గదా యిది! కావుననే శిష్ట జన సమ్మతమైనది. ఆహా! ఈ పొడికాయ నాన్నగారిది. ఇదియే నాన్నగారు నా కొసంగిన యాస్తిలో మిగిలినది. వేదవేత్త, వైయాకరణ శిఖామణి, తార్కికసింహము, కవి రాజు నరసింహాచార్యులుగారన్న ఢిల్లీకిఁ బేరుమోసిన వారు! సంస్కృతమున, కర్ణాటకమున, నాంధ్రమున, ద్రావిడమున, నురుదున నఖండసాహిత్యప్రతిభ యాయనకుఁ గాక యిం కెవ్వరికిఁ గలదు?'ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్త్రం 'శాపాదపి శరాదపి' యన్నట్లు వైదిక లౌకికాచార తత్త్వత పద్ధతులం దాటితేటిన మహామేధావియై,మహీశూర సంస్థాన విద్వచ్ఛిరోమణియై,యజరామర యశోవిభాసి యగునాయ నగా రెక్కడ?నే నెక్కడ? సింహముకడుపున నక్కపిల్ల పుట్టె నన్న గోపాలరాజుగారి మాట యథార్థము. నాన్నగారిం

దలంచుకొన్నప్పుడు నాహృదయము నీరగుచుండును. ముసలి తనంబున జనించుటచే న న్నల్లారుముద్దుగాఁ బెంచిరి; బాల్యముననే నా మాతృదేవత, గతించుటచే నా యాడిన దాట నా పాడినదిపాటగా జరిపిరి; తమంతవానిం జేయవలయు నని తమకుం గల విద్యాసంపత్తు లవ్వారిగా నొసంగిరి; సద్గుణ సంపన్న యగు, ఇల్లాలికి నన్నొప్పఁజెప్పి స్వర్గస్థులైరి."

"నా ముద్దు, మొద్దుగాఁ బరిణమించినది. చదివినచదువు . నెడ నిరాదరణ జనించినది. ద్యూతవ్యసను లగుమిత్రు లల వడిరి. ఇంట నున్న సర్వస్వము నూడిచికొనిరి. అంత ప్రేమించు మేనత్తమాట వినక యాతతాయి నయి యామె సొత్తుగూడ నంకించి కొంపోయి యాడి, యోడి మఱి యామె కగుపింపక పరారయి దేశదేశములు తిరిగితిని. తుదకు మళయాళము చేరి రెండు మూఁడేండ్లు గడపితిని. నాన్నగారిచ్చిన విద్యాప్రభావంబున ధన మెంత గడించినను ద్యూతవ్యసనము, దానిని మ్రింగి వేసి నన్ను మిగుల్చుచున్నది. తుదకు విసుగెత్తి మరలివచ్చి వనపర్తి సంస్థానముఁ జేరి, యింత వ్రాఁతకోఁత లెఱిఁగినవాఁడ నగుటచే గుమాస్తాగిరీ సంపాదించి మేనత్తయింట నున్నవాఁడ నట్లుండవచ్చునా? అక్కడి యుద్యోగస్థుల సోమరితనమును డాంబికవృత్తిని గాంచి పరిహాసించి యా యుద్యోగ మూడఁగొట్టించు కొంటిని. తరువాత నయ్యవారి వేషము వేసి, వనపర్తిలోఁ బెద్దబడి పెట్టి సాగించితిని. నాలుగు నాళ్లలోఁ దమపిల్లలు నాలుగుశాస్త్రములు చదువవలయునని తలంచు గృహస్థులే కాని నాలుగునాళ్లైన నయ్యవారి కింతయన్నము పెట్టవలయు

నన్నవారు గానరాకుండుటచే నక్కడి కాపదవికి రాజీనామా యిచ్చివేసి సుల్తానుగారి నాశ్రయించితిని. దేశదేశము లతనితోఁ దిరిగితిని. కాని యాటిక్కముండకొడుకు చేయుదు నని చెప్పిన యేర్పాటు చేయక, యతిదాహజ్వరంబున నంతకాతిథి యైనాఁడు. రాజ్యము మరల మనరాజులకు వచ్చినది. "గోపాలరాజుగారిని, బూర్ణయ్య పంతులుగారిని నాశ్రయించి నాన్నగారి యుద్యోగము సంపాదించెద" నని చెప్పి వనపర్తివెళ్లి మేనత్తనడిగి రెండువందలు తెచ్చి యీయూరు చేరితిని. సంస్థాన వ్యవస్థ చక్కఁబడిన పిదపఁగాని నా దరఖాస్తు విచారింప వీలు లేదని పూర్ణయ్య పంతులు గారు చెప్పినప్పు డాశ్రయము విడువక వచ్చుచుఁబోవుచు సద్వ్యాపారమున నుండవచ్చునా? చేతిలోనున్నపైసా యూరకుండనిచ్చినది గాదు. మరల జూదమునకు దిగినాను. సరసరఁబదిదినములలో నాలుగువేలు చేయెక్కినవి. వేషము బడాయించినది. మిత్రులు పెచ్చుపెరిగిరి. పెద్దలోగిలి, నౌకర్లు, చాకర్లు, సరదార్లు కుదిరిరి. అంతలో నాట చాలించిన నెంత బాగుండును? నా జ్యోతిష జ్ఞానము నన్ను నిలువనిచ్చినది కాదు. ఈ రాహుమహాదశలో నేను లక్షాధికారి నగుదు ననియు, దానికి ద్యూతమే మార్గ మనియు నిశ్చయించి పాచిక పాఱుచున్నది గదా యని జోరుచేసి యాడితిని. వెన్నెల చీఁకటి సామెతగాఁ గొన్నాళ్లు గెలుపోటములు వచ్చివచ్చి యొక్కరాత్రి తమకమెక్కి యాడుటలో నంతయు, నోడిపోయితిని. బడాయిమాత్రము మిగిలినది. అది నిలువబెట్టుకొనుట కప్పుచేయవలసి వచ్చినది. అప్పు

పలికినంతవఱకుఁ దెచ్చి యాడి యోడిపోయితిని. ఎక్కడఁ జూచిన నప్పులే. ఆ బాధపడలేక గామలింగయ్యయొద్ద నన్నూఱు రూక లప్పుదెచ్చి చిల్లర లన్నియుఁ దీర్చివేసితిని. ఇంక నింటివానిబాధమాత్ర మున్నది. ఎవ్వఁడు నమ్మఁడు. రామలింగఁడు సొమ్ము తే తెమ్మని పీడించుచున్నాఁడు. ఏమి చేయుదునురా సర్వేశ్వరా యని పొడిచిట్టాపీల్చి యాలోచింప నాకొకయెత్తు తోఁచినది. "ఉద్యోగ మైనది. పెండ్లి సంబంధము కుదిరినది. వెంటనే నన్నూఱు రూపాయలు హుండీమూలమునఁ బంపు"మని మేనత్తకు వ్రాసినాను. పాపము వెఱ్ఱిబాగులది నాబొంకు నిజమనుకొని పంపినది. దానితో నప్పులు దీర్చుకొని హాయిగా నుండక, పోయిన డబ్బు మగుడ రాఁబట్టఁ దలంచి సభికులలోఁ జేరి యాడి యదియు నోడిపోయితిని. అప్పప్పులాగుననే యున్నది. మిత్రుల మన్నవారి యింటింటికిని తిరిగితిరిగి దిమ్మపట్టినాను. నాకాళ్లు తోళ్లయినవి. ఒకఁడును తొంగిచూడఁడు, వంగి వాలఁడు, పలుకరింపఁడు, పలుకరించినఁ బలుకఁడు, మొగ మగుపడఁ బెడమొగముపెట్టుకొని పోవుచున్నాఁడు. ఓ! డబ్బున్నప్పు డందఱు మిత్రులే. ఇపు డొకఁడును గానరాఁడు. రామచంద్ర భట్టుగా రింతదనుక మహారసికులే; ఇప్పుడు దద్దమ్మయిపోయినాఁడు. ఔరా! కాలమహిమ! ఇపు డేమి సేయుదును? ఏమిగతి? ఎవ్వరి నడుగుదును? ఇంకొక్క శ్యామసుందరమూర్తిమాత్రము మిత్రుఁడన్నవాఁ డున్నాఁడు. నాఁడు తోడిబాలురతో నాడి యొక్కఁడు వారిచేఁ జిక్కి చిక్కుపడనుండ నేనింత తోడుపడితి ననుకృతజ్ఞత యతనిని

విడువలేదు. నాకుఁ గావలసినప్పుడు పది యిరువది యిచ్చుటే కాని లేదనుట యతఁ డెఱుఁగఁడు. రాజపుత్త్రుఁడు రాజపుత్త్రుఁడే. ఇప్పుడు నీ ముప్పుగడప నాతఁడే దిక్కు. అతని కడకే పోయెదను'' అని యనుకొనుచు నా రామచంద్రభట్టు, రెండవ రాజభవనముపోలె నలరారుచున్న యొక దివ్యభవనముఁ జేరెను.

## 2

### చిత్రాపూర్ణిమ – వసంతోత్సవము

రాచబాట కెదురుగ నిరుగెలంకులను బండ్లు వరుసలు దీరి నిలిచియుండెను. ఆ మందిరము దివ్యజ్యోతులతో ధగద్ధగాయమానముగాఁ బ్రకాశించు చుండెను. మందిరాంతర్భాగమునుండి, మహాజనుల యానంద కోలాహలము సుదూరము వినిపించుచుండెను. మన భట్టు సింహద్వారము దాఁటి లోని యావరణలోని కేగెను. అచ్చోట నంతట గుఱ్ఱపుబండ్లు నిండియుండెను. బండ్లవాండ్రు గుంపుగుంపులుగాఁ గూడి ప్రసంగించుచుండిరి. వారి కోసరిలి యతఁడు సౌధద్వారము దరియం జనెను. లోపలికేగి యుత్సవమునఁ బాల్గొనఁ బ్రాల్మాలి యతఁ డచ్చోటనే తటపటాయించుచుఁ జాటుననుండి లోపలివింతలను జూచుచుండెను. ఇంతలో నేదో పనిగలిగి లోపలినుండి యొకపరిజనుఁ డచ్చోటికివచ్చి భట్టుం జూచెను. వాఁడు, శ్యామసుందరమూర్తిగారి సేవకుఁడగుటచే భట్టు నెఱుఁగును. వాఁ డచ్చెరువొంది యతనికి దండము పెట్టి, బాబూ! లోనికి దయచేయుఁడని పలికెను. ''ఓయీ! శ్యామసుందరమూర్తి యేమిచేయుచున్నాఁడు?'' ''బాబూ!



ఇదంతయు నద్దేవదేవుని కృపాతిశయము. (౮-పుట)

సందడిలో నున్నారు. పిలువుమని సెలవా?" "వలదు." "లోనికి విజయం చేయుదురా?" 'రాను' 'సందడి యణఁగు వఱకు బాబుగారిగదిలోఁ గూర్చుండుదురా?, "సరి; పద." అను సంభాషణ వారిరువురికి జరిగినపిదప సేవకుఁడు దారి చూప భట్టు తనచెలికాని గదికేగి యొక వాలుకుర్చీలోఁ గూర్చుండి యించుక సేపటిలో నిదురకు లోనయ్యెను.

ఇట సభామందిరము దివ్యజ్యోతులతో నలరారు చున్నది గదా! తదంతర్భాగమునఁ దూర్పుమొగముగ శ్రీకృష్ణునిపట మర్చితమై వెలు గొందుచుండెను. మృదంగ తాళధ్వనులు సెలంగ భక్తులు తరంగము లష్టపదులు నతి మనోహరముగఁ బాడుచుండిరి. ఒకచో వీణాగానము, వేఱొకచో వారనారీమణుల తౌర్యత్రికమును దదుపరి ప్రస్తుతము లయ్యెను. కొందఱు యువకులు చిఱునగవులు మొగమ్ముల నలంకరింపఁ జేత గంధపు గిన్నెలు ధరించి తత్సభాసీత మహాజనంబులఁజేరి వారియొడళ్ళకుఁ జందనముఁ బూయసాగిరి. కొందఱు ప్రసాదంబులు పంచసాగిరి.. కొందఱు పన్నీరు చిలుకుచుండిరి; తాంబూలము లిచ్చు చుండిరి; కర్పూరదామంబు లఱుతలం గీలించుచుండిరి. కొంతసేపటికి గీతవాద్యధ్వనులు సద్దణఁగినవి. తద్గృహాధిపతి యగు గోపాలరాజుగారికి నాఁడుగలిగినసంతోషమునకు మేర లేదయ్యె. పౌరమహాజనులకెడ కతఁ డరుగుచు నొకొక్కరిని వరుసలుపెట్టి పలుకరించుచుఁ దగురీతిని సంభాషించుచు, వారు గావించు తాత్త్విక స్తుతులకు ముదమంది, యిదంతయు నద్దేవదేవుని కృపాతిశయ మని శ్రీకృష్ణుని చిత్రపటముం

జూపుచు నెల్లరను వారివారికిఁ దగినతీరున సన్మానించు చుండెను. నడుమ నడుమ నాతనిదృష్టి లోకయువకునిపయిం బ్రసరించుచుండెను. ఆ వన్నెకాఁడు, తెల్లని పట్టుజరీ షరాయిఁ దొడుగుకొని, యాకుపచ్చ మకమ లంగరకాను ధరించి, బనారసు త్తరీయమును నడుమునఁ జుట్టుకొని, బంగారు తీగలతోఁ జమికీపనితోఁ దయారయిన తురాయితోఁ జెలువొందు చక్కని ముత్తెపు సరుల కుళ్లాయి శిరంబునఁ దిరంబయి యుండఁ జెవుల గవలజోడు చవులీన,, మెడలోని చంద్రతార హారములు మిలమిల మెఱయుచుండఁ జేతి రుమాలుతో నుదుటి చిఱుచెమటఁ దుడుచుకొనుచుఁ దనమిత్రులను సన్మానించుచుఁ దిరుగుచుండెను. అతని నాపోవఁజూచుచు షష్టిపూర్తియయిన యా వృద్ధు గోపాలరా జుప్పొంగి పోయెను.

రాత్రి రెండుజాము లగుటచే నందఱును లేచి గోపాల రాజును శ్యామసుందరమూర్తిని వీడ్కొని తమతమ శకటమ్ము లధిరోహించి గృహమ్ములకేగిరి. "బాబు! చాల ప్రొద్దయినది. నీవేగి పండుకొనుము" అని కొడుకు నంపి గోపాలరాజు తనగది కేగెను. పరిజనమునకుఁ జెప్పవలసినవి చెప్పి శ్యామసుందరమూర్తి తనగది కరుదెంచెను; తన కుర్చీలో శయనించి నిదురించుచున్న భట్టుం జూచి యచ్చెరు వొంది యతనిని లేపెను. ఉలికి యతఁడు లేచెను! ఇరువురును గూర్చుండిరి.

భట్టు:- బాబు! ఉత్సవము పూర్తియయ్యెనా?

శ్యామ:- భట్టూ! ఎప్పుడు వచ్చితివి? పూజాసమయమున నేల రావైతివి?

భట్టు:-నే వచ్చునప్పటికి జాముున్నరరాత్రి యయియుండును. నాన్నగారికంటఁ బడుదునేమో యని సభకు రానైతిని.

శ్యామ:- నాన్నగారికడ నెందులకోయి సంకోచము నీకు? నే నెన్నిసారులు పిలిచినను వారిసన్నిధికి రావు?

భట్టు:- అన్నా! మఱేమియులేదు. మాకక్కగారు మీ బాబయ్యగారికి గురు వన్నమాట నీ వెఱుఁగుదువు కద! నీ తండ్రికిఁ దగినకొడుకవు నీవు. నా తండ్రికి దగినకొడు కనుగాను నేను. జూదరినై సర్వస్వము గోలుపోయి, పరువుమరువులులేని నేనేలా గున నాయనయెదుటఁ బడఁ గలను? ఒకనాఁడు మీ బాబయ్యగారు నన్నుఁజూచి, యాహా! సింహముకడుపున నక్కపిల్లపుట్టె నని పల్కిరి.

శ్యామ:- ఔనయ్యా! మీ మేనత్త పంపినరూకలతో నీ యప్పులు దీరిపోయినవిగదా! మఱి యాటమాని వేయుము. నీ భోజన భాజనములకుఁ దగినయేర్పాటు నేఁ జేయించె దను. నీవు పండితుఁడవయ్యుఁ బామరునివలెఁ బ్రవర్తిం చుట పాడిగాదు.

భట్టు:- అన్నా! నీతోఁ జెప్పకేమి? ఆ సొమ్ముఁగూడ నోడి పోయినాను. ఋణబాధ తీరలేదు. తెల్లవాఱునప్పటి కింటియద్ద చెల్లింపకున్నచోఁ బరువు నిలువదు. రామలిం గయ్య సోమవారముదాఁక వాయిదా యిచ్చినాఁడు. బాబూ! యీ యప్పులబాధ పడఁజాలను. ఈ యూరు విడిచి పోయెదను.

శ్యామ:- తొందర పడకు. ఇదిగో యీ యిరువదిరూకలు పోచ్చుకో, బాడుగ యిచ్చివేయుము. రామలింగయ్యతో నేను మాటలాడెదను.

భట్టు:-కార్యములేదు; సరే దానికేమి యింక రెణ్ణాళ్లు గడువున్నది గదా! బాబు! నేఁడు నిజముగఁ బెండ్లికొడుకువలె నున్నాఁడవు. నీకుఁ గళ్యాణకళలు వచ్చినవి సుమీ! నీ పెండ్లిమాట లేమెనవి?

శ్యామ:- బాబయ్యగారేవేవో సంబంధములు వచ్చుచున్నవని చెప్పినారు; కన్యకలనుగూడఁ జూచినారు. నాకే సంబంధమును నచ్చలేదు. నా కిష్టములేనిపిల్లను నాన్నగారు చేయరు. నేను నింతలోఁ బెండ్లి చేసికోను. నీ శిష్యుఁడ నగుటయే నాకుఁ బ్రీతి.

భట్టు:- తప్పుతప్పు. అలాగున ననకు. నీకేమి మహాలక్ష్మీపుత్త్రుఁడవు. ఈ విషయమున నాశిష్యుఁడవు గావలదు. పెండ్లి చేసికొని, గృహస్థుఁడవై, యాశ్రిత కల్పకంబవై, చిరంజీవివై పుత్త్రపౌత్త్రైశ్వర్యాభి వృద్ధులతో మనుము.

శ్యామ:- అయ్యా! నాకేమో కొన్నాళ్లు హాయిగా దేశసంచారముచేసి రావలయునని యున్నది. నాన్నగారితో మనవిచేసినాను. వారు నంగీకరించిరి; ఈ యుత్సవమైన పిదప నుచితమగు సాహాయ్య మిచ్చి పంపెద మని సెలవిచ్చినారు.

భట్టు:- అన్నా! నన్నుఁగూడ నీతోఁ దీసికొనిపొమ్ము. కొన్నాళ్లు నీతోఁగూడి తిరుగుచు విద్యాభ్యాసంగము చేయుచు నీదుర్వ్యాతవ్యసనమునుండి విముక్తుఁడనయ్యెదను.

శ్యామ:- నేఁ గోరునదియు నిదే. ఇంతకు నాన్నగా రేమం దురో!

భట్టు:- ఎట్లయినఁ జెప్పి యొప్పింపుము. నే నాంధ్ర ద్రవిడ కర్ణాటక మళయాళ దేశములు దిరిగియున్నాను. నా కా యా భాషలును వచ్చును. ఆ యా ప్రదేశములం గల వింత లన్నియు వివరింపఁ గలను.

శ్యామ:- సరే, యత్నించి చూచెదను. మా గురువుగా రనంతాచార్యులుగారి నెఱుగుదువు గదా! ఆయననే తోడిచ్చి పంపెద రనుకొందును.

భట్టు:- పాప మనంతాచార్యులు వట్టి యమాయికబ్రాహ్మ ణుఁడు. నా కాతనితో నంతగా పరిచయములేదు. న న్నాతఁ డెఱుఁగఁడు.

శ్యామ:- మంచివాఁడే; కాని యాయన యూహలు నుక్తు లును నాకు నచ్చవు. పాపాటుప్రసంగము, సాహిత్యప్రశం సయుఁ దప్ప నతని కిం కొకటి కిట్టదు. రెండవది నాకు నిష్టమే కాని దేనికైనను హద్దు పద్దు నుండవలయును. నా యూహలు నీ యూహలును జక్కఁగఁ గలియును. నిన్నే తోడుకొని పోఁదలఁచినాను. మనప్రయాణములోఁ గొంతసొమ్ము మిగిల్చి నీ ఋణము తీర్చివేసెదను.

భట్టు:- బాబూ; నీదయ యతి. శ క్తివంచన లేక జతనము సల్పుము. కా దేని నప్పటి కేదైన నె త్తాలోచించెదను. నిన్ను నిద్దురపోనీక, తడ వుంచితిని. మన్నింపుము. నేం బోయివత్తునా మఱి! నాన్నగారితో మనవిచేసి ఫలితార్థ మెప్పుడు తెల్పెదవు?

శ్యామ:- తేపుప్రొద్దుగ్రుంకు వేళ దుర్గాలయ ప్రాంతమునకు రమ్ము. కొండమీఁది చాముండాలయము తెలియును గదా?

భట్టు:- తెలియ కేమి? తప్పక వచ్చెదను. మఱి సెలవా?

శ్యామ:- నమస్కారము.

భట్టు:-నూతనవధూ ప్రాప్తిరస్తు.

అని యాశీర్వదించి భట్టు చెలికాఁడొసంగిన యిరువది రూకలు పట్టుకొని వెడలి ఇల్లుసేరెను. శ్యామసుందరుఁడు దిరేసు మార్చుకొని శయనించెను.

## 3

### గోపాలరాజు - శ్యామసుందరమూర్తి

గోపాలరాజు, మహీశూరసంస్థాన రాజపురుషాగ్రణి. తత్సంస్థానము, హైదరాలి యను తురుష్కప్రభు హస్తగతమై పది పండ్రెండేఁడులు భుక్తమయినపిదప, గోపాలరాజు తనముప్పదవయేఁటఁదలయెత్తి, యదిమొదలు హిందూప్రభుత్వమును సంస్థాపింపఁ జాలఁబాటుపడినవాఁడు. గత్యంతరము లేక యతఁడు హైదరాలీసేనలో నొకఫౌజుదారుఁడుగాఁ జేరి సమయమును నిరీక్షించుచుండెను. పంచవింశతి హాయనంబులు హాయిగాఁ దనయిష్టమే చట్టముగా

రాజ్యము నేలి హైదరాలి, తనకుమారుఁడును రణశూరుఁడు నగు టిప్పుసుల్తానునకు రాజ్య మొప్పఁజెప్పి కాలధర్మ మొందెను. అంతవఱకును గోపాలరాజు, వారి కొలువుననే యుండెను. టిప్పుసుల్తానునకును, గంపెనీవారికిని గలహములు పెరిగిన యనంతరము గోపాలరా జాంగ్లేయులలోఁజేరి, తన కార్య క్రమమును నడపఁజూచెను. టిప్పు, తనకు లభించినదానితోఁ దృప్తినొందియుండక యాంగ్లేయుల మచ్చ మాపవలయునని సమకట్టి వారితోఁ దీరనివైరముం దెచ్చుకొనెను. అది సందుగాఁ జేకొని గోపాలరాజు తగినకృషిచేసి వారివైర మును వృద్ధిపొందించెను. శ్రీరంగపట్టణమును దొలుదొల్త దొరలు ముట్టడించినప్పుడు మించివచ్చెనని సుల్తానుఁడు వారితో సంధిచేసికొనెను. గోపాలరాజు మనోరథము నెఱ వేఱకపోయెను. అయిన నాతఁడు పూన్కిమానక దొర లతోఁ జెలిమిచేసి సుల్తానుని మట్టుపెట్టించు నుపాయము లాలోచించి చాలఁ బ్రయత్నించెను. దేనికైనను దాని వేళ రాక చక్కఁబడదు! ఏడేండ్లు చల్లచల్లగా దాఁటిపోయినవి. సుల్తాను గావించిన యొడంబడికలు మీఱి, ఫ్రెంచి వీరా గ్రణియై యూరపుదేశమున నట్టలాడించిన నెపోలియన్ బోనపార్టును దనకుఁదోడుపడవలయు నని వ్రాయబార మంపెను; ఆఫ్ఘనులతోఁగూడ రాయబారముల నడపెను; మహారాష్ట్రులను మంచిమాటలాడెను; నైజాముకడ నక్క వినయములు సూపెను. ఈ యంశము లన్నిటిని గోపాలరాజు తనచారచక్షువుల నారసి దొరల కెఱింగించెను. అతిచాతురీ ధురీణులు నదృష్టశాలులు నగు నాంగ్లేయు లుచితప్రయత్న

ములు సేసి సుల్తానుని కార్యతంతువులం దుత్తునియలు సేసి వేసిరి. తుదకు రెండవసారి సుల్తానుని రాజధానియగు శ్రీరంగపట్టణమును ముట్టడించి యాంగ్లేయులు సుల్తానుం జంపిన యుద్ధములో గోపాలరాజు తన యసాధారణరణకౌశలముం జూపి దొరలమన్నన లందెను. మైసూరు రాజవంశమున కప్పటికి ముఖ్య వారసులయిన బాల మహారాజు శ్రీ కృష్ణఉడయారు వారికి దొరలు పట్టాభిషేకము సేసి గోపాలరాజొనరించిన సాహాయ్యమునకై యుపకార వేతనముగ నొక మంచి జాగీ రాయనకు బహుమానముగా నిప్పించి బిరుదు లిచ్చి గౌరవించిరి. అప్పటికి గోపాలరాజునకు షష్ఠిపూర్తి యయ్యెను. అంతకు ముందు సంవత్సరమే తన ప్రభువునకు జయము, రాజ్యము లభించుటయుఁ దనకుఁ గీర్తిప్రతిష్ఠలు లభించుటయుఁ గారణముగా నతఁడు తత్సంవత్సరాది నుండియు వసంతోత్సవ మతివైభవమున నొనర్చి, చిత్రాపూర్ణిమనాఁడు రాజబంధువులకును పౌరమహాజనులకును విందుగావించి బ్రాహ్మణ సమారాధనము చేయించి సంభావన లొసంగి శ్రీ కృష్ణ పూజోద్యాపనమును జేయించెను.

గోపాలప్రభువున కరువదేండ్లు నిండినను బంచాశద్వత్సర దేశీయుఁడుగాఁ గానవచ్చును. ఆతనిది బక్కపలుచని కాయశరీరము, మీసమును, నేరాయుఁ దిల తండుల న్యాయమును మించినవి; మోమునఁ జిఱునగవుతో సజ్జనత్వము దాండవించుచుండును; ఎఱ్ఱజీరలతోఁ గనులు మహావీరలక్షణములయి, యొప్పుచుండును; మెడలో బంగారపు, టుట్లతావళమును, బదివేళ్లకు బటువులును, నెడమచేతి కొక సువర్ణ

కంకణమును గలవు. చెవులకు వజ్రపు టంటుజోడు గలదు. ఇన్ని యాభరణములకు నాభరణమై యెడమకంటి బొమపై నొకఖడ్గాఘాతచిహ్న మలరారు చుండెను. రాజకార్య పరతంత్రుఁ డయి యతఁడు ముప్పదేండ్ల వయస్సుదాఁక పెండ్లి యాడక నిష్కళంకమగు బ్రహ్మచర్యవ్రతమును నెఱపెను; పిదప రుక్మిణీదేవి యను నొక రాకన్నెం బరిణయమై యామె యం దొక చక్కని పుత్త్రరత్నమును గాంచెను. పదంపడి యైదారేండ్లు. కాపురముసేసి సతీతిలకమయిన యతనిపత్ని యకాలమృత్యువువాతఁ బడెను. భార్యా వియోగ దుఃఖమునఁ దొలుదొల్తఁ గలంగియు గోపాలరా జది దిగమ్రింగి, తన యేక తనయుఁడే సర్వస్వమని యెంచి యల్లారుముద్దుగా నాబాలుం బెంచుచుఁ దగిన గురువులతోఁ జదివించుచు మరల రాజకార్యపరతంత్రుఁ డయ్యెను;తుదకు జయమంది మహైశ్వర్య సంపన్నుం డయ్యెను. చదువు సాముల గడిదేఱి యా తండ్రికిం దగినబిడ్డఁ డనుఖ్యాతి గడించినవాఁడు మన శ్యామసుందర మూర్తియే.

శ్యామసుందరుని కిరువదేండ్లు ప్రాయము; ఒడ్డు పొడుగు రేక. దబ్బపండువంటి పచ్చని దేహచ్ఛాయకు గుణవృద్ధిసేయు యౌవన మంకురించెను. పరిశ్రమార్జితమయిన యొడలి బందోబస్తు దానికి వన్నె పెట్టుచుండెను. సన్నని హరిమధ్యము, విశాలమైన యురము, మెలికలుదిరిగి యాదొకగా నున్న యాజాను బాహువులు, ఉన్నతము లగు భుజ శిఖరములు, త్రిరేఖావృతంబయిన కంబుకంఠము, పూర్ణచంద్రునివంటి నెమ్మోము, తాటి ముంజవంటి గడ్డము,

సమోన్నతము లగు నున్నని బింబోష్ఠములు,నూనూఁగు పస
మెసలారు మీసము, నింపైన నునుఁజెక్కిళ్లు, నిడుపై యంద
మైన నాసిక, ఆ కర్ణాంతము లయి లక్ష్మీనివాసము లయిన
కనుదమ్ములు, స్నిగ్ధము లగు ఱెప్పలు, వింటివలె వంగిన
బొమల జత, అలక భ్రాజితమైన విశాల ఫాలతలము, నల్లని
యుంగరపుజుట్టు గేరా, పెద్దచెవులు మున్నగు ప్రశస్తావయ
వములు పొంది పొసఁగి మన కథానాయకుఁ డగు శ్యామ
సుందర మూర్తికి సర్వాంగ సుందరుఁడను బిరుదమును
చేకూర్చినవి.

అట్టి తండ్రియు,నట్టి కుమారుఁడును, నిప్పు డొకచోఁ
గూరుచుండి మాటలాడుచుండిరి. గోపాలరాజు ప్రాణాధికుఁ
డైన తన తనయున కనురూప రూప లావణ్య సుగుణగుణ
విభ్రాజిత యగు కన్యకం గూర్చి పెండ్లిచేసి సర్వ సౌఖ్యము
లొన గూర్చి పౌత్త్రి సందర్శనముచేసి కృతార్థుఁడు గావ
లయునని యువ్విళ్ళూరుచుండెను. అట్టితటి నాతఁడు దేశ
సంచారము చేసి వచ్చెదనన్న పుత్త్రున కేమి చెప్పటయో
దోఁచక కొంతకాల మాలోచించెను. దేశాటనముచేసి కష్ట
సుఖము లనుభవించి, లోకజ్ఞానమును బొందుట ప్రతిమనుజు
నకు నందును దన తనయునివంటివానికిఁ గావలసిన దని
నిశ్చయించియుఁ దన కిహలోక సర్వస్వమైన యీ ముద్దు
కొడుకు నెడఁబాసియుండుట కోర్వలేకయు నొకంతట సెల
వీయక ఱేపనియు, మాపనియు, జరుపులుపెట్టి, తుదకుఁ
జైత్రాపూర్ణిమ వెళ్ళినపిదప, వెళ్లవచ్చునని యీవల కనుజ్ఞ
యిచ్చెను. దానికే శ్యామసుందరుఁడు తండ్రికడ కరుదెం

చెను. తనకుఁ బ్రాణమిల్లిన సుతు నెత్తి యాలింగనము చేసి కొని వాత్సల్యాకరుఁడయిన తండ్రి కన్నీటితో నతని యుత్తమాంగమును దడుపుచు నిట్లు పలికెను.

గోపా:- తండ్రీ ! నీకు జ్ఞానము వచ్చినది. బుద్ధిమంతుఁడ వైతివి. చదువుసాములం గడిదేఱితివి. నీ క్షేమము నీ వెఱుంగుదువు. నా కష్టములు గట్టెక్కినవి. నాకింకేమి కావయును? నీ యానందమే నా యానందము. నీ యెడఁ బాటు సహింపలేకున్నను నీ యుత్సాహ ప్రవాహమున కడ్డుగట్లు వేయుట నా కిష్టములేదు. నీ ప్రయాణమునకుఁ దగిన వసతులను గూర్చితిని. ఎల్లుండి తృతీయా సోమ వారమునాఁడు నీవు బయలుదేఱవచ్చును. ఉండవలసిన పరిచారకులు నీ వెంట నుందురు. అయినను నుచిత మయిన సహవాస మవసరము. కావున, నీ వెంట నెవ రిని గొంపోవుట కాలోచించితివి?

శ్యామ:- నా మిత్రుఁడు రామచంద్ర భట్టును గొంపోవు దును.

గోపా:- అతనినిగూర్చి విన్నాను. నా గురుపుత్త్రుఁడు, చదువుకొన్నవాఁడు. సర్వముఁ దెలిసినవాఁడు; కాని, యతఁడు ద్యూత వ్యసన పరాయణుఁడై తండ్రిపేరు చెడఁగొట్టినాఁడు. కావున నతఁ డర్హుఁడు గాఁడని నా మతము.

శ్యామసుందరుఁడు జనకునిమాట కెదురాడువాఁడు గాఁడు. కావున దమ చిత్తము వచ్చినవారిం బంపు డనెను.

గోపా:- మీ దేశికులు సర్వోత్తములు అనంతాచార్యులు గారు. వారిని నీ వెంట గొంపొమ్ము.

శ్యామ:- చిత్తము.

గోపా:- "ఆయన నీకుఁ బితృసమానుఁడు. అమాయికుఁడు. మీ కర్చు వెచ్చములకయి ప్రస్తుతము నన్నూఱు రూకలిచ్చుచున్నాను. విశేష ధనముతోఁ బయనము గావించుట మంచిది కాదు. బెంగళూరులో నా కాతాదారునికి నైదువందలు రూపాయలకు హుండీ పంపెదను. మీరు బెంగళూరు చేరినవెంటనే యతఁడు నీ కా సొమ్మిచ్చును. ప్రాణధనముగా నీ వీ యేఁబది మొహరీల నుంచుకొమ్ము. కడు జాగరూకతతోఁ బయనముసేసి తగినంత వేగముగాఁ దిరిగి రమ్ము. నీవు వచ్చుదనుఁక నా ప్రాణములు బొందిలో నుండవు. నీకన్న నాకీ ప్రపంచమున నింకేమున్నది?" అనియన గోపాలరాజు కన్నుల నీరు నిండెను. తండ్రి దుఃఖకారణము శ్యామసుందరుఁ డెఱుఁగును. అతని నేత్రములు నశ్రుపూరితము లయ్యెను. తన తల్లిం దలంచుకొని యతఁడు వల వల నేడ్చెను. వాత్సల్య సాగరుఁ డయిన తండ్రి మాటలతో నతని హృదయము ద్రవించిపోయెను. గోపాలరాజు కొడుకుం గవుంగిలించుకొని హృదయము పదిలపఱుచుకొని, కొడుకు నోదార్చి మొహరీల సంచి నిచ్చి యనిపెను.

ఆ సాయంకాల మనుకొన్నట్లు దుర్గాలయము కడ శ్యామసుందరుఁడును భట్టును గలిసికొనిరి. శ్యామసుంద

రుఁడు నిజ జనకుని యాజ్ఞను భట్టునకుఁ దెలిపెను. భట్టు కొంత తడ వట్టె యాలోచించెను.

భట్టు:- మిత్రమా ! చిత్రమైన నాటకమును బ్రదర్శించె దను. తిలకింపుము.

శ్యామ:- నాటక మేమిటి?

భట్టు:- మఱేమియు లేదు. అనంతాచార్యునితో నీవు పయ నము సాగింపుము. నేను వచ్చి త్రోవలోఁ గలిసి కొందును.

శ్యామ:- నాన్నగారియాజ్ఞ నుల్లంఘింపఁ జాలను.

భట్టు:- నీ వేమి యుల్లంఘించితివి? నా యంతట నేను వత్తును గదా!

శ్యామ:- జనకునకుఁ దెలిసిన నే మందురో?

భట్టు:- పిదప నతఁ డేమన్నను దకరరు లేదు లే.

శ్యామ:- ఆచార్యులుగారు నిన్నెఱుఁగరో.

భట్టు:- అదే కదా నాటక మని చెప్పితిని.

శ్యామ:- ఏమి సేయుదువు?

భట్టు:- ఇప్పు డేమియుఁ జెప్పలేను. సోమవారము మూఁడవ జామునఁ గదా మీ ప్రయాణము? సాయంత్ర మెక్కడ బస చేయఁదలచితిరి?

శ్యామ:- శ్రీరంగపట్టణమున.

భట్టు:- వా, వా,. నే ననుకొన్నట్లే యయినది. కానిమ్ము. ఇదిగో రేపు సాయంకాలము లోపుగా నీ దిరేసువంటి

మంచి దిరేసు కొని పంపుము. నా కొక పిస్తోలును నిరు
వది రూపాయలును బంపుము. ఏ లాగున నాటక మాడె
దనో నీవే చూతువు గాక.

శ్యామ:- సరే పంపెదనుగాని భట్టూ! జాగ్రత్త సుమీ!

భట్టు:- పరవాలేదు. నాది పూచీ. పద యింటి కేగుదము.
నేను బ్రయాణ సన్నాహముఁ జేసికోవలెను. ప్రస్తుతము
రామలింగయ్యకుఁ గుచ్చుల కుళ్ళాయియే. సరే, నేఁజెప్పి
నవి మఱచిపోకుము.

అని మాటలాడుకొని యిరువురు రెండు త్రోవలం
బట్టి పోయిరి. పాపము పితృభక్తి తత్పరుఁడగు శ్యామ
సుందరుఁడు తండ్రి నెడఁబాసి పోవుట కెంతయు విచారిం
చెను. భట్టుతోఁగలసి దేశాటనము చేయవలయునను నుబ
లాట మాతనిని ముందంజ వేయించుచుండెను. మఱునాఁ
డనుకొన్న ప్రకారము భట్టునకు కావలసిన వస్తువులు,
సొమ్మును బంపి శ్యామసుందరుఁడు ప్రయాణ సన్నాహము
చేసికొనెను.

## 4

### రా మ చ ం ద్ర రా వు బ హ దూ రు

ఆదివారమునాఁడే సామానుబండ్లు, వంటవాండ్రు,
పరిచారకులు, రెండుగుఱ్ఱములను శ్రీరంగపట్టణమునకుఁ బంపి,
శ్యామసుందరమూర్తి పితృసన్నిధిని సెలవొంది యనంతా
చార్యులువారితో జోడుగుఱ్ఱముల బండి నెక్కి బయలు

చేసెను. బండి శ్రీరంగపట్టణ మార్గమును బట్టి చల్లగా సాగి పోవుచుండెను. తనశిష్యునితో దేశసంచారముసేయ నేఁగు చుంటి నని యనంతాచార్యులుగా రుప్పొంగిపోవుచు శ్యామ సుందరునితో లోకాభిరామాయణముగాఁ బ్రసంగించుచుం డెను. గమ్యస్థానము మైసూరునకుఁ బదిమైళ్లున్నది. రెండు గడియలలో వారిబండి నాలుగైదుమైళ్లు దాఁటెను. ఉత్తర వాహినిం దాఁటిన యనంతర మాబండి వెనుక నతిత్వరిత గతి నొక యశ్వశకట మురుదెంచి యీ బండిం దప్పించుకొని పోఁబోయి దాఁకొనెను. రెండు బండ్ల యిరుసులును డీకొని నవి. ఆ వడిచే శ్యామసుందరునిబండి త్రుళ్లి దారిప్రక్కను గోదుగుపాటు పడెను. వెనుకముందున్న నౌకరులు బండివాం డ్రను లంఘించి పగ్గములం గోసివేసి, గుఱ్ఱములను రక్షిం చిరి. శ్యామసుందరుఁడును ననంతాచార్యులుగారును బండిలోనుండి దొర్లి ప్రక్కబంటలోఁ బడిరి. పడుచువాఁడు గావున శ్యామసుందరుఁడు చట్టున లేచి గురువుగారిని లేవ నెత్తెను. ఎవరికి నంతగా గాయములు తగులలేదు; కాని యాచార్యులుగారు భయాతిశయమున బిక్కవోయి, లేవ లేకపోయిరి. శిష్యుఁ డాచార్యులవారిని లేవనెత్తి చేయూఁత యిచ్చి రాజబాటకుఁ దెచ్చెను.

ఇట నుయ్యాడావుడిలో రెండవబండినుండి యొకమహా పురుషుఁడు నొకబాలుఁడును దిగిరి. ఆ పురుషుఁడు తనబండి వాని యజాగ్రత్తకై కేకలువేయుచు మందలింపసాగెను. అతని వేషము నాకేకలును గని విని శ్యామసుందరుఁ డచ్చెరు వొంది యట్టె నిలిచిపోయెను. ఆ పురుషుఁ డొయ్యారముగా

నడచుచు వెనుదిరిగి తన బండివానిం జుఱచుఱ చూచుచు, "పశువు, దారిచూచుకోఁడు. పాప మా వృద్ధున కెంత దెబ్బ తగిలినదో! పరిచారకులు చేసినదోషము ప్రభువులను గదా చెందును! ఈ దోషము మాది. ఆర్యులారా! మన్నింపుఁడు" అని పలికి యాచార్యులువారిచెంత కేగెను. ఆచార్యులు గన్నులెత్తి యాపురుషుం జూచెను. ఇంతలో, శ్రీ మన్మహా మండలేశ్వర, మన్యసుల్తాన్, మెహార్బాన్ దోస్తాన్ శ్రీరామ చంద్రరావు బహద్దూరువారు, వనపర్తి ప్రముఖ ధర్మసంస్థానాధీశులు మిమ్ముమన్నింపఁ గోరుచున్నారు" అని వెనుక నున్న పదునాఱేండ్ల బాలుఁడు వచించెను. ఆచార్యులు గారికి మతిపోయెను. తెచ్చవడి నిలువుగన్నులతో నతఁడు వారిఁ జూచుచుండెను.

ఆ పురుషుఁడు తెల్లని పట్టుషరాయియు నెఱ్ఱమకమలుచమికీ యంగరఖాను దొడుగుకొని నీలిరంగు జరీపాగ చుట్టుకొని, పెద్ద బనారసువాణి వల్లెవాటు వేసికొని, చేత పిస్తోలు పట్టుకొని రెండవచేతితో మీసములు నులివెట్టుకొనుచుఁ దురక ముచ్చెలతోఁ డక్కుటిక్కు మను చప్పుడు గలుగునటు లెత్తెత్తి యడుగులువైచుచు వచ్చె. తనయెదుట నిలిచిన యా వనపర్తి సంస్థానాధీశుని జూచియు నతని మొలపటకానుండి వ్రేలాడుచున్న ఖడ్గకోశమును నతనిచేతనున్న పిస్తోలును గాంచియు నాచార్యులుగారు గడ గడ వడఁకిపోసాగెను. శ్యామసుందరుం డా దృశ్యమును జూచి యతిప్రయత్నమున న వ్వాపుకొని, "నామిత్రులగు వనపర్తి సంస్థానాధీశులకు స్వాగతము! ఆచార్యులువారూ!

వీరు నామిత్రులు రామచంద్రరావు బహద్దూరువారు. మీరు భయపడవలసిన యవసరము లేదు. "మిత్రమా! యీయన మాగురువుగారు శ్రీమదనంతాచార్యులవారు, మహాపండితులు" అని యిరువురికిని బరిచయము గలుగఁజేసెను. "శాస్త్రిలువారు! తమ దరిసెన మెప్పుడును జేయలేదు. మా సంస్థానమునకుఁ దా మెప్పుడును దయచేయించినారు కారు. శ్యామసుందరుఁడు మా మిత్రుఁడు. మేమును దమకు శిష్యప్రాయులమే. మా పరిచారకుని మూలమున నపచారము గలిగెను. మన్నింప వేఁడుచున్నాము" అని జమీందారుగా రాచార్యులవారికి నమస్కరించి యతనిచేయి పట్టుకొనెను. ఆచార్యులుగారికిఁగలిగిన భయము దీఱినది. అతఁడు చేతులు జోడించి, "చిత్తము మహాప్రభూ! దేవరవారిదర్శన మెప్పుడును జేయలేదు. నేఁడు సుదినము. తమ రీ ప్రాంతములకు దయచేయించిన సంగతియు నాకుఁ దెలియదు. దైవాత్తు వచ్చినదానికి మనమేమి చేయఁగలము? నాకేమియు నంతగా దెబ్బలు దగులలేదు" అని తడవుకొనుచు నుత్తర మిచ్చెను.

శ్యామ:- మిత్రమా! ఎచ్చటికి ప్రయాణము!

జమీం:- మా నైజాము నవాబువారికిఁ దెలియకుండ నొక పనిమీఁద మైసూరువచ్చినాము. మేము బెంగళూరు వెళ్ళవలసియున్నది. మీ రెక్కడికి ప్రయాణము!

శ్యామ:- మేమును బెంగళూరే వెళ్లుచున్నాము.

జమీం:- మనము గలిసియే ప్రయాణము చేయవచ్చును. ఏమి ఆచార్యులువారు, ఏమందురు?

ఆచా:- చిత్తము మహాప్రభూ! అంతకన్న సంతస మేమి గలదు? నేను గోపాలరాజుగారికిఁగూడ నీ యానందవార్త నేఁడే తెలియఁజేసెదను.

జమీం:- మేము నైజామువారి కెఱుక లేకుండ రహస్యముగఁ బయనము సేయుచున్నాము. ఎవ్వరికి నీ ప్రాంతమున మే మున్నట్లు తెలియరాదు. మావంటివారియునికి యొక రికిఁ దెలిసిన యుత్తర క్షణమున జగ మంతటికిని దెలిసి పోవును. కాన నారాక మీ రేరికిని దెలుపవద్దు. మరలి పది దినములలో మైసూరువచ్చి మా మిత్రులయిన గోపాలరాజుగారిని జూచెదము. ఏమందు రాచార్యులు వారు!

ఆచా:- చిత్తము చిత్తము, ఏలినవారి యభిప్రాయమే సమంజసము.

జమీం:- బాబూ! మీ బండి, వెంటనే మీ ప్రయాణము నకుఁ బనికి రానట్లున్నది. నౌకరులు బండితోఁ దంటాలు పడుచున్నారు. వెనుకనుండి బాగుచేసి వారు బండి తెచ్చెదరు. మా బండిలో మనము నల్వు రము ముందేగి బస చేరుకొందము.

అని జమీందారుగారు పలుక శ్యామసుందరుఁడును నాచార్యులుగారు నంగీకరించిరి. నలువురును రెండవ బండిలోఁ గూర్చుండిరి. "బండి తిన్నగఁబోనీ! జాగ్రత!" అని జమీందారుగా రాజ్ఞాపింప వంగి సలాముచేసి బండి వాఁడు గుఱ్ఱము నదలించి బండియెక్కెను. ఆ గుఱ్ఱము

పోగుబఁపోతు గుఱ్ఱము. బండి నెగురవైచుకొని పరుగెత్త సాగెను. లోపలి నల్వురు నొకరి పయి నొకరు పడిపోవు చుండిరి. కూర్చున్న మెత్తలుగూడ బాగుగా లేవు. ఆచార్యులు గారికి మిక్కిలి బాధగా నున్నది. అంత గొప్ప సంస్థానాధీశుల కిట్టి తుక్కుబండియా యెక్కవలసి వచ్చె నని యతఁ డాలోచించుచు జమీందారుగారి మొగముఁ జూచెను. కుశాగ్రబుద్ధియైన జమీందారుగా రాతని యను మానమును గుఱుతించి, "ఆచార్యులవారు! ఈ బండి మా తాతగారి నాఁటిది. ఆ కారణముచే మా బాబయ్యగా రెంత యైశ్వర్యవంతులయిన నీ బండిలోనే పయనము సేయు చుండిరి. మేము నా విధముగా నీ బండిని విడువ నొల్లము. మా తాతగారును శ్రీ శ్రీ నైజాము నవాబు వారును నొక నాఁ డీ బండిలో నాసీనులయి ప్రయాణముసేసిరి. తమ రిప్పుడు, గూర్చున్న యీ మెత్తమీఁదనే శ్రీ నైజాము వారప్పు డాసీను లయిరఁట" అనిపల్కెను. నైజాము వా రాసీను లయిన స్థలముననే తన్నుఁ గూర్చుండఁజేసినందులకు నాచార్యులుగారు జమీందారుగారి నెంతయు నభినందించి తన కంత యదృష్టము పట్టినందుల కతఁడు లో లోన నుప్పొంగి పోయెను. అంత నా రామచంద్రభూపాలుఁడు తన బంగారు కట్టు పొడికాయఁ దీసి, "గురువుగారూ! ఈ నస్యమును గొంచెము సేవించినచోఁ దాము పడిన నేఁటి యాయాస మంతయు నిమిషములోఁ బటాపంచ లగును. శ్రీ శ్రీ నవాబుగారే తమమైత్రిని జిరకాల స్థాయిగా నుంపఁగోరి మా తాతగారి కొసంగిరఁట యీ పొడికాయను. వారును

వారి పిదప మా తండ్రిగారును నవాబుగారి గౌరవసూచక ముగా దీని నుపయోగించి మా కొసంగిరి. ఆ గౌరవమును నిలువుకొనుటకే మేమును దీని నుపయోగించుచున్నాము" అని యుపన్యసించుచు నాచార్యున కా పొడికాయ నందించెను. తనకుఁ బొడివేయు నలవాటు లేనప్పటికిని నవాబుగారి పొడికాయ తనచేతికి వచ్చెనని పొంగిపోవుచున్న యా వృద్ధభూసురుఁడు, బిరడాదీసి యొక్కింత చేతిలో వేసికొని యొక్క పట్టు పట్టి గాఢముగాఁ బీల్చెను. వెంటనే యపరిమితముగాఁ దుమ్ములు రాఁదొడఁగెను. ఆచార్యుని కన్నుల నిండ నీరు నిండెను; మొగ మంతయు జేవురించెను. ఊపిరి సలపక బాధపెట్టుచున్నను నాచార్యులుగారు నవాబుగారి గౌరవార్థ మదంతయు భరించుచుఁ దుమ్ముచుండెను. శ్యామసుందరుఁడును, బాలుఁడును గడుపుచేతఁబట్టుకొని నవ్వసాగిరి. ఆచార్యులవారి యడావుడి, శాంతించునప్పటికి బండి శ్రీరంగపట్టణముఁ జేరెను. ఆ గ్రామాధికారులు వారికి స్వాగత మిచ్చి తదర్థమయి నియతమయిన లోగిలిలోనికిఁ గొంపోయిరి.

రామచంద్రభట్టీ వనపర్తి సంస్థానాధీశుని పాత్ర మభినయించుచుండె నని మా పాఠకులకు విశద మయి యుండును. వెంటనున్న బాలుఁ డాతని మేనల్లుఁడు దుర్గాప్రసాదరావు.

మన బాటసారులు శ్రీరంగపట్టణముఁ జేరిన రెండు గంటలలో శ్యామసుందరుని బండియు నౌకరులును వచ్చి చేరిరి. తొలినాఁడు వచ్చినవారిలో నొకరిద్దఱు, భట్టునెతీ

గినవా రుండుటచే భట్టు శ్యామసుందరునితో రహస్యముగా మాటలాడి, వారిని, దనబండిని మైసూరు పంపివేయు మని యుపాయము చెప్పెను. రాత్రిభోజన మయినంతలో శ్యామసుందరుఁ డాప్రకారము కట్టడిచేసెను. తదనంతర మనంతాచార్యులుగారును, భట్టును, శ్యామసుందరుఁడును, దుర్గాప్రసాదుఁడును డాబామీఁద నాసీనులయిరి. శ్యామసుందరుఁడు ప్రసంగమున కుపక్రమించెను.

శ్యామ:- మిత్రమా! రామచంద్రభూపాలా! మన మందఱమును గలిసి బెంగళూరు మున్నగు ప్రాంతముల విహరింపవలయు నని నా ప్రార్థన. నా పరివార మంతయు నున్నది. ఒక బండియు నాలుగు గుఱ్ఱములు నున్నవి. నవాబుగారిబండిని మైసూరులో మనము వచ్చుదనుక నుంచునట్లు నా పరిజనమునకు నుత్తరువు సేసితిని. దయయుంచి మా యాతిథ్యము నంగీకరించి మీరు మాతో దేశాటనము సేయ వేఁడుచున్నవాఁడను. గురువుగారు! జమీందారుగారు మనకుఁ బూజనీయులు. విశేషించి మాధ్వబ్రాహ్మణ ప్రభువులు. వీరి నాశ్రయించి మనము ప్రయాణముసేయుట యానందప్రదము గాదా!

అనం:- అందులకు సందేహమా బాబూ! ప్రభువు వారు సాక్షాత్తు నారాయణాంశ సంభవులు. ఆ వర్చస్సేమి? ఆ వాగ్ఝరి యేమి? ఆ ఠీవి యేమి? మా వంశములో నిట్టి ప్రభువతంసము లవతరించుటచే మే మందఱమును ధన్యుల మైతిమి. బాలురైనను తమ రుదారాశయులరు.

శ్రీ శ్రీ ప్రభువువారిని మా కుమార ప్రభు ప్రార్థన నన్యథాకరింప వలదని వేఁడుచున్నాను.

భట్టు:- అయ్యా! ఆచార్యులుగారూ! శ్యామసుందరుఁడు మా ప్రాణ మిత్రము. తమరు సాక్షా త్సురాచార్యుల వంటివారు. ఇట్టి సహవాసము లభించుటచే మే మెంతయుఁ గృతార్థులము. మేము మిత్రవశ వర్తులము. మీరు త్రిప్పినట్లు దిరుగుట మా విధి.

దుర్గా:- గురువుగారూ! నన్నుఁ దమ శిష్యునిగా ననుగ్రహింప వేఁడెదను.

అనం:- నీవు చిచిందిరీవి. ఆ ప్రభువునకుఁ దగిన సరదారుఁడవు. నీవు తప్పక మాతో రావలయును.

దుర్గా:- ఆచార్య ప్రసాదమున ధన్యుఁడ నైతిని.

ఇట్టులు గొంతసే పా మాటయు నీ మాటయు నాడు కొన్న పిదప శ్యామసుందరుఁడు భట్టుం జూచి యొక ప్రశ్న వేసెను.

శ్యామ:- అయ్యా! కీర్తిశేషుఁడయిన యీ శ్రీరంగపట్టణాధీశుఁడు టిప్పుసుల్తానుఁడు పరమ దుర్మార్గుఁడని వచింతురే యీ విషయమునఁ దమ యభిప్రాయ మేమి?

భట్టు:- మిత్రమా! మనము పరమ మిత్రులము గావునఁ 'దమరు, ప్రభువువారు, మేము మా' అను గౌరవవాచకముల కవసరములేదు. ఆ ప్రతిపత్తి విడిచి యథేచ్ఛగా 'నీవు, నీవు, నేను, నేను, నీ, నా' యని యనుకొందము.

మైత్రి కేకవచనప్రయోగమే రమ్యమయినది. నీ వడిగిన ప్రశ్నకు, బదులు సెప్పుచున్నాను. నిజము వచింపవలసి వచ్చినప్పుడు సుల్తానుఁడు పరమ దుర్మార్గుఁడు కాఁడు. సార్వభౌమోచితములయిన పెక్కు సుగుణములతనియం దుండెడివి. అంతమాత్రమున నతనికడ లోపములు లేవని నా యభిప్రాయము గాదు. మనుష్యప్రకృతికిఁ దక్కిన జీవప్రకృతికంటె జ్ఞాన మెక్కుడగుటచేతనే ప్రమాదము లెక్కువ. విరోధముగా వినిపించినను నా పల్కు సత్యము. తక్కిన జీవకోటికిఁ దప్పు లొప్పులు లేవు. అవి స్వర్గమున కెగురలేవు, పాతాళముఁ బట్టి పోవు; ఒక్క రసాలోనే పోవును. జ్ఞానాధికుఁ డగుటచే మనుజుఁడు వినువీధి కెగురఁ బ్రయత్నించును. సిద్ధి యదృష్టము ననుసరించి యుండును. అదృష్ట మనఁగాఁ బూర్వజన్మకృత సుకృత దుష్కృత పరిపాకస్థితి. ప్రయత్నము సిద్ధించెనేని యున్నతపదవి లభించును. కాదేని పాతాళముం బట్టించును, ఎంత పొడ వెగురఁ బ్రయత్నించునో యంత దెబ్బఁ దిన సిద్ధమయి యుండవలయును. టిప్పు మహావీరుఁడు, దేశమును మతము నుద్ధరించుటకై చేతనైనంత పాటుపడినాఁడు. మనదృష్టి కతని ప్రవర్తనము దోషభూయిష్ఠ మయి కానరావచ్చును. తత్స్థానమున మనమే యున్నచో నెట్లు ప్రవర్తించి యుందుమో, యెవరి మట్టుకు వారు యోచించుకోవలెను. ఈ రాజ్య మాతని తండ్రి హైదరాలి సంపాదించినది. అది న్యాయ్యేతర మార్గమున వచ్చినది. కావుననే వాని సంతతికి రాజ్యము

దక్కినది కాదు. టిప్పు బాగుగ నాంగ్లేయుల యాశయములను గుర్తించినాఁడు. అతఁ డసాధారణ మేధావి. మనదేశమునఁ గంపెనీవారి ప్రభ ప్రబలుచున్న పద్ధతి నారసి కొన్నాళ్ళలో వారే సంపూర్ణ భరతఖండమునకు సమ్రాట్టు లగుదు రని గ్రహించినాఁడు. తనచే నయినంత వఱకు కోపి, తగిన జతనము సలిపి, వారి నీ దేశము నుండి తఱిమివేయకున్న-నో హాయిగాఁ దన యర్ధచంద్ర పతాక మంబరవీధి నెంతకాలమో యెగురఁ జాలదని నిశ్చయించినాఁడు. అటుగావుననే పరాసువారికిఁ దా విచ్చి తన సైనికులకుఁ జక్కని రణపరిశ్రమ నిప్పించెను. నైజామునవాబును, మరాటా పీష్వాలను, నాఫ్ఘను వీరులను, దుదకుఁ బరాసు వీరాగ్రణి యగు నెపోలియనును దనకుఁ దోడు పడఁ గోరి సర్వథా ప్రయత్నించెను. కాని యదంతయు వితయయ్యెను. ఆంగ్లేయు లదృష్టశాలు లగుటచే సుల్తానుని యాశాలతలు దుత్తునియ లయ్యెను. పరాసుయోధాగ్రణి యోటువడి భరతఖండముపై దృష్టి పఱుపలేక పోయెను. ఎవరును టిప్పునకుదోడుపడరైరి. మించివచ్చెననియుఁ దా నొంటరినైతి ననియు గుర్తించియు, మహావీరుఁడు గావున వెనుకంజ యిడక యూపిరి యున్నంత దనుక నోపికతోఁ బోరాడి, పడి, వీరస్వర్గమును జూఱఁ గొన్నాఁడు. అతనికడ నున్నలోపములలో ముఖ్యమయినవి రెండు; మతావేశము. తొందరపాటును. ఈ రెండే యాతనిరాజ్యమును విధ్వస్తము గావించినవి. హిందువులను, చేఁ జిక్కిన కొందఱాంగ్లేయులను నతఁడు నరక

కూపములం బడఁద్రోయించినాఁడు; కొండ నెత్తమ్ముల నుండి దిగఁద్రోయించినాఁడు; పలు కడగండ్లను ముంచి నాఁడు; అతని కాగ్రహానుగ్రహములలో నేది వచ్చినను మైమఱచి పోయెడివాఁడు; తనసేవకులనుగూడఁ గ్రూర శిక్షలకుఁ బాల్పఱచినాఁడు. దీని కొక్క తార్కాణముం జూపెదను.

తొలుదొల్తఁ డిప్పు, తిరువాన్కూరు మహారాజుతో న కారణముగా విరోధము తెచ్చిపెట్టుకొన్నాఁడు. ఆ మహారాజాంగ్లేయుల సాహాయ్య మపేక్షించెను. ఇప్పటి కెనిమిదేండ్లక్రిందట నాంగ్లేయు లీ పట్టణమును ముట్టడించిరి. సుల్తాను కోట తలుపులు మూయించి పరిఘమై యొప్పు నుభయ కావేరిం బూరింపజేసి, బురుజులు దిట్టపఱిచి సర్వ సేనలతో లోన నతి జాగరూకుఁడై యుండెను. అదెట్లు లాంగ్లేయులు కోట భేదించి లోపలఁజొచ్చిరో తెలియదు గాని యొకనాఁటి తెల్లవాఱుజామున నూరినిండఁ దెల్లదొరల సేనలు క్రిక్కిరిసి నిండిపోయెను. సుల్తానునికి మతిపోయెను. తప్పివచ్చినదని యాంగ్లేయులు కోరిన దుర్ఘటములగు నొడం బడికల కంగీకరించి, సగము రాజ్యము వారి కొసంగి, మఱి తిరుగుబాటు సేయకుండు నమ్మకమునకై తనకుమారుల నిద్దరను వారికిఁ బూటకా పుంచి యతఁడు సంధిచేసికొనెను; ఈ సంధి జరిగి దొర లూరువిడిచి పోయిన యుత్తర క్షణమున నొక పెద్దసభ చేయించి కోటలో నాంగ్లేయులు చొచ్చుటకుఁ గల కారణమును విచారించెను. ఆంగ్లేయులకడ లంచము పుచ్చుకొని తన కంగరక్షకుఁడుగా నున్న సదాశివరావను

నొకసరదారుఁడు పాణిద్వారము తెఱచి దొరలకు దారి యిచ్చె నని తెలియవచ్చుటచే సుల్తానుఁ డుగ్రాకారుఁడై యతఁడు నేరము చేసెనో లేదో మఱి విచారింపక తొల్త నా సరదారు నురి దీయుఁ డని యాజ్ఞ యిచ్చియుఁ బదంపడి యేలొకో యాశిక్షను మాపుచేసి యా నేరగాఁ డామరణాంతము కోయంబుత్తూరు కొండ కోట కైదులో నుండునట్లు శాసించి వానిం బంపివేసెను. ఐదాతేండ్లు గడచినపిదప సదాశివరావు పాప మేమియు నెఱుఁగఁడనియు నతని జ్ఞాతియే యాకార్య మొనరించి సదాశివరావుపైఁ దద్దోష మారోపించి తన నేరము బయల్పడు నని భయపడి తుద కాంగ్లేయులలోఁ జేరె ననియుఁ దెలియవచ్చెను. అప్పుడు సుల్తాను పడినపశ్చాత్తాపము వర్ణనాతీతము. తన తప్పును మన్నించి వెంటనే రావలయు నని సుల్తానుఁడు నాచేతనే సదాశివరావున కొక లేఖ వ్రాయించి పంపెను. అందు వ్రాయించిన యంశములు దలంచుకొన్నచో సుల్తానుని యుదారాశయమునకు నే నచ్చెరువొందుచుందును.

శ్యామ:- తుదకు సదాశివరావు వచ్చెనా?

భట్టు:- రెండవసారి దొరలు శ్రీరంగపట్టణమును ముట్టడించుట కొక దినముముం దాతఁ డిచ్చుటికి వచ్చెను. సుల్తానుఁ డాతని నాదరించిన యాదరణమును నే నెప్పటికిని మఱవఁ జాలను. తరువాత వా రిరువురును గలిసి యాంగ్లేయులతో ఘోరముగాఁ బోరిరి. సుల్తానుఁడు చనిపోయెను. సదాశివరావు మృతకల్పుఁడయి రణ

భూమినిం బడెను. అతనిని వెదకుచువచ్చి యిరువు రాంగ్లే యులు గట్టూపిరితోనున్న యతని గొంపోయిరి.

అనం:- ప్రభువువారి కీ సంగతు లన్నియు నెట్లు విశదము లైనవో వింతగా నున్నది. సుల్తానునకును దమకు నెట్లు మైత్రి యలవడెను?

భట్టు:- మేము నైజామువారి మండలాధీశుల మగుటచేఁ దొలుదొల్త సుల్తానునకు మిత్రుల మయితిమి. ఆ మైత్రిని బాటించియే, పిదప నైజము, సుల్తానుని విరోధి కోటిలోఁ జేరినను మేము మాత్రము మిత్రులమై యుంటిమి. అప్పుడు సుల్తానునకును మా నవాబుగారికిని సంధి చేయవలయు నను నుద్దేశముతో మేము సపరి వారముగా నీ యూరు వచ్చినాము. సుల్తానుఁడు మమ్ముఁ బ్రాణమిత్రులుగా నెంచుచుండెడివాఁడు. ఆహా! అట్టి సార్వభౌముఁ డేడీ? అతఁడే నేఁ డీ పట్టణమున నున్నచో మన మీ యింట నీ తీరునఁ బ్రసంగింతుమా? మన కెన్ని రాజ మర్యాదలు జరిగియుండునో! అదంతయు స్వప్న ప్రాయ మయ్యెను! (అని యొక నిట్టూర్పు పుచ్చెను.)

శ్యామ:- చెలికాఁడా! నేఁడు మన మలసియుంటిమి. పాపము గురువుగారు బండి గొడుగుపాటువలన నెంతయు నుత్త లపా టొందియున్నారు. కావున మన మింక బండుకొందము.

ఆ మాటలు విని, మంచి దని నల్వురు లేచునంతలో, "అయ్యో! చచ్చితిని చచ్చితిని. రక్షింపుఁ డో మహాజను

లారా?" అను నొక స్త్రీకంఠ నిర్గతమగు నార్తనాదము విన వచ్చెను. అందఱును నిమిషములో మేడ దిగి వచ్చిరి. శ్యామ సుందరుఁడును రామచంద్రభట్టును దమ తమపిస్తోళ్లు పట్టుకొని యా యార్తనాదము వచ్చినదిక్కునకుఁ బరుగిడి పోయిరి. లాంతరు పట్టుకొని దుర్గాప్రసాదుఁడు వారి ననుసరించెను. ఆచార్యులుగారు జిచ్చవడి యొకచోఁ గూర్చుండిరి.

# 5

## దీనురాలు

అది రాత్రి జాముచ్నర వేళ. చంద్రోదయ మయినది, కాని యాకసము మేఘచ్ఛన్న మగుటచే నంతగా వెన్నెల వెలుఁగు లేకుండెను. స్త్రీయార్తనాదమును విని నలు తట్టుల నుండియుఁ గఱ్ఱలు పట్టుకొని పలువురు పరువెత్తి వచ్చిరి. మన వీరులును వారిం గలసికొనిరి. మఱెట్టి సవ్వడియు లేదు. వా రెటు పోవుటకును నేమి సేయుటకును దోఁచక గంద్రగోళము పడుచుండిరి. అట రెండుదారు లగుపించెను. ఏ దారిం బోవలెనో వారికిఁ దెలియదయ్యె. అంతలో నా ప్రక్కనందు నుండి రెండు కుక్కలు బౌబౌ మని యఱచుచు వారి కెదురు వచ్చినవి. ఆ సందడిం జూచి యా శ్వానరాజములు మరల వెనుదిరిగి యఱచుచుఁ బోయి యొక పాడింటి గుమ్మము ముందర నిలిచెను. అదియే భయస్థాన మని యూహించి మన వీరులు పురోగాములయి యా యింటఁ జొచ్చిరి. లోపల నంతయు నుమ్మెత్తలు జిల్లేళ్లు మొలచి చిమ్మచీఁకటిగా నుండెను. ఒకరి మొగ మొకరికిఁ గానరాకున్న యాశిథిల

మంది రాంతర్భాగమునుండి యొక మూలుగు వినవచ్చెను. పాదముల తొడితొక్కుడు వినిపించెను. దుర్గాప్రసాదుఁడు తనచేతి లాంతరెత్తి చూపించెను. లోపల నెవ్వరో నలుగు రైదుగు రొకమూటను దింపి, యటువచ్చు మనుజుల కోలాహలమును వినియు,దీపపువెల్తురను గనియు నే మొనర్చుట కును దోఁచక నిలిచియుండిరి. రామచంద్రభట్టు సంగతిని గ్రహించి శ్యామసుందరుని చెవిలో నేమో చెప్పి తనచేతి పిస్తోలు నొక్కెను. ఢామ్మను శబ్దము దిగంతముల నిండి పోయెను. వెంటనే శ్యామసుందరుఁడును దనపిస్తోలును బేల్చెను. ఆ శబ్దముతో భయపడి నల్వురు మనుష్యులు తమబరువు నటు దించి యా పాడుగోడలు దాఁటి పాఱి పోయిరి.

ముందు లాంతరు పట్టుకొని దుర్గాప్రసాదుఁడు దారి చూప నందఱును లోనికేగిరి. దీపకాంతిని మూలుగుచున్న యొకవ్యక్తి వారికి గోచరించెను. నోట గుడ్డలు గ్రుక్కి, కాలుసేతులు బంధించి,దురాత్ము లెవరో యొకయిల్లాలి నెత్తు కొనిపోఁ దలచి రని వారు గుర్తించిరి. నలువురు సాయము పట్టి యామెను వెలుపలికిఁ దెచ్చి, నోటిగుడ్డలు దీసి, బంధ ములు విప్పి మెల్లగా నామెను నడపించుకొని శ్యామసుంద రాదులు బసచేసిన యింటికి దెచ్చిరి. కొందఱు, హంతకుల వెనుకఁ బరుగెత్తిరి; కాని తప్పించుకొని యా దురాత్ము లదృశ్యులయిరి.

శ్యామసుందరాదులు, కూడినమూఁకను బో సెల విచ్చి యా దీనురాలిని జావడిలోనికిం గొంపోయిరి. అంద

లును గూర్చుండిరి. పిస్తోళులచప్పుడు విన్నప్పటినుండి గడ గడ వడంకిపోవుచు భయాతిశయావేశ పరవశుండై యున్న యాచార్యుల నూరడింపఁజేసి, శ్యామసుందరుం డామెతో నిట్లు పలికెను. "తల్లీ! నీ యూరేది? పేరేమి? ని న్నీదురాత్ము లిట్లేల హింసింపఁజొచ్చిరి? తెలుపఁ దగునేని దెలుపుము." ఆ మాటలు విని యా యింతి కన్నీరేఱులై పాఱ నేడ్చుచు దుఃఖాతిశయమున నోట మాటరాక యెట్టకేలకుఁ దెమల్చు కొని గద్గద స్వరమున, "తండ్రీ! మన్నింపుము. ఇప్పు డేమియుఁ జెప్పలేను. ఉదయమున నంతయుఁ జెప్పెదను" అని పలికి యేడ్చుచుఁ జాపపైఁ బండుకొనెను. అలాగుననే కానిమ్మని శ్యామసుందరాదులును నిదురించిరి. ఆచార్యులు వారి కా రాత్రి శివ రాత్రి యయ్యెను. ధీరపురుషుఁడు!

తెల్లవాఱెను. ఎల్లరును లేచిరి. రాత్రి చాపపైఁ బండుకొన్న యా యభాగ్యురా లక్కడఁ గానుపింప దయ్యె. ఆమె యేమయ్యె నని శ్యామసుందరుఁ డడుగ దుర్గాప్రసాదుఁ డిట్లు చెప్పెను. "బాబూ! తెల్లవాఱుజామున నామె లేచి నట్టింటి వీధితలుపు దెఱచి వీధిలోని కేఁగెను. అప్పటినుం డియు నేఁ దెలివిగానే యున్నాను. ఇంతదాఁక నామె తిరిగి రాలేదు." శ్యామసుందరాదు లచ్చెరువొంది నలువలంకు లకు సేవకుల నంపి వెదకించిరి. ఆమెజాడ తెలియలేదు.

## 6

### రంగపట్టణము

పూర్వాహ్ణ మంతయు నా దీనురాలిని వెదకుటయం దును, దత్ప్రసంగమందును గడచిపోయెను. అందఱును

భుజించి యించుక విశ్రమించి లేచిరి. మూఁడవ జామున శ్యామసుందరుఁడును, భట్టును, దుర్గాప్రసాదుఁడును సికారు బయలుదేఱిరి. కోటగోడలు బురుజులు నగర్తయును జూచి సుల్తాను నుద్యానముం జూడ నరిగిరి. ఆ యుద్యాన మెటు చూచిన నరక్రోసు విస్తీర్ణము గలది. అక్కడి మేడలు మిద్దెలు, నాత్ఖానాలు, మసీదులు, సరస్సులు, పూలచెట్లు, ఫలవృక్షములు మున్నగునవి చూచి వారు విచారించిరి. ఆ దౌలద్బాగు రామణీయకముం దిలకించి, టిప్పు చేసిన యచ్చటి చక్కని యేర్పాటుల కలరి, తత్కథలను జెప్పు కొనుచుఁ గావేరి రెండు పాయలును గలిసికొన్న చోటి కేగిరి.

ఆ నదీతీరమునఁ జక్కనిమండప మలరారుచుండెను. రెండు వైపులను నదిలోనికి దిగుటకు సోపానము లమరి యుండెను. ఆ ముప్వురును నా తరంగిణీశాఖాద్వయ సంగమ ప్రదేశంబునఁ దనవిదీర స్నానముచేసి, తచ్ఛోభ కానందించి, యటు మరలి టిప్పు గోరీనిజూడ నరిగిరి. టిప్పును దన్మాతా పితలును ననంత సుఖసుప్తిం జెందియున్న మూఁడు గోరీ లను జూచిరి. త్రికాలములయం దచ్చోట నర్చనలు జరుగు ననియు, నయ్యయి యేర్పాటు లాంగ్లేయులు చక్కఁగాఁ జేసి తగినసేవకులను నియమించి యుంచి రనియును ద త్పాలకులు వారికి నివేదించిరి. అక్కడనున్న మహామ్మదీయ సేవకులకుఁ బసదన మొసఁగి మనబాటసారు లచ్చోటు వాసి శ్రీరంగ పట్టణమున కేతెంచిరి.

సాయంకాల మయ్యెను. ఉభయకావేరీ హృదయ రంగమున రంగారు శ్రీరంగనాథు నాలయమునుండి ప్రదోష వేళ ఘంటానాదము వినవచ్చెను. ఉచితవేషములు ధరించి మన బాటసారు లాచార్యుల వారితో రంగనాథాలయమున కేగిరి. ఫలపుష్పపత్రాదులు గైకొని, లోని కేఁగి, శ్రీరంగ నాథు నర్చకులచే నర్చింపఁజేసి ప్రసాదముల స్వీకరించిరి; తరువాత శ్రీమన్మహాదేవుని కోవెల కరిగి సందర్శించి సేవిం చిరి. హిందూమతద్వేషి యని పేరు వహించినను, సుల్తానా హరి హర దేవాలయములను బాడుచేయింపక తగిన వసతులఁ గూర్చి, భోగరాగము లుచితగతిం జరుగు సన్నివే శము లొనఁగూర్చెనని విని వా రెంతయు సంతసించిరి. అనతి చిరకాలముక్రిందట నఖండవైభవమున నలరారిన యీ పట్టణ మంతలో నట్టి దుస్థితికి వచ్చెఁగదా యని చింతిం చుచు వారటువాసి యిరవున కరుదెంచి భుజించి శయ నించిరి.

మఱుఁ డుదయముననే లేచి కాలకృత్యములం దీర్చు కొని, కావేరీ పావనతీర్థంబునఁ దానమాడి దానధర్మములు చేసి, శ్యామసుందరాదులు పురప్రదక్షిణము సేసిరి. నగరము నకు నాలుగు దిక్కులందును పవిత్రాంబువాహిని యగు కావేరి కలకలధ్వనులతోఁ బ్రవహించుచుండెను. ఇడియఁ గొట్టినకోటలు, గోపురములు, బురుజులు నా పురము పూర్వపు టున్నతి నూహింపఁ జేయుచుండెను. తిరిగి తిరిగి వారు విల్లువంపునకు వచ్చిరి. అది యిటికలతో ధనురాకార ముగ నూ అడుగుల పొడువును, నిరువది యడుగుల యెత్తును

గలిగి యున్నది. ఒకవైపునుండి మీఁదికెక్కి మధ్యప్రదేశము నకు వచ్చి కొంచె మూఁగించినచో నద్ధనువు జవుకు జవుకు మనుచుండెను. వా రాగోపురద్వారధనువుం బరికించియు నం దేమియున్నదో యట్లు జవుకు జవుకు మనుటకుం గతం బెద్దియో పోల్చుకోలేక పోయిరి. అటు వదలి మన బాటసారులు రెండవ వైపునకు వచ్చిరి. సుల్తానుఁ డాంగ్లేయుల ఫిరంగిగుండ్ల కెర యయి, విగతాసుం డయిన చోటికి వచ్చిరి. భట్టు తా నెఱింగిన తద్వృత్తాంతమును విశదీకరింప వారెల్లరు గంటఁ దడి పెట్టిరి. తెల్లదొరలను గైదుసేయుటకై సుల్తానుఁ డేర్పఱి చిన నేలమాళిగం జూచి వా రాతని నతిక్రూరునిగా భావిం చిరి. త న్నగర చరిత్రము నంతయుఁ జెప్పుకొనుచు, సుల్తా నుని మహిమ కచ్చెరువొందుచు, వా రందఱు నేక వాక్య ముగా నిస్సహాయుఁడై సుల్తానుఁడు దొరలచేతులలోఁ జిక్కు కొనుటచే నిట్టి యవస్థ తటస్థించినది; కాని, వాని పన్ను గడలే ఫలవంతములయి పరాసు నాయకుఁ డగు నెపోలియను సుల్తానునకుఁ దోడయి నిలిచెనేని హిందూదేశచరిత్ర మెంత విపరీతముగా నుండెడిదో గదా! మన మిప్పు డిట్టి లీ స్థలము లను జూడ ననువుపడియుండదు గదా! యని నిశ్చయించి తిరిగి బస కరుదెంచిరి.

అ విధమున మన ప్రయాణికు లక్కడి వింతలం జూచి వినోదించిరి. ప్రకృతి చిత్రములను దెలిసికొనుటలో శ్యామ సుందరునకును, నవి తెలిసినంతవఱకుఁ జక్కగ వివరించి వర్ణించి మెఱుగుపెట్టి యుపన్యసించుటలో భట్టునకును నపారప్రీతి; కాని యనంతాచార్యులువారి కీ ప్రసంగములు

తల కంటగించుచుండెను. భోజన ప్రసంగమన్న నతని కతి ప్రీతి. మంచి మంచి వంటకములు వంట బ్రాహ్మణులచే వండించుటయు, నోరూర వాని రుచులు వర్ణించుటయు, శిష్టకృతుగా భుజించుటయు ననువాని యందు నతఁ డందెవేసిన పద్దు. భట్టుగాడ న వ్విషయమున నాచార్యులవారి కింతేనియుఁ దీసిపోవువాఁడు కాఁడు. ప్రతిదినమును వారిరువురికిని భోజన సమయమునఁ బందెములు గల్పించి, యాచార్యుల వారిని ఖుషామద్దు చేయుటలో దుర్గా ప్రసాదుఁడు నానాఁటి కాటి తేటిన వాఁడయ్యెను. ఇట్లట్యానందంబున వారందఱొక వారమచ్చటఁ గడపి దశమినాఁడచ్చోటు వాసి మద్దూరుమీఁదుగా నైదాఱు మజలీలు సేసి బెంగళూరుఁ జేరి యొక దివ్య భవనంబున విడిసిరి. త్రోవలో దొంగల భయమని యాచార్యుల వారిని బెదరించి భట్టు రూపాయల సంచిని తనవశము చేసికొనుట తప్ప వేఱే విశేషములు జరుగలేదు.

## 7

### స దా శి వ రా వు.

అది చైత్ర బహుళామావాస్య. నిశీథ సమయము. అంబరము మేఘచ్ఛన్నమై చిమ్మచీఁకటిచే రాజ్యమేలించుచుండెను. రెండు దినములనుండియు ముసురువెట్టి, యానాఁడు శ్రోణీపాతముగా, ధారా సంపాతముగా వర్షము కురిసి వెలిచెను. అదృష్టహీనుని కష్టపరంపరలవలెఁ దెరలు తెరలై జలధరము లాకాశ తలమును జుట్టుముట్టి స్వేచ్ఛావిహారము సేయుచు, వీర విహారము సలుపుచుండెను. సౌదామనీ లతలు

తళుక్కు తళుక్కుమని మెఱసి యభాగ్యుని భాగ్య రేఖం బోలి యంతలోనె యంతర్హితములయి తదుపరివచ్చు భయం కరాఘాతములను సూచించుచు నుఱుము లుఱుతర భీషణ ఘోషణంబులు సేయుచుండెను. కొందఱు విప్రోత్తములు వేదము స్వస్తిచెప్పునట్టు లుద్దిలుగాఁ గప్పలు విశ్రివిరామము లేక యఱచుచుండెను. కీచురాలు కీచు కీచు మని రొదలు సేయుచుండెను. ఒక చెట్టుపైఁ గూరుచుండి పురుగుడు పిట్ట గుజ్జుపెట్టి వెఱపు కొలుపుచుఁ గూయసాగెను. తక్కిన జీవ ప్రకృతి యంతయు నిద్రాదేవత యక్కునఁ జేరి సుఖించు చుండెను. ఎడ తెఱపిలేక యెగురుచుఁ బొంగుచుఁ గ్రుంగుచు వేలాపనిం జేరుచు, వెనుక కేగుచు జీవుల జనన మరణ సంప ద్విప ద్వృద్ధిహాని పరంపరల ననుగమించుచు మహోదధి తరంగములు ఘూర్ణిల్లుచుండెను. జిల్లున నీటిగాలి వీచు చుండెను. చెన్నపురి సెంటు జార్జికోట ద్వారపాలకు లప్పు డప్పు డుచ్చైస్స్వరంబునం దెలుపు హెచ్చరిక కేక లా సముద్ర తీరమున విహరించుచుండెను. దక్షిణ హిందూస్థాన మం తయుఁ దమస్వాధీనమునకు వచ్చెనని యాంగ్లేయ వీరు లెదలఁ జేతు లుంచుకొని హాయిగా సుఖ స్వప్నములఁ గాంచు చుండిరి.

అట్టి తఱి నిరువురు దొరలు, కరదీపికలు కరంబుల వెలుఁగుచుఁ జిమ్మచీఁకటిం జిమ్మివైచి తమకు దారిచూపఁ, జుట్టలు గాల్చుచుఁ బొగ గగనంబునం జుట్టలు చుట్ట లుగాఁ జుట్టుకొని సికారు దిరుగునట్లు వదలుచు, మెల్లగ నొక రొకరితో మాటలాడుకొనుచుఁ గోటకు నుత్తర దిగ్భా

గంబునం గల యొకగది కరుదెంచిరి. అం దొకడు చేతిలాంతరు క్రింద నుంచి, జేబులోనున్న బీగము దీసి యా గది తలుపు దెఱచెను. ఇరువురను లోనికేగి తలుపు మూసిరి.

అం దొక మంచముమీఁద నొకరోగి శయనించి యుండెను. పాప మతఁడు మిక్కిలికృశించి శల్యావశిష్టుఁ డయి యుండెను. పాలిపోయిన యతని మొగమ్మున నల్లనిమీసము గడ్డము నావరించి యుండెను. కేశపాశము సంస్కారము లేక చిక్కువడి చెదరి యుండెను. అంతదనుకఁ గఫబాధచే నతనికి నిద్దుర పట్టక పట్టక యప్పుడే చిన్నకునుకు పట్టెను; కాని తలుపుఁ దీసినశబ్దము వినవచ్చినంతలో మెలఁకువ వచ్చెను. కనువిచ్చి చూచి యా రోగి కోపమున విసువును వెగటును దోఁప నించుక కెదవులు సడలించి, 'మరల నా ప్రాణములు దీయ వీరు దాపురించినారు; న న్నింత నిద్దుర పోనీయరు' అని గొణుగుకొనుచు నుస్సురని యొక నిట్టూర్పు పుచ్చెను.

ఒకదొర:- మిత్రుఁడా ! ఏల మమ్ము దిట్టెదవు? ఈ విసుగు లేల? మేము నీకు మిత్రులము కాని శత్రులము గాము. నీ శరీర మెట్టు లున్నది? కఫబాధ కొంత తగ్గినదా? నిద్దుర పట్టుచున్నదా? వైద్యుఁ డిచ్చుచున్న మందు పరిచారకులు వేళ కిచ్చుచున్నారా? పథ్యపానములు సరిగా జరుగుచున్నవి గదా!

రోగి:-అయ్యా! మీ కెందుల కీ బాధ? నే నేమైన మీ కేమి? నా ప్రాణము లింకను బోవ కున్నవని విసువు కొనుచున్నాను. మీ మందులు నేను ద్రావను. నేఁ జచ్చి

నను నాకు విచారము లేదు. మీరు పొండు; మఱి యిక్క-
కిడి రాకుడు.

రెండవదొర:- అయ్యా! మాపైc గోపింపకు. మా బావ
హార్బట్టు, దేశమునకేగుచు నిన్నుcగూర్చి చెప్పిన మాటలు
మేము మఱచువారము గాము. నీవు, మమ్ముc దిట్టు
చున్నను నిన్ను మేము మిత్రునిగానే భావింతుము. నీ
రాజభక్తి మెచ్చc దగినదే; కాని, దేనికిని దేశకాల
వివేచనము గావలయును. టిప్పు మహ్మదీయుcడు; నీజాతి
వాcడు కాcడు. అతcడు వీరపురుషోచితమైన మరణము
నొందినాcడు. గతించినదానికి వగచిన రాcగల లాభ
మేమి? రాజ్యము మేము హరింపలేదు. మీ హిందువులకే
యొసంగితిమి. నిన్నవమానపఱచి చెఱcద్రోయించిన
టిప్పుపాటి మిత్రులము మేము గామా? మా మాట విని
యూపగ విడువుము; నీ పెండ్లమును, బిడ్డలు నెక్కడ
నున్నారో వచింపుము. వారి నిక్కడకు రప్పించెదము.
సర్వధా నీ మేలుగోరు మమ్మేల నమ్మవు? మం దేల
పుచ్చుకోవు? అక్కఱమాలిన యలజడి మనస్సునకుc
గలిగించుకొని మంచముపట్టిపోయినావు. కొఱమాలిన
తలంపులc గట్టిపెట్టి పదిదినములు మా మాట విని మందు
త్రావుము. నీ యొడలి గాయము లన్నియు మానినవి. నీ
కాధి తప్ప వ్యాధి యంతగా నేమియు లేదు. మా మీcది
పగ విడిచితివేని నీ కారోగ్య మింతలోనే కలుగును.

రోగి:- వెళ్లవయ్యా! మీ మాటనే వినను. మీ మాల మం
దులు నేc ద్రావను. మీ సావాసము నా కక్కఱ లేదు. నే

నాంగ్లేయులకు గర్భశత్రుఁడ నని తలఁపుఁడు. మీలో నేఁ జేరుట కలలోనివార్త. నాకు మీయుపకార మేమియు నక్కఱలేదు. ఈ పంతముమీఁద నే నాయనుంగు సోదరుని విడిచితిని; పడరాని యిడుమలఁ బడితిని; నిప్పుచ్చరమున వేఁగితిని; సతీసంతానముల వీడితిని; సుల్తానుం జేరితిని; మీ పయిం గత్తిగట్టితిని; నా యోపినంత పెనంగి నావిధి నెఱవేర్చుకొంటిని. సుల్తానుఁడు నా ప్రాణబంధువు. అతఁడు పొరపడినన్నుఁగార నుంచెను. పొరపాటు నరమాత్రునికి సహజము. తనతప్పు, తా నెఱింగి పశ్చాత్తాప తప్తుండయి నన్ను రావించి, "మిత్రమా! ప్రాణప్రయాణసమయమున కరుదెంచితివి. నన్ను మన్నింపుము. నీ మేలు మఱవను. మేను దాఁపక దేశమునకై మతమునకై యిరువుర మా తెల్లదొరలతోఁ బోరుదము. జయలక్ష్మి మనల వరించెనేని మిత్రమా నీవే సుల్తానుఁడవు, నేనే సరదారుఁడను. అటుగాక విపరీత మయ్యెనేని స్వర్గంబునఁ గలసికొందము. మన యిద్దఱిలో నెవరిముక్కు దండినూపిరి నిలిచియున్నను దుర్జాతు లగు నీ జాతివారిని హతమార్పక విడువరాదు. ఇదిగో ఖడ్గము. దీనింబట్టి ప్రమాణము సేయుదము" అని నన్నుం గవుంగిలించుకొనిన యా వీరాగ్రణిని నే నెన్నఁడయిన మఱతునా? అయ్యో! అట్టి ప్రభుసత్తమునిం గావలేక జీవచ్ఛవ మయి యున్న నేను, మీతో -నతనికిఁ బరమశత్రువులయిన మీతో-నతని నన్యాయముగాఁ జంపిన మీతో-హైందవరాజ్యలక్ష్మి నా కేశగ్రహణంబుగా నపహరించి

యనుభవింపఁదలంచు పరమ దుర్జాతులరగు మీతో,- మాయాశీలులు, వంచకులు, ధూర్తులు, మహాపాతకు లయిన మీతో, నటు నిటు పోరపులుపెట్టి, వారిం బట్టి వీరిం గొట్టి,వీరిం బట్టి వారిం గొట్టి, హిందూరాజ్య సర్వ స్వముం గొల్లగొట్టుచున్న మీతోనా నేఁజేరుట ? అది కల్ల. నేను బ్రతికితినేని స్వర్గరాజ్యము నేలుచున్న నా ప్రియమిత్రునియాత్మ కనంత శాంతిసుఖము గలుగు నట్టు లాతని సన్నిధిని నేఁజేసిన ప్రమాణ ప్రతిజ్ఞను నెఱ వేర్చుకొనక మానను. నిశితాసిని ధరించి మిమ్మందఱఁ గడికండలుగా నఱకక విడుచువాఁడఁ గాను. మీ ఖడ్గ ములకు మీ ఫిరంగిగుండ్లకు నో పరంగులారా ! నే నాహుతి యగుదునేని నామన్నించు సుల్తానుని నాకలో కమునఁ గలిసికొనెదను. బ్రతికియుండి యాతనియాజ్ఞ నెఱవేర్పకపోవుట రాచపాడిగాదు. అది కృతఘ్నత. మీరు భీరువులుగాని వీరులుగారు. నన్ను విడిచి ఖడ్గ హస్తులరయి మీ మహావీరు లనుకొన్నవా రొకొక్కరు నాతోఁ బోరు సల్పుఁడు. నా బాహుపరాక్రమ మెట్టిదో చవిఁజూడుఁడు. నేఁగోరున దిదియే. మీ కిష్టమయ్యెనా నాకోర్కె తీర్పుఁడు. లేదా మీ దారిని మీరు పొండు.

1. దొర:- అయ్యా! నీవు మాహోర్బట్టు మిత్రుఁడవు గాన నీ వేమన్నను మాకుఁ గోపములేదు. నీ వాతనిం జెఱ విడిపించి మాతోఁగలిపిన యుపకారము మే మెన్నఁటికిని మఱచువారము గాము. నీ వీ పగఁబూని యున్నంత కాలము నీకు నెమ్మది గలుగదు. శాంతింపుము.

రోగి:- ఆంగ్లేయులందు హార్బర్టొక్కఁడే నాకు మిత్రుఁడు. అతఁడు నేను నే డేండ్లు కారాగారంబునఁ బరమమైత్రితో నున్నారము. అందులకే సుల్తానుని యభిప్రాయమునకు విరుద్ధ మయినను నతని విడిపించి మీకడకుఁ జేర్చితిని. అతఁడు వచ్చి చెప్పినను నే నీమాట వినను. నెలల తరబడిని మీరు నాకుఁ గావించిన చికిత్సకు మీకుఁ గృతజ్ఞుఁడనే. మీరు నా కాయమునకుఁ దగిలిన గాయములు మాన్పితిరి; కాని నా హృదయమున కెన్నఁడును మానని గాయము పెట్టితిరి. ఏ పరంగివాని ఫిరంగిగుండు నా పరమ మిత్రుని ప్రాణవాయువులు గ్రోలినదో యా పరంగివాని బంధు మిత్రుల దుంపత్రెంపక నాకు నిద్రపట్టదు. ఇదే నా సంకల్పము. ఇంక మీరు పొండు.

2. దొర:- అయ్యా! సరియే మేము పోయెదము; కాని నా మాట వినుము. కుట్టూపిరితో నున్న నిన్ను భీభత్సముగా నున్న రణరంగమున వెదకి వెదకి గుఱుతించి తెచ్చుటకుఁ గత మేమని తలంచితివి? మా బావ హార్బర్టు, నిన్ను మా కొప్పఁజెప్పి, చికిత్సచేయించి యాతనిం బ్రాణమిత్రునిగాఁ జూచి సంరక్షింపుఁడని మఱి మఱి మాతోఁ జెప్పి, పోలేక పోలేక యింగ్లండునకుఁ బోయెను. కాఁబట్టి నీవు మాకుఁ బ్రాణబంధుఁడవు. గతించినది మఱచి పొమ్ము. నీవు వచించునట్లు మేము దుర్జాతులము గాము; కృతఘ్నులము గాము; నీవు ప్రాణబంధుఁడ వగుటచే నీతో రణమొనర్ప నొల్లము. ఇది కారాగారము గాదు; చికిత్సాలయము. ఇంకను నీవు సంపూర్ణముగా నారోగ్య

మును బొందలేదు. నీ జాతి హిందువులచే నీకుఁ బథ్య పానములు పెట్టించుచున్నాము. మందు త్రావి యారోగ్య వంతుండ వైనచో నిన్ను విడిచిపెట్టుట కెట్టి యభ్యంతరమును లేదు. మా మీఁది పగ విడిచితినని యొక్క మా అనుము. నీ కిక్కడ స్వేచ్ఛయే కాని నిర్బంధము లేదు.

రోగి:- అయ్యా! మనసున నొకటి, మాట నొకటియు నే నెఱుఁగను. మీ మీఁదఁ బగ సంపూర్ణరూపమున నా మనస్సున నాటుకొని యున్నది. సరి, యీ రాత్రికి నన్ను విడువుఁడు. మ ఱొకప్పుడు మాటలాడుకొందము. హార్బర్టు వద్దనుండి యుత్తరము వచ్చినదా? అతఁడు తాను వలచిన కన్యకామణిం బెండ్లియాడి సుఖముగా నున్నాఁడా? హిందూదేశమునకు మరల వచ్చునా? అనురాగ నిధి యగు నాతని దర్శనము నా కగునా?

1 దొర:- అయ్యా! ఇదిగో వానియొద్దనుండి వచ్చిన యుత్తరము. అతఁడు తన ప్రియురాలిని (అనఁగా) ఈ చార్లెసుచెల్లెలిని బరిణయ మయి క్షేమముగా నున్నాఁడు. నీ యారోగ్యమునుగూర్చి వ్రాయవలయు నని మా కిరువురి యుత్తరములలోను వ్రాసినాఁడు. ఈ పాతనికిఁ గమ్మలు వ్రాసెదము. నీ వాంగ్లేయులకుఁ బరమ మిత్రుఁడ వైతి వని. వ్రాసినచో మా బావ పరమానందము నొందును.

రోగి:- (కన్నుల నీరుంచి) అయ్యా! ఇంతవఱ కీ మాటలకు నా హృదయమునఁ దావులేదు. కాని, నీవు హార్బర్టున కేమవుదువు? నీ పే రేమి?

1 దొర:-అతని చెల్లెలి పెనిమిటిని నేను. నా పేరు ఫిలిప్సు.
రోగి:- సరియే. ఇప్పటికిఁ బోయిరండు. దైవ మెట్లు దలఁచి యున్నాఁడో చూతము.

ఆ మాటలు విని యా మార్పునకు సంతసించి యత నిని వీడ్కొని తలుపులుమూసి తాళము వేసి యా దొర లిరువురు నేగిరి.

# 8

## బెంగళూరు

బెంగళూరు సమవిశాలోన్నత ప్రదేశంబునఁ జక్కని సౌధ పంక్తులతోఁ బొలుపారు నగరీ లలామము. మలయ మారుత సౌఖ్యపరమావధిం బొందఁగోరువారా పుటభేదనం బున కేగి వేసవిని నివసింతురు. అది మధ్యమ భువన స్వర్గ భవనము.నవ నవ సురభిళ కుసుమ సమూహమ్మున కది నంద నము. మధు మధుర వివిధ ఫల విసరంబుల కది మహానిధా నము. పలు రుచుల కూరగాయల కది పంట పొలము. చల్ల గాలుల కది సవిత్రి; వింతవస్తువులకు వేడుక సంత; ఆనంద లతికల కాలవాలము;చక్కఁదనముల కిక్క;పట్టు దుకూలము లకు భండారము; పరిమళ ద్రవ్యముల కది సరకారు. విలా సినీ జనంబుల కది కళాగారము. భోగ భాగ్యంబుల కది సాగరము. వేద శాస్త్రంబుల కది విద్యా పీఠము. కళా కలా పంబునకది విలాసభవనము. నేఁతపూఁతలకది నివాసభూమి. వెండి బంగారంబుల కది వింత గని. రత్నరాసుల కది రాజ ధాని. నిస్తుల వస్తు విస్తారంబున కది నిరుపమాకరము.

సంతలు, చావడులు, క్రంతలు పుంతలు, కోటలు పేటలు, కొలఁకులు కెలఁకులు, క్రీడాద్రులు, కేళాకూళులు, చక్కనిబాటలు, చిక్కని తోఁటలు, ఉన్నత గోపురములు, ఉత్తమ కుడ్యములు, అచ్చుకూటములు, రచ్చపట్టులు, యంత్ర శాలలు యతిమఠంబులు, సంగీత శాలలు, సాము గరిడీలు, పాఠశాలలు, భజన మందిరములు, కళాశాలలు, కర్మాగార ములు, ఆపణశాలలు, అంబికాయతనంబులు, చిత్రశాలలు, శివునాలయములు, వీధివిద్యాశాలలు, విష్ణు నిలయంబులు, వర్తకశాలలు, నర్తనావాసంబులు, ఆయుధ శాలలు, ఆయు ర్వేదభవనంబులు, గజశాలులు, గణపతి కోవెలలు, గుఱ్ఱపు సాలలు, కుమారగురు గుడులు, వేదపాఠ శాలలు, ఆదిత్య ధామములు, రత్నాపణ శాలలు రామ మందిరములు, మణి భూషణ శాలలు, మారుతి మందిరములు, మారువాడి విపణి శాలలు, మహమ్మదు నిశాంతములు, గోరక్షణ శాలలు, వారాంగనా నికాయ్యంబులు, పానీయ శాలలు, పాన్సుపారీ దుకాణములు, విచిత్రవస్తు ప్రదర్శనశాలలు, వివిధ మృగపక్షి ప్రదర్శన స్థానములు, కౌశేయ క్రిమివర్ధన శాలలు, కమనీయ వస్త్రాపణములును గలిగి యా నగరరాజ మమరావతి నల కాభిధాన నెకసక్కెము లాడుచు నెసలారుచుండెను. ఆ పుర సహస్ర పత్రమునఁ గర్ణికాకారమయి సుల్తానుకోట శోభిల్లు చుండెను. ఆ కోట కనతి దూరంబున రాజవీధిలోనున్న మొదటి సౌధమే మన శ్యామసుందరాదు లప్పటి కావాస ముగాఁ జేసికొని యుండిరి.

వైశాఖశుక్ల ప్రతిపత్తున మనబాటసారులా యూరు చేరిరి. అప్పటికిఁ బ్రొద్దు వోయినది. ప్రయాణపు టలజడిచే వింతప్రసంగములు సేయకవారు భుజించి శయనించిరి. ప్రాతః కాలముననే లేచి శ్యామసుందరమూర్తియు, భట్టును, దుర్గాప్రసాదుఁడును నిలువెడలి నగరశోభం దిలకించుచుఁ బుర బాహ్య ప్రదేశంబున కేగి యచ్చటచ్చటం గల యుద్యాన వనంబులం దిలకించుచుఁ దత్తత్తరు లతా నికుంజ పుంజముల నాలోకించుచు, సమయశోభచే మెఱుఁగు దేఱిన ప్రకృతి విలాసమున కానందించుచు నుపవన రామణీయకంబున కామోదించుచు నిష్టాలాపంబులఁ బ్రొద్దు తెలియక విహరించి విహరించి, యెట్టకేల కా ముచ్చటపట్టుల వీడి వీడు పట్టునకు మరలిరి.

ఇట ననంతాచార్యులుగారు, నౌకరులఁ దోడ్కొని బజారున కరిగి, మంచిమంచి కూరలు, పండ్లు, పంచదార, గోదుమ పిండి మున్నగు సామానులు గొని పట్టించుకొని యిర వున కరుదెంచి, నాఁడు చేయవలసిన పదార్థముల నట్టి లిట్టి లని మహానసాధికారి కాజ్ఞాపించి, స్నానముచేసి జపించి, భోజనవేళ యతిక్రమించి కడుపు నకనకలాడుచున్న "నెంత కును రా రీ విలాస పురుషులు, మంచిసంగడికాండ్రు దొరకిరి మా శ్యామసుందరమూర్తికి!" అని విసువుకొనుచుండ వారును వచ్చిరి. గురువుగారికిని వారికిని దద్విషయమున వినోద ప్రసంగ మించుక జరిగిన పిదప వారును స్నానముసేసి మడికట్టుకొనిరి; ముప్వురు విప్రులు ముందు భుజించి శ్యామ

సుందరుఁడు సాపడునవు డెదురుగాఁ గూర్చుండి వినోద ప్రసంగము సేయ నారంభించిరి.

భట్టు:- అన్నా ! మన గురువుగారి పాండిత్య మపరిమితము సుమీ! ఆహా! నేఁడు వా రొందిన యానందమున కంతు లేదు. స్వయముగా సంతకుఁ బోయి, భోజన సామగ్రులు దెచ్చి దగ్గఱఁ గూర్చుండి, వంటవాండ్రచే నన్ని పదార్థము లెంత రుచ్యములుగాఁ దయారుచేయించి రను కొన్నావు ! శ్రీ రంగపట్టణము విడిచినది మొదలు మనకుఁ దృప్తి దీరు భోజనము లేదు. పల్లెటూరి బస లంత సుఖప్రదములు గావు. కావుననే, కాళిదాస దండి భవభూతి బాణ మయూరాది మహాకవుల సాహిత్య ప్రశంస లీనడుమ గురువుగారి ముఖమున వినరావయ్యె.

శ్యామ:- గురువుగారికి మనపయిం గల వాత్సల్యమునకు హద్దులేదు. పాపము వార్ధకమున మనతోఁ బయనము సేయుచు వా రెంతో శ్రమపడుచున్నారు; మన సౌఖ్యమున కెంతో పాటుపడుచున్నారు.

ఆచా:- బాబూ! తమరు మాత్రము శ్రమపడ లేదా? ఆగర్భ శ్రీమంతులు మహారాజులు మీ రిరువురు శ్రమపడుచుండ నా శ్రమ కొక లెక్కయా! తమ గురుభక్తి యట్టిది. మన జమీందారువారి ప్రతిభ నిరాఘాటమైనది సుండీ! వారు సర్వజ్ఞులు; మంచి లోకానుభవము గల మహనీయులు. వారి సహవాసము మన కదృష్టవశమున సంగత మయినది. ఇంతే కాక నేఁటి భక్ష్య భోజ్య పరిశ్రమలో వ

న్నేడఁ గొట్టినారు. తేపో మాపో పీడ దీర్చుకో వలయును.

దుర్గా:- గురువుగారూ ! దీనిలో నొక్క కిటుకున్నది. తమ రుదయము, సాయంత్రము కనీసము నాలుగైదు క్రోసులు మాతో నడచి వచ్చుచుండినచో మా ప్రభువువారి నోడించుటలో సందియ ముండదు. ఎప్పటివలె నింటఁ గూర్చుండి, తావళము త్రిప్పుచున్నచో నెప్పటికిని పీడ దీర్చుకోలేరు.

శ్యామ:- గురువుగారు ! తమరుగూడ మాతో వాహ్యాళికి వచ్చుచుండుఁడు. గుఱ్ఱపు బండి దీసికొని పోవుదము. శ్రమగా నున్నప్పుడు తమరు బండిలో రావచ్చును.

ఆచా:- చిత్తము బాబు! లేఁత వంకాయల నేర్చి తెచ్చి మెంతిపెట్టించి చక్కఁగ వండించినాను. ఆ కూరఁదమరు పసందు చేయవలయును.

దుర్గా:- దానికిఁ దోడుగా నుల్లిమసాలా పెట్టించియున్నచో నెంత మజాగా నుండియుండును. ప్రభువువారికి మఱి మిగులకయే పోయియుండును.

ఆచా:- నే నుల్లియు, ముల్లంగియుఁ దిందునటోయి పెద్ద వాఁడను?

భట్టు:- అవి చేసిన పాప మేమి యాచార్యుల వారు? తమ వంటి సత్పురుషుల హృదయములలోఁ బడినచో వానికిఁ బునర్జన్మము లేని పుణ్యము వచ్చియుండునే!

ఆచా:- చిత్తము, చిత్తము, ప్రభువు వారవధరింప వల యును. అవి నిషేధ వస్తువులు. శిష్టులు వానిఁ దినరు. అవి దుర్వాసన గలవే కాక, కామోద్రేకమును గలి గించునవగుటచే నార్యులు త్యజించిరి.

దుర్గా:-నేను నా కిష్టములేని వస్తువులను ద్యజించితిని. దాని కేమి గాని యాచార్యో త్తము లొక్కసంగతి విశదపఱుప వలసి యున్నది. విశ్వామిత్ర పరాశరులు, మునిపుంగవు లుల్లి ముల్లంగులు దినుటచేతనే కావలయు మేనకా సత్యవతుల నుద్ధరించిరి?

ఆచా:- కుఱ్ఱవాఁడవోయి నీవు. నీకుఁ బురాణ రహస్య ప్రవృ త్తులు తెలియవు. మహామహుఁ డయిన భారతవంశ కర్త భరతుఁ డుదయించుటకును, దద్వంశ చరిత్రమును వేద విభాగమును రచింపఁగల వ్యాస మహర్షి యవతరిం చుటకును గారణమయి వారి కట్టి భావ ముదయించెను. తెలిసినదా!

భట్టు:-చిత్తము, చిత్తము, అది యట్టులే కాకున్నఁ గాళిదాసు నకు మహాకవి బిరుదమును దెచ్చిన యభిజ్ఞాన శాకుంతల మును, నన్నయభట్టున కాదిమాంధ్ర విద్వత్కవీంద్రుఁ డను పట్టముం గట్టిన యాంధ్ర మహాభారతము నెట్టు లుద్భూతము లయియుండును? మన మా గ్రంథములు చదువుకొనుచు వారి వారి కవితా తత్త్వము నెట్లు వర్ణింప గలిగి యుందుము?

ఆచా:- అది, రసజ్ఞత ! జమీందారువారి ప్రతిభ యప్ర తీప. ప్రతాపవంతము. (శ్యామసుందరునితో) బాబూ !

తమ రీ పూఁ తప్పొ లెట్లున్నవో రుచి చూడవలయును. దగ్గఱనుండి చేయించినాను.

శ్యామ:- తమ హృదయమువలె నత్యంత మధురము లయి యున్నవి.

ఆచా:- బాబూ! మఱి నాలుగుపుచ్చుకొండు. మధ్య మధ్య నప్పడాల పిండి నంజుకొనుఁడు. ఇంగువ వాసన గుమ గుమ లాడు లాగున మన మధుసూదనునిచే నప్పడాల పిండి చేయించినాను. బాబూ! మన మధుసూదనుఁడు బాలుఁ డయ్యేను బిడుగుఁడునుక; మంచి ప్రశస్తమయిన పాక శాస్త్రవేత్త యగును. ఎంత చక్కఁగఁ జేసినాఁడో యీ యప్పడాలపిండిని తమరు చిత్తగించినారు కారు. వా! వా! పులిహోగిరము గూడ నతఁడే చేసినాఁడు. నిమ్మ పండ్లు మంచి యేపైనవి, పచ్చనవి దెచ్చి, నే నే రసము దీసి యీ చద్దిలో వేసి తయారు చేయించినాను. అల్లము ముక్కలు, సెనగ పప్పు మున్నగు సంభారములు నింగు వయు నే నే పాళ్ళేర్పఱిచి, వేయించినాను. ప్రశస్త ముగాఁ దయారయినది. మంచిపాకమునఁ బడినది. అ దింత తిని దాని పాకమునకుఁ దగినట్లు శ్రీకాన్నమును భుజింపుఁడు. ఆ వేఁడి కీ చలవ సరిపోవును.

భట్టు:- అన్నా! ఈ పదార్థముల పని పట్టించుటలో నేఁను గురువుగారితో గ్రుద్దులాట యయినది. భార్గవ రాముని వంటివారు వారైనను నేను భీష్మ ప్రతాపమును జూపించితిని. వయసు మళ్లినవారయ్యు గురువుగారు

పంతములో నా కించుకయుఁ దీసిపోలేదు సుమీ ! వారి దతి ప్రతిభ.

ఆచా:-చిత్తము, చిత్తము, ప్రభువువారితోఁ బంతము వేయుటకు నే నెంతవాఁడను? ఏమయిన నేఁటి భోజనము కొంచె ముద్రాత్త మయినది.

దుర్గా:- మంచి తాంబూలము దెచ్చి యిచ్చెదను. రెండు మూఁడు బీడాలు వేసికొంటి రేని యంతయు నరిగి పోవును.

ఆచా:- అబ్బాయీ! నేను బ్రహ్మచారిని గదా ! తాంబూలము వేసికొందునటోయి !

భట్టు:- ఏమీ, తప్పేమీ? 'ఔషధార్థం సురాం పిబే' త్తని శాస్త్రకారుఁడు వచింపలేదా ? గొప్ప గొప్ప మందులలోఁ గొన్ని కొన్ని జంతువుల నేసి కట్టులు (గుండె కాయలు) పడుటలేదా? కాఁబట్టి తమ రౌషధముగాఁ దాంబూలమును సేవింపవచ్చునని మా యభిప్రాయము.

ఆచా:- చిత్తము, మహాప్రభువువారు సెలవిచ్చినది యథార్థమే! కాని నా కది యలవాటులేదు. గుండె డెక్కుపడి యెక్కిళ్లువచ్చి చీకాకు పెట్టును.

దుర్గా:-అయిన నీ వఱకు వేసికొన్నా రన్న మాటే. ఒక్కసారి యొక్కింత చీకాకు వెట్టినను రెండవసారి మఱేదియుఁ జీకాకు పెట్టదు.

భట్టు:- (నవ్వుచు) మొట్ట మొదటినాఁడు తమరు పొడి పీల్చినప్పుడు బాధించినట్లు లిప్పుడు బాధించుచున్నదా?

దుర్గా:- స్వామీ! నా దొక చిన్న మనవి. మన్నింపవలెను. తాము వివాహము చేసికొనకుండ నీలాగున బ్రహ్మచారిగా నుండిపోయినా రేమి?

ఆచా:- మా తండ్రిగారు నా బాల్యముననే చనిపోయినారు. అన్నగారు దేశాంతర గతు లయినారు. నేను విద్యాభ్యాస వ్యసనంబున నవద్వీపమున కేగి యిరువది వత్సరము లక్కడ నుండి పోయితిని. నా కేమో సంసార బాధలు పడుట కిష్టము లేదు.

భట్టు:-తమ కొకయన్నగారు నున్నారా? వా రిప్పు డెక్కడ నున్నారు? వారును బ్రహ్మచారులా? లేక గృహస్థులా?

ఆచా:- అన్నగారికిఁ జిన్నతనముననే పెండ్లి యయినది. అయినను వారు శ్రీ కాశీక్షేత్రమునకు వేంచేసి, తర్కవేదాంతము లభ్యసించి విరాగులయి సన్యసించి, బదరికాశ్రమాది పుణ్యక్షేత్రములు సేవించి,బదరీ నారాయణపీఠాధి పతులయి దేశమునకు వచ్చి ప్రస్తుత ముడిపిలో విజయము చేసియున్నారు.

దుర్గా:- ఆయన భార్యగతి యే మయ్యెను?

ఆచా:-ఆమె చనిపోయెనఁట. అందులకే వారు, పెండ్లిచేసికొమ్మని నా కాజ్ఞాపించినారు;కాని నా యనిష్టమును విని యింకఁ గొంతకాలములో నాకుఁగూడ సన్యాస మిచ్చి తమ యనంతర మా పీఠమున కుత్తరాధి కారినిగాఁ జేయుదు మని సెలవిచ్చియున్నారు.

దుర్గా:- తమరు పీఠాధిపతు లయినప్పుడు నన్నుఁ దమ ముఖ్య శిష్యునిగాఁ జేసికోవలయు నని యిప్పుడే దరఖాస్తు చేసి కొనుచున్నాను.

ఆచా:-అలాగునసే బాబూ! అలాగునసే, దాని కేమి భాగ్యము?

భట్టు:-అప్పుడు మా సంస్థానమునకుఁ దాము పీఠముతో విజయము చేయింపవలయును. మా పూల బగీచాలోని సౌధము తమ బస కేర్పాటు చేసెదము. మా మంత్రులు భృత్యులు, మేమును దమ్ము సేవించి కృతార్థుల మయ్యెదము. మా కోటలు, పేటలు, తోఁటలు, దొడ్లు, బళ్లు, మేనాలు, గుఱ్ఱములు, నేనుఁగులు. వెండిదుడ్ల నౌకర్లు, బంగారు డవాలా బంట్రోతులు, మా ఖజానా, కంఁదా, కార్ఖానా, మా సభాస్థానము, కవులు, పండితులు, గాయకులు, వైణికులు, వైయాకరణులు, తార్కికులు, మధ్వమతాభినివేశులు, పౌరాణికులు, నప్సరసలం బోని విలాసినీ జనము, సత్రములు, చావడులు, గుళ్లు, గోపురములు, సమస్తము తమ స్వాధీనము చేయించి వేసి మేమును దమ శిష్యులమై సేవించుచు నుండిపోయెదము; మిమ్ము మఱి విడువము. మన బాబు శ్యామసుందరుఁడును, మన వద్దనే యుండును. ఆహా! యే మానందము! అట్టి దినము లెప్పుడు వచ్చునో!

ఆ మాటలు విని యాచార్యులుగారు మనస్సులో నుప్పొంగిపోయిరి. ఆ భావము మొగమ్మున స్పష్ట మగుచుండెను. అప్పుడే తాను జగద్గురు పీఠము నధిష్ఠించి కాషాయ

చండ కమండులు మండితుఁడయి పూలబగీచాలోని వనప ర్తి వారి సౌధంబున విడిసినట్లును, సకల సామంత భృత్యా మాత్య పరివృతుఁడయి వనప ర్తి సంస్థానాధీశుఁడు, దాసో హమ్మని యాత్మార్పణము గావించి తన్ను సేవించు చున్న ట్లును, వారి వీరి కందా లేకమయి పంచ పక్వాన్నములతో నిండి గుమ గుమ పరిమళించుచున్నట్లును దలంచుకొనుచు నానందంబున నర్ధ నిమీలిత నయనుండయి పరవశుఁడయి పోయెను. శ్యామ సుందరుఁడు నవ్వాఁపు కొనలేకపోయెను. ఇంతలో నతని భోజనము ముగిసెను. అందఱును జావడి లోనికి వచ్చి కూర్చుండి, కొంత కొంత వినోద ప్రసంగము గావించి యింత విశ్రాంతి దీసికొనిరి.

సాయంకాలమున నందఱును బయలుదేఱి యా యూర నున్న దొరల పటాలమును జూడఁబోయిరి; మఱియు నా చుట్టుపట్టుల నున్న వింతలను దిలకించి రాత్రి యెనిమిది గంటల కిల్లుచేరిరి. దుర్గాప్రసాదుఁ డా ప్రాంతమునఁ జెట్ల క్రింద రాలిన గురి వెంద గింజ లేరి పెద్దమూటఁ గట్టి తెచ్చెను. బాగుగాఁదిరిగి వచ్చుటచేఁ జక్కని యాఁకలి గలిగి యాచా ర్యాదులు రాత్రి పంతములు వేసి భోజన పరాక్రమమును జూపిరి.

రాత్రి చల్లగాలిలో నొకింత దిరుగఁ గోరి శ్యామ సుందరుఁడును, రామచంద్రభట్టును రాజవీధిని మెల్లగా నడచి వెళ్లుచుండిరి. కొంచెముదూరము వెళ్లినంతలో నొక పెద్ద యిందునుండి, చల్లగాలిలోఁ గలిసి హాయిగా నొకపాట విన

వచ్చుటచే వారా సందులోనికి మరలి, యా సవ్వడింబట్టి యొక మేడ వాకిటికిం బోయి నిలిచిరి.

ఆ మేడలో నొక రమణీ లలామ గానము సేయుచు, నడుమ నడుమ వీణమీటుచు మన యువకులకు వీనుల విందు చేసెను "ఎంతవాఁడవో! యినవంశమణీ, సుంత యేని దయఁ జూపవె నాపైని" అను సావేరి కీర్తనను మనోహరము లగు జంత్ర గాత్రముల మేళవించి, యా యన్నుల మిన్న గానము సేయుచుండెను. సంగీతశాస్త్ర కోవిదు లగు మన భట్టు, మూర్తులు, "ఆహాహా! ఏమిహాయి, ఎంతసొంపు, ఏమి మధురము. కోకిల కుత్తుక, వింతతూఁగు, వింతసంగతి గవ్వలగుత్తి, కమ్మచ్చుతీఁగ, రాగరస రంజితము, లయా విభాసితము, పరిపూర్ణ కళా శోభితము, భరత శకుంత కూజితము, మయూర కేక, కలిత మృదుపద ధ్వని, కోమల జంత్ర గాత్ర సమ్మేళనము, సుకుమారత, అర్థస్ఫుటము, చొక్కు, భావగరిమ, కాంతి, శయ్య, కులుకు, చిఱు తరంగములు, ఘుమం ఘుమ ఘుంఘుమలు, లేఁతపూఁతలు, ఒయ్యారములు, జిలుగులు, నగిషీలు, మృణాలసూత్ర నిస్వనములు, తేనెసోన, పూలవాన, లతకూన, రసదాడిరసము, వెన్నెల వెలుఁగులు, మతాబు వెలుఁగులు, తారాజువ్వలు, జంఝామారుతములు, అమృత ప్రవాహము. వా! వా! సెబాస్, ఔర! అద్దిరా! భళీ! బాగు బాగు! హాయి హాయి!" అనుచుఁ జొక్కి సోలుచు మనశ్రోతలు తమ్ముఁ దా మెఱుఁగక కొంత తడ వచ్చటఁ జిత్రాకారులై నిల్చిరి. అంతట నా కీర్తన ముగిసెను. "నీ పాద కమలములకు నిత్యజయ మంగ

శ'' మ్మను మంగళహారతి వినవచ్చెను. మేడ గవాక్షముల నుండి నీరాజన జ్యోతి గానవచ్చెను. అదియు ముగిసెను. అప్పటికిఁ బది పదునొకండు గంట లయియుండును! ఆ దెవ్వరి హర్మ్యమో, యా గాయనీమణి యెవ్వతయో తెలుపఁ గలవా రెవ్వరు నా నిశీథమున నగుపింపమిచే మనశ్రోత లా కుతూహలము దీరక విధివేక మరలి బసకేతెంచి శయనించిరి. స్వప్నమునందును వారి శ్రోత్రేంద్రియ మా గంధర్వ గాయనీమణి గానమే వినుచుండెను. అంతలోనే బల్లునఁ దెల్ల వారెను.

## 9

### శ్యామల - సీత

వైశాఖ శుక్ల తృతీయ, రామచంద్రభట్టు పుట్టిన దినము. ముప్పది యొకటవ వత్సర మాతని వయస్సున నడుగిడును. ఆ నాఁడు పండుగుఁజేయఁ దొలినాఁడే యేర్పాటు చేయఁబడెను. నాఁటి ప్రాతఃకాలమున మన బాటసారులు నల్వురును నభ్యంజన స్నాన మాచరించిరి. ఆచార్యులుగారును, దుర్గాప్రసాదుఁడును నౌకరులను దోడ్కొని యంగడి వీధి కరిగిరి. భట్టును శ్యామసుందరుఁడును మంచిదుస్తులు దొడుగుకొని తిలక ధారణము సేసి వీధిలోనికి బయలు దేఱిరి. రాత్రి గానమొనర్చిన గంధర్వ గాయనీమణి యెవ్వతెయో తెలిసికొన నుత్సుకులై వారిరువురు రాజవీధిని వచ్చి సందు నకు మరలిరి. తొలినాఁటి రాతిరి తాము వచ్చిన సౌధద్వారమున జను లెల్లఁరు గుంపులు గుంపులుగాఁ జేరియుండుట వార

రసి వడి వడి నడచి వెళ్లిరి. రాత్రి గానసుధా లహరి వెల్లి గొల్పిన యా మేడనుండి రోదనధ్వను లపుడు వినవచ్చు చుండెను. హాహాకారములు సేయుచు స్త్రీపురుషు లింటిలోనికిం బోవుచు వచ్చుచుండిరి. ఆ దృశ్యమును గాంచినంతనే యా యింట నేదియో యాపత్తువచ్చియుండు నని గ్రహించి తత్తర మొంది భట్టు, గృహాంతర్భాగమునుండి వచ్చు నొకనిం దత్కారణ మడిగెను. అయ్యో! శ్యామలకూఁతు రకస్మాత్తుగా మరణించిన దని యాతఁ డశ్రుపూరితనేత్రుఁ డయి పలికెను. బాబూ! వేగము రమ్మని పలుకుచు భట్టు జన మధ్యమునుండి ముందు దారితీసెను.

నట్టిల్లు గ్రామస్థులతో నిండియుండెను. మేడమీఁది కేగ నొక సోపానమార్గ మా నట్టిల్లు దాఁటినంతనే చీడీ పయి నున్నది. ఆ మార్గము యాతాయాత జనములతోఁ గిక్కిరిసి యుండెను. మెల్లగ దారిచేసికొని మిత్రు లిద్దరును మేడమీఁది కరిగిరి. ఆ సౌధాంతర్భాగ మల్లకల్లోలముగా నుండెను. వచ్చిన ప్రజలలో విచారింపని వారును, బాలిక గుణగణముల నుతింపని వారును, గంటఁ దడి పెట్టనివారు నొక్కరును లేరైరి. ఎట్టులో దారిచేసికొని మిత్రులు వీథి గది ద్వారదేశమును జేరిరి. వారిం జూచినంతనే యెల్లరును దారి యిచ్చిరి. వారు గదిలో నడుగుపెట్టి నిలిచిరి.

ఆ గది విశాల మయినది. దాని నడుమ, ద్వారమున కెదురుగ నొకమంచముమీఁదఁ బరమ లావణ్యవతి యగు పదునాలుగేండ్ల బాలిక వెల్లకిలఁ బడియుండెను. త ద్వదన సుధాకర మండలము రాహుగ్రస్త మయినట్లు కళాహీన

మయి యుండెను. మల్లెపూలును, మొగలి రేకులును గూర్చి వేసిన యా బాలిక నిడుదవేనలిజడ, కుడిప్రక్కను కృష్ణ సర్ప మట్టులు పడియుండెను. ఆ జడ తుదను బంగారు జడ గంటలు గూర్చిన నల్లని పట్టుకుచ్చు లలరారుచుండెను. ఆమె నెమ్మోమునం బెట్టిన యంగారుబొట్టుచుక్క చెక్కు చెద రక చక్కఁగా నుండెను; చెవులకును, సంపంగినాసికకును గల వజ్రభూషణములు ధగ ధగ మెఱయుచుండెను, కన్నులు మూతవడెను; ఉచ్ఛ్వాస నిశ్వాసము లాఁగిపోయెను; చెక్కిళ్లు గాజువాఱెను; మెడలోని చంద్ర తార హారములు వజ్రాల యడ్డిగయుఁ జిక్కుపడియుండెను. జబ్బలందు మువ్వల దండ కడియములును భుజ బంధములును మిల మిల మెఱసిపోవు చుండెను; ముంజేతుల రంగారు బంగారు గాజులు, పోంచీలు, గొలుసులును దళుకు లీనుచుండెను; ఇరుచేతుల వ్రేళ్లయం దును వజ్రములు కెంపులు చెక్కిన యంగుళీయకములు చెరిరెండును జిగజిగ మెఱయుచుండెను; నడుమునఁ దగటు బంగారుమువ్వల యొడ్డాణ మమరియుండెను; పాద ద్వయ మున వెండిమువ్వల గజ్జెలు పొలు పొందుచుండెను; రాతిరి గట్టుకొన్న బెంగళూరి యూదాపట్టు జరీచీరయు నాకుపచ్చని మకమలు రవికెయు నాబాలిక సువర్ణ దేహచ్ఛాయకు వన్నె గూర్చుచుండెను. స్వర్గభ్రష్టయై యెద్దియేని ఘోరతాని ముని శాపవశంబున భూతల పతిత యయిన దివ్యకుమారీ రత్నము వలె నాబాలిక యా శయ్యపయిం బడియుండెను.

ఆ పిల్లప్రక్కను బచ్చని దబ్బపండువంటి మేనిచాయ గల నలువదియైదేండ్ల సంపన్నవనితామణియొూర్తు, తలయు

ఱొమ్మును బాదుకొనుచుఁ గన్నీ రేఱులై పాఱుచుండ, "నా సీతాలక్ష్మీ! నా తల్లీ! నా భాగ్యరాశీ! నా పసినిమ్మపండా! నా వరప్రసాదినీ! నా సౌభాగ్యనిధీ! అయ్యో! అయ్యో! నా చిట్టితల్లీ! నన్ను విడిచి పోతివా? ఇంక నే నెట్లు బ్రతుకఁ గలను? నాకేమిదారి? నాకీభాగ్య మేల? ఈ మేడలు మిద్దెలు నేల? నాకీ మొండిబ్రతు కేల? ఆహా! శ్రీరామచంద్రమూర్తీ! ఆర్తత్రాణపరాయణా! నిన్ను నేను నమ్మి కొలువలేదా? నా యానంద ధామము నెత్తుకొని పోయెదవా? తండ్రీ! నా బిడ్డ ప్రాణము లిచ్చి నన్ను రక్షింపుము; లేదేని నా ప్రాణములు గూడఁ దీసికొనిపొమ్ము. భక్తుల రక్షింప నీకుఁ బరాకున్నదా? తండ్రీ! నేను భక్తురాలను గానా? నా యాపద కడ్డపడవా! నీ భక్తోద్ధరణ కథ లన్నియుఁ గట్టు కథలా? నా తండ్రీ! నిన్నే నమ్మినాను. మహాప్రభూ! దేవదేవా! దీనరక్షామణీ! రామచంద్రమూర్తీ! రక్షింపుము రక్షింపు"మని వేడ్చివేడ్చి పరవశ యయి నిలువు గన్నుల బాలికం జూచుచుండెను. చుట్టును మూఁగియున్న యామెబంధువు లామె నోదార్చుచుండిరి.

ఇట్టి హృదయ విదారక మగు దృశ్యముం జూచి మన మిత్రులు నశ్రుపూరితనేత్రులయి కొంతవడి ఱిచ్చవడి చూచుచు నిలువంబడిరి. తుదకు ధైర్య మవలంబించి రామచంద్రభట్టు కన్నులు తుడుచుకొని గొంతు సవరించుకొని తత్రత్య జనంబుల నుద్దేశించి బిగ్గరగా నిట్లు పలికెను. "మీ రందఱొక్కింతసే పూఱకున్నచో నేమేని లాభ ముండును. ఒక్కనిమిషము సద్దణఁగి నా మాటలకు జవాబిండు" అని

పలుకు నాతనిపై సందతీదృష్టులు నొక్కసారి పడెను. అతఁడేమి చెప్పనో యని సద్దణఁగి యెల్లరు విన వేచియుండిరి. ఆ గృహాధికారిణికి శ్రీ రామచంద్రమూర్తి ప్రత్యక్ష మైనట్లు దోఁచెను. భట్టు రెండు నిమిషములు ఱెప్పవేయక, తల్పంబునం బడియున్న బాలిక నెమ్మోము పరికించి, 'యీ బాలికను నే స్పృశింపవచ్చునా?' అని యడిగెను. "అభ్యంతర మే మున్నది తండ్రీ!" అని గృహాధికారిణి పలికెను. భట్టు బాలిక తలయుంపిదెసకు వచ్చి తన యనామి కాంగుళితో నా బాలామణి నుదుటియందును, చెక్కిళ్ళయందును నొక్కి, యామె పెదవులు తెఱవంజేసి చూచి, కన్నులు తెఱవం జేసి పరికించి, చేతినాడిని నిదానించి, "బాలిక బ్రతికి యున్నది; తప్పక బ్రతుకఁగలదు; సర్ప దష్ట యయినది. ఉసురు లఱుగంటి యున్నవి. ఊపిరియు నాడియు నిలిచిపోయి నవి. అయినను భయము లేదు. మీ రందఱు నవ్వలి చీడీలోని కరుగుఁడు. మూఁడుసేర్ల పాలు పోసి మూఁడు క్రొత్త కుండ పాలికలు, నొకవస్త్రమును వెంటనే తెప్పింపుఁడు. జన సమ్మర్ద మీ యింట నుండరాదు. నే నొక్కఁడనే యీ గదిలో నుండవలయును" అని భట్టు వచించెను. అతఁ డించుక ధ్యాన నిమగ్నుఁ డయ్యెను. రెండు మూఁడు నిమిష ములలో నతఁ డాజ్ఞాపించినట్లు సర్వమును సిద్ధ మాయెను. శ్యామ సుందరుఁడు తనమిత్రుని యపూర్వచర్య కద్భుతా విష్టుఁడయి ప్రాన్పడి చూచుచుండెను. తక్కినవా రంద ఱును వెలుపలి కేగిరి. గృహాధికారిణియు నామె దాసియు వీధిచీడీలో నిలువంబడి మైమఱచి కలగన్నట్లు చూచుచుం

డిరి. భట్టు కన్ను దెఱచి యా సంపన్నురాలిం జూచి,‘ నిన్న నాయంత్రము మొగలిపూవులు గొంటిరా?’ అని యడుగ, ‘ఔను, నాయనా, కొన్నాము ’ అని యామె చెప్పెను. ‘ఎన్ని పూవులు?’ ‘పండ్రెండు’ ‘సిన్నను వాడగా మిగిలిన వెక్కడఁ బెట్టినారు?’ ‘అవ్వలి గదిలో’ ‘సరే ’ అని భట్టు కావలసిన సమాచార మడిగి తెలిసికొని, కన్నులు మూసి కొని యేదో మంత్ర మై దాఱు నిమిషములు జపించిన పిదప నొక విలక్షణమగు పెద్ద కేక వేసెను. అందఱు నులికిపడి విభ్రాంతులయి చూచుచుండ నెదుటిగది మోరు వాకిలి తలుపు సందుననుండి సర సర ప్రాకుచు నొక కృష్ణసర్ప మచ్చోటికి వచ్చెను. ఆ సంపన్నురాలును దాసియు గొల్లు మనిరి. చేసన్న చే వారి నూరకుండఁ జేసి భట్టు వే ఱొక వింత భాషలో నొక మాట చెప్పెను. ఆ యాజ్ఞావాక్యమును విన్నంతనే యా త్రాఁచుపాము మంచము చుట్టును గిరగిర దిరుగఁ దొడఁగెను. ఆ పాముసు్సు రుస్సురని యా యాస పడుచు రెండుమూఁడు సారులు మంచమునకుఁ బ్రదక్షిణము సేయుట చూచి, భట్టు తన ఫాలతలంబునఁ గే లుంచి యోచించుచుఁ దన గురుదేవునికి నమస్కరించెను. అంతలో మెఱపు మెఱసినట్లు లొక యూహా యాతనిబుద్ధిని స్ఫురించెను. పండుకొనియున్న బాలిక బారెఁడుజడ నతఁడుమంచము నుండి క్రిందికి వ్రేలాడవైచెను. వెంటనే యా నాగము సర సరవచ్చి యా జడమీఁదుగా మంచముపై కెగఁ బ్రాఁకెను. భట్టు మరల నేదో యాజ్ఞాపించెను. అప్పన్నగము కన్యకా మణి కంఠసీమ నొక కాటు వైచి మెఱపు మెఱసినట్లు

జడపైనుండి క్రిందికి జాఱి యొక పాలపాలిక కడకేఁగి యందలిపాలలో విషమునుగ్రక్కెను. మరలనది మంచమెక్కి కన్నియ నెన్నడుమునఁ గాటువేసి వచ్చి రెండవ పాలికలో విషము డించి, మూఁడవసారి మంచమెక్కి బాలిక పాదాం గుష్ఠమునఁ బల్లు నాటించి దిగివచ్చి, మూఁడవ పాలికలో విషమును గ్రక్కి మూర్ఛిల్లి నేలఁ జచ్చినట్లు పడిపోయెను. చూచుచున్న శ్యామసుందరాదుల కది స్వప్నమో యథార్థమో తెలియరాదయ్యెను. ఆ మూఁడు పాలికలందలి పాలును బచ్చగఁ బసుపు కలిపినట్లు మాఱి విఱిగిపోయెను.

భట్టు నెమ్మోమున నానందచంద్రిక తాండవించెను. అతని కనుగొలుకులనుండి సమ్మోదాశ్రువులు జల జల రాలెను. "కృతార్థుల మైనారము. బాలిక జీవించినది. ఇంక నైదాఱు నిమిషములలో నీమె కుచ్ఛ్వాస నిశ్వాసములు వచ్చును. మొగము శరీరమును రంగుమాఱుచున్నవి. చూడుఁడు" అని భట్టుపలికెను. ఆ సంపన్నురాలి యానంద మెంతని వర్ణింపవచ్చును! నట్టింటఁ బాము న్నదిగాని లేకున్న చక్రరక్షకుఁడే ప్రత్యక్షమయి పిల్లను బ్రతికించె నని భట్టు పాదములపై వ్రాలి యానందాశ్రువుల నభిషేకించి యుండదా? మాట తెమల్చుకొని యామె యేమో పలుకఁ బోవ భట్టు వారించి, "ఇదిగో, ఒక కుండయు మూఁడు కోడి గ్రుడ్లను, నొక పెద్ద గుడ్డయుఁ దీసికొని రం" డని పరిజనమున కాజ్ఞాపించెను. వారు వెడలిరి.

సర్పదష్టయైన కన్నె నెమ్మోము కళా సనాథ మయ్యెను; నునుఁజెక్కుల నరుణకాంతులు ప్రసరించుచుండెను; ఇంచు



భట్టిమో యాజ్ఞాపింప నక్కాకోదరస్వామి యా కుండలోనికిం
బోయెను. (69-పుట)

కించుక శ్వాస లాడెను; నాడి సంచరింపఁ దొడఁగెను. ఆమెకుఁ గొంచెము తెలివి వచ్చెను. ఆమె కన్నులు విడెను. ఆహా! ఎంతచక్కని కన్నులు! మరల నవి మూఁతపడెను. అందఱు నీ మార్పులు చూచి 'సీత బ్రతికినది, సీత బ్రతికిన' దని కెవ్వునఁ గేక వేసిరి. వెలుపల మూఁగియున్న గ్రామస్థు లందఱు నానంద కోలాహలధ్వనులు గావించిరి. ఆ యద్భుత కృత్యమును గూర్చి వింత వింతగ ముచ్చటించుచుఁ జల్ల చల్లగ నెవరింటికి వా రేగిరి.

ఇంతలోఁ గోడిగ్రుడ్లును, కుండయు, పెద్ద గుడ్డయుఁ దెచ్చి యొక పరిచారిక గుమ్మమునొద్ద నుంచెను. కుండలో గ్రుడ్లుంచుమని భట్టాజ్ఞాపింప దాసి యుంచెను; చల్లని నీళ్ళు తెమ్మన్నఁ దెచ్చెను. భట్టు మరల నేదో మంత్రము జపించి యా చన్నీళ్లా పాముమీఁద రెండు మూఁడు సారులు చిలుక రింపగాఁ బాము కదలెను. చేతితోఁ గుండ నోరగిలఁబట్టి భట్టేమో యాజ్ఞాపింప నక్కాకోదరస్వామి యా కుండలో నికిఁ బోయెను. భట్టు కుండపైని గుడ్డ వాసెన గట్టి దానిని మొగలిపూవు లున్నగదిలోఁ బెట్టించెను. "దీనిని సాయం త్రమువఱకు నట్టులే యుంచుఁడు. తరువాత నేఁ గావింప వల సిన విధానము నెఱిఁగించెదను" అని పలికి భట్టు బాలికవైపు చూచెను.

అప్పటికి సీతాలక్ష్మికిఁ దెలివి వచ్చెను. ఇంక మీఁదు లోపలికి రావచ్చు నని భట్టు, గృహాధికారిణితోఁ జెప్పెను. ఆమె యొక్కపరుగునవచ్చి భట్టు రెండు పాదములమీఁదను దలయుంచి మ్రొక్కి లేచెను. తండ్రీ! మా పాలిటి పరమేశ్వ

ఱుఁడవు గాని నీవు మనుష్య మాత్రుఁడవు గావు. నీ ఋణ మెట్లు తీర్చుకోఁగలను? నా బిడ్డ ప్రాణములతోపాటు నా ప్రాణములుగూడ నిలిపితివి" అని పలుకుచు బాష్పములు కనుదమ్ములనుండి చెక్కిళ్లఁ జాలువాఱ నా సంపన్నురాలు తన కంఠసీమ నున్న చంద్రహారములు దీసి యతని కర్పింపఁ బోయెను. "వద్దు. వద్దు. ఇప్పుడువద్దు. నే నేమియుఁ జేసి నది లేదు. ఇ దంతయు సద్గురు కటాక్ష విశేషమున నైనది. నా విధి నేను నిర్వర్తించితిని. ఇట్టి దానికి బహుమానము గైకోరాదు. మీ రిక్కన్యకామణిని భద్రముగాఁ గాపాడు చుండుఁడు. సాయంకాలమువఱకు నీమె కేమియు నాహార మీయ వద్దు. నేను మరల సంజవేళ వచ్చెదను. కాని, నే నొక్కమాట యడిగెదను. నిన్నరాత్రి యీమేడలో వీణ వాయించి పాడిన దెవరు?" అని భట్టు ప్రశ్నించిన అంత నా సంపన్నురాలు బాష్పపూరితనేత్రయై గద్గద స్వరంబున ఆర్యా! మీరు బ్రతికించి మరలఁ బ్రసాదించిన యీ నా బిడ్డయే పాడినది. అని సంపన్నురా లన, నబ్బురపడి భ ట్టాకన్యయఱచేతిని నిదానించి చూచి, 'ఈ బాలిక నీ గర్భ మునఁ బుట్టిన బిడ్డయా?' అని ప్రశ్నించెను. 'కాదు! నాయనా! కాదు;' అని యా కాంతామణి వచింప, భట్టు, "ఈ సుందరి బ్రాహ్మణకన్య" అని పలికెను. ఔనని యామె పలుక, "ఇక్కన్య పుట్టినవెంటనే తల్లి చనిపోయియుండును" అని భట్టు చెప్పెను. అతని ప్రజ్ఞ కద్భుతపడి, 'ఆ సంగతి నాకుఁ దెలియదు బాబూ!' అని సంపన్నురా లనెను. " ఈ చిన్ని రమణి కిఁక గండము లేదు. పది మాసములలోఁ బరిణయ

మగును. ఐదుగురు బిడ్డలీమెకుఁ గల్గుదురు. గర్భశోకము గలు గదు. భోగభాగ్యములతోఁ దులఁదూఁగుచు నీమెభర్తతోఁ జిరకాలము జీవించి సుఖించును" అని భట్టు పలుకుచుండ నించుక నయన చకోరముల విప్పి, య ప్పాన్పుపయి నున్న పువ్వుఁబోణి రామచంద్రభట్టుం జూచెను. లజ్జారుణిత కపోల యయిన యా బాలిక పెదవులపై మందహాస మంకురించెను. భట్టుమాత్ర మది కనిపెట్టెను. భట్టుప్రజ్ఞ కద్భుత పడుచు సంపన్నురాలొక తివాసి వేయించి, 'స్వామీ ! నిలిచి యున్నారు, ఇం దుపవిశింపుఁడు' అని పలికెను. "మే మింటికి వెళ్ళిపోవలయును. మా వెంట బస కెవరినైనఁ బంపుము. నే నొకమందు పంపెదను. అందు సగము చనుబాలతోఁ గలిపి పాము కాటువైచిన ముచ్చోటులఁ బూయింపుము. తక్కిన సగమునాలుకపయిం బూయుము. జాలము సేయరాదు. మేము పోయివచ్చెదము. పిల్ల లేచి తనంతట మాటలాడు వఱకు నామెయొద్ద కెవ్వరును బోకుఁడు; మాటలాడింపకుఁడు. జరి గిన యుదంత మామెకుఁ దెలియనీయ వద్దు" అని మెల్లగా నా సంపన్నురాలితోఁ వచించి భట్టు శ్యామసుందరుని చేయిఁ బట్టుకొని వెలుపలికి వచ్చెను. "స్వామీ ! ఆర్త రక్షకు లయిన తమ నామధేయము నెఱిఁగింపఁ గోరెదను "అని యజమానురాలడుగ భట్టు నవ్వి యూరకుండెను. శ్యామ సుందరుఁడు నవ్వుచు, 'నా ర్తరక్షకుఁడు శ్రీ రామచంద్ర మూర్తి గాక యింకెవ్వరగుదురు?"అని యుత్తర మిచ్చెను. సంపన్నురాలి సంతోషమునకు మేర లేదు. తన యిలువేల్పే యాతనిరూపమున నేతెంచె నని యామె భావించి వారికి

నమస్కరించి వీథి గుమ్మమువరకు నంపకము పెట్టి వారి వెనుకఁ దన పెద్ద పరిచారకను బంపి, సెలవొంది మేడమీఁది కరిగెను.

వీథివెంబడి వచ్చు భట్టును మిత్రునిఁ గాంచి, యగుల్ల గుళ్ళను గుంపు గుంపులుగాఁ జేరియున్న పురజనులు, వారి నడిగి తాము విన్న వింతవార్త సత్యమని తెలిసికొని పలు విధంబుల భట్టును నుతించుచు నతని బసవఱకు వెంబడించి వచ్చిరి. వారిమూలమున, నా సంపన్నురాలు శ్యామల యను నొక వేశ్యాంగన యనియు, సీత యామె పెంపుడు కూఁతు రనియు, నిరువురు విద్యావినయ వివేకవతు లనియు మన మిత్రు లెఱింగిరి. భట్టు బసకువచ్చి మందిచ్చి దాసిని బంపివేసి, మంత్ర మహిమను దనమిత్రునకుఁ జెప్పెను. నమ్మి చెడిన వారెవ్వరును లేరు.

## 10

### సీతాలాభ వృత్తాంతము

రామచంద్రభట్టు శ్యామలతోఁ జెప్పిన చొప్పున నాలుగుగంటలు కొట్టువేళకు శ్యామలామందిరమున కరుగు దెంచెను. అప్పటి కొకటిరెండు గంటలకు ముందే సీతాలక్ష్మి నెమ్మదినొంది లేచి జరిగిన యావత్సంగతులును శ్యామల వలన వినెను. తన మైకమునఁ దాఁ గన్న భట్టు నాకార మును, దాను విన్న సాముద్రికాంశములు నామె కప్పుడు దెరదీసినట్లు జ్ఞప్తికి రా నే మే మో యాలోచించుకొనుచు శ్యామల నేవో సంగతులు ప్రశ్నించుచు నొక పడకకుర్చీలోఁ

కూరుచుండి యుండెను. ఇంతలో దాసి పరుగున మేడ మీఁదికి వచ్చి, 'అమ్మా! ఆయన వచ్చుచున్నారు' అని చెప్పెను. భట్టు గుమ్మమెక్కి యక్కడ నున్న మల్లెపందిరిని బరికించుచుండెను. శ్యామలయు దాసియు నెదురు వచ్చి యతనికి దండము పెట్టిరి. "అమ్మాయి తమ యనుగ్రహము వలన బ్రతికి బట్టకట్టినది. ఇప్పుడు నెమ్మదిగా కూర్చున్నది. దయచేయుఁడు, చాల శ్రమపడితిరి" అని పలికి శ్యామల సగౌరవముగా నతనిని మేడమీఁదికిఁ దోడుకొనిపోయెను.

ముందటింటికిని వెనుకింటికిని నడుము నున్న పశ్చిమపు మేడ వసారాలోఁ బడక కుర్చీలోఁ గూరుచుండియున్న సీత వారి యడుగుల చప్పుడును, మాటల సవ్వడియు వినవచ్చి నంతనే లేచి యెదురువచ్చెను; భట్టు మేడ తుది మెట్టెక్కు నప్పటికి నునుసిగ్గున నతని వదనముం గాంచి తల వాంచి యతని యడుగులపయిని వ్రాలెను. "లెమ్ము లెమ్ము. ఆయాసపడ వద్దు. ఉపచారము లక్కఱ లేదు. కుర్చీలోఁ గూరుచుండుము; చెదరిన హృదయమును బదిలపఱచు కొమ్ము. కన్నులు దుడుచుకో. భావోద్రేకమున నలజడి గలుగును" అని భట్టు పలికెను. కృతజ్ఞతా సూచకము లగు నశ్రువులతో నిండిన కనుదమ్ములెత్తి యమ్ముగ్ధ, తనప్రాణ రక్షకున కీక్షణంబుల నీరాజన మిచ్చెను. వారందఱు నా వసారాలోని కేగిరి; అక్కడఁ బఱచియున్న రత్నకంబళము పయిని భట్టు నాసీనుం గావించిరి. కుర్చీలోఁ గూరుచుండు మని, భట్టు చెప్పినను సీత తల్లిప్రక్కను దివాసిమీఁదఁ గూర్చుండెను. అప్పటి యామె హృదయస్థితిని వర్ణింపఁగల

వాక్యపద్ధతి గానరాదు. ఆమె తల వంచుకొనును; వెంటనే తల యెత్తును; రామచంద్రునిఁ గ్రేఁగంట గాంచును. అతని చూపులు దాఁకొనెనేని యామె చూపులు బెదరి మరలి వచ్చును. లజ్జాభరంబునఁ జెక్కిళ్లెఱ్ఱవాఱును.అతఁడు శ్యాము లతోఁ బ్రసంగించుచున్నంతసేపును జెప్పవాల్పక సీత యతని వదనారవిందమును దదేక దృష్టితోఁ దనివోని యాసక్తితోఁ దిలకించు చుండును; ప్రొద్దుట జరిగిన యుదంత మంతయుఁ దలంచుకొని ప్రాణదాత కాత్మార్పణమే కృతజ్ఞతాసూచన మని తలంచును; అంతలో నిరాశ పొడసూప డిల్లవోయి యేమిసేయుటయో తోఁపక తహ తహ పడుచుండును;మరల నేమో యాశాంకురము హృదయక్షేత్రమున మొలకలెత్తఁ జెవియొగ్గి వారి ప్రసంగమును వినుచుండును. శ్యామలయు, భట్టును బ్రసంగించుచున్నను సీత యలజడిని గనిపెట్టుచునే యుండిరి.

శ్యామ:-స్వామీ!మా ప్రాణదాత.దివ్యనామాక్షరములు మే మీవఱకు జపించుచున్న యా యనంత కళ్యాణ గుణధాముని నామాక్షరములే యగుట మా భాగ్యము.

భట్టు:- రామరామ! ఒక ప్రాణికొక ప్రాణి, ప్రాణదాత యగు ననుట కల్ల. సర్వము నాయనంత కళ్యాణ గుణధాముని రాముని విలాసము. మనము నిమిత్తమాత్రులము. దాని కేమిగాని నే నొకమాట యడుగవచ్చునా?

శ్యామ:- అది మ మ్మనుగ్రహించుట గదా!

భట్టు:- (వ్రేలితో సీతంజూపుచు). ఈ కన్యాలలామ జన్మా దిక మగు వృత్తాంతములు నే వినఁగోరు చున్నాను.

శ్యామ:-స్వామీ! సర్వజ్ఞునికిఁ దెలియని యంశ మే మున్నది! అయినను నానోట వినఁగోరితిరి; కావున వచించెదను. అది యొక కరుణాజనక మయినది. ఆ యుదంతమును దెలుపుటకు ముందు ననుగుఱించి యించుక వచించెదను. పూర్వపు మైసూరు మహారాజువారి సంస్థానమున సుప్రసిద్ధ గాయనీమణి యని పేరొందిన జయలక్ష్మి యను నొక వేశ్యాంగన యుండెడిది. ఆమెకై దాఱువురు పిల్లలు పుట్టి పసితనముననే చనిపోయిరి. కడగొట్టుబిడ్డనై నే నామెగర్భమున జనించితిని. ఆ నాజనయిత్రి సంగీత సాహిత్యములయం దసామాన్యప్రతిభ గలదగుటచే, నమితముగాఁ గీర్తిధనములను గడించిన దగుటచే సామాన్య వేశ్యాత్వమును రోసి, యొక్క విప్రోత్తము నారాధించి తన ముప్పవదయేట నన్నుఁగని కడుగోముగా నోమి విద్యాబుద్ధులు గఱపినది. ఆ బ్రాహ్మణోత్తముఁడు, నా జనకుఁడు, నన్నెంతయు ముద్దుసేసి, సంస్కృతము, కన్నడము, తెలుఁగుభాషయు నేర్పి ప్రాణపదముగాఁ జూచుకొనుచుండెడివాఁడు. నేను సంపూర్ణ యౌవనవతి నైనంతలో వాత్సల్యసాగరు లయిన నా జననీ జనకులు స్వర్గస్థు లయిరి. వారి కలిమి కంతకు నే నధికారిణి నైతిని. నేనును నా సవిత్రీమతల్లి ననుసరించి యొక పండితుని వరించితిని. ఎంతకును సంతానయోగ్యత కలుగ దయ్యెను; నోములు నోచితిని; వ్రతములు సల్పితిని; ఉప

వాసము లుప్పిళ్లు నుంటిని. కనఁబడిన బైరాగులను సన్న్యాసులను బకీరులను బూజించితిని; కాని కార్యము లేక పోయినది. గొడ్డువీఁగు నదృష్టము లేకపోయినది. ఎవరే దానములు సేయు మని చెప్పినను ధనమునకు వెనుదీయక చేసితిని; దేవత లెల్లరికిని మ్రొక్కుకొంటిని. ఇట్లు పది పదునేను వర్షములు గతించినను బిడ్డనెత్తి లాలించు నదృష్టము నాకుఁబట్టదయ్యె. నా భర్తతోఁగూడ నే నీయూరువచ్చి కాపుర ముంటిని. రామారామ మని యొకతోఁట వేయించి పేరిడితిని, అందు శ్రీ రామమందిరమును గట్టించితిని; ప్రతి సంవత్సరమును దసరాలో నచ్చట రామాయణమును జదివించి పట్టాభిషేకము చేయించి బ్రాహ్మణ సమారాధనము సేయుచుంటిని; ప్రతి రాత్రి నాయింట భజనసేయుచు నతిభక్తితో శ్రీరామచంద్రమూర్తి నారాధించుచుంటిని.

నేఁటికిఁ బదుమూఁడేడులకు ముందు నవరాత్రములలో నెప్పటియట్లు తోఁటలో శ్రీమద్రామాయణము నా బ్రాహ్మణోత్తముఁడు చదివెను. విజయదశమినాఁడు పట్టాభిషేక మహోత్సవ మతి వైభవంబున జరిగెను. బ్రాహ్మణ సమారాధన యయినది. దీనులకు వికలాంగులకు నన్నిజాతులకు నన్నప్రదానము జరిగెను. అన్నియును ముగించుకొని మే మింటికి వచ్చితిమో లేదో యింతింత మబ్బెత్తి యంతంతయై యంబర మంతయుఁ దానై ప్రకృతి నంతయు నంధకారమున ముంచి వేసెను. మొదటఁ బడపడమని పెద్ద చినుకులతో నారంభించి చిన్నచిన్న జల్లులుగాఁ జల్లి క్రమాభివృద్ధిని

ధారాసంపాతముగా విజృంభించి యీ రాత్రియంతయు నెడ తెగక కుంభవృష్టి గురిసి వెలిచెను.

సూర్యోదయము గాకుండఁగనే స్నానముసేసి నేను, రామమందిరము నలికి ముగ్గుపెట్టఁదలఁచి యిలు బయలు వెడలితిని. ఎటు చూచినను గలకల ప్రవాహిని యగుగంగ మూర్తీభవించి తండోపతండముగాఁ గానవచ్చి కనులకు విందొనఁగూర్చెను. నేను మెల్లగ రామమందిరమున కేగి గడపయలికి ముగ్గిడినంతలో నంతర్భాగమునుండి 'వుజా వుజా' యను సద్యః ప్రసూతమగు శిశురోదనము వినవచ్చెను. నా యాశ్చర్య మేమందును! అదాఁటున దలుపు తెఱచి లోపలి కేగితిని; పాత్తుళ్ళలోఁ గెందళుకు లీనుచుఁ బండుకొని యేడ్చుచున్న యొకశిశువుం జూచితిని. బిడ్డలు లేక బిడ్డలో బిడ్డలో యని యనిశమును బలవించుచున్న దాన నగుట నా కంతలో మాతృప్రేమ గలిగి, పుట్టిన ాక్కులు దీరని యీ కసుగందు నెత్తుకొని యక్కునఁ గదియించుకొని ముద్దులలో ముంచి వేసితిని. అది యాఁడుబిడ్డ. నా సంతోషమునకు మితిలేక పోయెను. నా యిలువేల్పులైన సీతారాములే నా కా బిడ్డను ప్రసాదించిరని నాకు స్ఫురించుటచే నట నిమిషమైన నిలువ నోల్లక నాయడ్డాలఁ జేరఁగానే యూరకున్న యీ చిన్ని కూనం బయ్యెద చాటున మఱుగుచేసి, యొక్క నిమిషములో నింటికి వచ్చి చేరితిని; ఒకపాలతల్లికిఁ గబురంపితిని; దానిని శాలీయ నియమించితిని. పాలతల్లి చేతి కానిసువు నీఁబోవుచుండ దానిమెడలోఁ జిన్న తాటియాకు కట్టియున్నట్లు గాన వచ్చి పఠికించి చూచితిని. "బ్రాహ్మణ కన్య, మాతృహీన,

సత్సంతతి'' అను మూఁడు పదము లందున్నవి. ఆ రేకు విప్పి భద్రపఱిచి పిల్లను బాలతల్లి యద్దాలవై చిరిని'' అని చెప్పుచు శ్యామల సీతవంకఁ జూచెను. సీత వలవల నేడ్చుచుండెను. శ్యామల యామెకన్నీరు దుడిచి యోదార్చెను. భట్టు కన్నులు గూడఁ జెమ్మగిల్లెను. శ్యామల మరల నిట్లు చెప్ప సాగెను.

"స్వామీ! ఆ మఱునాఁ డీ నగరమునకు జగద్గురు స్వాముల వారరుదెంచిరి. బిడ్డ నాకు దొరకె నన్న సంగతి యూ రందఱి కంతలోఁ దెలిసిపోవుటచేఁ జాల మంది చూడ వచ్చిరి. అందొక బ్రాహ్మణుఁ డా చీటిం జూచి, 'ప్రస్తుత మీ యూరికి విజయముచేసియున్న స్వాములవారి సన్నిధి కేగి యా వత్సంగతు లున్నవున్నట్లు వచించి వా రాజ్ఞా పించులాగున నడచుకొనుట భావ్య'మని నాకు సలహా చెప్పెను. నేనును, మా యాయనయు నా బ్రాహ్మణుఁడును స్వాముల వారి సన్నిధి కరిగి వందనములు సేసి యా యుదంతమును నివేదించి యా చీటిం జూపి 'యే మాజ్ఞ'యని యడిగితిమి. మహానుభావులు కరుణాసముద్రులు గదా! మా మాటలు విని చీటిం జూచిన పిదప యతివర్యునకు జాలిచే డెందము గరఁగఁ గన్నీటిబిందువు లొండు రెండు చెక్కుల జాఱెను. కొంత తడ వుండి యా యతిసత్తముఁ డా బాలికను బెంచు కొన నా కాజ్ఞ యిచ్చుచు, 'నన్నప్రాశనము బ్రాహ్మణులచేఁ జేయించి, యది మొదలు వారిచేతనే యన్నముం బెట్టించి పాలింపఁజేయుము' అనియు నానతిచ్చిరి. నే నది మొదలా శిశువును గన్నులలోఁ బెట్టుకొని ప్రాణపదముగాఁ జూచుచుఁ

గడుపునఁ గన్నబిడ్డకన్న మిన్నగా నెంచుచుఁ బెంచుచు వచ్చితిని; ఆమెకు నా యిష్టదేవతయగు సీతామహాలక్ష్మి పేరే యుంచితిని; కడు గారాబముగాఁ జూచుచు దానిమూలమున నా ముద్దు ముచ్చటలు దీర్చుకొంటిని; ఉగ్గుపోసితిని; బోర్లా డించితిని; ఘృత మిడితిని; జలక మాడించితిని. దిన దినప్రవర్ధమాన యగు బాల సుధాంశు రేఖ వడువున నెదుగుచు నా కా బాలిక గూర్చిన యానందము నేమని వర్ణింతును! చిన్ని చిన్ని నగలు నేఁ జేయించితిని; తొట్టెలోఁ బెట్టి యూఁచితిని; పాటలు పాడితిని; దాని శిశుచేష్ట లాలోకించుచు ముద మందుచుంటిని; చిఱునవ్వులు, కేకలు, కూఁకలు విని పరవశ నగుచుంటిని; చేతులు కాళ్ళెగురవైచుచు నన్నుఁ గాంచినంతనే యులికి యెగిరి వెన్నెలలు విరియునట్లు దాను రవిరి విరిసినమాడ్కిఁ గలకలనవ్వుచుఁ జేతు లందీయ నా యానందవర్ధని నెత్తుకొని ముద్దులతో ముంచివేయుచు దినములు నిమిషములవలెఁ గడపివేయుచుంటిని; ఆయనచే నన్న ముహూర్తము సేయించితిని; ఒకపాఱుతెను వంటలక్క నదనముగా దానికై నియమించితిని; చక్కని దుస్తులు ఆఁడుబిడ్డ దుస్తులు, మగబిడ్డ దుస్తులు గూడఁ గుట్టించితిని. దోఁగాడి ప్రాఁకుచుఁ గూర్చుండి విద్దెములు సేయుచుఁ దప్పటడుగుల వైచుచు, మెలమెల్ల నడవనేర్చి కొలఁది రోజుల లోనే యిల్లంతయుఁ బరువిడ నేర్చి దాదుల నేమరించి యల యించి పరుగెత్తుకొని వచ్చి యమ్మా! యని నన్నుఁ గవుంగిలించుకొని పకపక నవ్వ, స్వామీ, నే నెంత ప్రమోద మొందితినో వర్ణింపఁగలనా? జిలిబిలి పలుకులు పలుకనేర్చి

ముద్దు ముద్దులు చెప్పుచు నన్నలరించు నా చిన్నారి చిన్న తనము నెన్న నా వశమా! అన్నిమాటలును వచ్చినవి. కథా ప్రసంగమున మైమఱచి పోవుచున్నాను. ఐదేండ్ల బాలిక యయినంత నొక యుపాధ్యాయు నక్షరములు గఱప నేర్పాటు చేసితిని. రెండు మూడు నెలలలోపలనే పుస్తకము పట్టినది. బాలరామాయణ మాయనయే చెప్పినారు. ఇంతలో నాయన మరణించి నన్ననాథను జేసిరి." అని శ్యామల యేడ్చెను. వేశ్య కట్టి పతిభక్తి యుండుటకబ్బురపడి భట్టు, శ్యామల వేశ్య యయినను నిల్లాండ్రలో నుత్తమురాలను కొనెను.

శ్యామల మరల నుపక్రమించెను. "ఆర్యా! ఆ యేడు స్వాములవారు చాతుర్మాస్యలు సేయుటకీ నగరము విచ్చేసి యుండిరి. ఆయన సన్నిధి కా బాలికను దోడ్కొనిపోయి మ్రొక్కి మ్రొక్కించితిని. విరాగియైన సన్యాసి యయ్యు నమ్మహాత్ముడు బాలిక నెత్తుకొని ముద్దులాడి కన్నులు చెమ్మగిల్ల బిల్లను దీవించెను. ఆ నాలుగు మాసములును బ్రతిసాయంత్ర మాయన యాజ్ఞానుసారము నా బిడ్డను దోడ్కొని యతిసన్నిధి కేగుచుంటిని. బిడ్డయు జన్నిపద్దె ములు చదువుచు మంగళహారతులు పాడుచు నయ్యతిశేఖరు నానందింపజేసి యాయన యొసగు ప్రసాదమును స్వీకరించుచు జనవుగలిగి మెలగుచుండెడిది. ఆ బిడ్డకు సంస్కృతమును నేర్పింపుమని యతి నా కానతి యొసంగెను. నేనును మఱియొక యుపాధ్యాయు నుంచి యాంధ్ర గీర్వాణముల నేర్పించుచు సంగీతము, వీణవాద్యము నేను నేర్పుచుంటిని.

అది మొదలు స్వాములవారు ప్రతిచాతుర్మాస్యలు నీనగ రమున నే చేయుచుండిరి;ఆ బాలికయం దత్యంత వాత్సల్యము గలిగి ముద్దుసేయుచు సుమారు నన్నూఱు రూపాయలు విలువగల నగలు చేయించిపెట్టిరి.

నిరు డాయన వచ్చునప్పటికి నమ్మాయికిఁ బంద్రెం డవ యేఁడు పూర్తి కావచ్చుచుండెను. మే మిరువురమే యా యన సన్నిధి నున్నప్పుడు స్వాములవారు నాతో, 'ఇంక నీ కన్నెకుఁ దగిన మధ్వబ్రాహ్మణ బాలకుం జూచి పరిణయము గావింపుము; పెండ్లియీడు మించుచున్నది' అని సెలవిచ్చిరి. అది మొదలుగా నేనును బ్రయత్నించుచున్నాను. నాకుఁ గల సర్వస్వము బాలికకే చెందు నని తెలిసిన యీ యూరి మధ్వబ్రాహ్మణ యువకు లామెం బెండ్లాడెద మని వచ్చిరి; కాని కన్నెకు వారిలో నెవనిని బెండ్లాడ నంగీకారము లేక పోయినది; పిల్ల నీయ నాకు నిష్టము లేకపోయినది. ఆమె పుట్టు పూర్వోత్తరములు దెలియనిహేతువుచే సంప్రదాయస్థు లగు సంపన్నగృహస్థు లెంత యిష్ట మున్నను నామెం గోడ లిఁగా నంగీకరింప సాహసింప లేకుండిరి. ఆమె కిప్పుడు యుక్త వయస్సు వచ్చినది. ఈ సంవత్సర మామెకుఁ గల్యాణము సేయక తీరదు. ఆ విచారముతో నే వేఁగుచు శ్రీరామచంద్ర మూర్తియే తగిన వరుని గూర్చువాఁడని యత్ని నమ్మి యుం టిని. ఆ నా పాలితపుత్త్రికయే యీ సీతమ్మ యని ప్రాజ్ఞు లయిన దమకు వేఱె చెప్ప నవసరము లేదు గదా! నా ప్రాణ పదమయిన యీ నాబిడ్డ నిన్నరాత్రి భజనచేసి ప్రసాదము స్వీకరించి యా శయ్యపయిం బవ్వళించెను. తండ్రీ! అదెట్టు

లా దుష్టపురుగా గదిలోఁ జొచ్చినదో, యెప్పుడు కాటు వేసినదో తెలియదు గాని నేను బ్రక్కనుండి లేచి గది గుమ్మము కడ కేగి యొరవాకిలిగా నున్న తలుపించుక దెఱచి చూచి బిడ్డ నిదురించుచున్న దనుకొని క్రిందికి వెళ్లితిని. నాలుగు గడియల ప్రొద్దెక్కినను బిడ్డ లేచి రాదయ్యెను. ఎప్పుడు నింత ప్రొద్దు నిద్దురవోని చిట్టితల్లి నేఁ డేల నిద్రించుచున్నదో చూచి రమ్మని దాసి నంపితిని. అది గదిలోని కేగి పిలిచెనఁట; పలుకకున్న తట్టి లేపిన దఁట. అప్పటికిని లేవకున్నది భయపడి, అమ్మా! కొంప మునిఁగినది. వేగముగా రండని యొక్క కేక పెట్టెను. చేతిపని యట్టె విడిచి వడివడి నే మేడమీఁదికి వెళ్లి చూతునా దీని నెమ్మోము గావిరి గ్రమ్మి కళాహీన మయి గనిపించెను. నా తల గిఱ్ఱునఁ దిరిగి యొక్క కేక పెట్టి నేలఁ గూలఁబడితిని. పరిజనమంతయు నచ్చటు మూఁగి నాకు శైత్యోపచారములు సేయ నాకుఁ దెలివి వచ్చెను. లేచి నాడి పట్టి చూచినాను. అది నిలిచిపోయినది. హృదయమునఁ జేయివైచి చూచినాను. శ్వాస లాడు జాడ గానరాదయ్యె. ఏమి వచ్చెనో నా కెఱుక లేక తలయు ఱొమ్మును గొట్టుకొని నే నేడువ సాగితిని. ఇంటిలో నున్న వా రందఱును గొల్లు మనిరి. ఇరుగు పొరుగులవా రందఱును వచ్చిరి. న న్నోదార్చువారే కాని ప్రతిక్రియ చెప్పువా రొక్కరును లేరైరి. హా రామా! తుదకు నా కీగతి యా తెచ్చి పెట్టితి వని నే నేడుచుచుఁ దెలివి తప్పిపోతిని. మీరు వచ్చుట నే నెఱుఁగను. ఆపదోద్ధారకుఁ డయిన యా రామచంద్రమూర్తియే మీ రూపమున నే తెంచి తనదాసినైన నన్నుద్ధరించె నని నా

తలంపు. మీ దయవలన మా యాపద దీరినది ; నే నీ యింటికి వచ్చి యిన్నేండ్లయినను నెప్పుడు నీ యింటికిఁ బాము వచ్చుట యెఱుంగను. ఆ గదిలోని కదెట్లువచ్చెనో యచ్చెరువుగా నున్నది.''

అని యామె కథ ముగించునప్పటికి వీధిలోనుండి, మొగలి పూవులు మొగలి పూవు లమ్మో! యను కేక వారికి వినవచ్చెను. తండ్రీ! వాఁడే నిన్న మొగలి పూవు లిచ్చిన వాఁ డని శ్యామల పలికెను. వానిం బిలుచుకొని రమ్మని భట్టాజ్ఞాపింప దాసి వానిం దోడ్తెచ్చెను. వానిం జూచి భట్టు వానితో నిట్లు ప్రసంగించెను. ఓరీ! నీపే రేమిరా? బాబూ! సింగఁడంటారండి. నీవే కదా నిన్నను వీరికిఁ బూవు లిచ్చినవాఁడవు? ఔను బాబయ్యా! నేనే యిచ్చినాను. నిన్నను నీవు పూవులు గోయుచుండ వింత యేమైన జరిగినదిరా? వింతేమి లేదు గాని బాబయ్యా! సాయంత్ర మొకవిడు మొగ్గ దొనెతోఁ గోయుచుండ బుస్సుమని యొకనాగు బాము నాపైఁ బడవచ్చెనండి. తెలుసుగాఁ బాములఁ జూచుచుందును గావున భయపడక దొనె కత్తితో మొగలి డొంకలోనికి దానిఁ జిమ్మివేసి పూలు మూట కట్టుకొని వచ్చినానండి. 'సరియే నీవు పొమ్ము' అని భట్టు రెండు డబ్బులు వాని కీయ వాఁ డతిసంతోషముతో వెళ్లిపోయెను.

భట్టు శ్యామలను జూచి, వింటివి గదా వాఁడు చెప్పిన మాట! ఆ పాము పగపట్టి వీని వెనుకనే వచ్చినది. వాఁ డీ యింటిలోనికి వచ్చినప్పటి కది గుమ్మములోని మల్లె పొదలోనికి వచ్చియుండును. మల్లె వాసన మరగి రాత్రివఱ

కది యచ్చటనే యుండియుండును; రాత్రి వీణా తంత్రీస్వరం బునకు వేడుకపడి మల్లె పందిరిమీఁదుగా మేడమీఁదికి వచ్చి పాట యాలించుచునుండి యుండును. హారతి యిచ్చి మీరు వెళ్లి పండుకొన్నపిదప నది గదిలోఁ బ్రవేశించెను. బాలిక జడ నల్లిన మొగలి రేకులు మల్లె పూవులును గుమ గుమ పరి మళించుటచే నది వాసనా వివశమై యట నిలిచియుండును. నిద్రావశంబున నీమె యొత్తిగిల్లినప్పు డీమెజడ క్రిందికి వ్రేలాడియుండును.తత్కాలమున సర్ప ముయ్యాల మంచము నెక్కఁగలెను. నిద్రావస్థలో నీమె కాలుసేతులు గదలింప నది వెఱపొంది కాటువేసి జాఱి క్రిందఁబడియుండును. ప్రక్క గదిలో మొగలి పూవు లుంచుటచే నా వాసనం బట్టి యది యా గదిలోఁ బ్రవేశించియుండును. నిన్నరాత్రి యీమె గానము సేయుచున్నప్పుడు నేనును నా మిత్రుఁడును నిక్కడికి వచ్చి వీధిలో నిలిచి పాట వినియుండుటచే నుదయమున నా గాయనీమణి యెవ తెయో తెలిసికొను నుత్కంఠచే నీ వీధి కరుదెంచితిమి. అప్పటి కిల్లు రోదన ధ్వనులతో,హాహాకారము లతో,యాతాయాత జనంబులతో నల్లకల్లోలమై యుండెను. వాకిట నొకనివలన నీ సమాచారము విని దుఃఖోద్రేకమున మేడమీఁదికి వచ్చితిమి. సర్వేశ్వరు ననుగ్రహమున నాపద గడచిపోయినది. ఇది విచిత్ర ఘటనము. ప్రొద్దు గ్రుంకినది. ఇంక నా సర్పమును విడిచి రావలయును. ఆ కుండబట్టుకొని పరిచారకుఁ డొకఁడు నావెంట రావలయును. రాత్రి యెని మిది గంటల కావుపాలు మాత్ర మీమె కాహార మిందు.

తేపు ప్రొద్దుట నేను మరల వచ్చెదను'' అని పల్కుచు భట్టు లేచెను.

శ్యామ:-వెళ్లుదురుగాని. నే నొకటి రెండు మాటలు మిమ్ము డుగఁ దలఁచితిని.

భట్టు:-అడుగుము.

శ్యామ:-మీ దేయూరు.

భట్టు:-వనపర్తి.

శ్యామ:-మీరు మాధ్వబ్రాహ్మణులా?

భట్టు:-ఔను.

శ్యామ:-మీకు వివాహ మయినదా?

భట్టు:-లేదు.

సీతమోము వికసించెను. శ్యామల నవ్వుచు స్వామీ! ఏల కాలేదు?

భట్టు:-ఇంతవఱకు నట్టి యుద్దేశము గలుగలేదు.

శ్యామ:-మీ రేయుద్యోగము సేయుచున్నారలు?

భట్టు:-ఉద్యోగము విడిచి ప్రస్తుత మూరకయున్నాను.

శ్యామ:-మఱి మీ రీయూరేల దయచేసితిరి?

భట్టు:-నిన్న నాతోఁ గలిసి యిక్కడికి వచ్చినయతఁడు నా మిత్త్రుఁడు. అతఁ డీప్రాంతమునఁ గొన్నాళ్లు దిరుగఁ దలఁచి వచ్చినాఁడు. నేను నాతనితో నిట కరుదెంచితిని.

శ్యామ:-ఇంక నీనగరమున నెన్నాళ్లుండఁ దలఁచినారు?

భట్టు:-నాలుగైదు దినములు.

శ్యామ:-జే వృదయము తప్పక దయచేయుదురుగదా! శ్రమ యిచ్చుచున్నాను.

భట్టు:-వచ్చెదను. శ్రమ యేమియు లేదు.

శ్యామ:-ఇంకను దమతోఁ గొన్నిసంగతులు మనవిచేయఁ దలఁచుచున్నాను.

భట్టు:-తేవు మాటలాడవచ్చును. నే నింకఁ బోయివచ్చెదను.

శ్యామల సీతనుదెచ్చి రామచంద్రుని యడుగులకు మ్రొక్కించెను. 'శీఘ్రముగాఁ గళ్యాణ మగుఁగాక' అని యతఁడు నవ్వుచు దీవించెను. సీత నునుజెక్కు లెఱ్ఱవాఱెను. వ్రీడాతిశయమ్మునఁ దల్లిమఱుఁగున కేగి సీత క్రీఁగన్నుల భట్టుం దిలకింపసాగెను. అతఁడును దానికిఁ బ్రత్యుత్తరము లొసంగి వారిని వీడుకొని యరిగెను. పామున్నకుండఁ బట్టుకొని నౌకరతని వెంబడి నేగెను.

సీతారాముల కన్యోన్యానురాగ ముదయించె నని గుర్తించి శ్యామల పరమానంద భరితురా లయ్యెను. "అమ్మా! సీతా! రామచంద్రుఁ డెట్టు లున్నాఁడు?" అని శ్యామల నవ్వుచు నడుగ సీత మోమోటముచేఁ దలవాంచి యూరకుండెను. "సీతారాముల కళ్యాణోత్సవము గాంచు భాగ్య మెప్పుడు గలుగునో, శివ ధన స్సెక్కుపెట్టవలయునా చిట్టితల్లీ! నా యొద్దనే మొగమోటమఁటే. అని పలుకుచు శ్యామల సీత నక్కునఁ జిక్కఁబట్టి మోము నిమిరి ముద్దుపెట్టుకొని, 'తల్లీ! నీ విష్టపడెద వేని రామచంద్రునితో నాడవలసినమాట లాడెదను. నీ కిష్టమే కదా!' అని యడిగెను.

'అమ్మా! నీ యిష్టమే నా యిష్టము' అని మెల్లన వచించి సీత శ్యామలం గవుంగిలించుకొనెను. 'అమ్మా! సీతా! నేనొక్క మాట చెప్పెదను. పరమేశ్వరునిమీఁద భార ముంచి యున్న మన కేదేని యాదరువు దొరకక పోదు. అతనిని నమ్మి చెడినవా రెవ్వరును లేరు. నేఁటి యద్భుత సంఘటనమే దీనికిఁ దార్కాణము. దైవ మేది తెచ్చినను మన మేలునకే యని భావింపుము. మనోవ్యాధి పెట్టుకొనక ధైర్యము వహించి నవ్వు నవ్వుచు నుండుము, అని శ్యామల వచించెను.

# 11

## అ న్యో న్యా ను రా గ ము

భట్టా కాకోదరము నొక వల్మీకమున విడిచి యిల్లు సేరెను; శ్యామసుందరాదులతో, సీత కుశలముగానున్నదని చెప్పెను. ఏదో కొంచె మెంగిలి పడి వెంటనే యతఁడు ప్రక్కఁజేరెను, అతని హృదయ మండపమున నూహాలతా వితాన మల్లిబిల్లిగా నల్లుకొనుచుండెను.

"పదుమూఁడేండ్లది, పరమ లావణ్యవతి, చక్కని చుక్క, చదువుల సరస్వతి, గానవిద్యా విశారద, ముద్దుల గని. ఇట్టి నిస్సమాన్య కన్యకామణి నావంటి నిర్భాగ్యున కెట్లు లభించును? శ్యామల కా బాలిక ప్రాణపద మగుటఁ దన సంపదల కా బాలిక నేలిక సానిగాఁ జేయును. నన్నేల శ్యామల యట్టి ప్రశ్నల నడిగెను? నా దారిద్ర్యము తీరి పోవునా? కన్యకకు నాయం దనురాగ ముదయించినది.

శ్యామల మా యన్యోన్యానురాగమును గుఱించియే తే పా ప్రసంగము సేయ నన్ను రమ్మన్నది. అన్నియు ననుకూలముగానే యున్నవి. కాని, యా చిఱుతుక పుట్టుకనుగూర్చి యిద మిత్థమని యింకను దెలియరాదయ్యె. సాహసించి పరిణయమయితినా కులమునకు వెలి యగుదును; పరిహాసమునకుం బాత్రుండ నగుదును. పరమ పూజ్యులయిన యీ నా తలిదండ్రుల కపకీర్తి తెచ్చినవాండ నగుదును. విద్యా ధన సౌందర్యములకు లోభపడితి నని యెల్లరు ననుకోక మానరు. మాన మర్యాదలు, కీర్తిప్రతిష్ఠలు, కులగౌరవాదులును బోయిన పిదప నే మున్న నేమి ప్రయోజనము? పోనీ నా కేల యని యుపేక్షింతునా? అది వట్టిమాట. అకారణముగా నవ్యాజముగా నా కన్యకామణియందు నా మనస్సు లగ్నమయినది. దానికి బలవత్తర మగు కారణ ముండి యుండును. ఆ బాలికామణికిని నాయందేల యత్యంతానురాగ ముదయింపవలెను! ఈ సంబంధ మెట్లు వల దందును? ఏమి సేయుదును? నే నెన్నండు నిట్టి యవస్థ యనుభవించి యెఱుంగను. తల్లి వెనుకనుండి యా సుందరాంగి వంగి తొంగిచూచిన యా చూపులు నాకన్నులం గట్టినట్లున్నవి. ఆ చిన్నారి నెమ్మోము, నా హృదయ దర్పణమునం బ్రతిబింబించి యున్నది. అది తుడిచివేయం జాలను. ఎట్టులయిన నా మిటారిం బెండ్లియాడి తీరవలయును. ఉపాయ మేమియుం దోంచకున్నది. త జ్జననమునుగూర్చి యెవరు తెల్పుదురు? ఆరంగూరిన మా యనురాగము ఫలింప నెవరు జతనము సల్పుదురు?"

"శ్యామల యామెకుఁ గన్నతల్లి కాదు. అయ్యేనేని తనవలె నొక బ్రాహ్మణునిచేఁ గన్నెఱికమును జేయించి యుంచును గాని, మధ్వబ్రాహ్మణున కిచ్చి పెండ్లి గావింప నేల యత్నించును? ఆ తాటియాకు కథ కల్పితమా? కాదు కాదు. శ్యామల భక్తురాలు. సీత, తనకడుపునఁ బుట్టినను, ఏదే నొక జాతి పిల్లను బెంచుకొన్నను దాను సాకక బ్రాహ్మణు లచే నేల పెంపించును? కావున శ్యామల చెప్పినకథ యంతయు యథార్థ మయినదే. ఇంక నా కుసుమగాత్రి వాస్తవిక జన్మ వృత్తాంత రహస్యమును దెలిసికొనుటయే కర్తవ్యము. అది యెఱుంగక పెండ్లాడరాదు. అ దెట్లు తెలియును? ఇంక నిక్కథాసందర్భమున నున్న మూఁడవ వ్యక్తి యెవరు? ఆ యతీంద్రుఁడు. పీఠాధిపతియై సంసారపు జంజాటమును వీడు కొన్న నిరాకారి కీ కన్యం గాంచినంతనే యశ్రూద్గము మేల యయ్యెను? బ్రాహ్మణుచేఁ బెంపింపు మని యేల కట్టడ సేయును? తన సన్నిధి కేల రప్పించును? బాలిక నెత్తుకొని ముద్దాడు టేల? నగలేల చేయించును? వయసు మించనీయక మధ్వబ్రాహ్మణుని కిచ్చి యీ సంవత్సరము పెండ్లి సేయు మని శ్యామల కేల యాజ్ఞాపించును? ఇ వన్నియు నాలో చింప నా సన్యాసికి నీ బాలికకు నేదియో వేఁగు సంబంధ మున్నదనుశంక తీరదు. పోఁగు త్రెంపుకొన్నను బ్రేఁగు త్రెంపుకోఁజాలరు గదా! ఆయనకే యీమె పుట్టుపూర్వో త్తరములు తెలిసియుండును. ఆ పరివ్రాడ్వర్యు నాశ్రయించినఁ గాని యీ చిక్కు దీరదు. ఎవ రా పరివ్రాట్టు? మన యనంతాచార్యుని యన్నగారు గారు గద! ఏమో! ఏ పుట్టలో

నే పాము న్నదో యెవ్వరికెఱుక? మహనీయుల చరిత్ర లతి గోప్యములు గదా! ఆయన యీ వత్సరమునఁ జాతుర్మా స్యలకీ బెంగళూరు దివ్యస్థలమునకుఁ దప్పక విజయంచేయు దురు. అప్పు డన్నియు వానియంతట నవియే విడిపోవును. ఆ వేళకు నే నీయూరుఁ జేరుకొందును. ఉదయమున శ్యామల యింటికేగి మాటలాడి చూచెదను. సర్వమునకు సర్వేశ్వ రుఁడే యున్నాఁడు. ఆ కన్యకం జెట్టపట్టితినా? నా జీవితము మంచిత్రోవం బోవును. ఇదియే మార్పునకుఁ గేంద్ర స్థానము" అని యాలోచించుకొనుచు భట్టుకొంత సేపటి కొకదరిఁ జేరి నిద్రకు లోనయి సుఖస్వప్నములు గాంచెను.

తెల్లవారెను; అనుకొన్నట్టులు భట్టు శ్యామలాభవ నమున కరుదెంచెను. శ్యామల సీతాసమేత యయి యతనికి స్వాగత మిచ్చి మేడమీఁదికిఁ దోడ్కొనిపోయి యుచితాస నంబున నుపవిశింపఁజేసెను. సీతారాము లొండొరులఁ జూచుకొనిరి. వారి చూపు లన్యోన్య కుశలప్రశ్నలు చేసి కొన్నవి. పెదవులపైఁ జిఱు నగవులు మొలకలెత్తి యుత్తర ప్రత్యుత్తరములు చెప్పుకొన్నవి.

భట్టు:- సీత సుఖముగా నున్నది గదా!

శ్యామ:-(నవ్వుచు) శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహమున సీత సుఖముగా నున్నది ; ఇప్పుడే భుజించినది.

కొంత తడవు లోకాభిరామాయణముగాఁ బ్రసంగించి శ్యామల ముఖ్యప్రసంగమున కుపోద్ఘాతము సేయునంత, సీత, సిగ్గుతో లేచి యుయ్యెలగదిలోని కేగెను. స్నానము

చేసి కొప్పార విడువ నది నెమలిపురి యట్లు సీతవెన్నున వ్రేలాడుచుండెను. తొలినాఁటి యలజడిదీర, మబ్బు తెరఁ దీసిన మవ్వంపుఁ జంద్రరేఖం బోలి యా కన్నెమిన్న మెఱసి పోవుచుండెను. కుసుంబచీర గట్టి, వంగపండుచాయ మకమలు రవికె దొడిగి, మణిమయాభరణంబులు దొడిగి మారు నాఱవ సాయకమో యన నొయ్యారమున గలుగల్లు రన నడుగు లిడుచు, గదిలో నడు గిడుచు వెనుదిరిగి యామె చూచిన వంపుచూపులు, నల్లగలువ తూపుల ట్లుల్లమున నాటి భట్టును సంపూర్ణముగా జయించి వేసినవి. ఆ దృశ్యముం జూచి శ్యామల సంతోషమును బట్టఁజాలక పోయెను.

శ్యామ:- స్వామీ! ప్రకృతము ననుసరింతము. సీత కథ వింటిరి గదా! ఆమెం జూచితిరి గదా! ప్రాణదాతల రగుటచే మీకంటెఁ బరమాప్తులు మా కెవ్వరు నుండరు గదా! కావున సీతాకళ్యాణమునుగూర్చి మీ సలహా యేమి?

భట్టు:-సర్వము సమీచనముగానే యున్నది. తజ్జన్మ రహస్యము నెఱుంగక యేమి చేయఁగలము? అది పవిత్ర ప్రసూతి యని నాకు నమ్మకము గలదు. ఇంతకు నీ మహానిధాన మే భాగ్యశాలిం జేరునో యెవరి కెఱుక?

శ్యామ:-నా మనస్సులోని మాట మనవి చేసెదను. మఱొక లాగున ననుకో వలదు. సీత జన్మమునుగూర్చి నాకు నట్టి నమ్మకమే యున్నది. నా సంరక్షణలో నామె కేమియు మచ్చ రాలేదు. ఆ నిజమును దెలియఁజేయఁగల మహాపురుషుఁ డొక్కఁడే యున్నాఁడని నా నిశ్చయము.

భట్టు:-ఆ యతీంద్రుఁడు దక్క నింకెవ్వ రుందురు?

శ్యామ:-నే ననుకొన్నదియు నదే. ఇంకొక్క రహస్యము తెల్పెదను. ఆఱవ చెవిని వేయకుఁడు. ఆ స్వాములవారి ముఖ లక్షణములకును సీతాముఖలక్షణములకును జక్కని పోలి యున్నది. ఆయన యిక్కన్యం గాంచునప్పుడు పడుచున్న యవస్థం జూచుచుంటిని. సాహసించి పరమ పురుషుఁడైన యా యతీంద్రు నేమియు ననలేము గాని యీ బిడ్డ యాతనికి దగ్గఱ పేఁగుచుట్ట మనియు, దీని గుట్టాతనికిఁ దెలియు ననియు మనము నిర్ధారణ చేసికో వచ్చును. పిల్ల కట్టుతప్పి యున్నది. ఇంతవఱ కాదండి నేమియు ననఁ దెగింపలేక యూరకుంటిని; కాని యింక నూరకుండఁ జాలను. ఈ సారి చాతుర్మాస్యల కాయన యిచ్చటికి వచ్చునప్పు డిందలి యథార్థము నడిగి తెలిసికొని, బిడ్డ నొకయయ్య చేతిలోఁ బెట్టి కృతార్థరాలను గాఁ దలంచితిని. మీ రేమందురు?

భట్టు:-చక్కఁగా నాలోచించితివి. నిన్నరాత్రి నేను నాలోచించి యిటులే నిశ్చయించితిని.

శ్యామ:-రాత్రి మీ రేల యీ సంగతి నాలోచించితిరి!

భట్టు:-(సరుదుకొని) ఏమియు లేదు. సంప్రదాయస్థుఁ డీబాలికను బాణిగ్రహణ మొనరించు కొనవలయు నన్న నింతకంటె వే ఱొకమార్గ మే మున్నది!

శ్యామ:-(న వ్వాపుకొని) సాధ్యమయినంత త్వరలోఁ దప్ప యత్నము చేసెదను. సరే కాని, స్వామీ! మీరు నా

ప్రాణమునకుఁ బ్రాణమైన సీతప్రాణములు నిల్పితిరి గదా. మా కృతజ్ఞతఁ జూపుటకై యెద్దియేని మా జ్ఞాపకార్థము మీకు సమర్పించు కొనుట మా విధికాదా! నిన్న నే నేమో వివశనయి చంద్రహార మర్పింప నిప్పుడు వల దంటిరి. ఏదో దైవము నాకుఁ బ్రసాదించినది తమ కర్పించి కృతార్థురాలను గాఁ దలంచినాను. వల దనక దానిని స్వీకరించి మము ధన్యులఁ జేయ వేఁడుచున్నాను.

భట్టు:- నావిధి నెఱవేర్చుకొంటిని. ఏ విధమయిన ధనమును స్వీకరింపరా దని సద్గురు నాన గలదు.

శ్యామ:- ఈ విషయమున ధనము మీరు స్వీకరింప నక్కఱ లేదు. ఏదో నాకుఁ బ్రాణపద మయి భద్రముగాఁ గాపాడఁబడిన యొక యమూల్య వస్తువును మీ కర్పింపఁ దలంచితిని.

భట్టు:- ఆ వస్తువును జూచినఁగాని చెప్పఁజాలను.

శ్యామ:-మీరు చూచినది మీ కిష్టమయిన దే యా వస్తువు. ఆ వస్తువునకుఁగూడ మిమ్ముఁ జేర నిష్టము పూర్తిగా నున్నది. ఇష్ట మేమిటి మిమ్ముఁ దప్ప నింకొరు నా వస్తు వభిలషింప దఁట. అది నా ముద్దులమూట సీత. సీత సీరామ చంద్రమూర్తి కర్పించి, ధాత్రినైన నేను నిజముగ ధాత్రి నే యయ్యెదను.

భట్టు:- నీ యుద్దేశమును నిన్న నే గుఱుతించితిని. మన మెంత స్వతంత్రులమైనను, లోకము నొక కంటఁ జూచుచుండ వలయును గదా! ఇంతకు నా స్థితిగతులు విచారింపవైతివి.

'నక్కయెక్కడ నాకలోకమెక్కడ' నన్నట్లు లుండ నిల్లును, వండఁ బొయ్యియును లేని నిరుపేద నగు నేను బరమ సౌభాగ్య భాగ్యవతి యగు సీతను గోరుట పరిహాస భాజనము గాదా! నా వేషము నాటకవేషమే కాని సంపజ్జన్యము గాదు. నాకుఁ దినఁ దిండియుఁ గట్ట బట్టయును లేవు. మఱియు సీతకంటెఁ బదునేను బదునాలేండ్లు పెద్దవాఁడను. ఇవన్నియుఁ దెలిసి సీతయు నీవును నాలోచించుకొన్నచో నీ రీతిని దొందరపడి యుండ రని నా తలంపు.

శ్యామ:- స్వామీ! మీ కలిమిలేములతో జోక్యము లేదు. మీ రిరువురు నొకటైనప్పుడు సీతకలిమి మీ కలిమి గాదా? నా సర్వస్వము సీతకే చెందు నని మీ రెఱుఁగుదురు. ఆమెతో నిదంతయుఁ దముదే. నేను సీతారాముల దాసిని; సీత యుద్దేశమును గనుగొంటిని. మనోవాక్కాయంబుల నది మిమ్మే వరించియున్నది. ప్రాణదాతలు, పరమోత్కృష్టు లగు మీ కామె యాత్మార్పణము చేసికొన్నది. మీరా కన్నియం గన్నెడసేయ రని వేఁడెదను.

భట్టు:- సరిపోయినది. కన్నెడసేయుటయా? నిన్ననే నా మానస మామె కర్పించితిని. నీవు పోల్చియుందువు.

శ్యామ:-సీతారాము లనురాగ సాగరు లగుటలో వింతయే మున్నది? సరియే బాబూ! సర్వము సముపపన్న మయినది. మీ రెక్కడి కేగినను వ్యాసపూర్ణిమ కీ యూరికి రండు. వారు నప్పటికీ గ్రామము వచ్చియుందురు.

భట్టు:- తప్పక వచ్చెదను. మఱి నేను బస కరిగి వత్తునా?

శ్యామ:-"కొంచెము మోపికసేయుఁడు. అమ్మా! సీతా! తాంబూలము దీసికొనిరా తల్లీ!" అని శ్యామల బిగ్గరగాఁ జెప్పినంత సీత వెండిపళ్లెరములోఁ దమలపాకులు, వక్కలు మున్నగునవి యుంచి తెచ్చెను. ప్రక్కగదిలో నుండి జరిగిన ప్రసంగ మంతయు విన్నది గావున సీత లజ్జామోదాతిశయమ్మున మోమెత్తలేకపోయెను; పళ్లెరమును భట్టు నెదుర నుంచి తల్లి చాటున కేగి కూర్చుండెను. భట్టు తాంబూలము గైకొనెను. అంత శ్యామల సీత వైపు దిరిగి నవ్వుచు, భట్టు నుద్దేశించి, 'స్వామీ! తాంబూలము పుచ్చుకొను టయినది. మా సీత ధన్యురాలయినది, అను నా మాటకు సీతారాము లిద్దరును బ్రసన్నవదనులైరి. రామచంద్రుఁడు లేచి వారిని వీడ్కొని మెట్లు దిగెను. శ్యామల యతని వెనుక వీధి ద్వారమువఱకు నరిగి, "బాబూ! మీదే యీ యిల్లు. ఈ సర్వస్వము మీదే. ప్రతి దినమును సందర్శనభాగ్యము నిప్పింప వేఁడెదను" అని పలికి వీడుకొని మరలివచ్చెను.

భట్టు వీధి నేగుచు సందు దిరిగి రాజ వీధి నడుగు పెట్టి వెను దిరిగి చూచెను. శ్యామలాభవనపుఁ బైయంతరువున సీతావదన పూర్ణసుధాంశు వుదయించి యతని చక్షుశ్చకోరముల కానంద పాథేయము నొసంగెను. సీత యటే చూచు చుండెను. భట్టు బసఁ జేరెను.

# 12

## యతిప్రశంస

అనురాగ లతిగ లల్లిబిల్లిగ నల్లుకొనుచుఁ గొనలు సాగుచుండుటచేఁ బ్రతి దినమును భట్టు శ్యామలా నికేతన మున కరుగుచు వచ్చుచుండెను. శ్యామసుందరున కెప్పటి కప్పు డీసంగతులు భట్టు చెప్పుచుండెను. దుర్గాప్రసాదుం దీసికొని శ్యామసుందరుఁ డనుదినముఁ బ్రాత స్సాయంకాల ములం బ్రకృతి చిత్రముల నారయఁ బురి బాహ్యప్రదేశ మ్ములం గ్రుమ్మరు చుండెను. ఆచార్యులుగారు దఱుచుగ నింటనే యుండి వంటవార్పుల యేర్పాటులు సేయించుచు గ్రంథకాలక్షేపము సేయుచుండెను.

ఒకనాఁడు సాయంకాలమున భట్టాచార్యులుగారిసి దోడ్కొని, బజాఱున కేగెను. అన్నియంగడులు దిరిగి కావలసిన సామానులు గొని నౌకరివానికి గంప యెత్తి యింటికిఁ బంపి వా రిరువురు నానా విధములయిన యుదంత ములు చెప్పుకొనుచు నొక యంగడి వాకిటికి వచ్చిరి. అది జలతారు కుళ్లాయీల యంగడి. బంగారు వెండి జలతారు లతలతోఁ గూర్చు చమికీపని చేసిన మంచి మంచి టోపీలా యంగడిలో జిగ జిగ మెఱసిపోవుచు నా దారిం బోవువారి దృష్టుల నాకర్షించుచున్నవి. ఆచార్యులుగా రటు చూచి, "మహాప్రభూ! ఏలినవా రొక మంచి జరీటోపీ ధరింప వల యును. ఇక్కడ నొకటి కొందము పదండు" అని పలికెను. ఇద్దఱు నంగడిలోని కేగి దుకాణదా రొసంగిన యాసనం

బులఁ గూరుచుండి టోపీలను బరీక్షింప సాగిరి. తుద కాచా ర్యులుగారు దన దృష్టి నాకర్షించిన మొదటి తరగతి టోపీ తీసి, 'శ్రీ శ్రీ వనపర్తి సంస్థానాధీశుల యుత్తమాంగమున కిది యుత్తమ మయినది'' అని నవ్వుచు, 'సాహేబుగారూ! దీని వెల యెంత ?' అని దుకాణదారు నడిగెను. ఇది యూ అండి. ఇది యేభయి రూపాయీ అవుతుంది. బంగారు జల్తారు వుంది. మంచి చమ్కీ వుంది. బలే తమాషా మజా వుంది'' అని సాహేబు దానిని వర్ణించెను. భట్టున కది కొనుట కిష్టము లేదు. ఆచార్యులుగారు, తన జమీందారీ ఘాయా ననుమానింతురేమో యనియుఁ గొన్న చో శ్యామ సుందరునికిఁ బనికివచ్చు ననియు నాలోచించి, బేరము చేసి నలువది యైదు రూపాయలకు ఖాయ పఱచి సంచి గల్లరనఁ దీసి లెక్కపెట్టి ఖరీదిచ్చివేసి భట్టు, టోపీ దల ధరించి బయలు దేఱెను. ఆచార్యులుగారు జమీందారుగారి కీవిని నౌదార్యమును గొనియాడుచుఁ బ్రక్కనే వచ్చుచుండెను.

భట్టు:-గురువుగారూ! తమ్మడిగి యొక సంగతి తెలిసికో వలసి యున్నది.

ఆచా:-చిత్తము, చిత్తము, ఎంతమాట, ప్రభువువారు సర్వజ్ఞులు, ప్రపంచ మంతయుఁ బరిపాలింపఁ దగిన ప్రతి భాశాలులు, సెలవిండు, సెలవిండు. తమకు నేనా తెలు పుట? ప్రభువువారికి నాయందు గల యనుగ్రహ మట్టి యవ్యాజ మయినది.

భట్టు:-తమరు దేవగురు సన్నిభులు. నాలు గాశ్రమములలో నుత్తమమైన దేది?

ఆచా:-అన్నియాశ్రమముల కాధార మగుటచే గృహస్థా శ్రమ ముత్తమ మయిన దని ప్రభువువారివంటి ప్రాజ్ఞులు వచించియుండిరి.

భట్టు:-ఐనప్పుడు తమ రేల బ్రహ్మచర్య మవలంబించితిరి?

ఆచా:-నాఁడే నేను మనవిచేసికొంటిని. ఏలినవా రవధరింపవలెను. నవద్వీపమునకు వెళ్లి యక్కడఁ దర్క వ్యాకరణములు ముగించునప్పటికి నాకు వివాహయోగ్య మగు వయస్సు మీఱిపోయినది. అదియుం గాక నేను సంసారమును నిర్వహింపఁగల లౌకిక ప్రజ్ఞ లేనివాఁడను; బీదవాఁడను. నా కేమో త త్సౌఖ్యములపై మనసు పోలేదు.

భట్టు:-తమరు తమ యన్నగారి సన్నిధినే యాశ్రమ స్వీకారము చేయఁదలంచితి రేమో?

ఆచా:- ఔను, వారు పితృతుల్యులు. వారి యాజ్ఞ పాలించుట నావిధి.

భట్టు:-స్వామీ! వారు గృహస్థు లయి గదా సన్యసించిరి?

ఆచా:-అనఁగా వివాహము మాత్రమే యయినది. చిన్నప్పుడే మా మేనమామ కూఁతు నాలుగేండ్ల పిల్ల నాయనకుం గట్టిపెట్టిరి. పెండ్లినాఁడు తప్ప మా వదినెగారి మొగము మఱి యాయన యెన్నఁడును జూడ లేదు. ఇరువదేండ్ల వయస్సునకు వారు శృంగేరిలోఁ గావ్య నాట కాలంకార సాహిత్యముఁ గొంత వ్యాకరణమును జదివిరి. అప్పుడే మా నాన్నగారు మా యన్నగారి కిష్టము లేకున్నను నాలుగేండ్లపిల్లను బెండ్లిగావించి పిదప రెండు

మాసములలోఁ గాలధర్మ మొందిరి. తరువాత రెండు మాసములకు మా తల్లిగారు మరణించిరి. పిమ్మట నొక సంవత్సరము మాత్ర మింట నుండి మా యన్నగారు నన్ను శృంగేరిలో నొప్పచెప్పి వారు శాస్త్రములు చదువుకొన శ్రీ కాశీ నగరమునకుఁ జనిరి. బహుకాల మచ్చట విద్యాభ్యాసము చేసి సమస్త శాస్త్రములు చదివి వైరాగ్యసంపత్తి గలిగి యచ్చటనే సన్న్యసించి బ్రహ్మకపాలమువఱకు నేగి బదరీనారాయణమూర్తిని సంపాదించి పీఠమందుఁ బ్రతిష్ఠించి, సకల దేశములు దిరిగి తిరిగి వచ్చి యిప్పుడు పీఠముతో నుడుపీ క్షేత్రమున నివసించు చున్నారు.

భట్టు:- గురువుగారూ! పాపము! మీ వదినెగా రెచ్చట నున్నారు?

ఆచా:-చిత్తము, ఆ సంగతి నాకేమియుఁ దెలియరాదయ్యె. నేను నవద్వీపమునుండి దేశమునకు వచ్చితిని. మా మేనమామయుఁ ద త్పత్నియుఁ జనిపోయి రనియు, వారి యేక మాత్ర పుత్త్రిక యగు మా వదినెగారు, బహుకష్టముల కగ్గమయ్యుఁ దన చరిత్రమును గాపాడుకొనుచు నొక గ్రామమున నొక సంపన్నగృహస్థు నింట వంటసేయుచుఁ గొన్నాళ్లుండి పిదపఁ జనిపోయిన దనియు శ్రీమా యన్నగారే సెలవిచ్చిరి.

భట్టు:-వారి సందర్శనము చేయవలయును. అది తమ మూలమునఁ గాఁ దగ్గది.

ఆచా:-వారు చాతుర్మాస్యలకీ నగరము ప్రతి వత్సరమును దయచేయించు చుందురఁట. ఇక్కడనే మనము వారిని సందర్శింప వచ్చును. మహాప్రభూ! మనము తిరిగి వచ్చు నప్పటికి వారు నీ నగరమున కే తెంతురు.

భట్టు:-"బాగుగానే యున్నది" అను నంతలో వారు బసఁ జేరిరి.

# 13

## మోసము

ప్రొద్దు గ్రుంకు మెట్టల మాటున మఱుఁగుపడెను. అర్ధ చంద్ర ప్రకాశ మాకాశావకాశంబుల నిండిపోయెను. ప్రకృతి సౌందర్య మోహితుఁడయి కడుదూరము సికారుపోయిన శ్యామసుందరుఁడు, దుర్గాప్రసాదునితో నింక బస కరుగ లేదు. భట్టు నాచార్యులుగారును బసచేరి స్నానము చేసిరి. ఆచార్యులుగారు జపము చేసికొనుచుండిరి. శ్యామసుందరుఁ డింక నిల్లుసేరమికిం గారణ మే మని యాలోచించుచు భట్టు వీధి గుమ్మములోనికి వచ్చినంత నొక బాలుఁ డాతనిచేతి కొక కమ్మ నొసంగెను. భట్టు నట్టింటి దీపము కడ కేగి యా లేఖను జదువుకొని యచ్చెరువొందెను. అం దిట్లున్నది.

"శ్రీమన్మహామండలేశ్వరులయిన వనపర్తి ప్రముఖ సంస్థానాధీశ్వరులకు సాష్టాంగ ప్రణామ పూర్వకముగా నాచరించు విన్నపములు. అత్యంత శ్రేయోదాయక మగు నొక కార్యావసరమున శ్రీ ప్రభువువారి సాహాయ్య మపేక్షితము

యున్నది. ఏలినవారి కిచ్చుట సకలోపచారము లీరాత్రి జరుగఁ గలవు. తమ విద్యా వివేక సౌశీల్య చాతుర్యాదులు కర్ణాకర్ణికగా విని శ్రీవారి సందర్శనముసేయ నామం బుబలాట పడుచున్నది. నిమిష మయిన జాగు సేయ నవధరింపక యీ బాలునివెంటనే మన్నికేతనమున కేతేర నెంతయు వేఁడుచున్నాను. చీట్లపేకాటయందు ప్రభు వతంసులు ముకుందు లని విని పేకదస్తా తెప్పించియున్నాను. ఏలినవారు దయచేయింపక యశ్రద్ధ చిత్తగించినయెడల నేనీ రాత్రి యెట్టి యాపదలోఁ బడుదునో యని తహ తహ పడుచున్నాను. ఆఁడు ప్రాణ మలజడి పడుచున్నది. అనుగ్రహించి విజయం చేయింప మిక్కిలి ప్రార్థించుచున్నాను.

చిత్తగించి దివ్యచిత్తమునకుఁ దేవలెను.

ఇట్లు తమ విధేయురాలు,

రాజ్యలక్ష్మీదేవి.

పెనుగొండ జమీందారిణి. విజయారామము."

ఆ లేఖం జదివి భట్టు కింత యాలోచించి, యా బాలుం బిలిచి, 'ఓయీ! భోజనము చేసి వచ్చెద మించుక యాఁగుము' అని పలికెను. ఆ బాలుఁడు వంగి సలాము చేసి, 'చిత్తము మహాప్రభూ! నిమిష మాలస్య మయినఁ బ్రమాదము సంభవించును. శ్రీమహారాణీవారు శ్రీప్రభువువారి దర్శనమునకై ప్రతీక్షించుచున్నారు' అని మనవి సేయ, సరియే యని భట్టు, తమ బండివాని నతి త్వరలో బండి పూన్పుమని యాజ్ఞాపించి జమీందారీ దుస్తులు ధరించి

నాఁడు కొన్న జరీ కుల్లాయి తల ధరించి, మే మీ రాత్రి యింటికిరా మని సేవకులతో వచించి బండి యెక్కెను. బాలుఁడును బండి యెక్కినంత బండివాఁడు గుఱ్ఱపుఁబగ్గములు చేత ధరించి, మహాప్రభూ! బండి యెటు పోవలయు నని యడుగ బాలుఁడు దారిచెప్పెను. బండి యా దారినంటి వడి వడి నరుగుచుండెను. నూటి మాటికి కుఱ్ఱవాఁడు, 'దారి యిటు; ఇటు త్రిప్పుము. ఈ సందు, అని చెప్పుచుండఁ ద దనుసరణ పద్ధతి నొక యరగంటసే పరిగి యొక హవేలీచెంత శకట మాఁగెను. పరిపరి విధముల నాలోచించుచున్న భట్టు బగ్గి నిలిచినంతనే ప్రకృతిస్థుఁ డయి దిగి, బండివాని కొక రూక యిచ్చి యుదయ మూఁడు గంటలకు బండి మరలఁ దీసికొని రమ్మని చెప్పి పంపి, బాలునితో హవేలీ సింహద్వారము దాటి లోపలి కేగెను.

లాంతర్లు పట్టుకొని యిరువురు సేవకులు వెంట రానొక యుద్యోగి వచ్చి, భట్టునకు స్వాగత మొసంగి సగౌరవముగా నాతనిని మంది రాంతర్భాగమునకుం గొంపోయెను. నట్టింట నడుగుపెట్టినంతనే తన యిరువురు చెలికత్తెలతో జమీందారిణి, జమీందారుగారి నెదుర్కొని మ్రొక్కి సత్కరించెను. అంతట నతి గౌరవ ప్రపత్తులు సూపుచు నతనిని పై యంతరువునకుఁ దోడ్కొని పోయిరి.

మేడపైని జేడీలో గుండ్రని మేజా బల్లయు, దానిచుట్టు నైదాఱు కుర్చీలును వేయఁబడి యుండెను. క్రింద నొక తివాసి పఱవఁబడి యుండెను. కొన్ని దినములనుండియుఁ ద న్మందిరము వాడుక లేక నాఁడే యది బాగుచేసినట్లు

చెప్పక చెప్పుచుండెను. జమీాందారిణి బససేయందగిన సౌధ మువలె నది గాన్పింపదయ్యె. 'దేవ విమానములంబోని దివ్యా రామసౌధంబుల కాకరం బయిన యా కళ్యాణ నగరరాజం బున నీ పెనుగొండరాణిగారి కీకొంపయా దొరకినది' అని భట్టు తనలో ననుకొని యిటు నటుఁ దిలకించుచుండెను. ఆ చీడీ పైడాబా కొక లాంతరు వ్రేలాడఁగట్టఁబడి యుండెను. అందు మంచి వెలుతురు వెదచల్లు దీప మొండు వెలుఁగు చుండెను. ఆ చీడీకి నిరుగెలంకుల రెండు పెద్దగదు లున్నవి. వీధివైపునఁ బెద్దచావడి యున్నది. దాని కెదురుగఁ బెరటి వైపున రెండుగదులు నొక చావడి యొక వసారాయు నుండెను. అం దెవ్వరో జమీాందారిణి యుద్యోగస్థులు గుమాస్తాలును గూర్చుండి యుండిరి. అక్కడఁ గాలుపెట్టినం తనే భట్టున కది యొక యింద్రజాల మని తట్టెను. తా నెట్టి జమీాందారుఁడో యామెయు నట్టి జమీాందారిణియే యయి యుండు ననియు నా రాత్రి యేదో విపరీత మున్న దనియుఁ దలంచుచు భట్టు, జమీాందారిణి చహరాను గనిపెట్టుచుండెను.

ఆ జమీాందారిణికి నలువది వత్సరములు దాఁటి యుండును. కాని, యువతీమణి ధరింపవలసిన వేషము నామె ధరించియుండెను. నగలుమాత్ర మొడలి నిండ నుండెను. ఆమె రాజ వంశ సంజాతవలెఁ గన్పట్టదయ్యె. చెలికత్తెలు రాణివాసమున మెలంగినవారుగాఁ గానరారైరి. వా రందఱును జక్కనివారే; కాని, వారిచూపులుమాత్రము సామాన్య స్త్రీద్యోతకము లయి యుండెను. భట్టుతో వచ్చిన బాలుఁడు మేడమీాఁదికి రా లేదు. ఎదురుకొన్న పురుషులు క్రిందనే

యాఁగిపోయిరి. భట్టుక్కడి కరుదెంచినంతనే యెదుటి గదులం దున్న ముప్వురు పురుషులు సంరంభముతో నరుదెంచి 'ప్రభువువారీ పెద్ద కుర్చీపై నాసీనులు గండు' అని వినయముతోఁ బలికిరి. భట్టు కూర్చుండెను. జమీందారిణి యెదుటి కుర్చీపయిం గూరుచుండెను. భట్టున కిరుగెలంకులఁ దక్కిన ముప్వురు పురుషులును గూర్చుండిరి. 'నేఁడు మా గృహము పావన మయినది' అని జమీందారిణి నవ్వుచు ననెను.

భట్టు:-దేవిగారీ నగరమున కేతెంచి యెన్నిదినము లయినది ?

దేవి:- మేమొక కార్యార్థుల మయి యొక మాసమునుండి యీ యూర నున్నాము.

భట్టు:- ఈ మందిరముననే నివసించుచుంటిరా !

దేవి:-ఇన్నాళ్లును నగర రాజవీథి నుంటిమి ; కొన్ని కారణములవలన నచ్చటి మేడ వీడి నేఁ డీ మందిరమునకు వచ్చితిమి. రేపటికిఁ గాని సరి యయిన మేడ దొరక దని మా దివాను మనవి చేయుచున్నాఁడు. ప్రభువువారికి శ్రమ యిచ్చితిమి.

భట్టు:-ఎంత మాట! శ్రమ యే మున్నది? దేవిగారీ నగరమునకు విచ్చేసియున్న సమాచారము తెలిసిన మేమే దర్శనమునకు వచ్చియుందుము.

దేవి:-ప్రభువువారి యాదార్థ్యాదులు వినియున్నాము. మేమే యేలినవారి దర్శనమునకు రాఁ దలఁచియుఁ గార

గాంతరమువలనఁ బ్రభువువారినే రప్పింప సాహసించి తిమి. మన్నింప వేఁడుచుంటిమి.

భట్టు:-(నవ్వుచు) సాహసమా? సౌహార్ద్రమా? మేమీ నగరమున నున్నంత కాలమును దేవీదర్శనము చేసికొను చుందుము.

దేవి:-ధన్యురాలను. ప్రభువువారు భుజింపలేదనుకొందును. ఇట సర్వము సంసిద్ధమయి యున్నది. మమ్ముఁ బావనులఁ జేయ వేఁడెదము.

భట్టు:-మన్నింపవలెను. ఆఁకలి లేదు.

దేవి:-మన్నించుటయా? పోనిండు, కొన్ని పండ్లును బానకమును దెప్పింపనా?

భట్టు:-ఏమియు నక్కఱలేదు. తమ దయ చాలును. మమ్ము రావించిన యంశ మేదియో తెలిపితిరేని మా చేతనైన సాహాయ్యము చేయుట కుద్యుక్తులమై యున్నారము.

దేవి:-భాస్కరోదయ మయినంతనే మంచు మాయమైనట్లు ప్రభువువారి దర్శన మయినంతనే మా యిడుమలు కడ ముట్టినవి. రాఁగల దనుకొన్న యాపద తమ ప్రభావంబున మటుమాయ మయ్యెను. కొంతదనుక వినోదార్థము చీట్ల పేక యాడుకొందము.

అని పలుకుచు జమీందారిణి యొడినుండి పేకదస్తా తీసి మేజాజల్లపై వేసెను. అది గాంచినంతనే భట్టున కున్న మతి యూడిపోయెను. అందఱు నాట కుపక్రమించిరి. అది రంగాట. భట్టు సమర్థుఁడే; కాని తక్కిన నలువురు నేకమయి

యతఁ డొడ్డిన పందెముల నోడుచుకొనఁ జొచ్చిరి. భట్టున కావేశ మధికమయ్యెను. ఆడ నాడ నొకసారి భట్టునకు మూఁడాసులు పట్టెను. అతఁ డొడలు తెలియక శ్యామసుంద రుని రూపాయల సంచిని దీసి క్రమ క్రమముగ రెట్టించి సొమ్మంతయు మేజామీఁదఁ బడవేసెను. జమీందారిణికి గుండె దిగులు దిగులు మనెను. తనగు ట్టొకసారి బయలుపడక మాన దని భయ మందియు నది వెలుపలికిఁ దోఁపనీయక తానును సరిగా నతఁడు వేయుచున్న మొత్తమునే వేయుచు వచ్చెను. తక్కినవారు నడుమనే వదలివేసిరి. భట్టునొద్ద నున్నసంచి వట్టిపోయెను. ఏమి సేయుటకును దోఁచక తన తలమీఁదనున్న టోపీఁదీసి, "యిది నూఁబది రూపాయలకు నేఁడే కొన్నాము. ఇది యొడ్డినాము. మీ పట్టు చూపింపుఁడు. ఎవరి పట్టు పెద్దదయిన వారిధన మంతయుఁ దీసికోవచ్చును" అనిపలికి భట్టు తనచేతనున్న మూఁడాసులును జూపించి బల్ల మీఁది ధన మంతయుఁ దీసికొనఁ బోయెను. "ఆఁగుఁ డాఁగుడు. నావియు మూఁడాసులే" అని జమీందారిణి తన చేతి పట్టు చూపించెను. భట్టు విభ్రాంతుడై 'యొకపేక దస్తాలో నా ఆసు లెట్లుండును? మీరు నన్ను మోసము చేయుచున్నారు. ఇది తగదు.' అని యతఁ డనుచు ధన మంతయుఁ బోఁగుచేయుచున్నంతలోఁ జెంతనున్న మువ్వురు పురుషులు కను సన్నలు చేసికొని, యొక్కసారి యాతని పయిం బడి యతని నవశుం జేసివైచిరి. జమీందారిణి బల్ల పైనున్న ధన మంతయు నొడిలో వేసికొని యాటోపీ పట్టు కొని చెలికత్తెచెవిలో నేమో చెప్పి గదిలోని కేగెను. చెలి

శ త్తై పయినున్న లాంతరులోని దీప మార్పివేసి పక పక నవ్వుచు దేవివెంట నింటిలోనికిం బోయెను. ఇ ల్లంతయు నవ్వులతో ఘూర్ణిల్ల సాగెను.

భట్టు నవశుం జేసిన పురుషులతో మఱి నల్వురుసేరి యతనిని బలవంతముగాఁ గ్రింది యంతరువునకుఁ దీసికొని పోయిరి. 'ఇ దేమన్యాయము? మా టోపీయైనను మా కిచ్చి వేయుఁడు. మేము బోయెదము' అని భట్టు బిగ్గరగా నఱచెను. "ఇది టోపీయే, అయ్యా! రామచంద్ర భట్టుగారు, తమరు జమీందారులు మంచి టోపీలు కొనఁగలరు. నేఁడు మేము వేసినది కుచ్చుల కుళ్లాయి. ఇంక మాటలాడక దయచేయుఁడు; బుద్ధిగా బ్రతుకుఁడు. నీ బండారమంతయు బయలు పెట్టెదము. ఓరీ! భట్టూ! సీత నంకించుకోఁ దలచితివా! ఓరీ! కితవా! నీసమాచార మామెకుఁ దెలిపెద నుండుము" అని యొక య శరీరవాణి యతనికి వినవచ్చెను. ఆ కంఠస్వర మెక్కడనో విన్నట్లు దోఁచెను గాని జ్ఞాపకము రాక భట్టు దీనుఁడై తన్నుఁ దా నిందించుకొనుచు నింక నేమియుఁ బ్రయోజనము లేదని తలఁచి యచ్చోటువాసి వెలుపలికి వచ్చెను. అంధకార మప్పుడు రాజ్య మేలుచుండెను. దారి తెన్ను తెలియక మతి చెడి యూరంతయుఁ దిరిగి తిరిగి యెట్టకేలకు విడిది చేరుకొని, సేవకుఁ డచ్చెరువుతోఁ దలుపు దీయ నేమాటయు నాడక భట్టు తన పడకఁ జేరి శయనించెను.

మఱునాఁడు జాముప్రొ ద్దెక్కినపిదప లేచి భట్టు శ్యామసుందరునితో, రాత్రి జరిగిన యుదంత మంతయుఁ జెప్పి యతనిం దీసికొని రాత్రి వెళ్లిన హావేలీ గుఱుతించెను. ఆ

యింటికి వెలుపలి తలుపునకుఁ బెద్ద కప్పుతాళము వేయఁబడి యుండెను. ఇంక నా యూర నుండుట కిష్టపడక శ్యామసుందరుఁడ నాఁడే తండ్రిపంపిన హుండీపై కము నందుకొని యట్టు నొదార్చి పైమజిలీకిఁ బయనము సాగించెను.

## 14

### దుర్గమ్మ

వైశాఖ మాసము వచ్చి పది దినము లయ్యెను. వసంత ఋతు విలాసములు ముదురుచుండెను. కోకిల కంఠ కుహూకారములయందుఁ గషాయ మధురిమ పూర్ణరూపమున విలసిల్లుచుండెను. ప్రభాకరుని కర నికరమునందుఁ బ్రౌఢిమ గానిపించుచుండెను. చందనాచలాయాత వాత పోత వ్రాతము జీవ కోటికి హాయి నిచ్చుచుండెను. ప్రకృతి సర్వ కళా పరిపూరితమై యౌవన రేఖలచే నూన విభవాభి రామం బయి పొలుపొందుచుండెను. తరు లతా విసర ప్రసవ రాజి నామెతలు గొనుచు మధుకరములు ఝంఝమ్మని వీనులవిందుగఁ దానము వట్టుచుండెను. లోకబాంధవుఁ డంశుమాలి యస్తాచల సౌధ వీధిని విహరించుచు ననురాగ రంజితమూర్తియై పూర్వ పశ్చిమ ఖండవాసుల కమందానందము నొసంగుచుండెను. అరుణారుణ ప్రభా విభాసిత యయి ప్రతీచీ సతి యిప్పుడమేయ శోభాసనాథయయి నారీ మణులు నాథాగమోత్సవ లను నార్యోర్తిం దలఁపింపఁ జేయుచుండెను. శకుంత సంతానము సాయంతనసమయ గానము నొనరించుచుండెను. దూర ప్రయాణము చేసి కడుపార మేసి పుక్కిళుల నాహారము లుంచుకొని

-వలు వలంకులనుండి మంద మంద గగనయానంబులఁ దగు చట్టుపల్లల్లన నాడించుకొనుచుఁ దల్లిపిట్టలు, తమ యనుంగు నిసుంగుల కాహార మిడ నిరవులు సేరఁ వయినంత, పరువిడుచు వరుసలు దీరి కులాయమ్ముల కేతెంచుచుండెను. విప్రోత్తములు విష్ణుస్వరూపధారి యయిన త్రయీమూర్తి కర్ఘ్యమిచ్చి సరిత్సరస్తీరమ్ముల నుపవిశించి పరిణతగభస్తియై యస్తంగతుఁ డగుచున్న య య్యరుణగభస్తి యరుణారుణ విద్యుతిజాలము దమ మోముల నపురూపపు విలసనమ్మునఁ దాండవింప నర్ధనిమీలిత నయనులై సరస్వతీ రూపిణి యగు గాయత్రి నుపాసించుచుండిరి. బేరముల కూరూరఁ దిరుగు బేరులు సరకుల నమ్మివేసి గోనెల బరువు చిక్కములఁ జిక్కి, వడివడి నడచుచు స్వగ్రామములఁ జేరుకొనుచుండిరి. తొలుకరి పనిపాటలు సేసికొనఁ గేదారమ్ముల కేగిన హాలధారులు, పనులు ముగించుకొని తత్సాధనంబులు వహించి యేఱులు దోలుకొనుచు నిరవుల కరుగుదెంచుచుండిరి. ప్రాతఃకాలమున నింటఁ బాలిచ్చి తమ ప్రాణపదంబుల డించి, జీవయాత్ర కేఁగి యచ్చటచ్చటం గల లేఁబచ్చికను ముచ్చట పడి కడుపారగమేసి, పడియలనీరాని, మిడిమెండను నంప దృక్ష సంతాన చ్ఛాయలం దలఁదాఁచుకొని విశ్రాంతి నొంది, సాయంసమయమగునంత గాపులు మరల్ప దగు చిన్ని దూడలు తలంపువాఱఁ జేపువచ్చిన పాలు పొదుగులు నిండ నంబారవంబులతోఁ దమ మాతృవాత్సల్యముం జాటుచు గంగడోలు దూఁగాడఁ బరుగు పరుగుల నాలపసులు స్వస్వనికేతనంబుల కేతెంచుచుండెను. గ్రామాంతరములకుఁ బయ

నము సేయు బాటసారులు వడి రెట్టించి నడచుచుఁ దమ బం
డ్లను వేవేగఁ దోలుకొనుచు మజిలీ చేరుకొన నేఁగుచుండిరి.
నిశాటము లగు మృగ పక్షి నివహంబులు తమ పయనమ్ము
లకుఁ దగిన జతనంబులు సేసికొనుచుండెను. అనంత ధామంబు
న నరసగము ప్రయాణముసేసిన యమృతాంశుఁడు వన్నె దేరి
చెన్నుమీరుచుండెను. అరకొఱ వెన్నెల లంతట నలము
కొనుచుండెను.

అట్టి తరుణమున మా పాఠకులతో మే మూహావిహా
రమ్మున రంగమ్మపేట యను నొకపల్లె కేగవలసి వచ్చి
నది. అది, శ్రీరంగపట్టణమున కాగ్నేయకోణమున నొకజాము
పయనమున నున్నది. అది పది పంద్రెం డిండ్లు గల చిన్నపల్లె.
ఆ పల్లెకుం గూఁతవేటు దూరంబునఁ గొంత దవ్వున రాజమ్మ
పేట యను నొక కుగ్రామము గలదు. ఆ తోఁట రంగమ్మ
రాజమ్మపేటలకు సరాసరి నడుమ నున్నది. రెండు గ్రామంబు
లందును బూర్వ మైశ్వర్యవంతు లయిన రాచ సంగడముల-
వా రిరువురు కాపుర ముండి యుండిరి. వారు బాగారులు;
కాని యొకరికొకరు కోరువారు కాకుండిరి. ఆ తోఁటకయి
యీ బాగారులు పోరాడుచుండిరి కారణాంతరమునఁ బ్రకృత
మున నా రెండు కుటుంబములో నొకటి, రాజమ్మపేట వీడి
పోయిన కారణమ్మున నా యుద్యానము రంగమ్మపేట కుటుం
బమునకు హక్కుపడి వారి యనుభవమున నున్నది. అది పెద్ద
తోఁట. కొంచెమో గొప్పయో యన్ని ఫలజాతులు నందు
న్నవి. దాని నడుమ నొక చక్కని యిల్లున్నది. తోఁటమాలీ
లిద్ద అన్నదమ్ములు రామయ్య భీమయ్య యనువార లాతోఁ

టలో వేఱొకచిన్న యింట నివసించుచుండిరి. అది మామిడి పండ్లయుమ్మిరికాలము. చెట్లనుండి పలుకవాఱిన దోరకాయలు పదిలముగా దింపి, పేఁకలలోను, గదులలోను వరిగడ్డియుఁ గొన్నియాకులును పఱచి యందు కాయలు పండవేసిరి. ఆ పెద్దయింటికి నాలుగైదు గదులున్నవి. మూఁడు గదులలోఁ జూతఫలములు, పండవేయ ముగ్గినవి గుమగుమ పరిమళించు చుండెను..

తోఁటచుట్టును నిలివెఁడెత్తు గ్రద్దగోరు, కోరెండము మున్నగు ముండ్లపొదలు పెఱిగి యుండుటచే నేరికి నందుఁ జొర వీలులేకుండెను. చుట్టు కందకముమీఁద, చింత, తుమ్మ, వెలగ, నేరేడు, విప్ప మొదలగుచెట్లు చక్కఁగ వృద్ధిపొంది యుండెను. అక్కడక్కడ, మఱ్ఱి, జువ్వి, కల్జువ్వి, రావిచెట్లు తమసంపత్తులతోఁ బెచ్చుపెరిగి యుండెను. ఆ తోఁట కంతటికిని రాజమ్మపేట వైపుననే యొక పెద్ద ద్వార ముండెను. దానికి దృఢమయిన పెద్ద తలు పుండెను. ఆ ద్వారమునుండి తోఁటలోనికి నిరాఘాటముగా బండ్లుపోయి రావచ్చును. అందలి పెద్దయింటి నాల్గవ గదిలో నొక వనితా మణి నివసించుచుండెను. ఆమె యా చూతవనాంతర్భాగ మున నిచ్చవచ్చినట్లు దిరుగవచ్చును. కావలసిన యాహార పదార్థముల కా కాంతామణి వెతకుకో నక్కఱలేదు. ఆసతీ తిలకము, వన్నెవాసి తగ్గియున్నను జవసత్వము లుడుగలేవు. ముదుకు కోక గట్టుకొన్నను, నగలేమియు లేన్నను, నలువ దేండ్లు దాఁటినను, నమ్మానవతీతిలకము సహజ తేజంబున, రాణివాసమునఁ బరిచారికా శతంబు లూడిగంబులు సేయఁ

గొలుపుండఁ దగినకీవి గల దేవీమూర్తి. ఆమె, తనగదిలో దీపము వెలిఁగించి, వెన్నెల వెలుతురులును, వృక్షములనీడలును గలిసి తిలతండుల న్యాయము వహించియున్న, యయ్యుపవనవీధి నడుగు లిడుచుఁ ద న్మాలమునఁ గలుగు నాకుల మర్మరధ్వని యుప్పటి నిశ్శబ్దత కించుకభంగపాటు గలిగించుచుండ వెలుపలి కేతెంచెను. అందలి ఱాతి కట్టడపు నూతిగట్టుఁ జేరి యా చోట నున్న చాప ఱాతిమీఁదఁ గూరుచుండి యా కాంతారత్న మాకసము వంకఁ జూచుచు నుస్సురని వేఁడి నిట్టూర్పు పుచ్చెను.

"అయ్యో! దైవమా! నీ కింకను గనికరము గలుగ లేదా! నా కష్టముల కంతములేదా? నా పయి నీ కింత పగ యేల? నేఁ జేసిన పాప మేమి? నే నెన్నాళ్లీఘోర దుఃఖ దావానలంబునం బడి మాడుచుండుట? నా కేల యీ దుర్జాతి కారాగారంబునఁ బడి వందురవలసె? పసితనముననే తలిదండ్రులు గతింపఁ బితృమాతృవాత్సల్య మేమో యెఱుంగక దిక్కుమాలియున్న సన్నింతో గారాబంబునఁ దన కన్నబిడ్డ కన్న మిన్నగ నల్లారుముద్దుగాఁ బెంచి, నావరించిన వరుని కిచ్చి పెండ్లిచేసిన యా వాత్సల్య సాగరుఁడు మా బాబు బ్రతికి యుండిన నా కిట్టిపాట్లు గలుగునా? జ్ఞాతిహృతసర్వస్వులై పౌరుషప్రధాన జీవులై మహాహవరంగంబున శత్రువీరులఁ గడికండలుగ నఱికి పాఱవైచు వీరాగ్రగణ్యులగు నా మగఁడును బావయుఁ దమలో నక్కఱమాలిన పట్టుదలలు గల్పించుకొని యేల వీడుపట్టు వీడిపోయిరి? వారేమైరో! హా! సుల్తానుఁడా! నాతోపాటు నీ జీవముల

కేడ్చుచు నిం కెంద రిట్టు లభాగినులయి విలపించుచున్నారో! నిన్నే పరమదైవమని నమ్మి, వలదు, వలదన్నను నామాట త్రోసిపుచ్చి, రాతి రనక పగ లనక యెం డనక వా నన‌క, యన్నమనక నీ రనక, కష్ట మనక,సుఖ మనక పెండ్ల మనక బిడ్డ లనక సర్వము నీవే యని నమ్ముకొని నీ కంటికి ఱెప్పై, కాలికిఁ జెప్పై, ప్రాణమునకుఁ బ్రాణమై నిన్నంటియున్న యీ స్వామిభక్తాగ్రగణ్యుని,నా స్వామి నేమిచేసితివి? నీ వేమి బ్రతికి బట్ట కట్టితివి? నీవేమి యుట్టికట్టి యూఁగితివి? హా! ఈశ్వరా! ఈ జన్మమున మగుడ నా మగని పాదసేవ సేయు భాగ్యము నాకు లభించునా? నా చిన్నిబిడ్డల ముద్దు మోము లే నాఁటికైనఁ జూడఁ గల్గుదునా? ఎన్నఁడైన నా యిడుమ లకు విడుమర యున్నదా?" అని యా దీనురాలేడ్చుచు విల పించుచుండ, 'అమ్మా! ఉన్నదున్నది!అని యొక పలుకు విన వచ్చెను. ఆ యభాగిని యచ్చెరువొంది యశ్వ్యపశ్రుతివలనఁ దన కడగండ్లు దీరు నని భావించి సంతసించుచు న్నంతలో నచట నొక వ్యక్తి గోచరించెను.

ఆ వ్యక్తి త దుపవ నాధికారి; ఏఁబది యేండ్లవాఁడు; దృఢ కాయుఁడు; అంత పొడవరి కాఁడు. కండలుపెరిఁగి మెలి కలు తిరిగియున్న యాతనిదండ లతఁ డొకవస్తాదని తెలియఁ జేయుచుండెను. మీసములు బుగ్గమీసములు దాడీయును బాగుగాఁబెరిఁగినల్లని యతనియాకృతికి వన్నెపెట్టుచుండెను. అప్పుడే గంజాయి పీల్చి వచ్చుటచే నతని కన్ను లగ్నికణ ములవలె నెఱ్ఱనయి యుండెను. కొంత కొంత నరసిన గేరా చుట్లు చుట్లుగ మెడపై చిందులు ద్రొక్కుచుండెను. వాని

యెడమచేతి కొక పసిండి కడియ ముండెను. వ్రేళ్లకు బటువు లుండెను. ఒడ లంతయుఁ జందనము పూసికొని, తాంబూలము వేసికొనుచు, వల్లెవాటు వేసికొన్న జరీ యుత్తరీయము జాఱి నేల జీరాడ, నవ్వుచు నా పురుషుఁ డా సతీమణిని సమీపించెను. వానిం జూడఁగానే యామె సర్వావయవములును గంపించిపోయెను. పైటచెఱఁగుతో నొడ లంతయుఁ గప్పుకొని కాళ్లు ముడుచుకొని తలవంచుకొని యాయమ, యచ్చటనే కూర్చుండి దిగులుపడెను. 'దుర్గా! ఏ మాలోచించితివి?' అని యతఁ డా నూతిగట్టునఁ గూర్చుండి యడిగెను. దుర్గాంబ మాటలాడలేకపోయెను. మరల నతఁడు, "దుర్గా! దుర్గ! నా మాట వినుము. పోయినవారికి విచారించిన లాభము లేదు. నా కైశ్వర్యమునకు లోపము లేదు. నన్నుఁ గాదని మీ బాబుమాట తృణీకరించి, నా దాయాదిని పెండ్లియాడిననాఁడే నీకు దారిద్ర్యము పట్టినది. ఆలోచించుకో, మన రెండు కుటుంబములకు విరోధ కారణము నీ తిరస్కారమే. మీ భూములు పుట్టలు పోయినవి. ఇండ్లు మేడలు పాడువడినవి. నిలువ నీడలేక నీ మగఁడును బావయును వలస పోయిరి. సర్వసిద్ధమయిన మనపెండ్లికార్యము భంగపఱిచి నీవు సదాశివుని రహస్యముగా వరించితి వని తెలిసినప్పుడు నే నెంత ఖేదపడితినో దైవమునకే యెఱుక. అయిన దేదో యయినది. నీవు దీనురాలవై యున్నావు. నా దగ్గఱ నీ వుండ రాదా? నీ కీ నిర్బంధ మేల? బొంబాయి నగరమున సైనికులకుఁ బరిచారికవై యున్న నిన్ను నిర్బంధమునుండి తప్పించి తీసికొనివచ్చినాను గానా? నిన్నంటితినా? పరుష ప్రలాపము

లాడితినా? ఏల తప్పించుకొని నాఁడు పాఱిపోయితివి? నిన్నుఁ బట్టలే ననుకొంటివా? ని న్నెంతో గౌరవ బుద్ధితోఁ జూచుచున్న నా కడ నుండుటన్న నీ తల కంటగించు చున్నదా? సుల్తాను రాజ్య మంతరించినది. నీ మగఁడును బావయు గతించిపోయియుందురు. నీ పిల్ల లెచ్చట నున్నారో తెల్పుము. వెదకించి తెప్పించెదను. నా యింటికి రమ్ము. మహారాణివలె నుండుము. ఊర కాయాస పడకుము" అని శోధింపసాగెను.

దుర్గా:-అయ్యా! దీని కింత యుపన్యాస మేల! నాఁడే నిన్ను నిరసించితిని. ఇంకఁ జావో రేవో, కలిమియో, కష్టమో సుఖమో నా దారి నాది; నీ దారి నీది. కులకాంత పర పురుషు నింట నుండరాదు. నీ వెట్టివాఁడ వైనను నెంత యుపకారి వైనను నీ యింట నే నుండ నొల్లను. తొలు దొల్తఁ బగఁబట్టి మ మ్మీయూర నుండనీక యల్లరిపెట్టిన యమాయిక హృదయుఁడవు నీవుగావా? నా పతికి నీమూల మున నేయీ గతి పట్టినదని నా గట్టి నమ్మకము. నీ వన్నట్టు లయిన దేదో యైనది. ఏరి కర్మము వారే గుఱియగుదురు. నిన్ను నిందించిన కార్యమేమి? నా దారిని నన్ను విడిచి పెట్టుము. దాయవగు నీవు నా బిడ్డల యునికిం జెప్పలేను. న న్నీ నిర్బంధమున నుంచుటలో నీ యుద్దేశ మేమో తెలి యదు. మించి వచ్చినచోఁ దృణప్రాయముగాఁ బ్రాణ ములు విడువఁగలను. నా స్వధర్మము నే నెఱుఁగుదును. న న్నీ నిర్బంధము నుండి విడిచిపెట్టుము. సర్వేశ్వరుని కృప యున్నచో నా పతిని, నా సంతానమును గలిసికొని సుఖిం

చెదను. లేదా తృప్తిదీఱ వెదకి వారి యుదంతము నారసి సన్యాసినినై తీర్థ యాత్రలు సేసికొనుచుఁ గాలమున లీన మయి పోయెదను. నన్ను విడిచి పుచ్చితివేని నీకనంత పుణ్యము గల్గును? నీవు మరల నొక యింటివాఁడ వయి బుద్ధిగా బ్రదుకుము. చిన్నదాన నైనను నిన్ను దీవింతును.''

పురు:-దుర్గా! ఇంక రెండు మూఁడు దినములు గడు విచ్చినాను. బాగుగా నాలోచించుకొనుము. నేను నాలోచించెదను. ఉత్తమ మార్గముననే పోవుదము.

దుర్గ:-''మాధవరాయా! వేయేండ్లు నీ తల్లికడుపు చల్లగా నొక యింటివాఁడవు వేయిండ్లవాఁడ వయి వర్ధిల్లుము. పోయిరమ్ము.''

ఆ మాటలు విని విసువుకొనుచు మాధవరావు వెళ్లి పోయెను. ''ఈ నాఁటి కీతని మనస్సు మెత్తపడినది. బంధ మోక్షములకుఁ గర్మయే కదా కారణము! అది యనుభవ మయినఁ గాని యేదియుఁ గాదు.'' అని యనుకొనుచు దుర్గాంబ యించుక సంతోషముతో లేచి బసగదికేగి పండుకొనెను.

శ్యామసుందరాదుల మొదటి మజిలీలో దుర్గాంబను పాఠకులు చూచియున్నారు. వేఁకువ నీవలికి వచ్చిన దుర్గాంబను మాధవరావు బలవంతమునఁ బట్టి కట్టి తెచ్చి యీ నిర్బంధమున నుంచెను.

# 15

## ఈఁ దు లా ట

విజయవర మఱువ దిండ్ల యగ్రజాతి గృహములు గల వసతియైన యగ్రహారము. అది హిందుపురమునుండి ధర్మవరమున కేగుదారిలో నున్నది. ఆ యగ్రహార బ్రాహ్మణ వీధులు రెండును మిగుల విశాలము లైనవి. శ్రేణికి సుమారు ముప్పదిండ్లుగా నెడ తెగక వీధులు సూటిగాఁ గట్టఁబడినవి. దక్షిణశ్రేణి నొక గొప్పధనవంతుల బవంతులు రెం డున్నవి. ఉత్తరశ్రేణి నడుమ నొక పెద్ద పెంకుటిల్లున్నది. అ దప్పటికిఁ ఖాళీగా నుండుటచే మన శ్యామసుందరాదుల నా గ్రామస్థులు గౌరవించి విడిది యిచ్చి యున్నారు. రెండు వీధులకును సమముగ మధ్య ప్రదేశమున నూరి పొడుగున నెవ రింటికి ముందఱ వా రొక ధాన్యపు గాదెను గట్టుకొని యుండిరి. ఆ ధాన్యపుఁ గొట్టుల కీవ లావల రెండువరుసలు దీర్చి నారికేళ వృక్షములు నిండు గెలలతోఁ బచ్చగ నా యూరికిఁ దోరణము గట్టినట్లు శోభిల్లుచుండెను. రెండు వీధులను బండ్లు మున్నగునవి పోవుటకు రెండు మార్గములున్నవి. నడుమ నడుమ నా శ్రేణినుండి యీ శ్రేణికి నీ శ్రేణినుండి యా శ్రేణికిని వారిలో వారు వచ్చి పోవుటకుఁ దగిన చిన్నత్రోవలు గాదెల ప్రక్కలనుండి యుంచుకొనిరి. రెండు వీధులకును వెనుకప్రక్కను రెండు శూద్రవీధు లూరి పొడుగునం బెట్టనికాఁపై యున్నవి. ఆ వీధులలో నాలుగైదు కోమ టిండ్లున్నవి. ఆ యగ్రహారము, భూస్వాము లగు భూసు

రో త్తముల వేదశాస్త్రాధ్యయన ధ్వనులతోను, శ్రీ సంపత్తుల కలకల నినాదములతోను నిండి యానంద జనకమయి యుం డెను. ఉదయ మగు నప్పటికి స్నానములుసేసి సంధ్యావంద నాది నిత్యకృత్య కర్మ కలాపములు నిర్వర్తించుకొని విభూతి రుద్రాక్ష భూషితు శరీరులయి వీధి వేదికలపయిని విద్యార్థు లకు వేదము సంత చెప్పుచున్న విప్రోత్తములు శంకరావ తారులుగాఁ గానవచ్చుచుండిరి. పసుపుఁ గుంకుమలతో నెమ్మోములు కలకల లాడుచుండ నిలు సవరించుకొను చున్న ముత్తైదువలు భవానీ మూర్తులువలెఁ గనుపడుచు సేయుచుండిరి. తల్లులవంటి వేషభాష లలవఱుచుకొని వారికిఁ బనిపాటులఁ దోడుపడుచు నాయూరి గృహిణీకుమా రికలు బాలాదేవీ మూర్తులో యన వెలుఁగొందుచుండిరి. పిల్లలు, బ్రహ్మచారులు, నూత్నవధూవరులు, గృహస్థులు, వృద్ధులు, వారు వీరననేల యా యగ్రహారరాజమ్మున నున్న యెల్లవారి నెమ్మొగంబుల నిత్యతృప్తియు, నిరుప మాన బ్రహ్మకళా దీప్తియుఁ దాండవించుచుండెను. మన శ్యామసుందరాదు లచ్చటికి వచ్చి యా యూరి యేర్పాటులు, గృహస్థుల మర్యాదా మార్దవములు, అగ్నికార్య పరతంత్రత, వేదాధ్యయన సంపత్తి, అతిథి పూజాభిలాష, ఆచార పరా యణత మున్నగు నుత్కృష్ట గుణ గణము లరసి యెంతో సంతోషించిరి. అచ్చటి సాధారణ గృహస్థులను, వేదనిధు లను, శాస్త్రవేత్తలను, బ్రహ్మవిత్తములను మన శ్యామసుం దురుఁ డెంతయు గారవించి, సంభావన లొసంగి వారి యాశీ ర్వచనము లందుకొనెను. భట్టు, వేదవేత్తలతో భావ్య

ప్రసంగముచేసి యన్నింటం దనకుఁ గల యసాధారణ చాతురీ మహిమను గాన్పించి, యా యగ్రహార విద్వన్మండలిని, ఆచార్యులవారిని శ్యామసుందరుని నబ్బురపడఁజేసెను. ఇట్టు లొకపూటాయూరఁ గడచిపోయెను. సాయంత్ర మగు నంత గ్రామమునకుఁ దూర్పున నున్న పెద్ద కోనేటికేగి యెల్లరు సంధ్యావందనాదికములు తీర్చుకొని, గట్టుమీఁద నున్న మహాదేవుని మందిరంబున కేగి సేవించి వచ్చిరి.

మఱునాఁటి ప్రాతఃకాలముననే మన బాటసారులు నిద్రలేచి వాయుసేవనార్థము .సికా రరిగిరి. కాల్యకృత్య ములు తీర్చుకొని నల్వురుం గోనేటికి వచ్చిరి. ఆకోనేరు మంచి నీటివసతి గలిగి కలువలు, దామరలు పూచి కలకల లాడుచుండెను. అగ్రహారమువైపున నుమామహేశ్వరాల యమునొద్ద నుండి కోనేటి యడుగుభాగమువఱకుఁ జక్కని రాతిమెట్లున్నవి. కోనేటి కవ్వలివైపున, మంగలి, చాకలి మున్నగువారికి వసతయి యున్న చిన్నపల్లెయు, దాని కొక చిన్న కోనేరును గలవు. పెద్ద కోనేటి గట్టుమీఁదఁ బెద్ద మఱ్ఱి, జువ్వి, రావి మ్రాఁకులు పెరిఁగి చక్కని నీడ నిచ్చుచుండెను. దాని రామణీయత కెంతయు నలరి, శ్యామసుందరుఁడు భట్టుతో మెల్లగా, భట్టూ! నేఁడీఁతకొట్టవలె నని సర దాగా నున్నది. నీ పాండిత్యముచూచి చాలరోజు లయినది. ఏ మందువు?' అని యడిగెను. భట్టు తలయూఁచెను. ఇరు వురు నడ్డికట్లు దిట్టముగాఁ గట్టి నీటిలో దిగిరి. దుర్గాప్రసా దుఁడు వారివెనుకనే దిగుచు, 'ఆచార్యులువారూ! తమ రీఁదఁ గలరా? దయచేయుఁడు' అని నవ్వుచుఁ బిలిచెను.

'నాయనా! ఆ కాలము పోయినది. ముసలివాఁడను; నే నీఁదలేను. నీ వన్నిటిలోను బిడుగుఁదున్కలా గున నున్నావు. పసివాఁడవు. నీ కెందులకోయి పడుచువారితో' అని వారిం చెను. ఆ మాట లాచార్యులుగారు 'ముగించునప్పటి కా మువ్వురును గోనేటిమధ్య కీఁదుకొని పోయిరి. ఆచార్యులు గారు గొణుగుకొనుచు, నే నెందఱినో చూచినాను గాని యీ జమీందారుగారి వంటి యసాధ్యప్రతిభు నెక్కడను జూడలేదు. ఈయన యీఁదుటలోఁగూడ నందెవేసికొన్న పద్దే! కదలక మెదలక నీటిమీఁద నాతఁడే యట్లు పండు కొన్నాఁడు ? ఆహా ! శ్యామసుందరుఁడు గూడఁ బండు కొన్నాఁడు! అయ్యో. మునిఁగిపోయినాఁడు, మహాప్రభూ! ప్రభుకుమారుం బట్టుకొని తీసికొని రండు. లేదు లేదు లేచి నాఁడు. మరలఁ బ్రయత్నమా! ఓరి! నీనిల్లు బంగారముగాను! దుర్గాప్రసాదుఁడునా! ముగ్గురు నీటిమీఁదఁ దేలియున్నారు ! జమీందారుగారి యొడలంతయుఁ దేలియున్నది. వీ రిరువురి కాళ్లు మునిఁగి యున్నవి. వా రిరువురిపని యయినది. లేచి పోయినారు. ఆయన పవనము పట్టినాఁడు; అసాధ్యుఁడు. నిస్సామాన్య ప్రతిభావంతుఁడు. కారణ జన్ముఁడు'' అని యాచార్యులుగారు సంధ్యావందనము మఱచి రేవు మెట్టు మీఁదఁ గూర్చుండి, ప్రక్కయొండకుఁ జే యడ్డము పెట్టి తదేక ధ్యానముతోఁ జూచుచుఁ బొగడుచుఁ దెగడుచు నుండెను. ఇంతలోఁ ద ద్గ్రామమండలి విద్యార్థి బ్రహ్మచారి మండలి స్నానముచేయఁ గెవ్వునఁ గేకవేయుచు వచ్చి యాచా ర్యులుగారి నిర్వికల్పక ధ్యానమునకు వికల్పము కలుగఁ

జేసిరి. బాలు రందఱు న-వ్వింతచూచి యచ్చెరువొంది చేతులు తట్టుచు నిలువంబడి యుండిరి.

అంత భట్టును, శ్యామసుందరుఁడును, దుర్గా ప్రసాదుఁడును లేచి యీఁదుకొని యొడ్డునకు వచ్చిరి. గొల్లున బిల్ల లందఱును దమ కా విద్య చెప్పుఁ డని శ్యామసుందరుని, భట్టును వేఁడిరి. 'మీ కలవాటు లేదు; పిల్లకాయలు, వద్దు; బాబులారా! వద్దు. స్నానము సేసి యిండ్లకుఁ బొండు' అని భట్టు వారించెను. తని వోక శ్యామసుంధరుఁడు భట్టును మరల నీఁద రమ్మనెను. వా రిరువురును మరలఁ దిగిరి. భట్టు చేతులు పైకెత్తి కాళ్లతో మాత్ర మీఁది కొంతదూర మరిగి చట్టున నక్కడ మునిఁగిపోయెను. పిల్ల లందఱును గొల్లు మనిరి. దుర్గాప్రసాదుఁడు నవ్వసాగెను. శ్యామసుందరుఁడతఁ డెక్కడఁ దేలునో యని చూచుచుండ భట్టు నిమిషములోఁ గోనేటి కవ్వలి యొడ్డునఁ దేలెను. చేఁపలు గూడ నింత త్వరగాఁ బోఁ జాల వని యాచార్యులుగారు ప్రశంసింప సాగిరి. భట్టు మరల నక్కడ మునిఁగి కనుఱెప్ప వేసినంతలో శ్యామసుందరుని కడఁ దేలెను. 'అన్నా! చిన్న తమాషా చేసెదను. ఒడ్డునకు ర మ్మని శ్యామసుందరుని ఱొమ్ముబంటి నీటివఱకు రానిచ్చి, నిలువుము. 'నే నిక్కడ మునిఁగి యడుగు మెట్టు పయినంటి పండుకొనెదను. చూడుము, అని పల్కి మునిఁగెను. శ్యామసుందరుఁడును, బాలురును జుట్టును మూఁగి చూచుచుండిరి. భట్టడుగు మెట్టు నానుకొని చేతులు కాళ్లు సాచి పండుకొని యుండెను. రెండు మూఁడు నిమిషము లట్టుండి లేచి యీ విద్య చేయు

మని శ్యామసుందరు ననెను. అతఁడు ప్రయత్నించెను; కాని నీరు తేల్చివేయుచుండుటచేఁ గృతార్థుఁడు గాలేకపోయెను. దుర్గాప్రసాదుఁడును బ్రయత్నించి యుండలేక పోయెను. భట్టు శ్యామసుందరుని చెవిలో దాని గుట్టెట్టిదని చెప్పి మునుఁగు మనెను. శ్యామసుందరుఁడు మునిఁగి యడుగుమెట్టు పయి సుళువుగా నంటి యుండఁ గల్గెను. దుర్గాప్రసాదుఁ డా కిటుకు కనిపెట్టి తరువాత నతఁడు నా విద్యలోఁ గృతార్థుఁ డయ్యెను. జమీందారుగారు సర్వవిద్యాకుశలు లని యాచార్యులువారు ప్రస్తుతించిరి. వారు ముప్పురును దృప్తి నొంది యొడ్డెక్కి తుడుచుకొను చుండిరి. ఆచార్యులుగారు మరల జపమున కుపక్రమించిరి.

ఆ విద్యార్థు లందఱు నా వినోద విద్యలం బొగడుచు నొక్కసారిగాఁ గా సారంబున దిగి యీఁదులాడఁ బోయిరి. భట్టు ననుకరింపఁ బోయి చాలమంది మునిఁగి లేచిరి. ఒక రిద్దఱు నీటిపై నొక్కింత తేలఁ గలిగిరి. అహ మహమికతో వా రందఱు నీఁదులాడుచుఁ గొలఁకుం గలఁక పెట్టి వేయు చుండిరి. పదునాలుగు పదునెనిమి దేండ్ల యీడులోవు వారే యందఱు నగుటచేఁ గొంత సేపటి కలసిపోయి యొకొక్కఁ డును మెలమెల్లగ నొడ్డుఁ జేరుకొను చుండెను. ఇరువురు బాలుర మాత్రము పంతమువేసి చాలసే పీఁదిరి. అందొ కఁడు తిరిగి వచ్చుచు నడుదారిని తెక్కలలో సత్వ ముడిగి బుడుంగు మని మునిఁగిపోయెను. వెనుక వచ్చుచున్న రెండవ బాలుఁ డాతనికిఁ దోడుపడ వచ్చెను. మునిఁగిన బాలుఁ డూపిరి సలపక నీళ్లు త్రావి తేలి, యీఁదుచు వచ్చిన

బాలుని మెడఁ గట్టిగాఁ బట్టుకొనెను. ఇరువురు మునింగిరి. నీటిలో వారు గిజగిజ కొట్టుకొను చుండుటఁ జూచి భట్టు, అన్నా! కొంప మునిఁగినది. ఆ కుఱ్ఱవాం డ్రిరువురు మునిఁగి పోయిరి. త్వరగా ర మ్మని పల్కుచు నిమిషములో నచ్చో టికి వచ్చెను. రెండవ బాలుఁడు కఱచి మొదటివాని పట్టు తప్పించుకొని పైకి లేచెను. ఇంతలో శ్యామసుందరుఁ డ చ్చోటి కీఁదుకొని వచ్చెను. భట్టు తేలినవానిని శ్యామ సుందరుని కొప్పించి మునిఁగిన వానిం బిలకపట్టి యెత్తి చేతుల మీఁద వేసికొని యొడ్డునకుఁ బెచ్చులోపున శ్యామసుందరుఁ డా బాలునికిఁ దోడ్పడి తీరముం జేర్చెను. కడుపు నిండ నీళ్లు ద్రావి స్మృతి తప్పియున్న మొదటి పిల్లవానిం గట్టుచేర్చి భట్టు, వాని కుపచారములు చేసి త్రాగిన నీరు వెలుపలికి వచ్చు నేర్పాటులు చేయుచుండెను. దుర్గాప్రసాదుఁడును, శ్యామసుందరుఁడు నాతనికిఁ దోడుపడు చుండిరి. గురువు గారు గడగడ వడఁకి పోవుచుఁ గన్నీరు గార్చుచుండెను. ఈ లోపునఁ గొందఱు బాలకులు గ్రామములోని కీ వార్తను గొం పోయిరి. గ్రామస్థు లా బాలగోపాల మచ్చట నంతలోఁ జేరిరి. భట్టుచేసిన యుపచారముల వలన నా బాలకుఁడు జీవించు నను నాస గలిగెను. గ్రామస్థు లందఱును నతనిని, శ్యామసుందరుని వేనోళ్లఁ గీర్తించుచుండిరి. 'వద్దు వద్దు బాబులారా యని మా ప్రభువువా రెంత చెప్పినను నీ పిల్ల కాయ లా మాటలు పెడచెవిని బెట్టి దిగినారు, అని గురువుగారు గ్రామస్థులతో జరిగిన సమాచార మంతయుఁ జెప్పుచుండెను.

అంతలో, 'నా నాయనా! నా తండ్రీ! నా చిట్టి తండ్రీ! నా వాసుదేవమూర్తి! నా కేమి గతి బాబూ!' అనుచుఁ దలయు ఱొమ్మును బాఁదుకొనుచుఁ, గన్నీరు మున్నీరుగా నేడ్చుచుఁ దొట్రుపడుచుఁ బడుచు లేచుచు దుఃఖ వివశాత్మయై యొక యవ్వ యచటికి వచ్చెను. భట్టా మె నూరకుండు మని చెప్పి, వాని కడుపు నొక్కియు, నటు నిటు నిరువురచేఁ బట్టించి త్రిప్పించియు మిగుల నేర్పుతో వాఁడు త్రావిన నీ రంతయు వెలువడఁ జేసి యొడలంతయుఁ దుడిచి నాడి పట్టి చూచి, యింకను దగిన చికిత్స కావలయు నని యూహించి, యా యవ్వం జూచి, 'అమ్మా! అబ్బాయి బ్రతికినాఁడు; శోకింపకుము. గంద్రగోళము సేయక వేగ మింటికి ముందుగ నరిగి కుంపటితో నిప్పులు సిద్ధపఱిచి యుండుము. మేము పిల్లవానిం దీసికొని మీ యింటికి వచ్చెదము' అని పల్కి యామెం బంపివేసెను. భట్టు, శ్యామ సుందరుఁడును, గ్రామస్థులు బ్రాహ్మణు లిరువురును నా బాలకుని జక్కఁగ నెత్తుకొని వాని యింటికిఁ దెచ్చి నట్టింటఁ బ్రక్కవేయించి యందుఁ బరుండఁ జేసిరి.

భట్టన్ని విద్దెలయం దారితేఱిన యరండా; కావున నతఁడు కుంపటి నిప్పులు తెప్పించి, తొలుత మెల మెల్లగఁ గడుపు గాచి తలయుఱొమ్మునుగాచి, చిట్టాముదము తెప్పించి చేతులకుఁ జఱుముకొని, పొత్తి కడుపు కొంచెము సేపు గోరు వెచ్చగఁ గాచెను. నులివెచ్చని యా కాపువలన బాలునికించుక చైతన్యము వచ్చి కనువిచ్చి చూచెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు సరిగా నాడసాగెను. ఆ యవ్వ,

కనుఁ గొలుఁకులనుండి జల జల బాష్ప బిందువులు జాఱ, బాలునిఁ గౌఁగిలించుకొని ముద్దిడుకొని, గరిసెఁడు నీళ్ల కేడ్చెను. ఆ దీనురాలు భట్టు పాదముల పయిఁ బడి, "నాయనా! నా యిల్లు నిలిపితివి; నా ప్రాణములు నిలిపితివి. నీ ఋణ మెట్లు తీర్చుకొనఁగలను? తండ్రీ! ఆపద్బాంధవుఁ డవు. వేయిళ్లుగా వర్ధిల్లు నాయనా. నే నిరుపేదరాలను" అని పలుకుచుఁ గృతజ్ఞురా లయి యా యవ్వ దీవించెను. "పాపము! బీదరాలు, ఒక్కఁ డొక్క బిడ్డఁడు. చిచిందిరీ వంటి వాఁడు. కృతార్థురాలే. మగఁడు పోయి సంవత్సర మయినదో లేదో. ఈ మహాత్మునివలన మరల నీ యిల్లు నిలఁబడినది. ఈ పిల్లలు దిన్నగా నుండరు బాబు! ఈ యుపకార శీలుఁ డక్కడఁ నుండఁబట్టి సరిపోయినది. చిన్నప్రాణ మెంతసే పెగిరి పోవుట? " అని పలువురు పలు మాట లాడుచు నెవ రింటికి వా రే గిరి.

బాలుఁడు లేచి కూర్చుండెను. అప్పుడే యా యూరిలో నున్న వైద్యున కీ సమాచారము తెలిసి వచ్చి, 'బాబూ!. ఎట్టు లున్నది!' అని భట్టు నడిగి యతనిం బొగడుచుఁ జేయి చూచి, 'తలనొప్పిగా నున్నదా వాసూ!' అని బాలు నడిగెను. ఔను తాతగారూ! అపరిమితముగా నున్నది' అని వాసుదేవమూర్తి వచించెను. వైద్యుఁడు కడుపులోని కింత యౌషధ మిచ్చి కుఱ్ఱవానిం గదిలోఁ బరుండఁజేసి యవ్వతోఁ జెప్పి, భట్టుతోఁ గూడ వీధిలోనికి వచ్చి, 'బాలునికి సాయంత్రము జ్వరము తగులును. అయినను బాధ లేదు. రేపటికిఁ గులాసాగా నుండును. దమకీ ర్తి

విన్నాను. ఉదార పురుషుల దర్శన మయ్యెను. సుదిన, మని పల్కి నమస్కరించి భట్టును వీడుకొని యతఁడింటికి వెళ్లెను. భట్టు, శ్యామ సుందరుఁడును బసకేఁగి పాడిబట్టలు గట్టుకొనిరి. ఆ దినమంతయు నా గ్రామమున నెక్కడ విన్నను దత్ప్రశంసయే వినవచ్చుచుండెను.

# 16

## రహస్యము

భట్టు రాత్రి వచ్చి వాసుదేవ మూర్తిని జూచెను. వానికి జ్వరము తగిలియుండెను. వాని తల్లి దిగులుపడి నాఁడంతయు నిట్రుపవాసము చేసి నిజతనయుని శయ్య విడువక రాతి రంతయు జాగరణ మొనర్చి వానికి సకల విధోపచారములు చేసెను. భట్టు నామె నోదార్చుచు రాతి రంతయు నచ్చటనే కడపెను. తెల్లవాఱుజామున నుష్ణము విడిచెను. బాలుఁడు నెమ్మది నొంది మాటలాడెను. భట్టు కాల్య కృత్యములు నెరవేర్చుకొని వచ్చునరికి వాసుదేవమూర్తి వచ్చి వీధి యరుగుమీఁదఁ గూరుచుండి యుండెను. భట్టున కమితానందము గలిగి, 'బాబూ! నెమ్మదిగా నున్నదా?' అని యడిగెను. వాఁడు నవ్వుచు లేచి భట్టు పాదములకు నమస్కరించెను. వానిని లేవనెత్తి ప్రక్కను గూర్చుండఁ బెట్టుకొని యతఁడు, 'అమ్మగారేరీ?' అని యడిగెను. 'అమ్మ యుంఛ వృత్తికై పోయినది' అని వచించి వాసుదేవుఁడు తల వంచుకొనెను. ఇప్పుడే వచ్చెద నని యింటికేగి భట్టు

వెంటనే తిరిగి వచ్చి యా బాలుని చేతిలోఁ బది రూపాయ లుంచి, మీ యమ్మగారి కిమ్మని చెప్పెను. వద్దు వద్దు. అని యది గైకొనుట కా బాలుఁడు మొగమోటము నొందెను.

అంతలో నతని తల్లి వచ్చి భట్టును జూచి యతని యవ్యాజానుగ్రహమున కచ్చెరు వొంది, 'తండ్రీ నీవు వేయిళ్లు మొదలుగా వర్ధిల్లవలయును. నా పాలిటి శ్రీమన్నారాయణమూర్తివి. నీ యపార వాత్సల్యముచే నా బిడ్డఁడు నాకు దక్కినాఁడు. నీ వంటివారు కోట్లలో నొక్క రుండు టరుదు" అని భట్టును బ్రస్తుతించుచుండ బాలుఁ 'డమ్మా! ఇటుచూడుము. ఈ మహాత్ములు నీ కిమ్మని యీ పది రూపాయలు నిచ్చినారు' అని తల్లి చేతిలో నుంచెను. ఆమె కన్నులనుండి గ్బున నీరు దిరిగెను. 'తండ్రీ! ని న్నేమని పిలువ వలయునో తోఁచకున్నది! నా బాలుని ప్రాణములు నిలిపితివి. చాలదా? ఇది గూడ నెందులకు?' అని పల్కెను. 'అమ్మా! నా మిత్రుఁడు మీ కిమ్మని యిచ్చినాఁడు. అతఁ డుదారుఁడు; శ్రీమంతుని బిడ్డఁడు. తప్పులేదు. తల్లీ! అబ్బాయికిఁ గావలసినవి గొనిపెట్టుము. మే మీ గ్రామము విడిచి వెళ్లునపుడింకేమైన నా చెలికాఁ డిచ్చెద నన్నాఁడు. కష్టములు కాపుర ముండునా తల్లీ! వెఱ్ఱిదానవు. మనుష్యులు మనుష్యులకుఁ దోడు పడకున్న మృగములా తోడుపడును? నిన్ననంతయు మీ రిద్దఱును శుష్కోపవాసము చేసియున్నారు. వేగముగా వండుకొని భుజింపుఁడు. చల్ల ప్రొద్దువేళ నేను మరల వచ్చెదను, అని

వచించి భట్టామె యనుచున్న కృతజ్ఞతా లాపము లాలింప కయే బస కేగెను.

శ్రాద్ధము చల్లపడిన పిదప రామచంద్రభట్టు మరల నవ్వగారింటికి వచ్చెను. బాలుఁడు సేదదేరి నట్టింటఁ జాపమీఁదఁ దల్లిప్రక్కను గూర్చుండి యేమియో చెప్పుచుండెను. తలుపోర వాకిలిగా మూసి యుండుటచే, 'అవ్వగారూ!' అని భట్టు పిలిచెను. అవ్వ, తలుపు బారుగాఁ దెఱచి, 'నాయనా లోపలికి రా! ఎండ గాలి తగులునని తలుపు చేరవేసినాను' అని పిలువ, భట్టు వచ్చి బాలుని ప్రక్క నాసీనుఁ డయ్యెను. అవ్వ, యించుక దూరముగా వారిరువురికి నెదురుగఁ గూర్చుండి, 'తండ్రీ! మన దేయూరు? నీ పేరేమి? మీ రెక్కడి నుండి యెక్కడికిఁ బోవుచు నా పాలి రామచంద్ర మూర్తులయి యిక్కడకు వచ్చితిరి?' అని యతనిం బ్రశ్నించెను. భట్టు తన చరిత్రము గొంత కొంత యెఱిఁగించి, యవ్వ కుటుంబమును గూర్చి యడిగెను. పొంగి పొరలివచ్చిన దుఃఖముఁ నాఁపుకొని కన్నులు దుడిచికొని యవ్వ యిట్లు వచించెను.

"నా దుఃఖ చరిత్ర యంత దీర్ఘ మయినది కాదు. తండ్రీ! నా పుట్టింటివారు బ్రతికి చెడిన వారగుటచే న న్నొక సాధారణ సంసారి కిచ్చిరి. ఆయన గుణవంతుఁడు నతి సాధువు. చిన్నతనమున సంస్కృతము చదివిరి, గాని యది రాలేదు. సంసార భారము పైని బడుటయు, నే విద్యా విశేషము లేకుండుటయుఁ గారణముగా, వారు వంట వృత్తిచేసి మిమ్ముఁ బోషించు చుండిరి. నా కైదాలువురు

పిల్లలు పుట్టి చిన్న తనముననే చనిపోయిరి. తుదకు నాకీ తండ్రి జన్మించి మా యానందమున కాధార మయ్యెను. మా కైశ్వర్యము లేకున్నను ప్రాణపదమైన యీ చిన్నవాఁడే సమస్తైశ్వర్యములు ననుకొని, తృప్తిగాఁ గాలక్షేపము సేయుచుండెడి వారము. అక్కడక్కడ శ్రీమంతులయిండ్లలో శుభశోభనములలోఁ బనిపాటులు సేసియు, మాఘాది పంచకమునఁ బెండ్లిండ్లలో వంటవార్పులు సేసియు నాలుగు డబ్బులు సంపాదించుకొని బ్రతుకుటే కాని, యొకరికిఁ దల నమ్ముకొని వా రుండెడివారు గారు."

"తరువాతఁ గొన్నాళ్లకీ యూరికిఁ బీఠముతో నొక యతీంద్రుఁడు విచ్చేసెను. అతఁడు మాధ్వస్వాములవారు; మంచి వాఁడు. ఆయనయు మా యబ్బాయి తండ్రియు సహాధ్యాయులై చిన్నప్పుడు శృంగేరిలోఁ జదువు కొన్నారఁట. వారికి వీరికిని ప్రాణస్నేహ మఁట. చిన్నతనమున నెడఁబాసిన మిత్రులు మరల నీ యూరిలోఁ గలిసికొనిరి. మా యాయన నా యతీంద్రుఁ డెంతో యాదరించి, యీ యూరి నుండి వెళ్లిపోవు నప్పుడు తన వెంటఁ దీసికొని పోయెను. పదంపడి మీ తాతగారు, నెల కొకసారి వచ్చి మా యొద్ద నాలు గైదు రోజు లుండి పది యిరువది యిచ్చి వెళ్లుచుండెడివారు. ఇవ్విధంబుననే డెనిమిది వత్సరము లా యతీంద్రుని సన్నిధి నుండి, మమ్ముఁ జూడఁ గోరి కడసారి యిక్కడికి వచ్చు దారిలోనే జ్వరమువచ్చి యిల్లుచేరిన నాలగవ నాఁడే..." అని యవ్వ యేడ్చుచుఁ బిమ్మట మఱి చెప్పఁ జాలక పోయెను. భట్టామె నతి ప్రయత్నమున నోదార్చెను.

కనికారమున నతని హృదయము కరఁగి కన్నులశ్రుపూ
తము లయినను నొకమూల చిన్న యాశాంకుర మొకటి
మొలకెత్తియతనిం దత్కథా శ్రవణ కుతూహలునిఁ జేసెను.
ఊరడిలి యవ్వ చెప్పసాగెను.

"నా తండ్రీ! మఱే మున్నది? నా కీ దగ్ధ దశ పట్టినది.
పిల్లవాఁడు దిక్కుమాలినాడు. చీము నెత్తురుగాఁ గూర్చిన
డబ్బునేగాణియు వారి దిన వారములకు మాసికములకు
నయిపోయినది. కుఱ్ఱవాఁ డైదవ కావ్యము చదువు
చున్నాఁడు, వడుగు మాత్రమే చేయఁ గలిగితిని. జీవనమే
కష్టముగా నుండ వానికి మాఱుపోచ యెట్లు వేయఁగలను
బాబూ! నే నీవలకు రా రాని దినము లయినను బిల్లవాని
నుంఛ వృత్తికిఁ బంపలేక, నేనే బిచ్చమెత్తి తెచ్చి చిన్న
వాని నట్లో సాకుచున్నాను. తండ్రీ! కంచములోఁ జలిది
యన్నము పెట్టి, 'నాయనా, ఒడలు కడుగుకొని వచ్చి
యన్నము దిని చదువుకోరా' యని చెప్పి యుంఛ వృత్తికి
నిన్నఁబోతిని. బాలుఁడు గోనేటి కేగినాఁడు. మిగత సంగతి
నీకుఁ దెలిసినదే. చక్రరక్షకుఁడవై నా యిల్లు నిలఁబెట్టి
నావు తండ్రీ! నే బ్రతికి యున్నంత కాలము నీ యుపకారము
మఱవను. దీపము పెట్టి, నీవు సేమముగా నుండవలె నని దేవు
నికి మ్రొక్కుచుందును" అని యవ్వ ముగించెను. భట్టాలో
చించి, 'అమ్మా! మా తాతగారి సహాధ్యాయి యంటివే
యా యతి యే పీఠాధిపతి?' అని యడుగ, 'నాయనా!
బదరీ నారాయణ పీఠాధిపతి' అని యవ్వ యనెను. 'అమ్మా!
ఆయన బాల్యముననే సన్యసించెను గదా!' అని భట్టన

నౌనని యామె పలికెను. 'పెండ్లాడిన పిదప సన్యసించెను గాఁబోలు'నని భట్టనఁగ నౌనని యవ్వ వచించెను. 'సరే, తల్లీ! ఆయన భార్య యున్నదా?' అని భట్టు ప్రశ్నింప నవ్వ చకితయై లేదని బదులు చెప్పెను. 'ఒక బాలికం గాంచి చనిపోయెను గాఁబోలు నవ్వా!' అని యతఁ డడుగ నామె విహ్వలయయి, 'తండ్రీ! అంతయు నీకుఁ దెలిసినట్టు లున్నది' అనెను. 'ఔను. అయినను స్పష్ట మయిన తచ్చరిత్రమును నీ నోట వినఁగోరు చున్నాను' అని భట్టు నుడువ, 'మహాత్మా! దానివలన నీ కగు ప్రయోజన మేమి?' అని యామె పల్కెను. 'కావలసినంత ప్రయోజన మున్నది. తరువాత నంతయు విశద పఱిచెదను' అని భట్టు నొడువ 'బాబూ! వాసూ! శాస్త్రులవారి దగ్గఱ కొకసారి వెళ్లిరా' అని యా యవ్వ తన కుమారుని గురువుగారి యింటికిఁ బంపి, "తండ్రీ! ప్రాణదాతకు నీ కెఱిఁగింపరాని దేదియుఁ గలుగదు; కాని, యది యొక మహాపురుషుని రహస్యోదంతము. ఆయన యింక జీవించియున్నాఁడు. అది వెల్లడి సేయ నని నీవు వాగ్దత్తము చేసినచో నొక యద్భుత చరిత్ర నాపతివలన విన్నది, నా హృదయ కుహరమున నింతదాఁకఁ బాఁతువడి యున్నది నీ కిప్పుడు తెల్పెదను. మీ తాతగా రెవ్వరికిని జెప్ప వలదని గట్టి కట్టడ చేసి యుండిరి" అని యవ్వ పలుక నా మాట విని రామచంద్ర భట్టు వికసిత వదనుండై "యవ్వా! ఆయన గౌరవమున కే విధమునను భంగము రానీను. సరిక దా! నే నుపకారము చేయుదును. నీ వే విషయమును మఱుఁగు పఱుపక యున్నదున్నట్లు వాక్రువ్వ వల

యును" అని భట్టు వచింప న య్యవ్వ యొక వింత చరిత్రము నెఱింగింపఁ బూనుకొనెను.

"తండ్రీ! ఆ స్వాములవారికిఁ జిఱుత తనమ్మున వారి తండ్రి నాలుగేండ్ల పిల్లను మేనమామ కుమార్తెను బరిణయము చేసెను. తరువాత నాతఁడు శ్రీ వారణాసీ క్షేత్రమున కరిగి యచ్చట నిరువదేఁడులు వసించి యచ్చట సకల శాస్త్రము లభ్యసించి, వేదాంత శాస్త్రమునం దసమాన ప్రజ్ఞ గలిగి విరాగియై సన్యసించి బదరీ నారాయణము మున్నగు ప్రాంతములఁ దిరిగి పీఠాధిపతియై యిరువదియైదేండ్లకు దేశమున కేతెంచెను. అప్పటికి వారికి నలువదియైదేండ్లు వయస్సు. ఆయన స్ఫురద్రూపి. అప్పటి కాయన పత్ని వ్యక్తురాలగుటయు నామె జననీ జనకులు పోయి, నాయను వారు లేక తన మర్యాద గాపాడుకొనుచు నొక శ్రీమంతునింట వంటలక్కయై యుండెను. ఇట్టు లుండ నా స్వాములవారు పీఠముతోఁగూడ మైసూరు, బెంగళూరు మున్నగు ప్రాంతముల సంచారము చేసి దైవ వశమునఁ దన భార్య వంటలక్కగానున్న యూరు వచ్చి యా శ్రీమంతు నింట భిక్షకై యురుదెంచిరి. తన భర్త సన్యసించి పీఠాధిపతియై సంచరించు చున్నట్లు వినియున్న యా సాధ్వి, యాతనిం గాంచి, యాతఁడే యీతఁడేమో యని యనుమానించెను. అతఁడు మాత్ర మామెను బోల్పలేదఁట. ఆ సతి, వండి వడ్డించుటయుఁ దత్పతి భుజించుటయు జరిగెను. ఒక నాఁటి రేయి యా సాధ్వీతిలక మా యతీంద్రుని సన్నిధి కేగి పాదసేవ చేసెనఁట. అప్పు డాయన కామె యందుఁ

గనికరము గలిగి యామె పుట్టు పూర్వోత్తరముల నడిగె నఁట. ఆ సతి సర్వము వినిపించిన పిదప వల వల నేడువఁ ద త్పతియు హృదయము నీ రయి కంటఁ దడిపెట్టి పరవశుఁడై యథార్థము నెఱిఁగించెనఁట.

వా రిరువురి కన్యోన్యాను రాగము గలిగి కొన్నాళ్లు గుప్తముగా నుండెను. తాను మఱుఁడ గృహస్థాశ్రమము స్వీకరించినఁ బరిహాస్పదుఁడ నగుదు నని యామెకు బోధించి తా నా గ్రామము విడిచి వెళ్లిన పిదప, నాపె నా వృత్తి విడిచి బెంగళూరు వచ్చి తన్నుఁ గలిసి కొమ్మని చెప్పి యతీంద్రుఁ డా యూరు విడిచెను. అతఁడా కాంతామణికి బెంగళూరిలో నొక యి ల్లేర్పాటు చేయించెను. ఆమె, యందుఁ గాపుర ముండెను. స్వాములవారును బెంగళూరున కేతెంచిరి. భార్య, భర్త ననుదినము సేవించుచు నంతర్వత్ని యయ్యెను. ఆ యుదంత మా యభాగ్యరాలు భర్తకు నివేదించెను. అతఁడు కలవరపడి కర్తవ్య మెఱుంగక పరమ మిత్రుఁడైన నా పతితోడఁ దదుదంతము సెలవిచ్చి సాయ మపేక్షించెను. నా భర్త దయాళువు, సాధు పురుషుఁడు, ప్రాజ్ఞుఁడు నగుటచేఁ ద ద్రహస్యము గుప్తపఱిచి, నాలుగు మాసము లయిన పిదప నామెను దోడ్కొని వచ్చి హిందు పురమున నొక యింట నుంచి నాతో సర్వము నెఱిఁగించి యామెకు సంరక్షణము సేయ నియోగించెను. మే మా యూర మూఁడు మాసము లుంటిమి. అచ్చటి పరిస్థితులు విపరీతము లగుటచేతను, ద ద్విచారమున నా దీనురాలు కృశించి శల్యావశిష్ట యయి యుండుట చేతను, దగిన

తోడ్పాటా యూర లభింపక పోవుటచేతను, నే డింగ్ల షిల్లి కూనగా నా యంతర్వాత్ని నూరూరఁ బనె పది దినము లుంచుమఁ ద్రిప్పసాగితిమి. తుద కామెకుఁ బ్రసవ దినములు సమీపించుటచే మరల బెంగళూరికిఁ దీసికొని పోవలయు నని బండిలో బయలు దేఱితిమి. అప్పటికి స్వాములవా రా యూరనే యుండిరి.

అది యాశ్వీజమాసము. నాఁడు విజయదశమి. ఆ రాత్రికి బెంగళూరు చేరవలయు నని మే మొక పల్లెనుండి బయలుదేఱి బండిమీఁదఁ బ్రయాణము సేయుచుంటిమి. ఇంక బెంగళూరు రెండు మైళ్లుండు ననఁగాఁ ద్రోవలో మమ్ము వర్ష మెదురుకొనెను. నాయనా యది వర్షముగాదు. అట్టి వాన నే నెన్నఁడు నెఱుఁగను. మింటికి మంటికి నేక ధారగా మిన్నువిసి వాన కురిసి భూమండలమంతయు జలాకీర్ణమయ్యె నని తోఁచినది. పాపము! ఆ దీనురాలు వడవడ వడంకి పోవుచుండెను. అదు గామడగా బండి బెంగళూరిని సమీపించెను. అప్పుడు రాత్రి పది పదునొకండు గంట లయి యుండును. త్రోవ తప్పి మా బండి యొక తోఁటలోనికిఁ బోయెను. అక్కడ నొక చక్కని రామమందిరము గలదు. నేను నా భర్తయు మెల్లగా నామెను బండి దింపి యా మందిరమునఁ బ్రవేశింపఁ జేసితిమి. తరువాత నొక ముహూర్త కాలమున కా యింతికి నొప్పులు గలిగెను. మఱి రెండు గడియల కామె కొక యాఁడుబిడ్డ పుట్టెను. ఎట్లో పురిటి పనులు నెరవేర్చినాను. ఇంతలో నా ప్రసవిత్రికి జన్ని గలిగి యొక్కసారి తన బిడ్డ నక్కునఁ గదియించుకొని మా

చేతులలో నా నిసువు నిడి, పాలింపు(డని చెప్పి యసువులు విడిచెను. ఏమి చేయుటకును దో(చక మీా తాతగారు స్వాములవారి సన్నిధి కరిగిరి. నేను నా కొమారునిని, బురిటి బిడ్డను దడిగుడ్డలలోనే పండుకొన(బెట్టి కొంత తడవు శవ జాగరణము చేసితిని. బాబూ! ఆ రాత్రి యా దీనురాలికై నే నేడ్చిన యేడుపు గంగా గోదావరులును బట్టవు. అట్టి సద్గుణ రాశిని, చక్కని చుక్కను సతీరత్నమును మఱి చూడము."

"నాలుగైదు గడియలలో నా భర్త తిరిగి వచ్చెను. మురిమురి చీ(కటి యుండు నంతకు మే మక్కడినుండి యా బండిమీా(ద నా శవము వేసికొని వర్షము వెలుచుటచే నింతుక దారి దెలియుచుండుటచే( ద న్నగర పరిసరమున నున్న యొక శూద్ర గ్రామము( జేరి యా యూరి వారి సాయమున నా దీనురాలి కగ్ని సంస్కారము చేసితిమి."

భట్టు:- కన్నీళ్లు తుడుచుకొని, యవ్వా! ఆ బిడ్డను గూర్చి యేమి యేర్పాటు గావించితిరి?

అవ్వ:- అన్నట్టు మఱచితిని దండ్రీ! స్వాములవా రొక తాటియాకు ముక్కపై నేమో వ్రాసి యిచ్చి యది యా పురిటిబిడ్డ మెడలో( గట్టి యా మందిరమున నుంచుమని సెలవిచ్చిరట. మే మా ప్రకారము చేసితిమి. మే మా కన్యను బెంచుకొనవలయు ననుకొంటిమి గాని స్వాములవా రందుల కంగీకరింప రైరట.

భట్టు:- అవ్వా! తరువాతి వృత్తాంతము నే నెఱు(గుదును. నీ ఋణము నే నెన్న(టికిని దీర్చుకోలేను. నే నా కన్యను

పెండ్లాడఁ దలంచితిని. నా యనుమానము తీరి పోయి నది. ఆ స్వాములవారు నీ పతి చేసిన యుపకృతికి నతఁడు పోయినపిదప మి మ్మిట్టు లుదాసీన బుద్ధితోఁ జూడరాదు. అయిన దేదో యయినది. సర్వేశ్వరు ననుగ్రహ మున్నచో నీకును నీ తనయునకును నన్నోదకములకు లోపము లేకుండఁ జూడఁగలను. మేము రే పీ గ్రామము వీడి ధర్మవరమునకుఁ బోవుదుము. నే నుత్తరము వ్రాయునప్పుడు కుమారుం దోడ్కొని నీవు నా కడకు రా వలయును.

అనిచెప్పి భట్టు బసకేగి యిరువది రూకలు దెచ్చి యా యవ్వ కిచ్చెను. మఱునాఁడు భట్టు శ్యామసుందరాదులఁ దోడ్కొని ధర్మవరమున కేగెను. దుర్గాప్రసాదు నచ్చటి నుండి బెంగళూరికిఁ బంపెను.

## 17

### దొంగల మఱ్ఱి

సాయంత్రము నాలుగు గడియల ప్రొద్దున్నది. వేఁడి గాలి చల్లఁబడెను. అక్కడక్కడ మబ్బు లల్లుకొను చుండెను. బెంగళూరిదారి నొక బండి వే వేగముగాఁ బరు గెత్తుకొని వచ్చుచుండెను. జవ సత్వంబులలోప మెఱుంగని యా బండి యెద్దులు తల లాడించుకొని టపా పరుగు పరు గెత్తు చుండెను. ఆజాను బాహు వగు నొక నాయఁడు తన పొడుగునకు సరియగు పెదుఱు దుడ్డు బుజమున వైచి జాగర

వేసి యా బండి వెనుక నడచుచుండెను. ముఖ లక్షణము లాతని కీతఁడు తమ్ముఁడని చెప్పక చెప్పుచున్న మఱి యొక నాయఁడు బండి మొగరుమీఁద కూర్చుండి కేకలుపెట్టుచు నెడ్లనదరు చుండెను. బండిలో దుర్గాంబ కూర్చుండి యుండెను. తోఁట కాపరి యయిన రామయ్యయు నతని తమ్ముఁడు భీమయ్యయు దుర్గాంబ దుస్థితిని గుర్తించి యామె యాపద కడ్డపడఁ దలంచి, మాధవరావు బారినుండి తప్పించి యతి త్వరతగతి నతి జాగరూకు లయి తోడుకొని వచ్చుచుండిరి. వా రట్లు మూఁడు మకాములు గడచిరి. నాఁటి రాత్రి కెట్లు లయిన బెంగళూరిఁ జేరుకొన వలయు నను నుద్దేశముతో వా రా బండి నంత వేగముగాఁ దోలుకొని వచ్చుచుండిరి. మాధవరావు పసి పట్టి వచ్చునేమో యని వారు బెంగపడుచుండిరి; గాని మఱునాఁ డా సంగతి విని మాధవరావు పోనిమ్మని యూర కున్నాఁడను సంగతి యెఱుఁగరు.

వా రెంత వేగిర పడుచున్నను ప్రకృతి వారికిఁ దోడుసూప దయ్యె. దైవ సంకల్పము వేఱుగా నుండెను. ఉన్నట్టులుండి మేఘములు నలు తట్టుల నుండి యల్లుకొని యాకస మంతయు నావరించెను. దానికిఁ దోడు గాలి చెలరేగెను. ఎదురుగాలి దుమ్మెత్తి పోయుచుండ నెద్దులు గన్నులు దెఱవఁ జాలకుండినను నోపినంత యడుగు వేయుచునే యుండెను. ముందు వెనుకల నొక క్రోసు దూరములో నే యూరును లేదు. నడచుచున్న చోటు నట్టడవి. నాటు త్రోవ. గాలితోఁ గలిసి పడ పడ మని పెద్ద పెద్ద చినుకులతో

వాన పడ నారంభించెను. ఎదురుగాలి, యెదురు జల్లు. నిమిషములో భీమయ్య తడిసిపోయెను. తలలు వంచి ప్రకృతితోఁ బోరాడ డీకొనునట్టు లా వృషభము లింక నడుగు వేయుచునే యుండెను. బండి ముందున కతి కష్టముగాఁ బోవుచుండెను. వెనుక నడచుచున్న రామయ్య పూర్తిగఁ దడిసిపోయెను. బండిలో నున్న దుర్గాంబయుఁ దడిసిపోయెను. అంత కంతకుఁ బంతము వేసినట్లు వర్షము జోరునఁ గురియసాగెను. తళుక్కు తళుక్కుమని మాటి మాటికిని కన్నులు మిఱుమిట్లు గొలుపుచు మెఱపులు మెఱయుచుండెను. బ్రహ్మాండ భాండము బ్రద్దలు సేయుచున్నట్టు లతి భీషణ ఘోషణంబుల నుఱుము లుఱుముచుండె. ఇంచుక ప్రొద్దున్నను జగ మంధకార బంధుర మయ్యెను. నాయెడ్లు నాయెద్లును మంచినడి వయసున నుండుటచేత నెట్టులో పట్టు పట్టుమని బండి నట్టడవి నరుగుచుండెను. ఇంకను వర్ష మధిక మయ్యెను. దప్పిగొని యున్న వసుంధర ద్రావి నంత ద్రావగా మిగిలినవర్షోదకము వెల్లివిరిసి కలకల ధ్వనులతోఁ బ్రవహింపఁ జొచ్చెను. రెండు మూఁడు గడియ లవ్విధంబునఁ బయనము సేసియు శకట మొక యరక్రోసైనను బోలేక పోయెను. 'ఏలాగునసైన రాత్రికి బెంగళూరు చేరుకోవలెను; లేదా యేదైనఁ బల్లె చేరుకొని తలఁ దాఁచుకో వలెను' అని సర్వథా ప్రయత్నించియు మన బాటసారులు కృతార్థులు గాలేక పోయిరి. దైవము తోడుసూపని నాఁడు మన ప్రయత్న మేమి ఫలించును? ఎంతకైన వాన తగ్గునని వారాశించుచుండిరి; కాని, యా యాశ యడి యాశ యయ్యెను.

వర్షము మించి ముంచుకొని వచ్చుచుండెను. గాలియు దానికిఁ దోడై ప్రతాపము చూపసాగెను. ఎంత జవసత్వ ములు గలిగినను జీవి పరమాణువులు మహాభూతద్వయ ముతోఁ బెనంగి జయింపఁ గలుగునా? ఏటి కెదురీఁద నేది గలదు? అలసి కాలూనక యటునట నావృషభ ద్వయము నిలిచి పోవుచుండెను. అప్పటికి వా రొక పెద్ద చెట్లగుంపు లోనికి వచ్చిరి. చిమ్మచీఁకటి వారి దృష్టిలేశము నపహరించెను. మట్ట మధ్యాహ్నమం దైనను జండకరుని కర సహస్రంబు చొరఁ జొరనీయని యా కాఱడవిని మన బాటసారులు చిక్కుపడిరి. ఎటు వోయిన నేమియో వారి కెఱుక పడదయ్యె. అప్పటునఁ బ్రకృతి పెట్టుచున్న బాధ కగ్గము గాక, యా దృశ్యమును జూడఁ గల్గినను, దానిని వర్ణింప వినఁగల్గినను, రచియింపఁ జనువఁగలిగినను వింతగా, వినోదముగా నుండును గాని, యది యనుభవించు చున్నప్పుడు డెంద మెట్టివారికి నెంత బేజా రగునో యూహింప నలవి గాదు.

అట్టు లేగి యేగి యా నట్టడవి లోక జడల మఱ్ఱిక్రింద నిలిచి పోయినవి. భీమయ్య బండి దిగెను. దుర్గాంబను బండి దిగ వలదని చెప్పి యా సోదరులెడ్లను విప్పి మఱ్ఱి మొదటఁ గట్టిరి; బండి పూజు నూడలకుఁ గట్టిరి; కర్తవ్య మే మని యోచింప సాగిరి. వర్ష మొక్కింత తగ్గినది; కాని, జలధరము లటు నిటు నంబర తలమునఁ బచారు సేయుచునే యుండెను. శంపా లతలు నృత్యము సేయుచు నంతర్ధాన మగుచునే యుండెను. [illegible]

చునే యుండెను. అంతలో నల్లుకొని పెల్లుగా నొక జల్లు వచ్చి కొట్టించి దట్టదీరి పుట్టి మునిఁగినట్లు తెడ తెఱపి యీయక యొక గంటలో నిరువది మడిగట్లు వర్షము కురిసి య య్యడవి నంతయు జలాకీర్ణముగాఁ జేసి వేసెను.

అంతట వాన యుడిగెను. వృక్షయాకులనుండి పదు పెద్ద చినుకులతోపాటు వృక్ష పఁడ్లను బడుచుండెను. రెండు గడియలలో నాకసమున నింత తెఱపి యిచ్చెను. వృక్ష కోటరములు నీటితో నిండుటయు, శాఖాగ్రంబులు విఱుగుటయు, గూళ్లు కూలిపడుటయుఁ గారణముగా న త్తరు నివాసము లగు పతత్రి ప్రతతి జాలి గొలుపునట్లు గూయసాగెను. ఘాతుక మృగము లెర గానక కడుపు చిచ్చున కోర్వలేక దిక్కు లవియు నట్లు బొబ్బరింపఁ జొచ్చెను. కర్ణ కఠోర ముగాఁ గప్పల బెకబెక లారంభ మయ్యెను. నీచ మృగ ముల కీచు కూఁతలు బయలుదేఱెను. పట్టపగలు ఖద్యోత కాంతి కింతేనిచోటీయని యీ సాంద్రారణ్యభూమి యంధకార బంధుర మయిన యీ రాత్రి, ఖద్యోత సహస్ర కాంతికిం జోటిచ్చెను. ఉదయ మీవేళ కట్టుడుకు నట్లుడుక నారంభించిన యీనాఁడు, రాత్రి యీ సమయమునకే జలాకీర్ణమై పాంథుల వడ వడ వడంకఁ జేసెను. అప్పటికి రాత్రి పది పదునొకండు గడియ లయి యుండును, ప్రకృతి చిత్రమైనది! ఎంతలో నెంత మార్పో!

రామయ్య భీమయ్యలు, తడిసిన బట్టలు పిడుచుకొని యొడళ్లు, తలలు దుడుచుకొని బండి కడకు వచ్చి, దుర్గాంబ నుద్దేశించి, 'అమ్మా! రాత్రి చాల మీఁజినది. మబ్బు లింక

వల్లుకొనుచుఁ దెలిపి యీాయకున్నవి. ఈ యడవిఁ జూచిన గుండె లవిసిపోవు చున్నవి. ఇక్కడ నిలుచుటకుఁ గాని, బయలు దేఱుటకుఁ గాని ధైర్యము సాల కున్నది. దారి తెలియరా కున్నది. ఈ నట్టి రాతిరి మఱి నడవనోప వని తోఁచుచున్నది. ఇది కాఱడవి. ఏ ఘాతుకమృగ మేమి సేయునో యని భీతిగా నున్నది. పోవుద మన్న నే దెసనుండి వచ్చితిమో యే దెసకుఁ బోవలయునో తెలియ కున్నది. తల్లీ! నీ యుద్దేశ మేమి?' అని యడిగిరి.

"రామయ్యా! మన మిక్కడ నొక్క నిమిష మయి నను నిలువరా దని నా తలంపు. ఈ గాలివాన నా కొక దుఃఖోదంతమును జ్ఞాపకము సేయుటచే నింత దాఁక నే నొడలు తెలియకుంటిని. వాన నిలిచిపోయినది. మెఱుము లుఱుములు తగ్గిపోయినవి. గాలి వడి విడిచినది. మబ్బులు గూడఁ జెదరిపోయినవి. దృష్టి కన్నియు గోచరించుచున్నవి. కావున నెంత రాత్రికైన నేదైన జనావాసముం జేరుకొం దము. పశువులు మనము నించుక విశ్రాంతి నొందవచ్చును" అని దుర్గాంబ పలుక సరియే యని యా యిరువు రన్న దమ్ము లెద్దులం దెచ్చి పూన్చి, ముం దొకఁడును వెనుక నొకఁడును నడచుచుఁ దాపిగా నెమ్మదిగా జాగ్రత్తగా బండి నడిపించుకొని పోసాగిరి.

అతి కష్టముగా బండి యరక్రోసు దూర మేగెను. అది యొక గుట్ట ప్రక్కను నడచుచుండెను. ఇంతలో వెనుకనడచు రామయ్య తలపై నెవ్వరో యొక్కమోఁదు మోఁదిరి. 'చచ్చితి నోయి బాబూ!' అని యఱచుచు నతఁడా

దెబ్బతో వివశుఁడై నేలఁ గూలెను. ఆ యఱపును విని శివయ్య యులికిపడి బండి నిలిపి, 'అన్నా! ఏమి యేమి?' అని యత్యాతురుఁడై యడిగెను. వాని నోటిమాట నోట నుండఁగానే రెండు దుడ్డుకఱ్ఱలు వాని తలపైఁ బడుటయు, వాఁడు నేల బడుటయు నెప్పపాటు కాలములో జరిగెను. బండిలో నున్న దుర్గాంబ యవస్థ చెప్ప నలవి గాదు. ఆమెకు మతి పోయి, 'చచ్చిపోతిమి, చచ్చిపోతిమి, రండు, రండో' యని బిగ్గరగా నాక్రందనము సేయ సాగెను. పెను రాకాసులం బోని యిరువురు హంతకులు బండి నిలువం బెట్టిరి. మఱి యిరువు రఱచుచున్న దుర్గాంబను బండినుండి బలవంతముగా ఁడిచ్చివేసిరి; మఱి యిద్దఱు కలిసి యామెనోట గుడ్డలు గ్రుక్కిరి. అందఱు నేకమై యా యడవి దారిం బట్టి యామెను గొంపోయిరి.

అంతలో నెవరో మార్గస్థులు వెనుకనుండి, దుర్గాంబ గావించిన యార్తనాదమును విని, "వచ్చుచున్నాము; ఇరువది మందిమి వచ్చుచున్నాము. భయము లేదు. భయములే" దని పెద్ద కేకలు పెట్టుచు జఱుబురదిలోఁ బడుచు లేచుచుఁ బది నిమిషముల కచ్చటికి వచ్చి చేరిరి. కార్యము మించి పోయినది. వారు విన్నది స్త్రీ యాక్రందనము. ఆమె బండిలో లేదు. ముం దొకఁడును వెనుక నొకఁడును దలలు పగిలి నిశ్చేష్టితులయి నేలఁ బడియుండిరి. మఱి చేయునది లేక యా బండిలో నా యిద్దఱం బరుండఁజేసి యా బాటసారులు బెంగళూరు దీసికొని పోయిరి.

# 18

## సీత యలజడి

“ఏమి చెప్పుమా! ఆయన మఱి రాలేదు? ఒక వారమయినదే! ఇంత కాల మీ యూర నుండియే మా యింటికి రారైరా? అది యసంభవము. ఊరు విడిచి పోయినచో నిక్కడికి రాక, మాతోఁ దెలుపక యేల వెళ్లిపోవుదురు? ఆయన కేదే నాపద వచ్చియుండునా? జ్వరము వచ్చెనా? తలవని తలంపుగాఁ బయనము తటస్థించెనా? ఆ బస యింటికడ నేరును లేరని దాసి చెప్పుచున్నదే! బస మార్చిరా? మాకేకతంబునఁ దెలుపరైరి? ఏమో యిదంతయు నా కగమ్య గోచరముగా నున్నది. పెద్ద దాసియు నమ్మయు నేమో గుసగుస లాడుచున్నారు. ఎన్నిసారు లడిగిన నా ముసలి ముండ చెప్పకున్నది. మన స్సేమో చేయి పెట్టి కలంచినట్లు కొండల మొందుచున్నది. హా పరమేశ్వరా! ఈ దిక్కుమాలిన బిడ్డపై నీ కింకను గనికరము గలుగకున్నదా! నా మనోహరు నేమి సేసితివి?”

“ఆహా! నిడుదలయిన యా చేతులు, వెడఁదయయిన యా యురము! తేఁటి తెక్కలం బోని యా కుంతలములు! నీటైన యా మీసము! విశాలమగు నా ఫాలము, కుటిలములగు ముంగురులు, చిఱునవ్వు లీను సుందర వదనారవిందము, అనురాగ పూరితములగు నా చూపులు, శ్రావ్యములగు నమ్మహామహుని పలుకులు నన్నాసాసలం

బెట్టినవి. నా ప్రాణదాన విశేషము నెట్లు మఱతును? నాకీ యిల్లేల? యీ సొమ్ములేల? ఈ సౌఖ్యమేల? అతనికిం గ యీ సొగ సేల? మఱునాఁడే మగుడ నాతని దర్శనము లభించు నని యువ్విళ్లూరుచు శృంగారించుకొని యెదురు సూచుచుఁ గూరుచున్న నా కెంత యాశాభంగ మైనది! ఆ చండవేళ నరుగుచు నందుదిరిగి యిటు దిరిగి చూచిన యా చూపు నే నెన్నాళ్ళకైన మఱచిపోఁ గలనా?"

"నన్నుఁ జూచి పొంగి పోయెనే! నా యుదంతము విని జాలిగొని కంటఁ దడిపెట్టి పరితపించెనే! నేఁ బాదాభివందన మొనరింప, శీఘ్రముగా నను రూప వరుని జే పట్టుదువు గాక ని యభిప్రాయ గర్భంబుగాఁ బలికి నన్నానంద వార్ధి నోలలాడించెనే! ఒక వారమయిన దన్నము నిమరయు నెఱుఁగను. నా ప్రాణ మాయన నిలిపెను. ఈ శరీర మాయన కటాక్షము చేతనే నిలిచెను. వీని కాయనయే నాథుఁడు. నా తల్లి యేమో యూరడింపు మాటలు చెప్పుచున్నది. అం దేదో విపరీతార్థ మున్నట్లు దోఁచుచున్నది. ఆయన విషయమై మా తల్లి కేదో తెలిసినది. నాతోఁ జెప్పుకున్నది. సిగ్గు విడిచి యడుగలే కున్నాను. దాసిని గూడఁ జెప్ప వల దని కట్టడఁ జేసినట్లు పొడగట్టు చున్నది. ఇ దేదో తంత్రముగా నున్నది. ఇం దేమి రహస్య ముండి యుండును? ఆతని కే మే నాపద రాలేదు గద! అది నేను విన్నచోఁ దగ్గత ప్రాణను గాన జీవింప నని వెఱపొందు చున్నారా? అట్లయిన నా కీ ప్రపంచమే మునిఁగి పోయినది. ఛీ, ఛీ, ఏ మంటిని? పాప ముపశమించును గాక. హా

శ్రీ హరీ! నావంటి దీన జనముల కెందఱికిఁ బ్రాణదానము సేయవలయునో యీ పరోపకారశీలుఁ డాతని కెట్టి యిక్కట్టును రానీయకు."

"ఏ కారణము చేతనో మాతోఁ జెప్పక నా చేతో వల్లభుఁ డీ గ్రామము వీడి వెళ్లెను. బలవత్తర మయిన కారణము లేక యిది యిట్లు జరిగి యుండదు. నా జన్మ రహస్యమును గనుగొన నరిగి యుండునా! అట్లైన మాతోఁ దెలుపక పోనేల? ఒక యూహ కొక యూహ పొందకున్నది. ఏమి సేయుదును? ఎవ్వరి నడుగుదును? అమ్మ నడుగుదునా? చెప్పవలసినచోఁ జెప్పక నా తల్లి దాఁచునది కాదు. నన్నుఁ బ్రాణాధికగాఁ జూచుచుఁ గన్నులలోఁ బెట్టుకొని కాపాడుచున్న నా తల్లి, నా యుద్దేశము నడిగి నన్నతని కిచ్చి పరిణయము సేయఁ దానుగా నిశ్చయించిన దయాశీల, తన సర్వస్వమును నా కొసంగ నున్న ప్రేమ నిధానము, బాల్యమునుండి నన్నల్లారు ముద్దుగాఁ బెంచి, నేలఁ గాలిడ నీక యురచేతులపై నడుగులు వేయించి నడపించుచుఁ బలుదెఱంగుల నన్నోముచు, నా ముద్దు, మురిపెము, నా శ్రేయస్సు, నా సౌఖ్యమునే కోరుచు, దాసియై, తల్లియై దైవమై నన్ను సంరక్షించుచున్న నా జనని, నన్నుఁ బరితాంబుధిం బడవైచి, యేల యీ లీల నాతని విషయమై యుదాసీన భావము వహించెనో యూహింప నలవిగా కున్నది. నేఁ డేమైనను సరే యమ్మ నడుగక మానను; ఇంక నీ వేదనను భరింపలేను; ఈ యనుమాన స్థితి యందుండఁ జాలను. సర్వేశ్వరా! నాకుఁ దోడుపడుము."

"వేశ్యకన్య ననుకొని నన్నతఁడు తృణీకరించెనా? ఆ మాట విని నా తల్లికిఁ గోపము వచ్చెనా? ఎవరే మేని పొరపులు కలిగించి యుందురా? అదేమో నేఁడు కనుఁగొనక మానను" అని సీత తన గదిలో నుయ్యాల మంచము మీఁదఁ గూరుచుండి చెక్కిటఁ జేయిచేర్చి విచారింపఁ దొడఁగెను. హావ భావముల కనుగుణముగ నామె వదనమ్మున నెన్నో మార్పులు గలుగు చుండెను. ఆ మోము నందలి సమ్మోద రేఖ యంతరించెను. కేశపాశము సంస్కార మెఱుంగదు. ఆఁకలి నీరు వట్టులు లేమిం జేసి యామె గ్రాలన్నులు గుంటలు వడెను; చెక్కిళ్లు తళుకు మాసెను; పెదవుల పయిని మందహాసము మందునకైనఁ గానరాదయ్యెను; నిట్టూర్పులచే నధరబింబము బీటలు వాఱెను; వేఁడి కన్నీరు చెక్కులఁ జాలువాఱెను; ఆమె తలదువ్వ లేదు; కనులకుఁ గాటుక పెట్టుకోలేదు; మంచి చీరయు, రవికెయు ధరింపదయ్యె; నుదుటఁ దిలకము దిద్దదయ్యె; వీణఁ దాకదయ్యె; అద్దము చూచుకోదు, చదువదు, పాడదు, ఎవరితోడను మాటలాడదు. పలుకరించినఁ బలుకదు; పలికినను బదులు పలుకదు. పలికినను సందర్భముగా నుండుదు. ఒక వారములో పున నూహింప రానంత మార్పు గలిగెను. పాపము శ్యామల బెంగ పెట్టుకొనెను. ఆమెకుఁ బ్రపంచమే మునిఁగి పోయినట్లుండెను. ఇట్టి స్థితి గలుగునని యామె తలంపలేదు. ఇంక నాలసించినఁ బ్రమాదము తప్పదని నిశ్చయించుకొని, తన తలంపు పిల్లతోఁ జెప్పి ముచ్చటింప వలయునని యామె తదవసరంబున నచ్చోటికేతెంచెను.

"అమ్మా! సీతా! ఏమి చేయుచున్నావు?" అని శ్యామల యడుగుచు వచ్చెను. సీత పలుకలేదు. హృదయము దడదడఁ గొట్టుకొనుచుండ నడుగుదునా మానుదునా? యని యాలోచించి సీతగుండె పదిల పఱుచుకొనెను. మగుడ శ్యామల, "తల్లీ! నీ యీ యవస్థ యేమియు సమంజసముగా లేదు. నీ మనసున నున్న దేమో తెలుప రాదఁటమ్మా! నా దగ్గఱ దాపఱిక మేల? అని పలుకుచు సీత ప్రక్క పఱుపులలోఁ గూర్చుండి, కౌగిలించుకొని కన్నీరు తుడిచి చెక్కులు నిమిరి ముద్దాడి యోదార్చెను. "నా తల్లివిగదే! సీతా! సీత! ఏల యేడ్చెదవు? ఊరకో, నీ కేమి కావలెనో చెప్పుము. నా కంటె నీ కెవ్వ రాప్తులమ్మా వెఱ్ఱిదానవు! నీ వీలాగున నున్ననే బ్రతుకఁ గలనా? ఈ వారములో నీ వెంత మాఱిపోతివో చూచితివా? నీ కేమి కావలెనో చెప్పుము. చెప్పకున్న నా మీఁద నొట్టే" అని యడిగెను. సీత నయనోత్పలములనుండి ముత్తెములవలె బాష్ప బిందువులు జలజల రాలెను; ఒకంతట నోట మాట రాదయ్యె. ఎట్టకేలకుఁ దెలివి చేసికొని, గద్గద స్వరమ్మున సీత 'ఆయన రాలే దేమి?' అని ప్రశ్నించి యూరకుండెను.

శ్యామ:- అమ్మా! ఆయన ధర్మవరము వెళ్ళినారఁట. వత్తురు లెమ్ము.

సీత:- అది కాదు. వెళ్లునప్పుడు మన కెఱిఁగింప లే దేమి?

శ్యామ:- తల్లీ! నీవే యాలోచింపుము. మన మేమి యవమర్యాద చేసితిమా? అతని కేదో లోనుఁ గుందుట చేత దొంగ దాఁటున దాఁటి పోయినాఁడు.

సీత:- లాసుఁగా! దొంగదాఁటా? సరే. నీకుఁ దెలిసిన దేదో దాఁచక చెప్పివేయరాదా? (సీత దుఃఖము నాఁపుకొని కోపము నాస్థిర చిత్త యయ్యెను.)

శ్యామ:- అమ్మా! ఇంతకు వచ్చిన పిదప నింక దాఁచిన కార్య మేమి? చెప్పెద వినుము. రామచంద్రభట్టు జూదరి యఁట. పోకిరి వాఁడఁట. విధి నిషేధములు లేనివాఁడఁట. మన యిల్లు విడిచిన యీ రేయియే రాజరత్నము దరి కేగి తప్పఁ ద్రావి, యమాయకుఁడగు నొక ప్రభు కుమారుని ధన మంతయు నోడిపోయి, యీ రాజపుత్త్రుని బంగారు జలతారు కుళ్లాయి కుదువఁబెట్టి నాఁడఁట. తప్పు ప్రసంగము చేసి వారిచే దెబ్బలు తిని యిలువెడలఁ గొట్టఁబడినాఁడఁట. తాను వనపర్తి జమీందారుఁడ నని యీ యూర బడాయి కొట్టుకొని తిరిగి నాఁడఁట. మైసూరిలో వీని ప్రవర్తన మతి నీచ మయినదఁట. జూదగాండ్రకు గ్రామస్థులకు బాకీలుపడి తీర్పలేక, యొక శ్రీమంతుని తనయునిం దన మాయలలోఁ జిక్కు పఱుచుకొని యీ ప్రాంతములకుఁ దెచ్చి, కొల్లగా నాతని ద్రవ్య మంతయు వెచ్చించి నాఁడఁట. మళయాళము వెళ్ళి మాయలు మంత్రములు, తంత్రములు, నింద్రజాలములు, యక్షిణీ విద్యలు నేర్చుకొని వచ్చినాఁడఁట. వాని దుష్ప్రవర్తనకు రోసి మేనత్త యిలు వెడల నడచెనఁట. పెండ్లి పెడాకులు లేక, యుద్యోగము సద్యోగములేక దురాచార పరాయణుఁడై, దుర్వ్యసనాభిభూతుఁడై యమాయికలగు బాలికలకు మందులు పెట్టియు మంత్రములు

ప్రయోగించియు మోసగించి వశపఱుచు కొనుచున్నాఁడఁట. వానివృత్తియే యిదఁట. తెలిసినదా చిట్టితల్లీ! ఇంకేమి కావలయును? నాఁటిరాత్రి రాజరత్నమునింటఁ జెప్పుదెబ్బలు దిన్నాఁడఁట. అది మనకుఁ దెలియకపోద నియుఁ దెలిసినచోఁ దన కిక్కడఁగూడ నట్టి మర్యాదయే కలుగు ననియు భయపడి యేరికిం దెలుపక యారాతిరే యూడనిం బాడెనఁట. అమ్మా! నా బంగారు తల్లీ! నీవు కలియుగ సీతవు; అమాయికురాలవు. నీ వామంత్రగాని తంత్రములోఁ బడక తేలితివి. నీ మనస్సు మరల్చుకో. నీ సేమము గోరుదానఁగానా? తొలుదొల్త నేను నీ సంగతి నమ్మనైతిని. నేఁటి దాఁక నెంతయో వాకపు చేసినాను. ఇదంతయు యథార్థము. లేకున్నచో నతని యడుగులకు మడుగు లొత్తి పూజించుచున్న మనతోఁ జెప్పక పరారయి పోవుటకు హేతు వేమో నీ వాలోచింపుము. నీవు వట్టి వెఱ్ఱి బాగుల దానవు. నిజము నిడివిమీఁదఁ దెలియును. మేఁక వన్నె పులులు, గోముఖ శార్దూలములు, పయోముఖ విష కుంభములు నెందఱో యిట్టి వా రున్నారు తల్లీ యీ లోకమున! చక్కగా డెందము పదిలపఱుచుకొని యాలోచింపుము. నీ యిష్టమునకు వ్యతిరేకముగా మెలఁగను.

ఆ పలుకులు విని సీత, వల వల నేడ్చి రేఁడ్చి హృదయము కుదురు పఱుచుకొని యిట్లు పలికెను. "అమ్మా! నీ మాటలు నాకుఁ గర్ణశూలము లయినవి. ఇంకఁ జాలింపుము. ఇందలి గుట్టు నా కవగత మైనది. ఇదంతయు బోగపు

లంజె రాజరత్నము పన్నిన పన్నాగము. నీ వీయూరు వచ్చి నప్పటినుండియు నీకును దానికిని బడ దని నీ వెన్నిమాఱులో చెప్పియున్నావు. మనలఁ జూచిన దానికిఁ గడుపు మంట. నీవలెఁ దనకు మంచి పేరు, ప్రతిష్ఠయు రాలేదని దాని కత్యసూయ. నీ కుమార్తె కట్టి వరుఁడు లభించెనని యా మాయల మల్లి వినియుండును. బ్రాహ్మణున కిచ్చి పెండ్లి చేసెదనని యా రంతయుఁ జాటి చాటి తుదకెవ్వఁడును దొరకకపోవుటచేఁ గులవృత్తిలో దింపుకొన్న తన కూఁతురు గతి నాకుఁ బట్టవలయునని దాని యూహ. అది, మాయలు పన్ని భట్టుగారి నింటికి రప్పించి నిషా పదార్థములు చెప్పక తినిపించి, జూదమాడించి యాతని సొత్తొడిచికొని పంపించి యుండును. అది యెందఱినో యట్టు లాడించి యోడించిపంపుట నీవు వినలేదా? నాకిప్పు డంతయుఁ దెలిసిపోయినది. మన యింటి గుట్టు మన ముదిదాసిముండ రాజరత్నమున కెఱిఁగించియుండును. చూపోపమిచే నీ దుస్తంత్ర మంతయు నా ముదివగ్గును, రాజరత్నమును జేరి చేసియుందురు. ఆ ముసలి మొద్దు నీతో నేదో ముచ్చటగా నచ్చుకచ్చు బుచ్చుకచ్చు మాటలు చెప్పుచుండుట విని నే నప్పుడే యనుమానించినాను. నీ వెన్ని చెప్పినను సరే భట్టుగారు నిర్దోషి యని నా యంతరాత్మ చెప్పుచున్నది. ఇదిగో నా యెడమ కన్నదరుచున్నది. అతనికి శుభ మగును. వీరి కుట్రలు గూలును. నీవు వచించిన వొకటి రెండు నిజ మయిన నగుఁ గాక. గోరంతలు గొండంతలు సేయువా రా దండిముండలు. లోపము లేనివారు లోకము లోనే లేరు. గుణము లెక్కువ యున్నప్పు డొండు రెండు

దోషంబులు లెక్కింపరాదు. ఇంతకును నా ప్రాణదాత, నా మనోహరుఁడు, ఆ దయాశాలి, యా పరోపకారపారీణుఁడా సర్వకళా కళానిధి కొక మచ్చయున్నంతమాత్రమున నర్పించిన మనస్సును వెనుద్రిప్పుదునా? నీ మాట కెదురాడుదానఁగాను. నీ వన్నట్లు నిజము నిడివిమీఁదఁ దేలక పోదు. ఆయన పైని వీరిట్లు దుష్ప్రథ వ్యాపింపఁజేయుట కింకేదైన మనకుఁ దెలియని కారణ మున్నదేమో! నీవు మోసపోకుము. ఆయన యెడలఁ గలిగిన భక్తి విశ్వాసము లంతలో నంతరింపఁ జేయరాదు. ఆ పూతచరిత్రుఁడు మనకుఁ గావించిన యుపకృతి నంతలోనే విస్మృతి నొంది కృతఘ్నుల పద్దులలోఁ బడరాదు. నీ వాయనతో నన్ను గుఱించి చేసిన ప్రసంగము పరాకు పడరాదు. ఇపుడు వచ్చిన యుపద్రవ మేమియు లేదు. రాజరత్నముచే నెట్టులో పరాభూతుఁడగుట నిక్కువము. దాన నమ్మహాభాగుఁడు మనకు మొగము చూపించుటకు నోడి, గ్రామాంతరమున కేగి యుండును. అందే నీ వాతని సద్భావమును గమనింప వలసి యున్నది. ఆయన నన్ను మఱవఁ జాలఁడు. దిక్కుమాలి యున్న నన్నతఁడొక యొడ్డునఁ జేర్పక పోఁడు. ఏమో నాచే నా సర్వేశ్వరి, వాణి, యిట్లు పలికించినది. ఇది తప్పదు ముమ్మాటికిని దప్పదు" అని పలుకునప్పుడామె నెమ్మొము వింతగా నెఱ్ఱవాఱెను. వసివాళ్లువాఱిన యా బాలిక చెక్కిళ్లు నునుపాఱెను. కనుదమ్ముల విలక్షణ జ్యోతి వ్యాపించెను. ఆమె దేవీమూర్తివోలె శ్యామలకుఁ దోఁచెను. సీత కిన్ని మాటలు వచ్చునని శ్యామల యెఱుఁగనే యెఱుఁగదు.

ఆ వేళ పూరిత మయిన సీత యుపన్యాసము శ్యామల హృదయమున నాటుకొనెను. 'తల్లీ! నీవు సత్య సరస్వతివి. నీ యీ పలుకు తప్పదు. తప్పదు. నీ యానందమే నా యానందము. నీ పాలిట నతఁడు సకల సద్గుణ సాంద్ర కీర్తియగు శ్రీ రామచంద్ర మూర్తియే యగును గాక " అని శ్యామల పలుకుచున్నంతలో దుర్గాప్రసాదుఁ డచ్చటికి వచ్చి శ్యామలచేతి కొక సీలు జా బొసంగి, 'ఇది మీ కిమ్మని మా మేనమామ గారిచ్చినారు ' అని పలికెను. సీత యానందంబు వర్ణింపఁ దరము గాకుండెను. శ్యామల యచ్చెరువునకు మేర లే దయ్యెను. దుర్గాప్రసాదుం గూర్చుండఁ జేసి శ్యామల యా వఱకా బాలు నెఱిఁగియున్న దగుటచే గౌరవించెను. సీత వీవనతో వానికి విసరుచుండెను. 'మీ మామగారికిఁ గుశలమా? విశేషము లేమి?' అని శ్యామల యడుగ నీ యుత్తరము జదువుకొన్న మీ కే విశద మగునని దుర్గాప్రసాదుఁ డనెను. సీతమోము వికసించెను. శ్యామల లకోటా విప్పి యా యుత్తరమును దనలోఁ జదువుకొనెను. ఆమె మోమునందే దృష్టి నిలిపిన సీత యందలి మార్పును నారసి యా యుత్తర మానంద దాయక మని గుర్తించెను.

"సీతా! మనము కృతార్థురాండ్రము. 'రత్నము రత్నమే కాని గాజురాయి యె ట్టగును! ఏండ్లకుఁ బెద్దనే కాని వివేకమునకు నీవే పెద్ద వైతివి. ఇది చదువుకొమ్ము" అని యా కమ్మను శ్యామల, సీతమ్మ కందించెను. సీత లేఖం జదువఁ దొడఁగెను.

"చి॥ శ్యామలకు రామచంద్ర భట్టాశీర్వదించి వ్రాయునది. ఇక్కడ నొక బ్రాహ్మణ వటువు జల గండము నుండి నా చే రక్షింపఁ బడెను. అత్యుత్కటములగు పుణ్య పాపముల కీ లోకమునందే ఫలమున్న దను నార్యోక్తికి రెండవ దృష్టాంతము గానుపించినది. ఆ వటుని తల్లిచే సర్వము విదిత మయ్యెను. సద్గుణ సంజాతయగు సీత, భూదేవీ సంజాత. యతి శేఖరుండయినను జనకుండు సంసారియై యానందించెను. ఇంక నీవు సీతారాముల కళ్యాణోత్సవంబునకుఁ దగు ప్రయత్నము సేయ వచ్చును.

కొన్ని యసందర్భపుఁ గారణముల వలన మీకుఁ దెలుపకయే వచ్చినాఁడను. నేను వచ్చి సంగతులు వివరించె దను. నీ పరివారమున నొక కంటక మున్నది. అదియే దీని కంతటికిని గారణ మని నా తలంపు. మెలఁకువ గలిగి యుండ వలెను. మీ క్షేమముఁగోరు రామచంద్ర భట్టు."

అని మనస్సులోనే చదువుకొనెను; కాని యందలి యర్థము వివరముగా నా బాలికకుఁ దెలియ దయ్యెను. సీతా రాముల కళ్యాణోత్సవమునకుఁ దగు ప్రయత్నము సేయ వచ్చు నన్నమాట యా కుమారీ రత్నము నానంద రస తరంగిణీ తరంగముల నోలలాడించెను. సంపూర్ణ శర త్పూర్ణిమా సుధాకరుని వడువున నా బాలిక మోము కళాస నాథ మయ్యెను. శ్యామలా హృదయ వాటికను నాటియున్న కంటక మూడి పోయెను. దుర్గాప్రసాదుఁడు బెంగళూరిలో నుండిపోయెను; భట్టును గూర్చి శ్యామలయు సీతయు నడి గిన సంగతుల కన్నిటికిని తగిన ప్రత్యుత్తరము లిచ్చెను.

# 19

## చిత్రా దేవి

శ్యామసుందరాదులు ధర్మవరముం జేరి యొక విశాల భవనమున విడిసి యా చుట్టు పట్టుల నున్న ప్రకృతి విచిత్రములను దిలకించుచుండిరి. భట్టు సీతా జననాదిక వృత్తాంతమును రహస్యముగా శ్యామసుందరునికిం దెలిపెను. తప్పక సీతను బెండ్లాడు మని శ్యామసుందరుఁడు మిత్రునిం బ్రోత్సాహ పఱిచెను.

ఒకనాఁడు భట్టు నాచార్యులుగారును వెంటరా నశ్వశకటంబున శ్యామసుందరుఁడు రాచబాట నంటి కొంత దూరము సాయంకాలిక వాయుసేవనార్థ మరిగెను. గవ్యూతి దూర మరుగునంతలో వారి కొక పల్లె గానవచ్చెను. వా రా పల్లెకుఁ బోవ నిశ్చయించి యచ్చట బండి దిగి ముచ్చటలు చెప్పుకొనుచు నూరిలోని కేగిరి. అందలి కాఁపు లందఱును వారిం గని వింతపడిరి. వారికిని వీరికిని గొంత దనుక నిష్ట గోష్ఠి జరిగెను. ఆ గ్రామనాయకుఁడు మన బాటసారుల నూరి కుపాంతమున నున్న యొక విశాలవటమునకుఁ దోడు కొని పోయెను. ఆ వనస్పతి క్రింద నున్న అచ్చుఱాలపై వా రాసీను లయిరి. కాఁపు లెల్లరు బనిపాటులు ప్రొద్దుండఁ గానే ముగించుకొని, యలఁ బ్రొద్దులు తివి యప్పుడే యొక రొక్కరుగ నచ్చోటికిఁ జేరుచుండిరి. పండ్రెండు పదునెనిమి దేండ్ల నడిమియీడు గల బాలురును, బాలికలును, సుమారిరువది మంది సింగారించుకొని ముసి ముసి నగవులు నవ్వ

కొనుచు నచటికే తెంచిరి; అటఁ గ్రొత్తవారిం గని వింత పడిరి. పదంపడి నాయకు నాజ్ఞచే నెల్లరును గాళ్లకు గజ్జెలు గట్టుకొని, చేతుల గోలలు పట్టుకొని రంగమునఁ బ్రవేశించిరి. వారికిఁ జుట్టును వలయాకారముగా నూరి కాఁపులాఁడువారు, మగవారును గూర్చుండి యుత్సవ దిదృక్షాపరులయి నిశ్శబ్దముగా నుండిరి. సాధుత, సజ్జనత, సత్యసంధత, సరళతయు నా యాటవికుల మోములఁ దాండవించుచుండెను. మంచి నీరును, గాలియుఁ గల కుగ్రామ వాసులెంత యారోగ్య వంతులు నెంత యుత్సాహవంతులు నయియుందురో వారిం జూచిన విశదమగు చుండెను. పని పాటుల నలసి, సోమరి తన మేమో యెఱుంగక నిరంతరము కృషి సేయుచు దేశమునకు జీవనముం బ్రసాదించు వారి జీవనమే జీవనము! వారి యారోగ్య భాగ్యమే భాగ్యము!

రంగమున కేతెంచిన బాలబాలికలు, విచిత్రములగు పదములు పాడుచుఁ దొలుతఁ గోలాట మాడ నారంభించిరి. తాంబూల రక్తిమ యెఱుంగని వారి కెం పెదవులును, నచ్చంపు ముత్తియంపుఁ గోవల కెనయగు వారి పల్వరుసలును, వారి నునుసిగ్గు చిఱునవ్వులకు వన్నె వెట్టుచుండెను. నాగరక పురుషులను గాంచుచు వారి యెదుట, దమ యలౌకిక నృత్తగానాభినయ విలాసములు బ్రదర్శింపఁ దటస్థించుటచే, మొక్కళ పాటుతో పాటు వెక్కళ పాటును, వేడుకతోడుగ వ్రీడయు నా యాటవికుల నావరించి యపురూపములగు మనోభావములను గల్పించెను. రంగు రంగుల యడవి పూదండలఁ దమ దండలను, గంధరంబులను, గంధ

రంబులంబోని శిఖా కలాపంబులను జుట్టుకొని, తమ తమ చిత్తరు చూపులతో నయ్యాగంతుకులఁ బుల్కు పుల్కునఁ జూచుచు మనోహర కంఠ స్వరంబులెత్తి పాడి యాడుచున్న బాలికలతోపాటు బాలకులు నీడు తీయక పాలుగొను చుండిరి. ఒండొరులను మీఱు నుబలాటముతో, నా నాక రకుల మెప్పొంద వలయునను నుద్దేశములతో వా రందఱును దమతమ నేర్పును జూపసాగిరి.

ఒక బాలుఁడు ముందు పల్లవిఁ బాడుచుండ, వాని వెనుక నందఱు నొక్క రీతిగాఁ బాడుచు వాని విధముగానే కొంతవడి కాడిరి. అందఱి సమ లయా విన్యాసము మెచ్చఁ దగినది. చేతుల చప్పట్లును, నడుగువేఁతయు సరిగాఁ బడు చుండెను. ఇట్లొక విధ మయిన యాటయుఁ బాటయు నయి నంత నొక బాలికావతంసము, తన యవ్యక్త మృదు మధుర కోమల కోకిల స్వరంబున నొక వింత పల్లవి నందుకొని పాడ సాగెను. ఆ యువతి ననుసరించి తక్కిన వా రందఱు నా పదము ననువదించుచుఁ జేతు లిటు నటు నూఁచుచు నొక్క లయగా నడుగు లిడుచు నొకపరి యొక వంకకు వంగుచు, మఱియొక పరి మఱి యొక వంకకు వంగుచు, ముందఱి కడుగు లిడుచు వెనుక కరుదెంచుచు, గిఱ్ఱునఁ దిరుగుచు నొకరి నొకరు దప్పించుకొని వలయాకారముగఁ దిరుగుచు, వీడుచుఁ గలయుచు, మలయుచు, మంద్రస్థాయిని మొదలిడి, మధ్యమ స్థాయిని నిలిపి, తారకంబునకుఁ డా రా జువ్వలు విసరుచు నారోహ ణావరోహణంబులు సేయుచు, నొకటి రెండు మూఁడు నాలుగు కాలమ్ముల ననులోమ గతి నెక్కించి ద్రుత



"చందమామ, చందమామ, చందమామా, నీ చందమెల్లఁ దెలిసెనోయి
చందమామ." గ్రామ బాలబాలికల నృత్యగానములు. (157-పుట)

గతిని నిలిపి దానికి సరిపడునట్లు పదగతిని వడిఁ బెంచి, నెన్నుదుళ్లఁ జిఱుఁ జెమట చుక్కలాణి ముత్తియము లట్లు మెఱయ, నెమ్మొగము లించుక రక్తిమ కాంచ, గుబ గుబ ధ్వను లొలయ, నానంద ఝరి, పరీవాహము వాఱ, న చ్ఛో పఱ యుల్లంబులు పల్లవింపఁ జేయ నాడి పాడి పీడి యలపు దీర్చుకొన నిలిచిరి. కాని వారు పాడినపాట, "చందమామ చందమామ చందమామా ! నీ చందమెల్లఁ దెలిసె నోయి చందమామ ! " అనునది శ్రోతల శ్రుతి కింకను వినిపించు చునే యుండెను. భట్టును, శ్యామసుందరుఁడును, నాచార్యులు గారు నొందిన యానందమునకు హద్దు లేదు. శ్యామసుంద రుఁడు వారి కొక రెండు రూకలు బహుమాన మొసంగెను. భట్టు పైని వేసికొన్న యుత్తరీయము నిచ్చివేసెను. ఆచా ర్యులుగా రంగవస్త్రము నిచ్చివేసిరి. ఈ యడా వుడిలో నా జనసమ్మర్దములో నుండి జాబిల్లి యుదయించి యంతలో మఱేఁగిపోయెను.

ఆచార్యులు గారికిని, భట్టునకును నింకను సరదా తీర లేదు. అది గనిపెట్టి శ్యామసుందరుఁ డట్టెలేచి, 'భట్టును జూచి, మీ రిరువురు నిచ్చట నుండుఁడు. నే నించుక యీ ప్రాంతములఁ దిరిగి వచ్చెదను ' అని యచ్చోటికిఁ బశ్చిమ ముగా నున్న గుట్టల పైపునకుఁ జర చర నడుగులు వేసి వెళ్ళెను. అక్కడ నొక్క త్రోవయే యుండెను. ఆ గుట్టలు దాఁటి యవ్వలి కేగుట కా సన్నని దారియే దారి యని యెంచి శ్యామసుందరుఁ డా బాట నంటి పది నిమిషములు ప్రయాణము సేసి యంతలో నతని కొక ప్రకృతి రచితమైన

యుద్యాన మగుపించెను. ఆకసము నంటుచున్నట్లు పెరిగి యున్న యత్తరురాజముల శిఖరములవఱకు నల్లిబిల్లిగ నల్లుకొన్న లతా మతల్లికలు పూచిన వింతపూలనుండి వెలువడుచున్న పరిమళవస్తు విస్తారము నంకించుకొని మెల్ల మెల్లన వీచు పిల్లతెమ్మెరలచేఁ గదలింపఁ బడు పత్రముల నుండి గలుగు మర్మర ధ్వని వినుటచే నుదయించు నానందముచే వివశమయిన డెందముతో నా రాకుమారుఁ డరుగుచుండఁ జల్లగ నొకమలయమారుత మేతెంచి యతరు లతల నుండి జలు జల్లున నాతని పయిని బరిమళ కుసుమములను రాల్చి యెదు రయి స్వాగత మొసంగెను. అతఁ డట్లు ఐదు నిమిషము లా బాట నంటి నడచినంత నచ్చట నతని కొక యూట కాలువ గానిపించెను. అది యా గుట్టలలో నెక్కడఁ బుట్టి యెక్కడి కేగుచున్నదో కాని నిమ్నోన్నతములగు కఠిన ప్రదేశంబులనుండి జాఱుచుఁ గల కల ధ్వని సేయుచు స్వచ్ఛమయి పూతమయినే యుదక పూరంబునఁ బ్రవహించుచుండెను. ఉన్నత తరుశాఖా పర్ణాంతరాంతరముల నుండి యస్తంగతుఁ డగుచున్న భాస్వంతుని సువర్ణభాను వస్తు శేషము, మలయ మారుత కిశోర ప్రసారంబున నించించుక తల నూపి పరువిడు బాల తరంగశ్రేణిపైఁ బడి తాండవించుచు నవరత్న ప్రభాసంపుటి నం దుదయింపఁ జేయుచుఁ జూడ వేడుక వొడమించుచుండెను. ఆ మనోమోహన దృశ్యమును దిలకించుచు శ్యామసుందరుఁ డొడలు మఱచి, యక్కాల్వగట్టుననే పోవు సన్నని తెరువుంబట్టి మెల మెల్ల నడుగు లిడుచు నెద్దియో యొక యపురూపపు వస్తువు నన్వే

షించువాఁడు వోలె నలు వలంకులఁ గలయఁ బరికించుచుఁ నరిగి యరిగి చటాలున నాఁగిపోయెను. తనయెదుట నున్న దృశ్యమునఁ గీలుకొని యా సుందరుని దృష్టి మఱి మరల దయ్యె.

ఆ కాలువగట్టున కడ్డుగ నొక త్రోవ వచ్చి కలియుచుండెను. అది రేవుగ నేర్పడి యుండెను. ఆ క్షుద్ర నదీ తీర్థావతరణమున కా దారి చివరను నాలుగైదు ఱాల వరుస లుండెను. అందు మూఁడవ మెట్టుపై నొక యువతీ శిరోమణి కూరుచుండి నాల్గవమెట్టు మీఁదినుండి నీటి దరికిఁ గాళ్లు సాచుకొని యుండెను. ఆ సుందరి పాద పల్లవ రుచుల నంటి యుంటక యా సెలయే అవ్యక్త మధుర నినాదముతో నరుగు చుండెను. కిశోర సమీర ప్రసార వశంబున నప్పుడప్పుడెగురుచుఁ దలలెత్తు చిన్నిచిన్ని యల లా వృద్ధాదిత్య కర సుషమా విశేష విలాసితము లగుచు న య్యబల యడుగుందామరలఁ దడుపుచుండ, న న్నదీ రమణీమణి, దివ్య రమణీమణిం బోని య య్యాటవిక కన్యకామణికి, సువర్ణ మణి రుచి రంజితంబగు పాద్య మిడుచున్నట్లు దోఁచుచుండెను. ఆ క్రాల్గంటి యించుక తల వాంచి య న్నదీ వీచికలం దోఁచు సమయ ప్రసాద మధురిమ నారయుచుఁ బరవశ యయి యుండెను; మెల మెల్లనఁ దన పాదము లాడించు చుండెను. ఆ సుధాకర వదన వదన బింబమున మూఁగి సదాగతి గతి కధీనములయి ముంగురు లెలదేఁటి మొత్తమును దలపించుచుండెను. అ య్యళికుంతల కుంతల భారము ప్రేలు ముడిగ వెన్నునఁ జెన్నొందు చుండెను. సాయం ప్రభలచే నా

చిన్నారి నునుఁ జెక్కిళ్లు మిలమిల మెఱసి పోవుచుండెను. గ్రీవాభంగ మభిరామయి యుండెను. ప్రకృతి ప్రసాదితమగు క్రొంగ్రొత్త జవ్వనము వర్ణనాతీత ప్రభావము నందుచుండెను; ఒడల నొక యలంకార మయిన లేకుండుటయే సహజాలంకార శోభను బ్రకటించు చుండెను. ఆ పడఁతి కట్టుకొన్న ముదుగుఁ గోక, 'ఇయ మధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వీ' యను మహాకవి సూక్తికి దృష్టాంతాంతరమును సూచించు చుండెను. సన్నని నడుము, చక్కని యురము, గొప్ప పిఱుందు, కేతకీ సుమ సమ గాత్రము, కుటిల కుంతలము, కించి దున్మిషిత నేత్రము, ఈ షద్వివృతోష్ఠ పుటము, నిరుపహతి స్థలము, నిస్సామాన్య సమయ శోభ, నిరాడంబర ప్రకృతి, నిస్తుల యౌవనము, నిస్సందేహ ప్రవర్తనము! వా! వా! యేమి సొగసు!

అ కుసుమ గాత్రి పురుష సన్నిధి నుండు టెఱుంగదు. దాన నొడలిపయిం బరామఱిక వీడి, యావును దన సహవాసి ప్రాణులు నచ్చట నున్నవని మాత్రమే యచ్చెలు తుఁక యెఱుంగును. కాని, నిశ్చల దృష్టితోఁ దన సుధా మధురమగు సౌందర్య యౌవన విలాసము నా పోవఁ ద్రావుచు నొక సుందర సుకుమార కుమార ప్రభువు గట్టున నబ్బుర పాటుతో నట్టె నిలిచి యున్నాఁడన్న సంగతి యామె యెఱుంగదు. ప్రక్కపల్లెనుండి నృత్తగాన ధ్వని, విను వీధి నెగసి యచ్చటి కచ్చముగ వినిపించుచునే యుండెను. అట్టి వినోదమునఁ బాల్గొనక యొంటిగ నమ్మచ్చెకంటి యన్నదీ తీరమునఁ గూర్చుండనేల? శ్యామసుందరుని హృదయమున



"ఇయమధిక మనోజ్ఞావల్కలేనాపి తన్వీ" అను మహాకవి సూక్తి

నీ ప్రశ్నయే ప్రతిబింబించెను. ఆ చక్కెరబొమ్మను దనివారం బరికించి, కళాధామమగు నామె నెమ్మోమునం గళంకము వలె సంతాపచ్ఛాయ దవిలియున్నదని యతఁడూహించెను. ఇంతలో నా ప్రక్క త్రోవ నెవ్వరో మాటలాడుకొనుచు వడి వడి నరుగుచుండిరి. వారిని సమీపించి శ్యామసుంద రుఁడు బాలికవైపు చేయి చూపించి యామె యెవ్వరని మెల్లగ నడిగెను. 'పాపము! అగతిక, చిత్రా బాయి' అని వా రుత్తరమిచ్చి తమ జాలిని సూచించు చూపుల నద్దెసఁ జూచి సాగిపోవుచుండిరి. శ్యామసుందరుఁడు వారి వెన్నంటి వడి వడి నడచి కలిసికొని, 'ఆ బాలిక కేమి వచ్చెను? ఈడు జోడగు బాల బాలికలు నేఁ డాట పాట లలో హాయిగాఁ బ్రొద్దుపుచ్చుచుండ నది యొంటిగ నేల నిర్జన ప్రదేశమునఁ గూర్చుండెను?' అని వారిని మరల బ్రశ్నిం చెను. 'మంచి బిడ్డ. అదే యాటపాటలకు రాదు' అని యుత్తర మిచ్చుచునే వారు తరలిపోయిరి. శ్యామ సుంద రుని కా సుందరిపై జాలి కలిగెను. త దుదంత మాద్యంతము నెఱుఁగఁ గోరి మరలి తొల్లి తాను నిలిచియున్న చోటికేగి నిలిచెను. అప్పుడు చిత్ర మోమెత్తి పడమటిదెస నాలో కించుచుండెను. ఆ మోము చక్కందన మంతయు నతని కప్పుడు గోచరించెను. ఆమె యపుడు నవ్విన చిఱునవ్వులోఁ జింతయు సంతసమయి యున్నట్లతఁడు గుర్తించెను. పరమ లావణ్యవతి, బంగారుబొమ్మ, నవ నవోన్మేష యౌవన, యంతఃపుర సంచార యోగ్యయునగు నీమె కిట్టి లేఁ బ్రాయ మున నెట్టి సంకటములు గల్గెనో యవి తెలిసికొని తీర్చి

చేతనైన సాయము చేసెదను గాక యని యనుకొనుచు నతఁడామె నట్టె విలోకించుచుండెను. చిత్ర యాతనిం జూడలేదు. ఆటపాటలలో నప్పాటల గంధి కంత సరదా లేక పోవుటచే నా ప్రక్కనుండి దృష్టి మరలించి, యొండొంటిం దాకుచుఁ ద్రుళ్లుచు నెగురుచు సాయంకాలిక ద్యుతి సంశోభితంబులయి తన పాదంబుల నంటుచున్న చిన్ని యలలం జూచుచు మధుర మధురమగు మందహాస మొనరించెను. తన ప్రతికృతిం జూపించు నయ్యేటి తేటనీటిం బోలి యామె యంతరంగ మెంతయు నమలమై యున్నట్టులా మందహాసము సూచించుచుండెను. ఈ బాలిక యి య్యాటవిక జాతి బాలిక గాదు. దీనిం గూర్చి యెద్దియో నొక వింత యుదంత ముండి యుండును. ఈమె నడిగి తెలిసికొనెద ననుకొని యతఁడడుగులు మెల మెల్లఁగ నిడుచు దగ్గఱగాఁ జని నిలిచెను. అంత దనుక నా సౌందర్యరాశి కన్నెత్తలేదు. 'సుందరీ! నీ వేల యీ పున్నమ యాటపాటల కరుగక యొంటిగ నిటఁ గూర్చుంటివి?' అని కరుణా జనకమగు మృదు మధుర స్వరమ్మునఁ గథా నాయకుఁడు చిత్ర నడిగెను.

చిత్ర యులికిపడి ప్రక్కఁదిరిగి యతనిం జూచి యొడలు సవరించుకొని లేచి నిలువంబడి తత్తరపడసాగెను; కాని, యతని మధుర స్వర మా జవ్వని తత్తరమును గొంత తగ్గించెను. 'నీకేమి చింత? ఇట్టి లేఁత వయసుననే చింతయా? నీ సంతాపకారణ మెఱిఁగి నీ కుపకరింపనేర్తునేని నాసంతోషమునకు మేరయుండదు' అని శ్యామసుందరుఁ డన నా దీన బాలిక విచార సూచకముగా నతని విలోకించెను. ఆ విలో

కనమునఁ గృతజ్ఞతా సూచనయుఁ గలదు. దిక్కుమాలిన పక్షియై యున్న తనపై నంత జాలిగొని యట్టి పలుకు లింత వఱకు నెవ్వరును బల్కియుండలేదు. అయినను నూతనాగతుఁడు, సుందరుఁడు, నాగరకుఁడు నగు నొక యువకుని చెంతఁ దా నట్టి వివిక్తప్రదేశంబున నేకతమ నిలిచి యుండుట భావ్యము గాదు. కావునఁ జిత్ర తన మనోహర విలోకనంబుల నిం కొకసారి యాతని వదన బింబమును దిలకించి తల వాంచి యటువాసి పోవఁదలఁచి నాలు గడుగులు వేసెను. అంత నతఁ డామె చేయి పట్టుకొని నిలిపి, 'భయపడకు. నీ యుదంతము నాతోఁ జెల్పుము. నీ యిడుమలు గడముట్టిన వని తలంపుము' అని పలికెను. చిత్ర యచ్చెరువొంది బెగడొంది యా పట్టు తప్పించుకొని పో నెంచెను; కాని, శ్యామ సుందరుఁడు కరుణా నిధానములగు చూపు లా బిసరుహ పాణి లజ్జారుణిత ముఖ కమలమ్మున నిలిపి, నన్ను విడిచి పోయెదవా? చిత్రా! నే నడుగు మాటలకు జవా బీయ నొల్లవా? నాతో మాటాడవా?' అని యడుగ న ముగ్ధ మఱి యడుగు పెట్టఁ జాల దయ్యెను. ఆమె దృష్టి వీచికలు తళుకు తళుక్కన మెఱుఁగు లీన, లోచనము లశ్రుభరితము లయ్యెను. సంతాప చ్ఛాయ నెమ్మొగము నావరించెను. గండ ఫలకంబులనుండి కన్నీరు జాలువాఱెను, 'ఏడ్చుచుంటివా? నీ దుఃఖమునకు నే నే కారణ మైతినా? చిత్రా! ఊరడిలుము' అని మరల నతఁ డామె కర పల్లవమును దన కరమ్మునఁ జెమల్చి తన యుత్తరీయమున నశ్రు బిందువులఁ దుడిచెను. నోట నేమియుఁ బలుక నేరకున్నను నామె దన దుఃఖ

మున కా సుందరుఁడు కారణము గాఁడను సంజ్ఞ చేసెను. అతఁడు నవ్వెను. ఆ చిన్నారి చిన్ని చెక్కు లెఱ్ఱవాఱెను. మందహాసము మోమున నంకురించెను; కాని, యది యంత లోనే విలీన మయ్యెను. చిత్ర యతని పట్టు విడిపించుకొని పొంగి వచ్చు శోకావేగము నణఁచు కొనుచుఁ గను దమ్ములు తుడుచు కొనుచుఁ బుల్కు పుల్కున నా కరుణా నిలయుం జూచుచు సంభ్రమంబునఁ బదంబులు దొట్రిల నడుగులిడుచుఁ దన వెంట లేచి వచ్చు సహవాసి పశువర్గముతోఁ గాలు సాగించి సరసర నరిగి మలఁగి యదృశ్య యయ్యెను.

శ్యామసుందరమూర్తి యామె వెన్నంటి నాలుగై దడుగులు వెళ్ళెను. కాని దేశ కాలములు వాని కనుకూల ములు గావయ్యెను. అప్పటి కప్పుడే సూర్యుఁ డస్తమించెను. చందురుఁ డుదయించెను. ఆ బాల యే త్రోవం బోయెనో తెలియ రాదయ్యె. అచ్చట నన్నియుఁ జిన్న చిన్న గుట్టలు. ఎటు వోయిన నే మగునో తెలియదు. తన మిత్రులింతకు నే మనుకొందురో, యని యాలోచించి మరలి, మొదటఁ జిత్ర కూర్చున్న చోటికి వచ్చి శ్యామసుందరుఁ డాలోచనాధీన మానసుఁ డయ్యెను. ఆ కన్యకామణిం గూర్చి యే యభి ప్రాయ మొందుటకు వీలుపడకున్నను, దా నంత వఱకుఁ జూచిన వధూటులు దాని కాలిగోటికైనం బోల రని మాత్ర మనుకొనెను. తన దృష్టిపథమునుండి జాఱియా చారు బింబాధర యదృశ్య యయినంత వాని హృదయ మని ర్వాచ్యమగు నొక స్థితికిం జిక్కె కర్తవ్యమును బాలుపో నీయదయ్యె. తన యానందమున కర్తన్వంగి సావాసము

ముఖ్యమని యతఁ డనుకొనెను. "అహా! ఏమి యీపసిండి శలాక సింగారము! ఏమి యీ యాకార గరిమ! ఏమి యీ కనుదమ్ముల వింత సోయగము! అమాయికమగు తత్సౌందర్య మధురిమ యే నగర నాగరక నాగనాసోరులకుం గలదు? ఇట్టి యీ ప్రకృతి కన్యాలలామ కేమి విచారము గలిగినదో! ఏల మాటాడదు? సిగ్గా? భయమా? అనిష్టమా? మొగమోటమా? పేరు చిత్రాబాయియా?! దాని కర్థ మేమి? దీని సంరక్షకు లెవ్వరు? స్వతంత్రయా? ఇం దేదో వింత గలదు."మన్మనో హారిణీ! నీ చరిత్రమేమో నేఁ గనుఁగొందును; నిన్ను విడువను; విడువలేను; మరల జేపు నిను జూడవచ్చెదను; నీ సంతాపమును మఱపించెదను. నిన్ను నేఁ బ్రేమించితిని. ఔను, ప్రేమించితిని. హృదయ రహిత మయిన తుచ్ఛప్రేమ కాదు నా ప్రేమ. నిష్కళంక ప్రేమకుఁ బాత్రు రాలవు. నీ నేత్రములలోనే నీ పవిత్ర హృదయ చరిత్రమును నేఁ జదివినాఁడను. నీవును నన్నుఁ బ్రేమించితివా, నా వంటి ధన్యుం డీ లోకములో నిం కెవ్వఁడును లేఁడు. నీ నెమ్మోమునం దున్న విచారచ్ఛాయ లంతరించి, పరిపూర్ణ శరద్రాకా సుధాకరుం బురుడించుచు నీ మోము వెలుఁగొందు చుండ నేఁ జూడఁ గల్గితినా నా వంటి భాగ్యవంతుఁ డుండఁడు. నిష్కళంకంబగు నిర్మాపిన కుసుమము నీ పరితాప కంటకాభి హాత హాతముగాఁ జేయ నా పరమేశ్వరుని తలం పగునా? నే నా కంటకము నంటకుండ నా సుందర కుసుమమును గాపాడ సాధనముగాఁ గూడదా?" అని శ్యామసుందరుఁడు, త దాట వికబాలిక యేగిన దెస దృష్టి నిలిపి పలుకుచు వెను దిరిగి

యచ్చోటు విడిచి వెన్నెల వెలుఁగులలోఁ దోఁగాడుచు గ్రామాభిముఖుఁ డయి యరిగెను. 'రేపు తప్పక వచ్చెదను. దీనింగూర్చి భట్టుతోనైన ముచ్చటింపను. అతఁడు పరిహాస ప్రియుఁడు; కేలిసేయును. స్త్రీ లందఱు నొక్కపద్దులో వారే; ప్రేమ కూరగాయల వంటిది యను మాటలిప్పుడు నూనినాఁడు. సీత యతనికి బుద్ధి చెప్పినది. అయినను జిత్రనుగూర్చి యిప్పు డేమియుఁ జెప్పను" అను మాటలు మరల మరల ననుకొనుచు నతఁ డాటపాటల మట్టికడ కరుదెంచెను.

వైశాఖ పూర్ణిమా పూర్ణచంద్రుం గాంచి సుధా సముద్రము నట్లు లా యాటవికుల యుల్లము లుప్పొంగ వా రాటపాటలతో నా గ్రామమును ఘూర్ణిల్లఁ జేయుచుండిరి. శ్యామసుందరుని రాక చూచి, భట్టు నాచార్యులు గారును లేచి వచ్చిరి. ఉత్సవము నంతతో నాఁగిపోయెను.

భట్టు:- నీవు వింతవాఁడ వన్నా! ఆ గుట్టలలోనికి సికా రేమిటోయి! ఈ యానంద లహరిని విడిచి యట నేమి చూడ నేగితివి? చిత్ర మేమయినఁ గలదా? ఇంత తడ వేమి సేసితివి? మంచి రక్తి సమయములో వెళ్లిపోయితివి! ఎంతో చక్కని యాటపాటలు గదా!

శ్యామ:- (నవ్వుచు) దేని రక్తి దానిది. దాని కేమి గాని మన మింక నైదు మైళ్లు నడువ వలయును గదా! వేగముగా బండి యెక్కుఁడు.

ఆచా:- బాబూ! నేఁడు మహానంద మైనది. నేను సాయాహ్నిక కృత్యములే మఱచితిని. బండి యెక్కుదము రండు.

శ్యామ:- నేను నాటు త్రోవను వెన్నెలలో నడచి వచ్చెదను. జమీందారు గారును దమరును బండిలోఁ గూర్చుండుఁడు.

అని పలికి వారిని బండియెక్కించి యచ్చట నిలుచుండిన యొక కాఁపు బాలునిం జూచి, 'చిన్నానాయఁడా! ధర్మవరమునకు నాటు దారి తెలియునా?' అని యడిగెను.

బాలు:- తెలియును బాబు! ఇదికాదా! గుడ్డిపొడుగు దూరమున్నది.

శ్యామ:- నీ వొక్కింత దారి చూపింప వచ్చెదవా? ఈ పాపులా నీ కిచ్చెదను. (అని నాలుగణాల కాసు వాని చేతిలోఁ బెట్టెను.)

పండ్రెండేండ్ల బాలుఁడు. అయాచితముగ నాలుగణాల నాయాసముగా వచ్చుచున్న విడుచు కొనునా? వాని కెంత సంబరము! అది పుచ్చుకొని గొనానఁ బెట్టుకొని, 'సామీ! మన మీ త్రోవ నిట్లు మళ్లవలయును. రండు' అని వాఁడు దారి తీసెను. శ్యామసుందరుఁడు వాని వెనుక నేగుచు మెల్లగాఁ బ్రసంగములోనికి దింపెను.

# 20

## చిత్రా చరిత్రము

శ్యామ:- అబ్బాయీ! నీ పేరేమి?

బాలు:- చంద్రన్న, బాబు!

శ్యామ:- చంద్రన్నా! మీరెంద అన్నదమ్ములు?

చంద్ర:- నలువురము.

శ్యామ:- నీ వెన్నవ వాఁడవు?

చంద్ర:- కడగొట్టు వాఁడను, బాబూ!

శ్యామ:- మీ యమ్మయు, నయ్యయు నున్నారు గదా!

చంద్ర:- ఉన్నారు.

శ్యామ:- మీ కప్పసెల్లెం డ్రెండ ఉన్నారు?

చంద్ర:- ఇరువురు.

శ్యామ:- సరే కాని చంద్రన్నా! నీ వీ చుట్టుప్రక్కలన్నియు బాగుగ నెఱుఁగుదువా?

చంద్ర:- ఎఱుఁగుదును సామి!

శ్యామ:- చిత్రాబాయి నెఱుఁగుదువా?

చంద్ర:- ఎఱుఁగకేమి బాబు! చిత్రమ్మ నెఱుఁగుదును.

శ్యామ:- దానినిగూర్చి నీ కేమి తెలియునో చక్కఁగాఁ జెప్పుమీ చూతము.

చంద్ర:- "చిత్తము బాబూ! అదొక వింతయైన కథ!"

అని బాలుఁడు చిత్రాచరిత్రము నిట్లు చెప్పఁదొడఁగెను.

"బాబూ! ఆ కన్న రెండేండ్ల పిల్లయయి యున్నప్పు డామె తలిదండ్రు లీ యూరు వచ్చినారు. ఇచ్చట నుండుటకు మంచి తా వేదని యడుగ నీ గ్రామస్థు లీ యూరిలో నుండు మనిరఁట. కాని, వారలొకో వా రీ యూర నుండ నొల్లక యా యా చోటు లెల్ల నరసి యా గుట్టల కవ్వల నున్న బోయపల్లెకు దగ్గఱగా నొక కుటీరమును నిర్మింపఁ

జేసికొని యందు నివసించుచుండిరి. వా రిక్కడికి వచ్చు నప్పటికిఁ జిత్రతల్లి నిండు చూలా లయి యుండెనఁట. ఆమె కట నా కుటీరమున నొక చక్కని మగశిశువు పుట్టెను. వారితో నొక ముసలిది గూడ వచ్చియుండెను. ఆమె యే వారికి సక లోపచారములు చేయుచుండెను. కుఱ్ఱవాఁడు పుట్టిన యిరువది రెండవనాఁడే తండ్రి యొక సుల్తాను గారి కొలువులో సేనా నాయకుఁడుగాఁ గుదిరి వెళ్ళి పోయినాఁడు. ఆ ముసలమ్మ యిట సంసారము నిర్వహిం చుచుఁ బిల్లల నతిప్రేమతోఁ బెంచు చుండెను. చిత్ర తండ్రి నెల కొకతూరి యేఁబది రూక లంపుచు నాలు గైదు మాస ముల కొకసారి గుఱ్ఱముమీఁద నిక్కడికి వచ్చుచు నెల, పది, యిక్కడ నుండుచుఁ బోవుచుండెడి వాఁడు. వా రెవ్వరో యేల యీ దేశమునకు వచ్చిరో తెలియకుండ నాలు గైదేండ్లు గడచి పోయెను."

"చిత్రమ్మ చిన్నప్పుడు మూఁగది గాదఁటబాబూ!" అని చంద్రన్న చెప్పుచుండ నులికిపడి శ్యామసుందరుఁడు, 'ఐన నిప్పు డామె మూఁగదా యేమి? వింతగా నున్న దే'అని యడిగెను. అతని మనస్సు చివుక్కుమని యాతాట పడ పడ సాగెను. మరలఁ జంద్రన్న చెప్పసాగెను.

ఔను బాబూ! చిత్రమ్మ మూఁగదే. చిన్నప్పు డా పిల్ల మూఁగది కాదు. ఆమె మాటలాడుచున్నను జిలిబిలి పాటలు పాడుచుఁ దమ్ముని నాడించు చున్నను విని కని తీరవలసి నట్టు లుండెడిదఁట. ఆమె యెల్లప్పుడు తన ప్రాణ పద మయిన తమ్ము నెత్తుకొని బుజ్జగించుచుఁ దనచేతి ప్రే

లిచ్చి నడయాడఁ జేయుచు నన్నము దినిపించుచు, ముద్దు ముద్దు సుద్దులు చెప్పుచుఁ గంటికి ఱెప్పవలెఁ గాపాడు చుండెడి దఁట. ఏడవ యేఁడా పిల్లకు వచ్చునప్పటికిఁ జూడ సొంపై యుండెడిదఁట; ముద్దులు మూఁట గట్టుచుండెడి దఁట; పనిపాటులలోఁ దల్లి కెంతో తోడు పడుచుండెడి దఁట; తన తమ్ముని విడిచి, తన చిన్నితోఁట విడిచి యెప్పుడు నొక నిముసమైన నెచ్చటికిని వెళ్లెడిది గాదఁట; నవ్వులబండి పక పక నవ్వుచునే యుండెడిదఁట. ఈ యూరిలో నుండు నాఁడు పిల్లలు మగపిల్లలు నామె యీడుజోఁడు వా రప్పు డప్పు డా కుటీరమున కరిగి యామె సావాసము గోరి యాడుకొను చుండెడి వారఁట. ఎప్పుడేని మా యమ్మ నన్నెత్తుకొని యచ్చటికిఁ దీసికొని పోవుచుండెడిది. ఆ పిల్ల యెల్లర నెంతో యాదరించు చుండెడిది. సంతోషముతోఁ గలకల నవ్వుచుఁ దమ్మునికిఁ దాను నేర్పిన మాటలు పాటలు వాని చేతఁ జెప్పించి వినిపించుచు వాని చర్యలు వింత వింత మాటలు నందఱికిఁ దెలుపుచు నడుమ నడుమఁ దన చిన్ని తమ్ముని ముద్దులాడుచు వచ్చిన వారి నెంతో యానందింపఁ జేయు చుండెడిదఁట. ఆ ముద్దుబిడ్డను వీడి వచ్చుటకే యేరికి నిష్టము లేక పోయెడిదఁట. అంతలో నామె తండ్రి యొక నాఁ డింటికి వచ్చెను. పది దినములు మాత్ర ముండి తిరుగ వెళ్ళిపోయెను. పాప మాతని భార్య యెప్పు డాతఁడు సుల్తాను కొలువునకు వెళ్ళిపోయినను మగడు వచ్చువఱకు నాతఁడు పోయిన దెసనే చూచుచు సంతత మా గుట్టపైనున్న పెద్ద

రావిచెట్టు క్రిందఁ గూర్చుండి యాసాయంత్రము నుండెడి దఁట. అంత పతిప్రేమ గల యిల్లాలు మఱి లేదఁట బాబు!"

కడసారి యతఁడు వచ్చి మితి దాఁటి పోయినది. రూపాయలు రాలేదు. జాబుగూడ రాలేదు. ఆమె నానాఁటికి బెంగపెట్టుకొని చిక్కి శల్యమై యెల్లప్పుడు నా రావిచెట్టుక్రిందఁ గూర్చుండి కంటికి నేలకు నేకధారగా నేడ్చుచుండెడిది. బాబూ! నేనుగూడ నప్పు డప్పుడు చూచినట్లు జ్ఞాపక మున్నది. తెల్లవాఱఁగానే వచ్చి యచ్చటఁ గూర్చుండి నెత్తిమీఁదికిఁ బ్రొద్దు వచ్చుదనుకఁ దదేకదీక్షతో నుపగని రాక కెదురుచూచుచు నుస్సురని వేఁడి నిట్టూర్పులతోఁ జాలువాఱు వేఁడి కన్నీటితో నింటికిఁ బోయి యేవో యిన్ని మెతుకు లెంగిలిపడి మగుడ నచ్చోటనే కూర్చుండి కనుమూపు చీఁకటి పడువఱకచ్చటనే యుండి గోలు గోలున నేడ్చుచు నింటి కామె పోవుచుండెడిది. ఇదే తీరున దినములు గడచిపోవుచుండెను. ఆమె సంతాపము చూచి భరింపలేక వారి యింటనున్న ముసలమ్మ యతనికి జాబు వ్రాయించుట కొకనాఁడు ధర్మవరము వెళ్ళినది. తండ్రి యింటికి రాకపోవుటయుఁ దల్లియన్నము దినక నీరు ద్రావక నిదురింపక దుఃఖ వివశయై యేడ్చుచుండుటయు నెఱింగి యప్పు డప్పుడు తల్లి నోదార్చుచుఁ దమ్ముడు బెంగపెట్టుకొను నని తాను గట్టిగా నేడువక చిత్ర, సంతత మా బాలు నాడించుచు నుండెను. అవ్వ ధర్మవరము వెళ్ళిననాఁడు చీఁకటి పడినను దల్లి యిల్లు సేరమికిఁ జింతిల్లుచు నమ్మనిస్త్రీ యని యేడ్చు ముద్దుసోదరు నోదార్చుచు నొక్కరితయుఁ

జిత్ర యా కుటీరమున నుండెను. మానిసి మొగము మానిసి కగుపింప నంత చీఁకటి. మబ్బులాకసము నిండెను. చల్లని గాలి వీచెను. మెఱుములు ప్రారంభించెను. ఉఱుము లుఱుము చుండెను. వాన కురియ నారంభించెను. అప్పటికిని దల్లిగాని ముసలమ్మగాని యింటికి రాలేరి. చిత్రయవస్థ చెప్పఁ దరముగా కుండి యుండును."

"అంత కంతకు గాలియు వానయు నెక్కువయ్యెను. చిత్ర తమ్ముని లాలించి యన్నము దినిపించి బజ్జుండఁబెట్టి జోకొట్టి నిదురింపఁజేసి తలుపోర వాకిలిగా వేసి తల్లిగాని యవ్వగాని వచ్చుచుండెనేమో యని యా భయంకరాంధకారమ్మున నీవలికిఁ బది యడుగులు వచ్చి నిలిచెను. ఇంతలోఁ దళుక్కు మని కన్నులు చీఁకట్లు గ్రమ్మునటు లొక పెద్ద మెఱపు మెఱసెను. చిత్ర నేత్రములు మిఱుమిట్లు గ్రమ్మెను. అంత లోనే బ్రహ్మాండ మంతయు బ్రద్దలుసేయఁ జాలినంత పెద్ద ధ్వనితో నొక్క యుఱుము మిఱిమి వారి కుటీరముమీఁద నొక పిడుగు పడెను. చిత్ర తెలివి తప్పి యచ్చటఁ బడిపోయెను. అట్టు లొకటి రెండు నిముసము లుండి తెలివి వచ్చి నంతఁ గనుదెఱచి కుటీరము వైపు పాఱ చూడ న దంతయుఁ బొగ గ్రమ్మి యుండెను. చిత్ర యొక్క యఱ పఱచి యక్కుటీర ములోని కొక్క దాఁటునఁబోయి తమ్ము నెత్తుకొని యీవలికిఁ దెచ్చెను. కార్య మేమి? ఆ ముద్దుబిడ్డఁడు చనిపోయెను అప్పటి నుండియుఁ జిత్రకు మాటలాడు శక్తిపోయి మూఁగ దయినది. ఆరాత్రి చిత్ర యే రీతి వేఁగించినదో యా సర్వేశ్వరుని కే యెఱుక. ఆహా! ఘోరము ఘోరము తండ్రీ!

ఆ సంగతిఁ దలంచుకొని యిప్పటికిని మా యయ్యయు నమ్మయుఁ గంటఁ దడి పెట్టుకొందురు."

శ్యామసుందరుఁడు వివశుఁడయి కొంతతడ వేమియు నడుగలేక తన భావము మఱుగు పఱిచి, "చంద్రన్నా! పాపము! ఆ పిల్ల కెంత గతి పట్టినది! పిదప నే మయ్యెను? కథ ముగింపుము" అనఁ జంద్రన్న మరలఁ జెప్పసాగెను.

"అయ్యా! తెల్లవాఱినది. మా యూరి వారందఱును బోయపల్లె వారందఱును నచ్చటి కేగి, చిత్రమ్మ తమ్ముని శవము నొడిలోఁ బెట్టుకొని కడుపు పగులునట్లు లేడ్చుచుం డుట చూచి యా దురవస్థ కెంతయు దురపిల్లి యామె నోదార్చుచుండ నవుడ్లు గ్రక్కుకొని ముసలమ్మ యేడ్చుచు వచ్చెను. అప్పటి స్థితినిగూర్చి చెప్ప నాకు వచ్చిన మాటలు చాలవు. మా గ్రామస్థులు సానుభూతి సూపి చిత్రమ్మను వృద్ధురాలను మా యూరికిఁ దోడ్తెచ్చిరి. అంత వఱకుఁ జిత్ర మూఁగదయ్యె నన్న సంగతి యెవరును గుర్తింపరైరి. రాత్రి జరిగిన సంఘటనమును గూర్చి సాయంత్ర మామె నడుగఁ బాప మామె మాటలాడలేక సంజ్ఞలతోనే సర్వ మును దెలియజెప్పి వలవల నేడ్చెను. చిలుక పలుకుల వంటి తేనె లొలుకు నా బాలిక పలుకులు నాఁ డాదిగా నేఁటి దనుక మఱి వినిపింపవయ్యె. ఆ యాటలు పాటలు ననుంగు ననుజునితోనే యంతరించి పోయినవి. మా యూర నుండు మని గ్రామ నివాసు లెంత చెప్పినను వినక యా యవ్వ, తొలుత నున్నచోటనే యొక కుటీరమును గట్టించుకొని యది మొద లింతవఱకు మనుమరాలితో నచ్చటనే వసించు

చున్నది. కలనాఁడు కూడఁబెట్టిన సొమ్మొక్కింత యవ్వ కడ నుండుటచే నామె రెం డావులను, రెండు మేఁకలను గొన్నది. బోయపల్లె నున్న ముదుసలి బోయ యొకఁడు వారికిఁ బరిచారకుఁడుగాఁ గుదిరి యా పసులఁ గాపాడుచు, వాని పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, మున్నగునవి యమ్మి యొకపాలు తా నుంచుకొని మూఁడుపాళ్ళు యవ్వ కిచ్చుచుండను. దాన వారి జీవనము గడచుచున్నది. చిత్రమ్మకు వయసు రానురాను నావులు, మేఁకలు వృద్ధి పొందినవి. ఆ బాలిక వానికిఁ జక్కఁగ సంరక్షణ సేయుచు నవ్వకుపచారములు సేయుచుఁ దలిదండ్రు లందలి ప్రేమయుఁ దమ్ము నందలి ప్రేమయు నవ్వయందును బసులయందును జూపుచుఁ గాల క్షేపము సేయుచున్నది. ఇట్లు దినములు పోవం బోవ న మ్ముదుసలికి జవ సత్వము లుడిగిపోయెను. చిత్ర కిష్టము లేకున్నను బహు సంతతి నంతయుఁ దగిన వెల కమ్మివేసి యవ్వకొంత పైకముఁ గూర్చెను. చిత్రకిలు నవరించు భార మున్నను బ్రస్తుత మున్న కపిల గోవును, రెండు మేఁకలను వాని నిసువుల నేమఱక యెంతో గారాబముతోఁ బెంచుచు వచ్చుచున్నది; అవ్వ కఖిలోపచారము లొనర్చుచుఁ జంటిపిల్లవలెఁ బెంచుచున్నది. మూఁగ యయినను జిత్రమ్మకుఁ జెవుడు లేకుండుట చిత్రమే. మన మేమి చెప్పిన నా బాలికకుఁ జక్కఁగ నర్థ మగును. మాటల బదులు చెప్ప లేదు గాని, చూపులతోను, సంజ్ఞలతోను నంతకన్న నెక్కువగాఁ దన చెప్పఁదలఁచిన మాటలు మనకుఁ దెలియఁ జేయఁగలదు. అంత కంత కామె కెల జవ్వన మంకురించి విస్తరించుచు

మిసిమి మించిన పసిండి చాయకు మెఱుఁగు వెట్టుచుండెను.
ఇక్కడి వారిలో నొకరిద్దఱు చిత్రను బెండ్లాడఁ గోరిరి; కాని
యా యవ్వయు నామెయు నంగీకరింపరైరి. వారి యాచార
వ్యవహారములు నాలవ జాతికిఁ జెందియున్నను వా రే జాతి
వారో యేరికిని దెలియదు. కుల గౌరవము గల సంపన్ను
లెవరు వచ్చి నూఁగదానిం బెండ్లాడ నాసింతురు? తన పని
పాటులేమో తా నేమో కాని చిత్రకు లోక వ్యవహార
మేమియు నక్కఱలేదు. మొత్తము మీఁదఁ జిత్ర కులగౌర
వము గల కుటుంబమున, మంచి సంప్రదాయస్థులఁ గడుపునఁ
బుట్టినది. 'మంచి గుణములు గలది; ప్రేమకుఁ బెన్నిధి; అర
విరి తామర మొగ్గ వంటిది. అది యే భాగ్యవంతుని సొత్తో '
అని మా యూరి పెద్ద లనుచుందురు. చిత్ర, ఒక యాటలోనికి
రాదు; ఒక పాటలోనికి రాదు. బాబూ! సాయంత్రము
పాట లాటల కడకు వచ్చి యొక్క సారి చూచి యంతలోనే
చిత్రమ, కుటీరమునకు వెళ్లిపోయినది. తమరు చిత్తగింప
లేదు కాఁబోలును?"

శ్యామసుందరుఁడు చంద్రన్న చెప్పుచున్న చిత్రో
దంతమును వినుచు నూఁ గొట్టుచు నడచుచుఁ బలు రకము
లగు నూహలకు లోనగుచు, వాని ప్రశ్న వినియు విన నట్లు
నటించి, "చంద్రన్నా! చాల దవ్వరు దెంచితివి; ఇంక నీ వింటి
కరుగుము. రేపు ప్రొద్దుటనే వచ్చెదను. నీవు నన్నుఁ గనిపెట్టి
యుండవలయును. నే నీ యూర నుండు నన్నాళ్లును నీకు
దినమున కొక పావులా యిచ్చెదను. నీకుఁ బని యేమియు
లేదు. నన్నుఁ గనిపెట్టి యుండి నేఁ జేయుమన్నది చేయు

టుమే. తెలిసినదా! నాతో నీ ప్రసంగము చేసినట్లు లేరికిం దెలియ నీయకుమీ జాగ్రత్త. పోయి వచ్చెదవా!'' అని పలుక, 'చంద్రన్న, చిత్తము బాబయ్యా! ఏలిన వారి యానకుఁ దిరుగా! నా రాజా! నే నుందునా? సేవకుని పయి దయ యుంచవలెను' అని పలికి సెలవొంది వెను దిరిగి పాట పాడుకొనుచు వెళ్లిపోయెను.

శ్యామసుందరుఁ డిల్లు సేరుసరికి బండియు వచ్చెను. అందఱు నింటిలోని కరిగిరి. ఆచార్యులుగారు స్నానము సేయ నరిగినంత భట్టు, శ్యామసుందరునిం జూచి నవ్వుచు, 'అన్నా! చిత్రాబాయితో మాటలాడితివా? ఫలితార్థము సెప్పుము' అని యడిగెను. 'చిత్రాబాయి యెవరోయి!' అని శ్యామసుందరుఁడు వింతపడి యడుగ, నృత్తగాన సమయమున జనసంఘమున నుదయించి యే యిందు బింబము ని న్నాకర్షించినదో, గుట్టలు పట్టి తిరుగఁ జేసినదో యదియే చిత్రాబాయి' అని భట్టు పలికి పకపక నవ్వెను. అసాధ్యుఁడవు సుమీ! భట్టూ నీవు! పే రెట్లు తెలిసె నోయి?' అని శ్యామసుందరుఁడన నామె వచ్చినంతనే యచ్చట వారొక రిద్దఱు, 'చిత్ర, చిత్రాబాయి,' అని వ్రేలు చూపించుటచేఁ దెలిసికొంటిని. అని భట్టు పలికెను. ఇరువురు నవ్వుకొనిరి.

# 21

## పాణిగ్రహణము

" పాపము! చక్కనిపిల్ల. దిక్కుమాలి పోయినది. అదృష్ట దేవతా! నీకు మతిలేదు, ఆహా! ఆ ముద్దుగుమ్మ పలుకు లెంత యింపయి యుండెడివో! నా కా పలుకులు విను ప్రాప్తి లేదు కాంబోలు? ఆ కంఠస్వర మెంత మధుర మయినదో! చిత్ర మాటలాడఁ గల్గినచో నా యానంద మునకు మేర యుండునా? అదృష్టదేవత నపరంజి పూవులఁ బూజింపనా? చిఱుత తనమునుండియు నే నేల తపస్సుచేయ నైతిని? తపస్సు ధారవోసి యత్తరుణీ మణిని బలికించి యుండనా? ఈ చిన్న లోపముచే నా చిన్నారి చిలుకను జిన్న చూపు చూతునా? చూడను. నాకు దాని చేతనే యా దీనురాలి యందుఁ గనికారమును బ్రేమయు ద్విగుణిత మయినది. చంద్రయ్య యే మన్నాఁడు? ఆ రమణి, గుట్టల కవ్వలి తోఁటలో బోయపల్లెదరి కుటీరమున నివసించు చున్నదనియా? పశువులు తమ్ముని స్థానమ్మున నా ప్రేమ రాశికి ముద్దు ముచ్చటలు తీర్చుచున్న వనియా! పాపము! వానికి నోరులేదు. దానికి నోరులేదు. ఆ ప్రేమయే యచ్చ మయినది. నాకుఁ జిత్రా చరిత్ర మంతయుఁ జిత్రముగా నెమరునకు వచ్చుచున్నది. ఆ కుసుమకోమలి యనుభవించిన కడగండ్లం దలంచిన నా హృదయము నీరగు చున్నది. ఆ యనురాగ నిధానము తన తమ్మునిఁ బ్రేమించిన తీరు మూహింప తన్మానస స్థితి విశదమగు చున్నది. ఆహా! దాని

మానస మనురాగ రస పూరితము! తన్నుఁ బెంచిన యా ముక్కాలి ముదుసలిపైఁ జూపు భక్తి వర్ణనాతీతము! నే నెంత ప్రేమించిన నన్ను మాత్ర మంత ప్రేమింపదా? అట్టి మధురమయిన యమాయి కాను రాగమునకుఁ గల రుచి యనుపమానము. అట్టి విశుద్ధ హృదయతోఁ గూడి మాడి యుండుట యెంత భాగ్యము! ఎంత సౌఖ్యావహము! ఇంకను దెల్లవాఱ కున్న దేమి?'' అని శ్యామసుందరుఁడు రాత్రి తన శయన గతుండయి యాలోచించు చుండెను. అతని హృద యమునఁ జిత్రా దేవి యుండుట గని యసూయతో నిద్రా దేవి యా కుమార ప్రభుని చెంతఁ జేరదయ్యెను. ఏ తలంపుల లోనో యేమఱిచి నిద్రా దేవి యాతని నావేశించినను దాలి కోడికూఁత కులికిపడి విడిచి పాఱిపోయెను.

తెల్లవాఱెను. కాల్యకృత్యములు దీర్చుకొని, పెందల కడ భుజించి మన కథానాయకుఁడు తన తురంగము నెక్కి యకొండపల్లియ కేగెను. ఊరు దాఁటి నంతనే నదీ తీర మున గుఱ్ఱము దిగి దానిని నడపించుకొనుచు గుట్టల నడుమ నా సన్నని మార్గమున నరిగి యచ్చోఁ బచ్చికమేయ నయ్య శ్వమును విడిచి తొలినాఁటి యేటి రేవునకు వచ్చి యచ్చటి నుండి చిత్ర తొలినాఁ డంతర్ధానమయిన చిన్న త్రోవం బట్టి యా త్రోఁవం గడచి వెళ్ళి యట నొక కుటీరమును గాంచెను. ఆ కుటీరమునకుఁ జుట్టును దోఁటయును దానికిఁ జుట్టును గంతకమును గంచెయు నుండెను. నిర్జనమయిన యయ్యాట వీ ప్రదేశంబునఁ గూయు కల కంఠ కంఠస్వరము వినుచు మన కథానాయకుఁడు, గుబురుగా నున్న యొక తీవ జొంప

మున నిలిచి కుటీరము దెస విలోకించు చుండెను. "ఇది తప
స్వుల కుచిత స్థలము. పాపము! చిత్రయుఁ దపస్విని యే.
అదిగో! ఆ గూటనే నా రామచిలుక వసించుచుండును.
శైశవ దశనుండియు నా బాలిక కదియే శరణము.
అయ్యో! ఆ దీనురాలి తలిదండ్రు లచ్చటనే నివసించి తమపిల్ల
లతో నానందించిరి! ప్రాణపదమయిన యీ మెయనుంగుతమ్ముఁ
డక్కడనే చనిపోయినాఁడు! నాఁటి నుండియు నా నంద
లేశ మేమో యెఱుంగక, మంచి తిండియు మంచి గుడ్డయు
లేక, దేవకన్యా మణులఁ దలఁదన్ను నా యన్నుల మిన్న
యనద యయి యీ గుడిసెయందే వసించి కాలము గడవు
చున్నది! అదిగో, ఆ కుటీరము తలుపు తెఱవఁ బడినది.
అదిగో యక్కడ నొక బాలిక నిలిచి యున్నది. అదియే
చిత్ర" అని యను కొన్నంతలో నిర్జనమగు నవ్విపినము,
నిరుపేద తనమున కిరవగు నక్కుటీరము, సంతాపకరము
లగు నతని తలంపులు నెల్ల మాయ మయ్యెను. అ దంతయుఁ
జిత్రా లావణ్య రసంబునఁ బూఁత పూసినట్లు మెఱుఁగెక్కి
యాతని దృష్టి కమితానందమును గూర్చెను. ప్రేమగలచో
నుద్దియైనను ప్రకాశ వంతము గదా! చిత్ర కుటీరమునఁ
ప్రవేశించి యంతలోనే మబ్బు మాటునుండి యరుదెంచు
మవ్వంపు శంపాలతికయో యన వెలుపలికి వచ్చెను. ఆమె
వెనుక రెండు మేఁకపిల్లలు బయలు దేఱెను. ఆ కుటీరమున
కెదురుగ నున్న గోశాలలోని కరిగి చిత్ర, కపిలను దడవి
మోర గోకి ముద్దాడి మరల వచ్చెదనని చెప్పినట్లు చేసన్న
చేసి యటు విడిచి బయలు దేఱెను; మేఁకపిల్లలు ముందు

వడువ వాని వెలుకఁ దల (వేలవై చికొని యిటు నటుఁ జూడక శ్యామసుందరుఁ డున్న లతా కుంజము వైపునకే వచ్చు చుండెను. అనిమేష లోచనంబుల నా పోవక యా యంద కాఁ డా మందయానం దిలకించు చుండెను.

చిత్ర శ్యామసుందరుని జూడలేదు. అతని ప్రక్క నుండియే దాఁటిపోయి కాలువగట్టు త్రోవ నవలంబించి వెళ్లుచుండెను. సద్దు సేయక యమ్ముద్దుగుమ్మ వెనుకనే రాధ వెన్నంటి చను మాధవుని చందంబున మన శ్యామసుందర మూర్తి యరుగుచుండెను; కాని పలుకరింప లేఁడయ్యె; పలుకరించిన భయపడి కఠీరమున కరుగు నేమో యని జంకెను. అట్లు కొంత దవ్వరిగి చిత్ర యొకచో నాఁగి పచ్చికపయిం గూరుచుండెను. రెండు మేఁకపిల్లలును జెరి యొక ప్రక్కం జేరినవి. వాని యొడలు నిమురుచుఁ జిత్ర తాఁ దినఁ దెచ్చుకొన్న పండును, రొట్టెయుఁ బచ్చిక పయిం బెట్టుకొని చినచిన్న తునుకలు చేసికొని తినుచుండెను. మెలమెల్లగ శ్యామసుందరమూర్తి యా దేవీమూర్తి ప్రక్క కరిగి నిలిచెను. చిత్ర తన కుడిప్రక్కనున్న మేఁకపిల్ల వైపు చూచుటకుఁ దిరిగినంతలో దివ్య సుందరమూర్తి లోచన గోచర మయ్యెను. క్రిందటి సాయంకాల మగుపించిన శ్యామ సుందర మూర్తియే. చిత్ర యులికిపడెను. భయము చేతఁ గాదు; అచ్చెరుపాటుచేత. ఆ రాకొమరునికడ వెఱపొందించు లక్షణము లెవ్వియుఁ గానరావు. అతని చూపులు కరుణా పూరితములు; నెమ్మోము సంతోష నిలయము. ముగ్ధ గావున నా జవ్వని లేచి వెళ్లిపోవఁ దొలుతఁ దలంచెను;

కాని యతఁ డంతలో నా బిత్తరి చిత్త మెఱింగి, "భాగ్యశాలీ! నన్ను వదలి పోయెద వేని నా సంతాపమున కంతము లేదు. నీ కే హానియుఁ జేయ నే నరుదేర లేదు. నిన్నఁ జందప్రొద్దున నత్తరంగిణీ తటమున నన్నుఁ జూచి యుంటివి. జ్ఞాపక మున్నదా? నీ హితాభిలాషిని గాని నీకు భయ హేతువను గాను. ఆఁగుము" అని పలికి మందహాసము చేసెను. చిత్ర మోమునను జిన్ని నవ్వు మొలక లెత్తెను. తత్కటాక్షము లుత్తేజితము లయి వెఱ పొంద లేదని సాక్ష్య మిచ్చినవి. తాను వెఱపొంద లేదనియు నిన్న సాయంత్ర మయ్యోటి దరిని జూచినది జ్ఞాపక మున్నదనియు సన్నలతోఁ దెలిపి మాటలు రా నందులకు లజ్జించి యించుక తల వంచు కొని చిత్ర యూరకుండెను. అది యూఁతగొని శ్యామసుం దరమూర్తి యామె కించుక సమీపమున నాసీనుఁ డయి, 'చెలీ! నీవు మఱచితి వేమో కాని, నిన్నఁటి యా నిము సము మొదలు నేఁటి యీ నిముసము దాఁక నీవు నా హృదయ ఫలకమున హత్తియుంటివి సుమీ! కం డెఱుఁగని నీ సుంద రాకారమును, దాత్వికమగు నీ సాత్విక భావమును నే నెన్నఁటికిని మఱవఁ జాలను" అని పల్కెను. చిత్ర క దంతయు వింతగ వినిపించెను. మర్యాద నతిక్రమింపక దా దవ్వులఁ గూరుచుండి మధుర మధురముగఁ బ్రసంగించు నా రాకొమరుని సత్స్వభావమున కా యింతి యెంతయో సంతోషించెను; అతఁ డేమి వచించునో వినఁ గుతూహల మున్నట్టులు గన్నులెత్తి వాని మోము చూచి శిరంబు వంచు కొనెను. "నిన్న నిన్నుఁ గాంచినంత నే నీ యెడ నా కింతిం

తన రాని వాత్సల్య ముదయించెను. నీ వేమియు బదులాడక గిరుక్కున వెళ్లిపోయితివి. పిదప నే నొక బాలుని మూలమున నీ దీనచరిత్ర మంతయు నా మూలాగ్రముగ వింటిని. నా మనస్సు నీ దయిపోయినది. నీ శ్రేయస్సున కేమి సేయుమన్నను జేయుటకు సంసిద్ధుఁడ నయి యున్నాను” అని శ్యామసుందరుఁడు వక్కాణించుచుండ నక్కమలాయతాక్షి యక్షు లశ్రుభరితము లయ్యెను. చక్కని చుక్కయగు నా మూఁక బాలిక తలయెత్తి వియత్తలము వంకఁ జూచి మరలఁ దల వంచుకొని యుస్సురని వేఁడి నిట్టూర్పు విడిచెను. కన్నీళ్లామె లేఁజెక్కుల నుండి జాఱి బొట్టు బొట్టుగఁ గట్టు కోకపయిం బడుచుండెను. ప్రియానులాపి యగు న య్యకారణ బంధువు పరామర్శ మూలమున నత్తన్వి శోకపూర ముబ్బి పొంగి వెల్లివిరిసెను. ఆ కోమలి కోమల హృదయము సంచలించి పోయెను. సానుభూతిం జూపు ప్రియ జనాలాపమునఁ బ్రాఁతవడి యున్న దుఃఖము, ప్రబలమగుట సహజమే కదా!

అంత శ్యామసుందరుఁ డా సుందరిని జేరఁదీసి లాలించి కన్నీరు దుడిచి, ‘చిత్రా! నీ వలవంతను గరలించితినా? నన్ను మన్నింపుము. నీ విచారమును నేఁ బోఁ జేయఁ జాలనా? లలనామణీ! నీ కానందముఁ గూర్పలేనా? నీ వేఁడి యశ్రువు లింకఁ బ్రసరింపనీయను. నీ వీ విశాల ప్రపంచమున నెవరు లేనిదాన వింకఁగావు. నీ కొక ప్రాణమిత్రుఁ డున్నాఁడని ధైర్యమును దాల్పుము. అతఁడు నిన్నే నాఁటికిని మఱవఁ జాలఁడని తలంపుము. నీ జీవితకాలము నీతో

పాటు నీ కష్టసుఖంబులు పంచుకొను నాత్మబంధు వొకఁడు గలఁడన్నమాట మఱవకు. చిత్రా! నెచ్చెలీ! నిన్ను విడిచి నే నుండలేను. ప్రతి దినమును నే నిందు వచ్చి నీ సేమము విచారించి పోవుచుండెదను. నీతోఁ గష్టసుఖములు మాట లాడుటకు నీ వంగీకరింపుము. నీ విది నిరాకరించినచో నా గతి యధోగతియే. నీ కానంద మన్న దింక సున్నా. ఏ మందువు!'' అని యోదార్చి యడిగెను.

ఆ మాటలు మనస్సు కరఁగి వచ్చినవనియు నందించు కేని కపటము లేదనియుఁ జిత్ర గుర్తించెను. దాని యాశ్చర్య మునకు హద్దు లే దయ్యెను. అట్టి మధు మధు రార్థదములగు పలుకు లంతకు ముం దెన్నఁ డా మందయాన విని యెఱుఁ గదు. అట్టి నాగరక సంపన్న పురుషు న న్నాతిమిన్న యెన్నఁ డును గని యుండలేదు. అ య్యువకుని సంపన్న గౌరవ స్థితియుఁ దన దురదృష్ట స్థితియు నా యిందువదనకుఁ జక్కఁగ బుద్ధిని గోచరించెను. బుద్ధిశాలిని యగు చిత్ర, తొల్తనతని యున్నత స్థితిని, దరువాత దన హీన స్థితిని సంజ్ఞలచే వ్యక్త పఱిచి, 'యిట్టి దీనురాలి ప్రేమవలన నీ కేమి ప్రయోజన మనియో, యిట్టి బీదబాలికను మూఁగను ప్రేమింపఁ గలవా!' అనియో యర్థమును సూచించు సన్నలు చేసి,యత నిని ప్రశ్నించుచు నిదానించి వాని మోమును జూచెను. వాని చేతినుండి తనచేయి వదల్చుకొనఁ బోయెను. 'నేను నీ కేమాత్రమును దగను' అనియు సూచించెను. అది గుర్తించి దాని యుదార భావమునకు సంతసించి, యామె కరమును దన కరమ్మునఁ గీలించి హృదయ స్థానంబున నుంచుకొని,

చిత్రా! ప్రేమ దివ్య వస్తువు. నిన్ను నే నెప్పటికి నాకే తీరున నా ప్రాణపదముగాఁ బ్రేమింతును. నీ కేమి గావలసి నను జేయుదును. కాని, ప్రేమకు, నుపాధులనుబట్టి, భావములనుబట్టి పేరులు వే ఱయ్యెను. కావున నీ వన్యథా దలంపవేని నిన్నొక్కమాట యడిగెదను. అది విశదమయిన పిదప, నా ప్రేమ యే భావము నే నామమును బొందునో తెలిపెదను. 'ఈ రత్నశలాక, యే వంశాంకురమో వచింపుము' అని శ్యామసుందరుఁ డడిగెను. చిత్ర కేమి చెప్పుటకును దోఁచ కొక్కింత సేపాలోచించి, 'ఈ సుందరమూర్తి యే వంశాభరణము?' అని యడుగునట్టు లతనివైపు చూపించి ప్రశ్నను మరలించెను. "నేను మైసూరు రాజ వంశస్థుఁడను; ఒక యమీరున కేక మాత్ర పుత్త్రుఁడను. నా పేరు శ్యామసుందరమూర్తి యందురు" అని యతఁడు వల్కెను. ఆ కన్య సంతోషమునకు మేర లేదయ్యె. ప్రఫుల్ల సరోజాకృతిం దాల్చి యామె వదన మందమున ననుపమాన వస్తువయి భాసిల్లెను. కన్ను లుత్ఫుల్ల వికసితేందీవరమ్ముల సౌరు మీఱెను. దాని నెమ్మొగమ్మున నానంద రస తరంగంబులు తలసూపుచుండెను. కన్నులఱ మూసి యొక్కసారి యక్కన్యకామణి సర్వేశ్వరుని ధ్యానించి యతనిం జూచి తలంపులు పదిల పఱుచుకొని, తానును దద్వంశబంధుత్వము గలదాన నని సూచించి చిఱునవ్వున సిగ్గు నుయ్యాల లూఁగించెను. శ్యామసుందరుఁడు గెవ్వునఁ గేక వేసి బిగియార నమ్ముగువం గవుంగిలించుకొని యమ్ముద్దరాలి నును జెక్కిళ్లు ముద్దులతో ముంచివేసెను. "లలనా

శిరోమణీ! నా సంశయము దీరెను. నీ వే జాతి కన్యవయి నను నిన్నన్యగా భావింప ననుకొన్న నేను నా బంధువంశ సంజాతవని దెలిసిన పిదప నిన్నన్యగా నెంతునా? ప్రేయసీ! మన ప్రేమకుఁ బ్రేమయనియే పేరు, మఱి యనురాగము నైక్యభావము ననుకొందము. కొందల మొందకుము. 'నీవు నా దానవే, నేను నీ వాఁడనే' అని యతఁడనుచున్నంత, దూర మునఁ గుటీరాంతర్భాగమునుండి గణగణ మని ఘంటా నినా దము వినవచ్చెను.

ఘంటానాదము విన వచ్చినంతనే చిత్ర లేచి నవ్వుచు నిలువం బడెను. ఆ ధ్వని చిత్రను గుటీరమునకు రమ్మని యామె సంరక్షకురా లవ్వ చేయు సంజ్ఞ. అది తెలిసికొని శ్యామసుందరుఁడును నవ్వుచు మరల వచ్చెదవు గదా యని యడుగఁ జిత్ర తలయూఁచి యంగీకారమును సూచించి బయలు వెడలెను. మేఁక పిల్లలు చెవ్రు లాడించుకొని చిన్న చిన్న దాఁటులు దాటుచు నామె వెనుకఁ బరువిడి పోయెను. అనిమేష నయనంబుల శ్యామసుందరుఁ డామె యరుగు చున్న దెస వింలోకించు చుండెను. చిత్ర కుటీరద్వారముఁ జేరి తిరిగి తన ప్రియుని జూచి నవ్వి లోనికరిగెను ఆ చూపు నా నవ్వును మన కథానాయకుని డెందమున నాటుకొనెను. ప్రేమ లాలసులగు వారకే మాత్ర మాసూచన గానిపించి నను గోటి గుణితముగ నుండుట సాజమే కదా!

శ్యామసుందరుఁడు తన యుత్తమాశ్వమున్న యెడకు వచ్చెను. అతఁ డప్పుడు ధర్మవరమున కేగి చందవేళ మరల వచ్చునా? వట్టిమాట. ఆ తోఁటలోనే యందందుఁ దిరిగి

కొంత విశ్రాంతి దీసికొని యచ్చటి ప్రకృతి చిత్రముల నారయఁ దలంచెను. తన మిత్రులు పరివారము నేమను కొందురో యని యాతఁ డాలోచింపనే లేదు. వా రట్లు తన యెడఁ బాటలవాటు పడుటయే మంచిదని యతఁడెంచెను. తా నాచిత్రావిహార ప్రదేశములం దెక్కువకాలము గడప నెంచెను. తన యున్నత స్థితి గతుల నాతఁ డించుకయు గమనింపఁ డయ్యె; పట్టణ నాగరక సహవాసము విస్మృతి నొందెను. తన బ్రతు కంతయు న య్యాటవిక బాలిక తోడిదే యని యతఁడు నిశ్చయించెను. ఇరువది వత్సరంబుల నుండియు నొక్క రీతిని బోవుచున్న య య్యువకుని జీవిత చరిత్రము నూతన మార్గము నవలంబించెను. అతని యూహ లంతలో నెంతో మాఱిపోయెను. ప్రకృతి, చిత్ర విచిత్రము. అది యూహాతీతము. అ దెంతలో నెంత తాఱుమాఱైన నగును. సంపుటీ కరణ గుణ దోషంబులచే, వ్యక్తి తత్త్వ మూహింప నలవిగా నంత మార్పుచెందును.

శ్యామసుందరుఁడు చెంత పల్లియ కేతెంచెను. తొలి నాఁటి పరిచయమున నలుగు రైదుగు రెదురు వచ్చి యతనిం బలుకరించి గౌరవించిరి; ఫలములం గొని తెచ్చి యిచ్చిరి. ఫలాహారము సేయుచు నతఁడు వారిని జిత్రాచరిత్రము నడిగెను. ఆమె తలిదండ్రుల స్వభావములు, వారి జాతి నీతులు, బాల్యమునఁ జిత్ర, తలిదండ్రులకు దూరమై పోవుటయుఁ బిదుగు పాటువలనఁ దన తమ్ముఁడు చనిపోయి నంతనే వాగింద్రియమును గోల్పోవుటయు, నామె సత్ప్రవర్తనము, దయాదాక్షిణ్యములు మున్నగు నవి తాను జంద్రన్న వలన

విన్నవియుఁ జిత్రా సహవాసమునఁ గన్నవియుఁ దా నూహించినవియు యథార్థములని యతఁడు వారి మూల మునఁ దెలిసికొనెను. అందఱు నా దీనురాలిం గూర్చి జాలి పడువారే. 'పాప మున్నత వంశమున జన్మించినది, పేద రాలు, మూఁగదయి పోయినది. ఎవ రా బాలికం బెండ్లాడు దురు ? ఆమె జాతివా రీ ప్రాంతమున లేరు' అని యెల్ల రును జాలిపడిరి. ఆ పల్కు లాలించి, శ్యామసుందరుఁడు దన మనమ్మున, "ఔరా కాల మహిమ! ఏ యంతః పురము ననో, పరిచారికా శతంబులచే సేవింపఁ బడుచు నింద్రాణిం బోలె విహరింపఁ దగిన చిత్రాదేవి కిట్టి యవస్థయా ! కౌ త్కనక మణిగణ విరాజితంబగు రాజరాజ మకుటాగ్ర సీమ నలంకరింపఁ దగిన యమూల్య రత్నము, కాఱడవులం బడి కానికిం గాని గాజుపూస గావలసి వచ్చెనా ? మహీశూర కళ్యాణ నగరాదులం గల యుత్తమ నాగర కాంగన లిమ్మత్త కాశిని కాలి గోరగోటికైన సరిపోల నేర్తురా ? నా కా నాగరకలోక మక్కఱ లేదు. నా చిత్రతోనే వనవాసినై యీ కుటీరమ్మున నున్నను నమరావతీ నందనోపవన వాసుల కంటె నెక్కువ హాయి గాంతును" అని యనుకొనుచు లేచి చంద్రన్నను బిలిచి కొంత సొమ్మిచ్చి తన గుఱ్ఱమునకు దాణా పెట్టి పచ్చిక మేపించుమని చెప్పి యొక్కఁడును మరలఁ దోఁటలోనికి వచ్చి తరుచ్ఛాయ నించుక విశ్రమించెను.

పది పదునేను నిముసములు విశ్రమించి లేచి శ్యామ సుందరుఁడు చిత్రను జూడఁ దలఁచి కుటీర ప్రాంతమునకు వచ్చెను. కుటీరముచుట్టు కంచె నాలు గడుగు లెత్తుగ నుండు

టచే నందొక ప్రక్కనుండి పర్ణశాలవైపు దృష్టి సారించెను. ఆ తోఁటలో ఫల వృక్షములు నాలుగైదున్నవి; కూర పాదులు పందిళ్లు నున్నవి. పెరటి గుమ్మములోఁ గూరుచుండి భుజించి యవ్వయుఁ జిత్రయు నప్పుడే లేచి చేతులు గడుగు కొనుచుండిరి. అతఁడా యిరువురి పరస్పర ప్రేమను బరికించు చుండెను. భోజనమయి నంతనే చిత్ర యా యవ్వ చేయి పట్టుకొని, యా తోఁటలో నిటునటుఁ బది నిముసములు పచారు చేయించెను; తరువాతఁ దీసికొని పోయి పెరటి గుమ్మములో నా యవ్వను గూర్చుండఁ జేసెను. అవ్వయుఁ జిత్ర నొడిలోఁ గూర్చుండఁ జేసికొని తల సవరించి, చెక్కులు నిమిరి కౌఁగిలించి ముద్దాడి యేమో మెల్లగా నడుగసాగెను. ఆ మాటలు శ్యామసుందరునకు వినిపింపలేదు గాని వానికిఁ జిత్ర యొసంగు సంజ్ఞా ప్రత్యుత్తరములును, నప్పటి యచ్చిఱుతుక హావ భావములును గ్రహించి వృద్ధురా లడిగిన ప్రశ్నలఁ గొన్నింటి నతఁడు గ్రహింపఁగల్గెను. మొత్తము మీఁద నమ్ముదుసలికిఁ జిత్ర, ప్రాణపదమయిన ముద్దుబిడ్డ, చిత్రి కామె వాత్సల్యనిధి యగు మాతృదేవత, యని యతఁ డనుకొనెను. చిత్ర మాత్ర మప్పు డప్పు డడవి దెస విలోకనప్రభలఁ బరువెత్తించు చుండెను. అందలి సారస్యమును గ్రహించి తత్ప్రియుఁడు బ్రహ్మానందము నొందెను. ఆ కుమారప్రభు వొక్కబిగి నా కంచె దాఁటి యా చిన్నిబోటిం దన యక్కున గదియించుకొన నెంచెను గాని వృద్ధురాలచట నున్న దగుటచేఁ దన భావమును బదిలపఱుచుకొనెను. అవ్వయు మనుమరాలు నింటిలోని కేగినంత

నతఁడు మరలి తోఁట కరుదెంచెను. అచటి సర్వప్రకృతియు నతనికిఁ జిత్రామయ మయి కానిపింప సాగెను. ప్రతి వృక్షమును, బ్రతి లతయుఁ, బ్రతి గుల్మమును నతనికిఁ జిత్రా చరిత్ర ముపన్య సించుచున్నట్లు దోచెను. తొమ్మిదేండ్లనుండియు నేకాకిని యైన య య్యనాథ బాలిక కీ ప్రకృతియే తోడునీడ యయ్యెను. అది చూచుచు నతఁ డెన్నో మాట లనుకొను చుండెను.

సుందరుఁడు మెల్లగాఁ దిరిగి నదీ తీరమును జేరెను. అదియే తొలుదొల్తఁ దాను చిత్రాదేవిం గాంచిన పుణ్యతీర్థము. ఆమె కూరుచున్న చోటనే యతఁడు గూర్చుండెను. చిత్ర వచ్చుట కింకఁ జాలసేపు పట్టును. కాలక్షేపమునకై యా రాకొమరుఁడు మొలనుండి తాటియాకును గంటమును దీసి పద్దెములు వ్రాయ మొదలిడెను. ఎవరిపయి నీ కవనము? చిత్ర ప్రకృతిపైని, చిత్ర స్వభావము మీఁదను, జిత్ర మీఁదను. అంతకంటె వర్ణ్య మింకేద్ది గలదు? గంటమును గలమును బట్టుకొన్న కవివరునకును బ్రహ్మధ్యాన నిమగ్నుఁడగు యోగివరునకును గాలముపోక తెలియరాదు. ప్రేమానంద లహరిలో నోలలాడఁగల వా రందఱును గవీంద్రులే కదా! ప్రేమ ప్రవాహమునఁ దా మరుగుచున్నప్పుడు కవీంద్రులు పరవశులు గారా? మహాకవి విరచితములగు ప్రకృత్యనురాగ వస్తు తత్త్వములం జదివి రసికులు పరవశు లగుచునే యుందురు. అట్టి వేళంగూడఁ బ్రొద్దుపోక తెలియదు. మన మొక యింపయిన భావవర్ణనము గావించు చున్నప్పుడు మైమఱచుటలో వ్యాస వాల్మీకాదులకుం దీసిపోము. శ్యామ

సుందరుఁడు గూడఁ జిత్రా భావవర్ణ నానందమ్మున మేను మఱచి గంటమును బరువెత్తించుచుండెను. ఆచార్యుల కడ నభ్యసించిన సాహిత్య మపరంజి యయ్యెను. అది భట్టు సహవాస యోగంబునఁ గవనాలంకార రూపమును దాల్చెను. అదప్పుడు చిత్రా దేవి నలంకరించి భూషణ భూష్య భావముం జెందెను.

చిత్రభానువు గ్రుంకు మెట్టలకు మెఱుగు వెట్టుచుండెను. చిత్ర మెల మెల్లగ వచ్చి సుందరుని వెనుక నిలువంబడి, యతఁడు తన్మయుఁడై వ్రాయుచుండుట గాంచి దరహాస సుందర వదనారవిందయై యానందించుచుండెను. పద్యములు పూర్తియయ్యెను. ప్రొద్దు వంకఁ జూచి శ్యామసుందరుఁడు వెను దిరిగి చూచెను. తిర్యగ్వివృతములయి యొండొరుల దృష్టులు సమ్మిళితము లయినవి. చిత్ర యించుక నానఁ జెందెను, లజ్జారుణిత కపోలయగు చిత్రాకుమారి చేయి పట్టుకొని సుందరుఁడు తన ప్రక్కం గూర్చుండఁ జేసి, తానందాఁక వ్రాసిన గీతములను బద్దముల నొక్కటిగఁ జదివి వినిపించి, యం దందుఁ గల విశేషములను దెలియ వివరించి, నడుమ నడుమ నవ్వుచు, నా కవిత్వ మెట్టు లున్నదని యడిగెను, చిత్ర కంతయును బోధపడెను. .“ తాను శకుంతల, తన ప్రియుఁడు దుష్యంతుఁడు. పాక, కణ్వాకుటీరము, అవ్వ, కణ్వర్షి.” “తాను రాధిక, తన ప్రియుఁడు, రాధికాప్రియుఁడు శ్యామసుందరుఁడు. తా నున్నది బృందావనము.” ఆ యాయంశముల కుపోద్ఘాతములు చెప్పి, తత్తత్కథలను సంగ్రహముగా నుపన్యసించి, తత్తద్భావముల వివరించి ప్రియుఁడు

చెప్పు చున్నప్పుడు చిత్ర హృదయమున నపురూపము లయిన భావము లుదయించెను. చెక్కిలి చెక్కిలిం జేరు నపుడు నీప వల్లరి నా న ప్పల్లవాధర, పులకితాంగియై యతనిం దన హృదయస్వామి గోపాలమూర్తింగా దలంచి, తాను రాధాత్వము నొందెను. లోక యాత్రా తంత్రపద్ధతి నంతగా నెఱుంగని యమాయిక జన మన స్సరణి నెఱుంగ మనస్సే మంచి సాధనము. పెద్ద పెద్ద నాగరక కుటుంబము లందు మాత్ర మీా సాధనము విపరీతగతిం బడి చెడిపోవును. సాధనము మొదటి వర్ణచ్యుతి నొందినచో ఫలసిద్ధి నొందును గాని యది నిశ్చలము కాదు.

చిత్రకు శ్యామసుంధరుని కడ నింత చనవు గలిగెను. అంత సిగ్గుగాని బెట్టుగాని యప్పటి యామె చిన్నెలలోఁ గానిపింప దయ్యె. పడఁతులకు సాధారణముగాఁ బదునాఱవ యేఁటనే లోకముతోఁ బరిచయము గలుగ మొదలిడును. సాత్త్విక భావుఁడు, దయాశాలి, కోమల హృదయుఁడు, చూడ సొంపైన యందగాఁడు, అమీరు బిడ్డఁడు, దీనురా లయిన తన్నిం త ప్రేమించు చున్నాఁడు; ముద్దు సేయు చున్నాఁడు. ని స్సహాయ మైన యీా విశాల ప్రపంచమునఁ దన యవ్వ గాక తనకుఁ బ్రాణాధారమయిన వస్తు విం కొకటి యమూల్య మయినది తనంతన చేకూరినది. అక్కడి కాఁపులు దన్నుఁ గనికరించువారే. కాని యది సర్వజన సాధారణ మైనది. శ్యామసుందరుని భావ ముదారము. వాక్కులు దయారస రంజితములు. అతనిం గాంచి యమ్మనోహరా కారుని ప్రసంగము విన్నప్పటి నుండియుఁ జిరకాలము

నుండి తన మనంబునఁ జెంపొంది గడ్డకట్టిన దుఃఖభారము, తనకుఁ దాన కరఁగి యంతకంతకుఁ జులుకన యగుచున్నట్లు లా జవ్వని గుర్తించెను.

జగచ్ఛక్షువు మఱుఁగుపడెను. "హృదయేశ్వరీ! ఏమాలోచించు చుంటివి? నీ లోపముల నెంచకుము. నా హృదయ మెచ్చట లగ్నమయినదో యదియే నా జీవితేశ్వరి. నే మోసగాఁడను గాను. నీ వొండు దలంప వలదు" అని శ్యామసుందరుఁ డనఁ, దన శాయూహాయే లే దనియుఁ దన హృదయమును దాను నతని కర్పించితి ననియు సూచించు సంజ్ఞల నామె గావించెను. శ్యామసుందరుఁడు చిత్రపాణిని గ్రహించెను. ఆమె యొడలు జల్లని పులకరించెను. అనను భూతమగు సంభ్రమ మా యువతీ హృదయమునఁ బొడసూపెను. ఆమె గుండెలు దటతటఁ గొట్టుకొన సాగెను! ఆపాద మస్తకము గాలికిఁ గదలు రావియాకు ననువున సంచలింపఁ దొడఁగెను. తా నేమి సేయవలయునో తెలియక చిత్ర, ప్రియుని వదనముం జూచెను. అది సంభ్రమపాటని గ్రహించి శ్యామసుందరమూర్తి, చిత్రం జేరఁదీసి చెక్కిలి నొక్కి ముద్దిడికొని యా సంభ్రమము నణఁచెను. ఆ లలనా లలామ పరవశ యయ్యెను. ఆనంద సుధా తరంగ మాలికా డోలికల నామె హృదయ మూఁగుచుండెను. తచ్ఛక్షూరాజీవ యుగళ మానందాశ్రు మరంద మిళితమై యా మిత్ర కర స్పర్శనంబునఁ బ్రఫుల్లమై విలసిల్లెను. బేడిస కనూల తళుకుల నగుఁ జిమ్ముచుఁ దళుకుతళుక్కను మెఱుఁగారుచూపు లాతని యానన లావణ్య రసంబున నీఁదులాడు చుండెను. ప్రియుని

కౌఁగిలిలోనుండి, తన దుఃఖమును ప్రపంచమును గూడ మఱచి చిత్ర చిత్రాకృతిం దాల్చెను. వారిప్రేమం బిలకించు చున్న వా రెవ్వ రచ్చట నున్నారు? నిరంతరము కలకల ధ్వని సేయుచున్నది మతల్లిక, శకుంతవ్రాతము, తరులతాదిక మగు తత్ప్రకృతి. ఇంకఁ బైనున్న భగవానుఁ డాదిత్య దేవుఁ డా యువతీయువకుల ప్రేమ పత్రమున, రాగ రంజిత మగు తన వృద్ధకర సూచికతో సాక్షి వ్రాలు చేసి యదృశ్యుఁ డయ్యెను. కర్మసాక్షికంటె సాక్షు లెవ్వరు గా వలెను? ఆ దంపతుల యనురాగమే మిన్ను ముట్టినన్నట్లు సంజ కెంజాయ లెల్లెడల నల్లుకొనియె. వారి హృదయ వీధుల స్ఫురించు సుఖ భావము లన నీలాంబర తలంబునఁ దళుకు తళుక్కునఁ జుక్కలు స్ఫురించె. కాని యా నూత్న దంపతు లేవియో మాటలు సంజ్ఞలు చెప్పుకొనుచునే యుండిరి. అంతలో వరుని యశ్వము సకిలించెను.

చిత్ర యటువైపునఁ జూపి ధర్మవరము దెసఁజూపి వెళ్లిపోయెదవా? యని ప్రశ్నించెను. అతఁడు చిత్ర చేయి పట్టుకొని తురంగము కడకుఁ దెచ్చి, 'ప్రేయసీ! నా పరి వారము ధర్మవరమున నున్నది. నా మిత్రు లిద్ద ఱచ్చట నున్నారు. ఇప్పుడు నే నా యూరు వెళ్ళిపోవలెను. మగుడ ఱేపు ప్రొద్దు దూరునంత కిచ్చట నుందు నని నమ్ముము. ని న్నిక్కడ నుంచి నే నక్కడ నొక నిముసమయిన సుఖ ముగ నుండ లేను' అని పలుకఁ జిత్ర నవ్వెను. ఆ నవ్వున కతఁ డొక ముద్దు బహుమానముగా నిచ్చి గుఱ్ఱ మెక్కెను. చిత్ర కొంతవడి కంపకము పెట్టి తోఁట పొలిమేర నాఁగి

పోయెను. వీడుకొని యా దొరబిడ్డఁడు తురగమును వద లెను. గుఱ్ఱపు డెక్కల చప్పుడు విన వచ్చునంత కక్కడనే నిలిచి ప్రియుఁ డరిగిన దిక్కు సూచుచు నుదయించిన చంద మామను జూచుచు మరలి చిత్ర యిరవుఁ జేరుకొనెను. నాఁ డా బాలికా రత్నమునకు నూతన పరిస్థితు లేర్పడెను; చూపులు తలంపులు మాఱెను. హృదయ ముకుళము విక సింపఁ దొడఁగెను. ఏ నాఁడు నెఱుంగని వింత సంతోష మా చిన్ని యింతికిఁ గలిగెను. తన నూతన చరిత్రమును దలంచుకొని యా షోడశి నవ్వుకొనెను. నిరంతర చింతా భరంబునఁ గ్రుంగుచున్న వారి కేపాటి సంతోషము గలిగి నను దాని కెంతో విలువ యుండును.

## 22

### అ ను రా గ ల త ల ల్లు కొ ని యె ను.

ఆచార్యులుగారును భట్టును భోజనము సేయక శ్యామసుందరుని రాకకై యెదురు సూచుచుండ నతఁడు తన తురంగమును వెన్నెలలోఁ బరుగెత్తించుకొని వచ్చెను. పరివారము తెలివి నొందెను. అందఱును భుజించిన పదప నేకాంతమున భట్టు శ్యామసుందరుని కడకేగి, 'యన్నా! నేఁ డింత సేపు పనియున దేమి? వింత లేమి?' అని యడుగ, నక్క డక్కడఁ బ్రకృతి చిత్రముల నారయుచుఁ గడు దవ్వరిగితిని. అందుచే జాలమైనది' అని సుందరుఁడు బదులు సెప్పెను. 'మంచి ప్రకృతి చిత్రములే లెమ్ము. వా, వా, నీ కేమి యీ పల్లెటూళ్లను, నీ యడవులును, నీ కొండలును, నీ యాటవిక

చిత్ర ప్రకృతియు నింత మనోరంజకము లైనవి? మరలి యింక బెంగళూరునకుఁ బోవుదము' అని భట్టు పలికెను, 'మీా పెనుగొండ జమీాందారిణిగారి దర్శనమునకా?' అని శ్యామసుందరుఁడు నవ్వుచు నడిగెను. 'దాని ముండ మోసి నదిలే దాని యూసు చెప్పకుము నా యెడలు మండును' అని భట్టు పలికెను. 'సరిసరి యాది వచ్చినది. సావేరి కృతి విన నిచ్చఁ గలిగినది గాఁబోలును! అన్నట్టు భట్టూ! దుర్గా ప్రసాదు నంపితివే, నీ సీతా సమాచార మేమయినఁ దెలిసి నదా?' అని శ్యామసుందరుం డన, 'లేదు, అన్నా! ప్రాప్త మున్నచో నన్నియుఁ దమంత నవే సమకూరును. మన మేల తొందర నొందవలయును? ప్రసాదు నచ్చటనే మనము తిరిగి వచ్చువఱకు నుండు మంటిని. నీకు సరియయిన సరదారు సుమీా వాఁడు. ప్రకృతి చిత్రము లన్న వానికి నెంతో ప్రీతి. కాని, దేనికిని, మితి యుండవలయును. చెట్లు, చేమలు, నదులు, పొదలు, గట్టులు, పుట్టలు, గుట్టలు నన్నిచోటుల నొక్కతీరున నే యుండును. ప్రతి విషయమును గనుగొన వలె నన్న మన జీత కాలమంతయుఁ గ్రుమ్మరితినను నొక మండల మయినం బూర్తిగఁ జూడఁ జాలము. కావున నిచ్చటి యాటవిక చిత్ర ప్రకృతి విమర్శనమును జాలించి ముందటి కరుగుదము. లేదా వెనుకకు మరలుదము. పెదపెద్ద నగరముల కేగినచోఁ జూడవలసిన చిత్రము లెన్నియో నుండును. దిక్కుమాలిన యీా గుట్టలలో నట్టడవులలో నీ కే మున్నది?' అని భట్టుపన్యసించుచుండ నడ్డు వచ్చి శ్యామసుందరుఁడు, "భట్టూ! ప్రకృతి సౌందర్యము పలు రుచులు గలది. ఎవరి

కేది యిష్టమో యెవరి కెఱుక? ఇచ్చటి ప్రకృతి శోభ నా మనం బాకర్షించినది. కావున నింకఁ గొన్నాళ్ళీ ప్రాంతముల నుండఁ దలంచినాను. మీ కిష్టమయ్యె నే నిచ్చట నుండుఁడు; కాదేని యిష్టమగు తావున కరిగి తిరిగి రండు. కలసి వెళ్లి పోఫదము" అని పలికెను. "అన్నా! ఆ చెంచెత వలననే నీ మాట లీ జాడం బట్టిన వనుకొందును" అని భట్టు పలుక, "భట్టూ! అట్టి బెంగళూరు మైసూరు నగరముల లోనే నా చిత్తము నాకర్షించు కన్నెలు గానరాలేదు గదా ఖూ పల్లెలలో గుట్టలలో నెవ రుందురు? నీ కంత పరిహాసా స్పదమయినద గదా నా నడవడిక?" అని సుందరుం డనెను. 'లేదన్నా! కోపింపకు. ఆ శ్యామసుందరునికి మధురా నగర కాంతలపై మనసు దగులలేదు. గొల్ల పడుచు బృందావన వాసిని, ప్రేమైక నిధాన రాధ పై మరులు వొడమెను. తన్నామధారివి గావున నట్టి చిత్ర ప్రకృతి నీ కింపయిన దేమో యని యడిగినాను. గాజు తాలలో గరుడ పచ్చ లుండుట సంభవ మేమో' అని నవ్వుచు భట్టు వచించెను. "నీవలె నందఱు నను కొన్నావు. నా కేమి మంత్రములు వచ్చునా తంత్రములు వచ్చునా? నీవో, సన్యాసులను మాచ కన్నులను దోఁచు స్వభావము వాఁడవు. నీ ప్రజ్ఞను బట్టి నీ వితరుల విమర్శింతువు. నీ కవసరమయినచో బెంగళూరు వెళ్ళిరమ్ము. అప్పు డన్నియు సమన్వయించును" అని నవ్వుచు శ్యామసుందరుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అటులు ప్రసఁగించుకొనుచు నా యిరువురును నిద్రకు లోనయిరి.

మఱునాఁడు, సుందరుఁడు పెందలకడ భుజించి యశ్వారూఢుండయి, బోయపల్లెకు వచ్చెను. గుట్టల కవ్వలి మైదానమున నొత్తుగఁ బెరిఁగిన పచ్చికబీడులోఁ దనఘోటక మును విడిచి, లోయదాఁటి తోటలోనుండి కుటీర ప్రాంత మున కేతెంచునంతఁ దనకై నిరీక్షించుచున్న చిత్రాటవీ దర్శన మాతనికి లభించెను. ఆమె తన సహచరములగు సజ పోతముల నడుమఁ గొలువు దీరి యతఁడు వచ్చు మార్గమున దృష్టి నిలిపియున్న దగుటచే నతఁ డగుపించినంతనే తటా లున లేచి యెదురేగి ముసి ముసి నవ్వులు నవ్వుచుఁ గై దండ యొసంగి ప్రియునిఁ దోడ్తెచ్చెను. ఇరువురు నొక్కచోఁ గూర్చుండిరి. వారి యానందమునకుఁ బారము లేదు. అతఁడు మఱి రాఁ డేమో యని యా బాలికయుఁ, దన దుడుకుఁ దన మునఁ దప్పించి యా కళ్యాణి రా దేమో యని సుందరుఁడు ననుమానించుచున్న వా రగుటచే న ప్పరస్పర సమ్మేళన మెంతో సంతోష ప్రదముగా నుండెను. కొన్ని గడియ లే సహవాస సౌఖ్య మనుభవించినను నయ్యువతీ యువకులు చిరకాలము కలసి మెలసి యున్న దంపతుల యనువునఁ జనవు గలిగి యుండిరి. అ య్యిరువురి హృదయములును బరి శుద్ధ ముకురముల వంటివి. ఒం డొరుల భావములు చక్కఁగ నందుఁ బ్రతిఫలించినవి. ఇంక సిబ్బితికిఁ గాని, భీతికిఁ గాని యెడమేది? ఒక రొకరిం జూచినంతనే నెమ్మోములఁ జిఱు నగవులును ననురాగ దృక్కులు నుదయించి స్వాగత విధిని నెఱవేర్చినవి. ప్రేమ విద్యుచ్ఛక్తి వంటిది. నిమిష ములో నెంతమ ట్టయిన వ్యాపింపఁ గలదు. పాపము! ఆ

మూఁగ బాలిక ప్రేమ నిధానము ! సౌందర్యమునకుఁ గాని భోగభాగ్యములకుఁ గాని, మఱి యే లాభ మపేక్షించి కాని యా ప్రభు కుమారుని ప్రేమించినది కాదు; వాని సాను భూతికిని ననుకం పాతిశయనమునకును, మంచి తనమునకును గరఁగి యాత్మార్పణము చేసివేసినది. మాయలు మర్మములు టక్కులు టెక్కులు గోటు సీటులు న య్యబలా రత్న మెఱుఁగనే మెఱుఁగదు.

మఱి శ్యామసుందరుఁడో చక్కని నాగరక శిఖామణి, ప్రేమాంబురాశి, దయాళువు. డాబు, దర్పము, వంచనా కౌశలము నెఱుంగని యకారణ దీన బంధువు. ఆ విపిన కుసుమమును జూచినంతనే తత్సుమ మామోదమున కతఁడు వశుఁడయ్యెను; ఎద నీరు సేయు నామె దీనోదంతమును వినినంతనే, తన సర్వస్వము దారవోసియైన న క్కోమలి కడగండ్లఁ బోఁజేసి, పరితాప ధూమావృతమయిన యచ్చిన్నారి హృదయ దర్పణమును ననురాగానిల బలమ్మున సహజ తేజో విరాజితముగఁ జేయ నిశ్చయించెను; కృతకృత్యుం డయ్యెను. ఇంక ననుమానమునకుఁ దా వేది? ఏ వేవో మాటలు చెప్పుకొనుచు నే వేవో సన్నలు చేసికొనుచుఁ గొంత తడ వచటవారు గడపిరి. వారి హృదయ సమ్మేళనమునకుఁ బంచమహాభూతములును, వినిర్మలయయిన ప్రకృతికాంతయుఁ దమ సంతసమును వెలిపుచ్చుచున్నట్టు లప్పు డప్పు డా దంపతులపైఁ బూల వాన గురియించు తరులతా సంతానమును, న య్యాజ పోత ద్వయమును, సర్వాంతర్యామియయిన సర్వేశ్వరుఁడును సాక్షు లయిరి.

అంతఁ గొంత సేపటి కా చిన్ని కాంత లేచి కుటీరము వైపు చూపించి, వెళ్ళి వచ్చెదనని సంజ్ఞ చేసెను. అర నిముస మయినఁ దన నూతన ప్రేయసి నెడఁబాయఁ జాలని యా ప్రియుఁడు త్రోవ కడ్డముగా వచ్చి నిలిచెను. చిత్ర కొడలు జల్లు మనెను; కన్నులు చెమ్మగిల్లెను. మాంత్ర దేవతా స్థానమున నుండి తన్ను సాకిన యా యవ్వ కే వేళ కేమి కావలసియుండునో కనుఁగొనుట యా ముఁగబిడ్డ కలవాటు. అది యెఱుఁగఁ డా రాచబిడ్డఁడు. అప్పు డామె తలంపు గుర్తించి, 'చెలీ! నన్ను మన్నింపుము. నిన్నెడఁ బాయఁ జాలని కతమ్మున నీ తలం పెఱుఁగక యడ్డు వచ్చితిని. ఇప్పుడది విస్పష్ట మయినది. నీ పెంపుడుతల్లి యెడ నీకుఁ గలభక్తి కెంతో సంతోషించితిని. ఆమె సంరక్షణ కార్యము నెప్పుడేమఱ రాదు. వెళ్లుము. ఇం కెప్పుడు నాటంక పఱుపను' అని శ్యామసుందరుఁ డామె ననునయించి బుజ్జగించెను. చిత్ర, తదీయ వదనమును దదేక దృష్టితోఁ గొంతసేపు చూచి, పిదప ధర్మచర మార్గమును, దన కుటీరమును జూపి ఒక సన్న చేసెను. "మన మింత దవ్వైనఁ గాపుర మున్నారము గదా! ఎడఁబాయక యేక మయి యుండు టెట్లు పొసంగును?" అను నా సన్నఁ దెలిసికొని యా కుమారప్రభువు దరహాస మధుర పల్లవమునఁ దాండవించుచుండ, 'నీ వీ కుటీరమును విడిచి నాతోడ రమ్ము. మన మిద్దఱ మే నాఁటికి నెడఁబాయక యుందము' అని పల్కెను. అది విని చిత్రయు నాతని హస్తము బట్టుకొని కూర్చుండఁ జేసి ప్రక్కను గూర్చుండి ప్రియుని నెమ్మోముఁ జూచి మందహా

సము సేసెను. ఆ యలివేణి కుంతల కలాపము, సమీర వశం బున నొక్కసారి యెగిరి శ్యామసుందరుని నెమ్మొము నాక్రమించెను. పక పక నవ్వుచుం జిత్ర, తన కేశపాశమును జక్కఁ గూర్చుకొనెను. దాని యానందము వర్ణింపఁ దరము గాదు. ఆ చిన్నారి విన్నాణంపు సేవధిం జెక్కఁ గేటి యక్కునం గదియించుకొని యతఁడు తదుత్తమాంగమును దన విశాలోరస్థలంబున నుంచుకొని దాని ముంగురులు సరిపఱుచుచు నెఱ్ఱవడిన గులాబి చెక్కులను ముద్దులతో ముంచివేసెను. సన్నని యా చిన్ని తరుణి నిశ్వాసవాయువు లా యందకాని కపోలంబునఁ బ్రసరించెను. మందహాస వశంబునఁ బెదవు లెడఁబడ ముత్తెపుంగోవం బోని యా బిత్తరి పల్వరుస సొంపును దిలకించుచుఁ జక్కెర మోవి నాని శ్యామసుందరుఁడు పరవశుం డయ్యెను. చిత్రయు మేను మఱచెను. పులకిత గాత్ర మగు నా ప్రియదంపతి యెంత యానందము ననుభవించి యుండునో యనుభవజ్ఞులకే యెఱుక.

నాఁటి పూర్వార్ధ మటులే కడచెను. చిత్ర, పర్ణశాలకుఁ బోయెను. సుందరుఁ డా తోఁటలో నుండిపోయెను. ఆమె యతనికై పండ్లు పాలు రొట్టెయుఁ దెచ్చి పెట్టెను. తన భోజనవేళఁ దప్పఁ దక్కిన ప్రొద్దంతయుఁ జిత్ర ప్రియుని విడిచి యుండదయ్యె. అప్పుడప్పుడవ్వ కేమి కావలయునో యని పర్ణశాలకేగి యాపె దిరిగి వచ్చుచుండెను. కాని, నాఁ డా ముదుసలి సాపడిన పిదప సాయంత్రము దాఁక నిదురనుండి లేవలేదు; సంజప్రొద్దున లేచెను. తత్పరిచర్యావ్యగ్రయై చిత్ర యపుడు మాత్రము గొంతసేపు తన మిత్రుఁ

నెడఁబాసి యుండెను. సుందరుఁడును గాలువ గట్టునఁ గూర్చుండి చిత్రాగమనమును నిరీక్షించుచు దాటి యాకుపై గంటమును నడపించుచుండెను. అంతలోఁ జిత్ర యరుదెంచి తన చెలికాని చర్య చూచి, 'తన కా విద్య తెలియదు. నేర్వ వీలు లేదా?' అని సన్నలతోఁ బ్రశ్నించెను. "నేను నీ కుపాధ్యాయుఁడ నయ్యెదను. వ్రాఁత మూలమున నీవు సంభాషించునట్టులు నిన్నుఁ దరిఫీదు చేయుదును. నీచేఁ బద్దెములు వ్రాయించెదను. ఈ పద్యము వినుము" అని సుందరుఁడు పద్యము చదివి తాత్పర్యము చెప్పెను. చిత్ర, యవ్వ కడకును సుందరుని కడకును వచ్చి పోవుచున్న భక్త్యను రాగ వర్ణన మా పద్యము. తాత్పర్యము తెలిసి చిత్ర మిత్రుని మెచ్చుకొనెను.

సూర్యాస్తమాన మయ్యెను. సుందరుఁడు లేచెను. ఇరువురును జెట్ట పట్టులు పట్టుకొని హయరాజ మున్న యెడకు వచ్చిరి. చంద్రన్న దానికి దాణా పెట్టి సిద్ధపఱచియే యున్నాఁడు. రాజ కుమారుఁడు చెంగునఁ దురంగము మీఁది కెగిరి కూర్చుండి పగ్గములు పట్టుకొనెను. 'రేపు ప్రాతః కాలముననే రావలయును. ఇక్కడనే కనిపెట్టుకొని యుందును. జే పిట విందు' అని చిత్ర చిత్రములగు సంజ్ఞలతోఁ దన మనోభావమును దెలియఁ బఱచెను. 'నీ యాజ్ఞానుసారము కారేఁడు ప్రొద్దెక్కునప్పటి కిక్కడ హాజ రయ్యెదను. నా రాణీ! యుత్తరువా' అని నవ్వుచుఁ బలికి గుఱ్ఱమును వాయువేగమునఁ బరువెత్తించి సుందరుఁ డా దృశ్యమునుండి యదృశ్యుఁ డయ్యెను. చిత్ర చిత్రాకారి

ణిద్దై కొంత తడవట నిలిచి, కుటీరమున కేతెంచి, 'నిన్నఁ టికిని నేఁటికిని మా ప్రేమ లత లల్లిబిల్లిగ నల్లుకొన్నవి' అని మనంబున ననుకొనెను.

# 23

## అక్షరాభ్యాసము

ఒక వారము తీరునఁ గడచిపోయెను. ప్రతిదినము సుందరుఁడు ప్రొద్దుతో నవ్వన కుటీరమున బొడసూపి, యా సాయంత్రమునటఁ జిత్రతో విహరించి చీఁకటి పడి నంత ధర్మవరమున కరుదెంచుచుండెను. వారొండొరుల వీడియుండఁ జాలక యన్యోన్య సహవాసంబున మైమఱచి సుఖ పరమావధిం జేరి యుండిరి. ప్రేమ యా మగువను వశ పఱుచుకొనెను. లోకమునఁ దన సుఖమునకుఁ గావలసిన వెన్నియే యున్నను జిత్ర యద్దెసకు మనసు వోనీయనిది. శ్యామ సుందరుని సుందరమూర్తి యా చిన్ని సుందరి చేతః ఫల కమ్మునఁ గమ్మగ నాటుకొనెను. తన ప్రేమ జన్మావధిలో విడువ దని యనుదినము నతఁడు చెప్పుచునే యుండెను. తన్నాఁతఁడు మోసగింపనని యించుకేనియు నామె యను మానించియైన నెఱుఁగదు. అనురాగ పూరితములగు వాని మాటలకు మాటలతోఁ బ్రత్యుత్తర మీఁ జాల కున్నను నో రెఱుఁగని యా ముగ్ధ తన విలోకన పరంపరతోఁ దనమనో భావముల నెల్ల సువ్యక్తములుగాఁ జేయుచుండెను. చిత్రకు సుందరుఁ డక్షరములు నేర్పెను. గుణింతము చెప్పెను. తొలు

ద్రొ_ల్త "శ్యామసుందరమూ_ర్తి" అను పేరు వ్రాయిం
చెను. వారి యనురాగ ప్రవాహమున, వచ్చిన యక్షర
ములు గుణింతమును వెల్లిపోయినను, దన్నామాక్షరములు
మాత్ర మామె మఱవలేదు. అనురాగ లత లొం డొంటిం
బెనుచుకొని కొనలు సాగుచుండెను. అతఁ డుపదేశించిన
యనురాగ విద్య యతి త్వరలోఁ బట్టుపడి శిష్యురా లెప్పటి
కప్పుడు పాఠము లొప్పఁజెప్పుచుండెను. సుందరుఁ డెట్లు
తిరుగు మన్న నట్లు తిరుగుటయే యా సుందరి యెఱుఁగును
గాని లాతి విధ మెఱుఁగదు. సుందరుఁడు ప్రేమాసవ సేవనం
బున మత్తిల్లియుండెను. ఆ నిషా యామెకుఁ గూడ గాఢ
ముగాఁ బట్టెను. వారిరువురును దమ చిత్తానుసారిణిని బ్రవ
_ర్తించుచుండిరి. శ్యామసుందరుకి రాత్రిఁ దన బసలో
నుండుట కష్టముగా నుండెను. చిత్రకుఁ గుటీరమున నుండు
టయుఁ గష్టతరముగా నుండెను ఆ సంగతిని గూర్చి యిరు
వురు నాలోచించుకొని సంతతముఁ గలసి మెలసి యుండుట
కేర్పాటు చేసికొనిరి. చిత్ర, తన ప్రేమోదంత మంతయు
నవ్వ కెఱుకపఱిచి శ్యామసుందరునిఁ జూపింప వలయునని
పలుసారు లనుకొనెను; కాని, సాహసింప లేకపోయెను సుంద
రుఁడును దద్విషయమున నామెను నిర్బంధింప లేదు. ఒక
వేళ నవ్వకా సంబంధ మిష్టము లేకున్నచోఁ దన్నాపర్ణా
గారమును వెడలనడచి దేమో యని చిత్ర బెంగ పడెను.
ఇన్నాళ్లు నంత గారాబముతోఁ బెంచిన యా ముదుసలి
యాజ్ఞ మీఱుటా బాలిక కిష్టము లేదయ్యె. సుందరుని
సము లేక నిముసమయిన నామె నిలువఁజాలదు. ఆ కారణ

మున వారి ప్రణయము రహస్యముగానే పెరుఁగుచుండెను. నిర్జన ప్రదేశమునఁ దమ యిచ్ఛవచ్చిన తీరునఁ దిరుగ ననువు పడుటచేఁ జెప్పుట కవసరమును గలుగదయ్యె. తొలి వయస్సున నున్నవారికి భావికాలచింత యుండదు గదా! దిన దినమునకు నవ్వ మిగుల నీరసించుచు మంచము మీఁద నుండి లేవలేని స్థితికి వచ్చెను. ఆమెయింద్రియ పటుత్వ మడు గంటెను. కావున వారి ప్రణయ సరణి కేయడ్డును గలుగదయ్యె.

శ్యామసుందరునికిఁ దన మిత్రు లే మనుకొందురో, తండ్రి యేమి బెంగపెట్టుకొనునో యను నూహయే లేక పోయెను. వానికి సర్వమును జిత్రాదేవియే యయియుండెను. అట్టి ప్రణయ నిధానము నతఁ డెప్పుడును జూడలేదు; అట్టి మధుర ప్రేమ ననుభవింపలేదు. అందఱు కోడెగాండ్ర వలె నతఁడు చల చిత్తుఁడు గాఁడు. వానికిఁ దన సౌధమును, జిత్రా కుటీరము నొక్కటియే యయ్యెను; హంసతూలికా తల్పములును, లేఁబచ్చిక తావులు నొక్క విధముగానే యుండెను; సకల వస్తు సంపన్నములగు పడుకగదులును, బూవుటీరమును నొక్కతీరుననే కానవచ్చుచుండెను. చిత్ర తనతో నుండుటయే సకల భోగ భాగ్యములు నని యతఁడు దృఢ నిశ్చయుఁడై యుండెను. చిత్రాలోలుఁడై విహరించు న వ్వాన్ని కాఁడా తలంపులు నిలుకడ నొందునో మాఱిపోవునో యెఱుంగఁడు.

ఒకనాఁడు శ్యామసుందరుఁడు రాత్రియిల్లు సేరఁడయ్యె. ఆచార్యులుగారును, బరివారమును, భట్టును దత్తర పడసాగిరి. మఱునాఁటి యుదయమునఁ గూడ నతఁడు

రాకున్న వా రందఱును గంగారుపడిరి. భట్టు నాచార్యులు గారు నాలోచించుకొని భుజించిన తోడనే బయలుదేఱి బోయపల్లెకు వచ్చిరి. చంద్రన్న వారికి మార్గము చూపించెను. వారు గుట్టలు నదియు దాఁటి మైదానమున కేఁగినంత నచ్చట గుఱ్ఱ మగుపించెను. శ్యామసుందరుఁడు గానరాఁడయ్యె. ఆచార్యులు గారు కంటఁ దడిపెట్టి, 'ప్రభూ! నా ప్రియశిష్యుఁడు, నా కుమార ప్రభు వీ యడవుల పాలయ్యెను. ఏమి గతి?' అని బాలునివలె నేడ్చెను. అతని నోదార్చి భట్టు శ్యామ సుందరుని వెదకుచు నాచార్యులు గారితో నందందుఁ గ్రుమ్మరుచుఁ బోయి పోయి యొక్కెడఁ జట్టున నాఁగెను. 'ఆర్యా! వాఁడె మీ యంతేవాసి, యొక యాటవిక కాంత కేలు కేలం గీలించి యిటు వచ్చుచున్నవాఁడు. చిత్తగింపుఁడు, అని యనియెను. 'అతఁ డట్టివాఁడు కాఁడు మహాప్రభూ!' అని యాచార్యులు వా రనిరి. 'అటు చూచి మఱి నామాట బొంకనుఁడు' అని భట్టు చిత్రా సుందరులను జూపించెను. ఆ వృద్ధుఁడు నిశ్చేష్టితుఁ డయ్యెను. 'అఁపు కాఁపుదులు లేక విపినవీధి దేర దొరకిన యా సురభిళ కుసుమమును మరగి తపుయంతేవాసి మధుపము, మ త్తిల్లి మనల మఱచెను. తుద కబ్బెరా తురక విద్య యన్నట్టు లీ బోయ కన్నియా యీతనికిఁ బ్రేమస్థాన మయినది. కాని, స్వామీ! చూడుఁడు చూడుఁడు. ఆహా! అది చక్కనిచుక్క' అని భట్టు పలుక నాచార్యులుగారు దృష్టికిఁ జే యడ్డము వెట్టి చూచి, "ప్రభూ! ఏలినవారు వచించినది యథార్థము. మనకేమి గతి? దాని మరలఁబోఁ బడి మనల మరచెనన్న వింత

లేదు. మన మగుపించినచో నతనికిఁ గోపము వచ్చునేమో. అడ్డాల నున్నప్పుడే కాని, గడ్డములు మీసములు వచ్చినప్పుడు బిడ్డలు గారుగదా!” అని పలుకునంత నెదిమిది కన్నులును దారస పడినవి. వారిం గాంచి సుందరుఁడు చకితుఁ డయ్యెను. చిత్ర వెఱపొంది తన ప్రియుని కేదో యాపద వచ్చెనని తలంచి యాతనిం గట్టిగఁ దన చేతులతోఁ బట్టుకొని వాని యురమ్మున శిర మ్మూంచి గడ గడ వడంక సాగెను.

“సెబాసు! చెలికాఁడా! సెబాసు! ఇందులకా యంత ప్రొద్దుననే నీవు వాహ్యాళి వెడలుట! రాధా దేవి లభించుట యథార్థమే” అని భట్టు పలుకఁ జిత్ర తలయెత్తి భట్టుం జూచెను; పిమ్మటఁ దన ప్రియుం జూచెను. “అంత చనవు దీసికొని యతఁడా మాటాడుటకుఁగల కారణ మేమని చిత్ర యభిప్రాయ ప్రశ్నము. వా రిరువురును దమ్మోడఁ బాప సరుకెంచిరని చిత్ర నిశ్చయించెను. సుందరుఁ డామె నోదార్చి, ‘కుటీరమున నుండుము. ఇప్పుడే వీరిం బంపి వచ్చెదను, అని మెల్లగాఁ జెవిలో నూఁదెను. చిత్ర ప్రియుని యాజ్ఞ జవదాఁటదు; విడిచి పోలేదు. ఎట్టకేల కాతని నిర్బంధమున న చ్చోటు వాసి యశ్రుపూరిత నయనమ్ములతో మరలి మరలి చూచుచుఁ జిత్ర, కుటీరప్రాంతమున కేగి యచ్చట నిలువంబడి యుండెను. సుందరుఁడు డెందము పదిలపఱుచుకొని మిత్రులకడ కరుదెంచెను.

‘చెలికాఁడా! అనాఘ్రాతంబగు నీ విపిన కుసుమము నీ కెట్లు లభించెను?’ అని భట్టు ప్రశ్నింప, ‘ఇది యీ విపిన

శకుంతల ' అని యాచార్యులు గారనిరి. ఇంచుక కోప దృష్టితో, 'ఏ మనుచున్నారు?' అని శ్యామసుందరుఁ డడిగెను. "ఏ మనుచుంటిమా? మిత్రమా! ఆ దిక్కుమాలిన ధర్మ వరమున మమ్ముఁ బడవైచి, పరిజన మే మయ్యెనో విచారింపక యీ యడవి పూవును వలచి యిక్కడఁ జిక్కియుంటివా యనుచుంటిమి; అది త్రిలోక సుందరియే యగుఁ గాక. నీ మిత్రుని, దేవసములగు నీ యాచార్యులు వారిని విడిచి యీయడవిలో నుండి పోవుదువఁటయ్యా!" అని భట్టు బెదరక యెదురు దిరిగెను. సుందరుఁ డాలోచనా నిమగ్నుఁ డయ్యె. ఆచార్యులు "బాబూ! కోపించిన నేమి చెప్పఁగలము! యుక్త వయస్సువచ్చిన ప్రభు కుమారున కీ పాటి స్వాతంత్ర్యము లేక పోలేదు; కాని, యంతమాత్రమున సనాతన సంఘధర్మము నేమఱ వచ్చునా? మీ రెఱుఁగని దొకటియు లేదు. మీ రుత్తమ కుల సంజాతులు; వీర పురుషులు. ఉచితములగు నున్నత పదవులు మీ నిమిత్త మెదురుసూచుచున్నవి. మీ జనకుఁ డిట్టి నిర్జనారణ్యమున నివసింప మిమ్ముఁ బంపలేదు. ఇది దేశాటన మనిపించుకోదు. నాధర్మమును నేను—" అను నర్ధోక్తిలో "స్వామీ! మన్నింపుఁడు. వివరములు దెలుప నిది సమయము గాదు. నే నౌచిత్యమును మీఱలేదు. ఈ నా ప్రభు మిత్రునితోఁ గొంత రహస్యముగాఁ బ్రసంగింపఁ ననుజ్ఞ యొసఁగుఁడు " అని శ్యామసుందరుఁడు గురువు గారితో వచించి, భట్టుచేయి పట్టుకొని కొంత తొలఁగం దీసి కొని పోయి యొక చెట్టునీడను బ్రసంగింప నారంభించెను.

శ్యామ:- భట్టూ నీ వింత దుందుడుకు వాఁడ వేమోయి! గురువుగారి నెందుల కిచ్చటికిఁ దో డ్తెచ్చితివి? నీ వేల వచ్చితివి? నా యిష్టానుసారము దిరుగ నింక నాకు స్వాతంత్ర్యము రాలే దనియా నీ తలంపు?

భట్టు:- అన్నా! మన్నింపుము. మొదటి సంగతి గురువు గారి కీ శృంగార ప్రపంచపు గొడవలు తెలియవు. నిమిషములో నాతనిని వేఱు త్రోవకుఁ ద్రిప్పఁగలను. రెండవది, నాకుఁ దెలిసినంత మాత్రమున నీ సుఖావాప్తికి భంగము గలుగదు. వారము దినములనుండియు నీ వొంటిగ విహరించుచు మమ్ముఁ దలంపకుండుటచేఁ బరివారమును, గురువుగారును దిగులుపడుచున్నారు. నిన్న రాత్రి రిల్లు సేరవైతివి. ఈ నట్టడవిలో నీ వేమైతివో యని దిగులుపడి రే యంతయు మే మందఱము జాగరణము చేయుచు నీశ్వరుని బ్రార్థించుచుంటిమి. నీ పెద్ద నౌకరు నాయనగారికి నీ దినచర్య తెలియఁజేయుచున్నాఁడు. సాయంత్ర మిల్లుసేరుచున్న నంతగా బాధ లేదు. నే నేవో కథలు కల్పించి యిచ్చటి నీ యునికికిఁ గారణములు సెప్పుచుంటిని. ఎన్నా ళ్ళియా యి గా రడి, యల్లిబిల్లి గా రడీ చేయఁగలను? నీ వొక ప్రబంధము వ్రాయుటకుఁ దగిన పరికరములఁ గూర్చుకొనుచుంటివని బొంకుచుంటిని. ఇది యిట్టి ప్రబంధమని నే నా మఱునాఁడే గ్రహించితిని. కాని, నీ వీ శూద్రకన్య నింత ప్రేమించితివని తలంప నైతిని. నీ వింతలో నింత మాఱిపోవుట నా కెంతో వింతగా నున్నది. కమనీయ రత్నములఁ గన్నెత్తి

చూడని నీకీ కాఁపుఁగన్నెకన్నుల చందమామ యైనదా? నీ తండ్రి యేమనును? నీ బంధువు లేమందురు? నీ మిత్రు లేమి తలంతురు?నీ గౌరవ మేమి?నీ యునికి యేమి? అది చిత్రాతార, మాణిక్యమే; కాని, రే రాజు త దంతికముననే యెప్పుడు నుండఁడు. తుదకీ గొల్లపడుచును బరిణయ మాడఁ దలంచితివా యేమి?

శ్యామ:-భట్టూ! చాలఁ బొరపడితివి. అది గొల్ల కన్నె గాదు; నా జాతి రత్నము. బీద దయినంత మాత్రమునఁ బుట్టి మునిఁగి పోయిన దేమి? ఆమె చరిత్రమును వింటి వేని నీ ప్రసంగ మీ దారి నుండదు. ఆమె డెంద మెంత పవిత్రమో, యెంత యనురాగ పూరితమో నీ వే మెఱుఁగుదువు? పై మెఱుఁగులకు లోఁబడి యపవిత్ర కార్యాచరణ పరాయణుఁ డయ్యె నీ మిత్రుఁ డని తలంచితివా? సంతసించితిని.నీ నాగరక ప్రపంచమునఁ జూపఁ గలవా యిట్టి వస్తువును? ఆ రూపమును, దాని కనుగుణములగు సుగుణములును నీ వెందును జూచి యుండవు. నాగరకత లే దామెకు; నాజూకు తెలియదు.లోక జ్ఞాన మెఱుఁగ దామె; ఉన్నత వంశాచారము లూహింపఁ జాలదు. అంత మాత్రమున వచ్చిన లోప మేమి? కావలసి వచ్చినప్పు డన్నియు నాలుగు నాళ్ళలో నా చిత్ర నేర్చుకోఁ గలదు.

భట్టు:- అవు నయ్యా! అన్నియు నిజమే. నీ జీవిత మీ నిర్జ నాటవినా కడప నెంచితివి? నీవు మ తేమియు నాలో

చింప నక్కఱలేదా ? భార్యా వియోగ విహ్వలుఁడై నీవే ప్రాణాధారముగా నున్న నీ జనకుని కేది దిక్కు ?

శ్యామ:- అవు నదొక్కటే యాలోచించు చున్నాను. ఏ దెట్లయినను నా చిత్రను మాత్ర మెడఁబాసి యుండ జాలను.

భట్టు:- సరే కానిమ్ము. దానిని నీతోఁగూడ మైసూరునకుఁ దీసికొని రమ్ము. నీ వీ దిక్కుమాలిన యడవి నుండుట నా కిష్టము లేదు.

శ్యామ:- ఈ యడవి దిక్కుమాలినదా? చిత్రా సనాథ మయిన యడవి యమరావతి గాదా? ఇది విడిచి నేను రావలెనా? అ దెట్లు జరుగును? దాని కొక విస్సంప్రతి యున్నది. చిత్రాదేవి కొక ముక్కాలి ముసలి యవ్వ యున్నది. ఇం దనుకఁ జిత్రను బెంచి పెద్ద చేసిన దా వృద్ధురాలే. ఆ యవ్వ మంచము విడిచి లేవ లేదు. ఆమెకు సర్వస్వమును జిత్రయే. కావున నవ్వను వీడి చిత్ర రాలేదు. చిత్రను వీడి నీ మిత్రుఁడు రా లేఁడు. తెలిసినదా చిక్కు ?

భట్టు:- చక్కఁగాఁ దెలిసినది. నీ కిక్కడఁ జిన్న సంసారము జత పడిన దన్నమాట.

శ్యామ:- భట్టూ! పరిహాసము వద్దు. కొన్నాళ్ళిట్లు గడవనిమ్ము. పిపద నే వచ్చి మిమ్ముఁ గలసికొందును.

భట్టు:- మే మిప్పు డిక్కడ నిన్ను విడిచి నోళ్లు మూసికొని, తలలపై గుడ్డలు వేసికొని చల్ల చల్లగా బసకు జాఱిపో

వలసినదా? నీవు నీ రాధాదేవితో నీ బృందావనమున నీ కృతకాద్రుల, నీ కాళిందీ తీరమున విహరించు చుందువా?

శ్యామ:- మిత్రమా నీ మేలముల కేమి లెమ్ము. చిత్రను గూర్చి నీకిప్పు డేమియు నేఁ జెప్పఁ దలంచుకో లేదు. ఇవిగో పెట్టె తాళములు తీసికో. నీ యిష్టము వచ్చినట్లు; డబ్బు సెలవు చేసికో. పరివారమునకును, గురువుగారికి నెట్లు నచ్చఁ జెప్పెదవో నీ భారము. నే నింకఁ బోయి వచ్చెదను. అదిగో, చిత్ర చూడు మెట్లు సూచు చున్నదో!

భట్టు:-(మిత్రుని చేయిపట్టుకొని) అన్నా! ఇ దంతయుఁ బైలా పచ్చీసు వ్యాపారము సుమీ! ఇంక మూఁడు వారములు మాత్రమే యీ ప్రేమా ప్రవాహమున నీఁదు లాడుదువు. ఇది మూఁడు వారముల ముచ్చట. మీ ప్రణయము మితి మీఱకున్నచో నున్న దున్నట్లు విడిచి వచ్చుట శ్రేయస్కరము.

శ్యామ:-భట్టూ! నీ కడ దాపటిక మే మున్నది! సర్వేశ్వర సాక్షిగ మే మిరువురమును సతీ పతుల మైతిమి. మించిన దానికేమి చేయఁగలము?

భట్టు:- అన్నా! పొరపాటు చేసితివి; ముందు వెనుక లాలోచింప వైతివి. నీవు తండ్రిమాట కెదురాడ లేవు. ఇది నా భార్యయని కుల గోత్రములు తెలియని చిత్రను జూపఁ జాలవు. 'ఇంటికిఁ బద బాబూ' అని నీ జనకుఁ

డన్నచో నో రె_త్తలేక నీ చిత్రను విడిచి, దుఃఖ సముద్ర మునఁ ద్రోసి వెళ్లి పోవుదువు. అట్టి యమాయకురాలిం జెట్టవట్టి యీ గుట్టల బట్టించి నీ దారిని నీవు వోవుట కన్నఁ గ్రూర కృత్యము మఱి లేదు. నీ జనకుఁ డీ సంబంధమున కంగీకరింపఁడు. ఆయన మనస్తృప్తికై నీ విం కొక తెను బెండ్లాడవలసి వచ్చును. ఆలోచింపక తొందర పడితివి. ఏది యెట్లు లయినను బాదున నిలిచి యీ దీనురాలిని మాత్రము ద్రోహము సేయకుండుటకై సర్వథా ప్రయత్నింపుము.

శ్యామ:- మిత్రమా! నీ వన్నది యథార్థమే. మోసము సేయు తలంపు నా కిసు మంతయు లేదు. నేను హృదయ పూర్వకముగాఁ జిత్రను బ్రేమించినాను. ఆమెచే నంత కన్న నెక్కువగాఁ బ్రేమింపఁ బడితిని. దైవ సంఘటన మిట్లున్నది. అన్నిటికి నతని మీఁదనే భారము వేసి యున్నాను. నీ చేత నైనంత నా కీ యంశమునఁ దోడు పడవలయును.

భట్టు:- ఈ మోహ ప్రవాహపు విసరు తగ్గినంతనే నీ వీ చిత్రను విడువ కుంటివేని యుత్తమ వీరుఁడవే. ఇట్టి వెన్నియో నేఁ జూచితిని. సరి నేఁ బోయి వచ్చెదను. అప్పు డప్పుడు నేను మాత్రము వచ్చి నిన్నుఁ జూచు చుండెదను.

శ్యామ:- సరి, పోయిరమ్ము. వ్యవహారము నెట్లు నచ్చఁ జెప్పెదవో నీ భారము. పై సంభాషణము ముగిసినంతనే వారిరువురును దిరిగివచ్చిరి. గురువుగారికి నమస్కరించి

శ్యామసుందరుఁడు చిత్రా నికేతనమున కరిగెను. భట్టాచార్యులువారితో మాటలాడుచు నయ్యడవి విడిచి వెలుపలికి వచ్చెను.

ఆచా:-ప్రభూ! శ్యామసుందరుఁడు మనతో బసకు రా నన్నాఁడా?

భట్టు:- అతని కింక నిక్కడఁ గొన్నాళ్లు పని యున్నది. పదు నేను దినముల వఱ కిచ్చటనే యుండును.

ఆచా:- అతఁ డడవిలో నుంటయు, మనము బసలో నుంట యునా?

భట్టు:- ఔను, ఆ బాలికవలన నతనికిఁ గావలసిన పని యున్నది. పుస్తకమును గంటము నతనిచేతనే యున్నవి చూచితిరి గదా! మనలం గూడ నిక్కడ నుండుఁ డను చున్నాఁడు. మే మీ యడవిలో నుండలే మని చెప్పితిని. పదుము దినములలో నతఁడు వచ్చి మనలం గలిసికొను నట్లు లేర్పాటు చేసినాను. ఇప్పు డాతని పని కంతరాయ మును గల్పించితి మేని మనతోఁ జెప్పకుండ నెయ్యెడ కేని బోవును. అపుడు మనము చింతింపవలసివచ్చును. నూతన కవిత్వాభి రుచి గలవారికిఁ బ్రపంచము తృణ ప్రాయముగా నుండును. అతని ప్రవర్తనలోఁ బ్రమాద కరమగు స్థితి గానరాదు. మన మీ యూర సాయంత్ర మగువఱకు నుండి యిల్లు సేరుదము. రండు.

ఆచా:- చిత్తము చిత్తము. తమకంటెఁ దెలిసిన వాఁడను గాను. తమ యుద్దేశమే నా యుద్దేశము. అయినను

నాకు మాట రాకుండఁ జూడఁగోరెద. భార మంతయుఁ దమదే. పదండు.

అని మాటలాడుకొనుచు వారు బోయపల్లెం జేరిరి. అడవిలో నుండు టన్న నాచార్యులవారికి భయమని భట్టెఱుఁగును. మంచి మంచి కూరలు, పిండివంటలు, శుచియైన భోజనము దేవతార్చనయుఁ గాననంబున జరుగ వని యాచార్యులు వారెఱుంగుదురు. దానిచే భట్టు మాటల కతఁ డంగీకరించెను.

ప్రొద్దు పోవువఱకును భట్టు నాచార్యులు గారును శ్యామసుందరునిగూర్చి ప్రసంగించుకొనుచు నా గ్రామమున నుండిరి. ఇంక బస కరుగ వలయు నని బయలుదేఱి వారు బండి కడ కరుదెంచిరి. ఆ బండి కడ నింకొక బండి నిలువంబడి యుండెను. అప్పుడే యా ప్రాంతములు చూచి తమ యింటికి మరలిపోవ నేతెంచుచున్న యొక మిథునము వారికి గోచరించెను. వారును వీరిం గాంచి నిలిచిరి. తమదే గ్రామ మని యా పురుషుఁడు ప్రశంసించెను. "వీరు వనపర్తి మహా మండలేశ్వరులు, రామచంద్రరావు బహద్దూరు వారు, బ్రాహ్మణ ప్రభువులు" అని యాచార్యులువారు పలుక, నవ్వుచు భట్టు, "వీరు సకలశాస్త్రి పారంగతులు, మధ్వాచార పారీణులు, ముఖ్యప్రాణ బ్రహ్మచారిగారు, అనంతాచార్యులువారు. మీ రెవ్వరు?" అని ప్రశ్నించెను. "చిత్తము చిత్తము. ఏలినవారి దగ్గఱ మెప్పుదును జేయలేదు. ఈ సమీపమున రాయవర మను గ్రామమున నివసించు చున్నాము. మేము గోలకొండ వ్యాపారులము. నేను

గోలకొండలోఁ గొన్నాళ్లు వ్యాపారము చేసి నాలుగు రాలు గడించుకొని యిప్పుడు రాయవరమునఁ గాపుర మున్నాను. మా నివసించు గ్రామ మిచ్చటికి గవ్యూతి దూరంబున నున్నది. మంచి వసతియైన గ్రామము. ప్రభువువారును, నాచార్యులుగారును మా గ్రామమునకు విజయంచేసి మా గృహమును, మమ్ములను పావనులుగాఁ జేయ వేఁడు చున్నాను. ప్రభువు వా రెన్నాళ్లనుండి యీ ప్రాంతముల నున్నారు? ఏ గ్రామమున బస చేసినారు?" అని యా వ్యాపారి పలుక, "మేము ధర్మవరమున నున్నారము. మే మీ ప్రాంతములకు వచ్చి యొక పక్ష మయినది" అని భట్టు ప్రత్యుత్తర మిచ్చెను. "ఆ గ్రామమును దద్గ్రామ వాసులును ధన్యు లయిరి. మా యూరి కెప్పుడు దయ చేయించెదరు?" అని చేతులు జోడించి యా గృహస్థు పలుక, "దాని కేమి భాగ్యము. ఆచార్యులువారూ! రేపు సాయంత్రము మనము రాయవరము వెళ్లుదమా?" అని భట్టు గురువుగారి నడిగెను. "చిత్తము మహాప్రభూ! ఏలినవారి దివ్య చిత్తమునకుఁ దోఁచినదే మంచిది. తప్పక రేపు సాయంత్రము వెళ్లుదము" అని గురువుగారు పల్కిరి. "చిత్తము, చిత్తము ధన్యుల మైతిమి. నేఁడు సుప్రభాతము. రేపు సాయంత్ర మెన్ని గంటలకు శ్రీవారి దర్శనము లభించును?" అని యా గేస్తడిగెను. "నాలు గైదు గంటలకు. మీ నామ ధేయ మేమి?" అని భట్టు పలుక, 'చిత్తము, నా పేరు భుజంగరా వందురు. నేను సెలవు దీసికొందును' అని పలికి భుజంగరావు భార్యతోఁ దన బండిని సమీపించెను. గురువు

గారును భట్టును, దమ శకటము నధిరోహించిరి. బండ్లు వాయు వేగమున వేఱు మార్గములఁ బోయినవి.

# 24

## పోట్లేళ్ల పందెములు

సాయంకాలము నాలుగు గంటల వేళకు రాయవర వాస్తవ్యు లెల్లరు నెదురు సూచుచుండ, జోడు గుఱ్ఱముల బండిమీఁద నిటు నటు నిర్వు రిర్వురు సేవకులు మంచి ముస్తాబులు ధరించి తురంగముల నదల్చుచు బాటసారులను దొలఁగుఁడు తొలఁగుఁ డనుచుఁ గేకలు పెట్టుచుండ, ప్రశస్తమయిన ముస్తాబుతో రామచంద్ర భట్టు ననంతాచార్యులు గారును వచ్చిచేరిరి. గ్రామస్థు లందఱు నెదురుకొని స్వాగత మిచ్చి వారిని భుజంగరావుగారి యింటి కతి గౌరవముతోఁ దోడ్తెచ్చిరి. గోల్కొండ భుజంగరావునకు, నతని భార్యా రత్నమునకును గలిగిన యానందమునకుఁ బారము లే దయ్యెను. వెనుక నిలువం బడియున్న యిద్దఱు డవాలా సేవకులు బండి యాఁగి నంతనే వచ్చి తలుపులు తెఱవ, జమీందారుగారు గురువుగారి చేయి పట్టుకొని చూపఱపై మందహాసము వెదచల్లుచు బండి దిగెను. అ య్యశ్వ శకటము న య్యుత్తమాశ్వ ద్వయమును, సేవక చతుష్కమును, రాజ పురుషోచిత వస్త్రాలంకార భూషితుఁ డగు రామచంద్ర భట్టును జూచి రాయవర వాస్తవ్యులు దంగుబాయించి పోయిరి. రామచంద్రరావు బహద్దూరు మన్య సుల్తాను మహా మండలేశ్వరులకు స్వాగత మని ఎల్లరు నేకగ్రీవముగాఁ

బలికి నమస్కరించిరి. బ్రాహ్మణ ప్రభువు, తమ గురువు గారితో విచ్చేసి రని యూరంతయు నానంద ప్రవాహమునఁ దేలియాడెను.

భుజంగరావు మధ్య వయసున నున్నవాఁడు; తన జీవితమున జమీందారులకు నాతిథ్య మిచ్చి యెఱుఁగఁడు. నాఁటి కట్టి యదృష్టము పట్టిన దని యుప్పొంగుచు నతఁడు జమీందారుగారికిని, గురువుగారికిని నమస్కరించి స్వాగత మిచ్చి వారిం దోడ్తెచ్చి, చావడిలో వేసిన వాలు కుర్చీలపై నాసీనులఁ జేసి, గ్రామస్థులకుఁ దగిన మర్యాదలు చేసి కూర్చుండఁ జేసెను. జమీందారుగారు నాతనిని, గ్రామస్థులను గుశల ప్రశ్న చేసెను. గ్రామాధికారులు, సంపన్న గృహస్థులు నతి భయ భక్తి వినయ గౌరవములు సూపుచు జముఖానాలపైఁ గూరుచుండి తమ కృతజ్ఞతను వెలిఁబుచ్చిరి. భుజంగరావుగారి భార్య రంగనాయకమ్మ, సకలాభరణ భూషితయై చక్కని చీరయు, రవికెయు ధరించి యింటఁ జకచకఁ దిరుగుచు వంటవారికిని, సేవకులకును నా యా కార్యములు సేయ నియమించుచుఁ గాంతా జన పరివృతయై లోపల నుండెను. చీఁకటి పడుదాఁక లోకాభి రామాయణముగాఁ బ్రసంగము జరిగెను. సాయంకాలిక కర్మ కలాపము నిర్వర్తించు కొన నెల్లరును లేచిరి.

విందునకుఁ బిలువఁబడిన మహాజనులో కొక్కరుగ రాఁ దొడఁగిరి. మడి గట్టుకొని భట్టును, గురువు గారును భోజనాగారమును బ్రవేశించిరి. విం దారగించుటకై వచ్చిన వా రందఱును వారితోఁ బీటలపయిం గూరుచుండిరి. భోజన

శాలలో రెండు వరుసలుగాఁ బీటలు నరఁటి యాకులు వేయఁబడి యుండెను. వంట బ్రాహ్మణు లన్ని పదార్థములు వడ్డించు చున్నను రంగనాయకమ్మ యప్పు డప్పు డేదో వస్తువు దెచ్చి వడ్డించుచు హాయలు గులుకఁ గటాక్షమాలి కల జమీందారు వారికి నివాళు లిచ్చుచుండెను. వడ్డన పూర్తి యయ్యెను. నివేదన లయ్యెను. అందఱును బరిషించిరి. సద్యోఘృతము దెచ్చి గృహిణి వేసెను. అన్ని వస్తువులు నామెయే వడ్డించు చుండెను. జమీందారుగారు చిత్ర విచిత్రముగాఁ బ్రసంగించుచు భుజించుచుండెను. జమీందారు వారి కది వేయి మిది వేయు మని గేస్తు, భార్య కాజ్ఞాపించు చుండెను. కీలు ముడి యోర జాఱ, భూషణ నిస్వనంబు లొలయఁ గాళ్ళ గజ్జె లందెలు గలుగల్లు మని మ్రోయఁ జూపుఁ దళుకులు తళుకు తళు క్కని మెఱయ, మువ్వల యొడ్డాణము నడు మింత యని సూచింపఁ జెవుల రవల జోడు జిగ జిగలు చెక్కుటద్దములఁ బ్రతిఫలింప నామె వడ్డించు నప్పుడు భట్టు పట్టరాని యానంద మనుభవించెను. ఆచార్యులు వారి లోకమున లేరు; రుచ్యములగు నాయా పదార్థముల రుచు లెన్నుచు శక్తివంచన లేక పాటుపడుచుండెను. ఆయనకువిందారగింపు లున్నచో నేదియే మయినను దకరారు లేదు. జమీందారుగారి యండ నుండఁ బట్టి గదా తన కిట్టి గౌరవమును, విందులును లభించిన వనియు, శ్యామసుందరు ననుసరించినచో నడవులఁ గ్రుమ్మఱు చుండవలసి వచ్చును గదా యనియు నతఁడాలోచించు కొనుచుఁ దన భోజన పాండిత్యమును జూపుచుండెను.

భోజనము లయినవి. చేతులు గడుగుకొని యందఱును జావడిలోఁ గూర్చుండిరి. తెల్లనాకులు మంచి మదరాసు వక్కపొడి, యేలకులు, లవంగములు, జాజికాయ, జాపత్రి, మున్నగు తాంబూల ద్రవ్యములం దెచ్చి వెండి పళ్లెరములతో భుజంగరా వచ్చట నుంచెను; అత్తరు, పన్నీరుం దెచ్చి యిచ్చెను. అందఱు నా యా వస్తువులనుభవించిరి; వింత వింత ప్రసంగములతోఁ గొంత దనుకఁ బ్రసంగము గావించిరి. మఱునాఁడు, తనయింటికి విందునకు రావలయు నని రంగారా వను నియోగి, జమీందారు గారు మున్నగు వారి నాహ్వానించెను. మూఁడవ నాఁడు మా యింట విందు; నాల్గవ నాఁడు మా యింట నని మఱి యిరువురు లౌకికులు వారి నాహ్వానించిరి. అంతయు భుజంగరావుగారి చిత్తమని జమీందారుగారు సెల విచ్చిరి. మఱునాఁడు మధ్యాహ్నము తమ యింటనే విందారగింప వలయు ననియుఁ దరువాత బ్రభువువారి చిత్తమనియు భుజంగరావు వినయముతో వేఁడుకొనెను. జమీందారు గా రందఱను సమబుద్ధితోఁ జూచి, వారి వారి యాహ్వానముల కంగీకారమును జూపి, తమ యౌదార్యమును నిర్గర్వ చూడామణిత్వమును వెల్లడి పఱిచెను; తన బండిం దోలుకొని పొం డని సేవకుల కాజ్ఞాపించెను. బండి యా రాత్రియే ధర్మవరమున కరిగెను.

జమీందారు గారికి మేడపై గదిలోఁ బ్రక్క వేయఁబడెను. ఆ ప్రక్కగదిలో నాచార్యులువారికి శయ్య వేయఁబడెను. ఎవరి శయ్యలకు వా రేగి శయనించిరి. భట్టునకు నిదుర రా దయ్యెను. అతఁడు, తన వింత చరిత్ర

మంతయుఁ దలపోసి కొనసాగెను. "సీత యేమయ్యెను? శ్యామల యే ప్రయత్నము సేయక యూరకుండెనా? ఏ సంగతియు దుర్గాప్రసాదుఁ డేల తెలుపఁడు? వారిలో నెరికైన నే మైన నాపద వచ్చియుండదు గద! యతి వర్యుఁ డెచ్చట నున్నాఁడో! లోకములో నిట్టి రహస్య వ్యాపారము లెన్ని నడచుచున్నవో! మనుజుని పై వేష మును బట్టియే మాన్యత గలుగు చున్నది. నా చరిత్రము మఱి మఱి వింత మార్గమున నడచుచున్నది. తొలుత నొక యసత్యము వలుకుటయు, దానిని గప్పిపుచ్చుచుండుట కాయి వున్నంతవఱ కసత్య మాలికను గూర్చుచుండుట యునా! నా జమీందారీ సంగతి బయలుపడినచో నీ యూరి వారు నన్నెట్లు గౌరవింతురు! ఈ గృహస్థును, గృహిణియు నా నిజవృత్తాంత మెఱిఁగిన నెంత చింతింతురు! ఛీ, ఛీ,, నా బ్రతు కేమి బ్రతుకు! శ్యామసుందరుఁ డా యందక త్తెను మరఁగి, కులగౌరవము వోనాడి యీ గుట్టలఁ బట్టినాఁడు. స్త్రీ లోలుఁడు క్రిందు మీఁదు లరయఁ జాలఁడు. వాఁడు రాఁడు. నే వానిని విడిచి పోలేను. నా సావాసము వల దని గోపాలరాజు నిషేధించినను దగుదు నని శ్యామసుందరుని వెనుకఁ బడితిని. ఆ పెద్ద సేవకుఁడు గోపాలరాజున కిక్కడి సమాచారము వ్రాసి పంపినాఁడు. నన్నుఁ గూర్చి యేమి వ్రాసినాఁడో తెలియదు. ఏది యెటు వచ్చునో. ఏ మయిన నేమి సేయఁగలను? పాపము! సీత యెట్లు లున్నదో! న న్నే మనుచున్నదో! చెప్పకుండ వచ్చితి నని నా పైఁ గోపము వచ్చెనేమో! నేను జూదరి నను సంగతి తెలిసిపోయి

యుండును. దాని లేఁత మనస్సు త్రిప్పివేయ నెవరేమి చెప్పుచున్నారో! నా కా వస్తువు లభించునా? అందని మ్రాని పండయి పోవునా? మది కిష్టములేని మార్గమున కీ మాయా గ్రహములు నన్నీడ్చుకొని పోవుచున్నవి. ప్రకృతి యీడ్చిన దెస కరుగుట కంటె జీవ ప్రకృతి సేయున దేమున్నది? ఈ మర్యాదతో నీ గ్రామమునుండి వెళ్లుదునా యదియే పదివేలు. ఏ మయిన నింత పెద్ద వేషము వేయుట తప్పు. ఆచార్యులువారి నేమఱచుట కింత బొంకు బొంకి యింత వేషము వేయవలెనా? ఏదో యయిపోయినది. మీఱిన దాని కిప్పుడేమి చేయవచ్చును?" అని తలపోయుచు భట్టు నిద్దురకు లోనయ్యెను. అతఁ డద్భుతములైనఁ గలలు గనుచుండ బల్లునఁ దెల్లవాఱెను. లేచి యెల్లరును గాల్య కృత్యములు దీర్చుకొనిరి.

ఆ నాఁటి మధ్యాహ్నమున జమీందారు గారును బండితుఁడును భుజంగరావుగారి యింటనే యాతిథ్యము గైకొనిరి. సాయంత్రము జమీందారుగారి వినోదార్థము భుజంగరావుగారి వాకిటఁ బొట్టేళ్ల పందెమును బెట్టిరి. కోడి పందెములు, గొఱ్ఱె పోతుల పందెములు నన్న జమీందారు గారి కతి ప్రీతి. సర్వమును సంసిద్ధమయినది. రెండు వీధుల నడుమ రెండు వరుసలుగాఁ దీరి ప్రజలు వింత చూచుచుండిరి. ఆటగాండ్రు, నాలు గైదు జతలు గొఱ్ఱె పోతులను గజ్జెలు కట్టి ముస్తాబు చేసి తెచ్చిరి. క్రొవ్వి, బలిసి, కొమ్ములు తిరిగి యున్న యా పొట్టేళ్లు పందెములలో నారి తేఱినవి. ఇరు వైపులను సొంతగాండ్రు వానిం బట్టుకొని నిలిచి

యుండిరి. జమీందారుగారు సభాధ్యక్షులుగా నుండుట కంగీకరించి గ్రామ మహాజనులతో నరుగుపయిఁ గొలువు దీరి యుండిరి. వారికిఁ జక్కఁగ నగుపించు నేర్పాటులు చేయఁబడెను. జనుల కోలాహల మపరిమితముగా నుండెను. పందెము గట్టుట కై దాటుగురు జూదగాండ్రు పైకమును బట్టుకొని సిద్ధమయి యుండిరి. ఒక పక్షము వా రొక పొట్టేలును రంగమునకుఁ దెచ్చిరి. అట్టి శృంగారముతో నలరారు పోటీ పొట్టేలును రెండవ పక్షము వారు నెదురుగఁ దెచ్చి నిల్పిరి. రెండు ప్రక్కలనుండియు నలువురు పందెపు టాటగాండ్రు తమతమ పందెపుఁ బైకమును దెచ్చి జమీందారు గారి సన్నిధిని జెల్లించిరి. పై పందెగాండ్రు, వారిలో వారే పందెములు గట్టుకొనిరి. జయాపజయముల కాధారము లయిన పొట్టేళ్లపై నెల్లర దృష్టులును గేంద్రీకరించినవి. పందెము విడువ వచ్చు నని సభాపతి యనుజ్ఞనిచ్చెను. తత్క్షణమే యిరు కక్షల యోధులును రెండు పొట్టేళ్ళను దాకొలిపి యుత్సాహ కరములగు సన్నలఁ జేసి తట్టి విడిచిరి. విడుచుటయే తడవుగా నవి గుభి ల్లని యొండొంటి దాఁకి గ్రుద్దుకొనియె. వెనుకకుఁ దగ్గి తగ్గి గుభిల్లు గుభిల్లు మని యవి డీకొని పెనంగెను. ఇటులై దాటు సారులు పెనంగినంత నొక యురణము రణ పరాఙ్ముఖ మయ్యెను. చూపఱు గొల్లు మనియె. గెలిచినవారు సభాధిపతి కడకు వచ్చి యుత్సాహముతో గెలిచిన పందెపు ధనమును గై కొనిరి. ఓడిన వారు తామగ మెక్కి మరల నొడ్డుటకు సొమ్ము తీసికొని సిద్ధముగా నుండిరి.

మరలఁ గ్రొత్త పందెములు జరిగెను. పందెములు చూడ వేడుకగ నుండెను. గెలిచినవారు గలగల లాడు మొగములతో నత్యుత్సాహవంతు లయి చెలంగు చుండిరి. జమీందారుగారు ధన్యవాదములతో వారి సత్కారి చేయుచుఁ బందెపుఁ బైకము నొసంగు చుండిరి; ఓడి లేటమొగము లతో నిరుత్సాహులగు వారి నోదార్చి, యుత్సాహ పఱిచి మగుడఁ బందెము లొడ్డం బురిగొల్పు చుండిరి. ప్రొద్దు పోవు టచే నాఁటికిఁ బోటీ పోగాటము నాఁపివేసిరి. మఱునాఁ డును, నా మూఁడవ నాఁడును నా ప్రకారముగానే పందె ములు జరిగెను. పందెపుఁగాండ్ర సంఖ్యయు, జన కోలాహల మును గ్రమాభివృద్ధి నొందుచుండఁ బ్రతి దిన మా గ్రామ ముత్సాహ పూరిత మగుచుండెను. జమీందారుగారి ప్రోత్సాహము మూలమున నట్టి వినోదమునఁ బాల్గొనఁ గల్గితి మని యెల్లరు నతని నభినందింప సాగిరి. జమీందారువారికి విందులు గూడఁ గ్రమాభివృద్ధి నందుచుండెను. జూదరుల సంఖ్యయుఁ బెచ్చుపెరిఁగెను. ఒక నాఁడు మహమ్మదీయ సంపన్నుఁ డొకఁ డా పందెమునఁ బాల్గొన వచ్చెను. అతఁ డొడ్డిన పందెమున కెదు రొడ్డువారు లేకపోయిరి. దిన దిన మును గ్రమ గ్రమముగా నుత్సాహ పూరితులై, లో లోన నాడ వేడుక పడుచున్న జమీందారుగారి కా తురక పందెగాని నెదురుకొన వలయు నని బుద్ధి వొడమెను. అతఁ డొడ్డిన యొడ్డునకు నెవరు నెదు రొడ్డువారు లే రని నంత,నా సాహేబు, 'బండార మింతే యీ యయ్యలది!' అని పరిహ సించెను. ఆ మాట పడి యుండలేక జమీందారు గారు తన

సంచి తెచ్చి వాని యొద్దున కెదురు కట్టు కట్టిరి. చూపఱు యుత్సాహము వర్ణింపఁ దరము గాదయ్యె. జమీందారు గారే పందెము గట్టి రని చేతులు తట్టుచుఁ బ్రజ లందఱును గెవ్వునఁ కేక వేసి తమ యానందమును వెలిఁబుచ్చిరి. రెండు మూఁడు పందెములు పెద్ద పెద్ద మొత్తములు గట్టి జమీందారుగారు గెలుచుకొనిరి. నాలుగైదు పందెలు కట్టి యోడిపోయి మఱి కట్టఁ గాసు లేక మీసము దువ్వుచు వచ్చిన సాహేబుగారు, గడ్డము సవరించుకొనుచు, బిక్క మొగము పెట్టి తలవంచుకొని యాలోచించి 'రేపు మరల వచ్చి యాడెదను. మీరు వెను కంజ వేయరాదు' అని జమీందారు గారితో ననెను. గెలుపులోనున్న రామచంద్ర భట్టు వెనుకఁ దీయునా? రా రమ్మనెను. నాఁటి కాట నిలుపు చేసిరి.

జమీందారుగా రా యూరు వచ్చి యొక వారమయ్యెను. ఆతిథ్యములకు నానందమునకును లోపము రాలేదు. ఎనిమిదవ నాఁడు మధ్యాహ్నమే సాహేబు సంచి గలగల లాడించుచు వచ్చెను. ఆ నాఁటి యాట వర్ణనాతీతముగా నుండెను. అంతగాఁ బై పందెములు మ తెవ్వరును గట్ట లేదు. క్రొత్త క్రొత్త పందెపుఁ బోతులు హాజరగుచుండెను. తొలి నాఁడు మండలాధీశ్వరుని జయమున కానందించి తృప్తిగా సంభావన లందిన మహానుభావులు వచ్చి యాతనిని బరివేష్టించి యుండిరి. ఆచార్యులువారు నత్యుత్సాహ వంతు లయి బహద్దూరు వారిని స్తోత్రము చేయుచుండిరి. సాహేబును, మండల ప్రభు సత్తముఁడును బెద్ద

పెద్ద మొత్తములను గట్టి, తమ తమ పొట్టేళ్లను డీకొలిపించిరి; సాయంత్రము వఱకు నాడిరి. జమీందారు కట్టిన పందె మంతయు గెలుచుటే కాని యోటమి యన్న దెఱుఁగకుండెను. నాఁడును సాహెబు సంచి దులిపి చల్లచల్లగ జాతెను. జమీందారువారు గెలిచిన సొమ్ములో సగము పేద సాదులకు, స్తుతి పాఠకులకును దానము చేసిరి. రామచంద్రరావు బహద్దూరు వారి కీర్తి యా ప్రక్క దిక్చక్రముల నిండి నిబిడీకృత మయ్యెను.

తొమ్మిదవనాఁడు మరలఁ గొత్త పొట్టేళ్ల పోటీపందె మతి రభసముగా జరిగెను. ఈడు దీయక తురక సంపన్నుఁడు కట్టుమీఁదఁ గట్టు కట్టుచు నోడిపోవుచుండెను. తుద కతఁడు తామసం పడి సంచిలో మిగిలియున్న ధన మంతయు నొక్కసారి కట్టివేసెను. మహా మండలాధీశ్వరుఁ డా పందె మంగీకరించెను. ఆ పందెము సాహెబు గెల్చుకొనెను. మరల రెండవ పందెమున క దంతయు నతఁడు గట్టివేసెను. మరల గెల్చుకొనెను. దానితో నతఁడు మూఁడు దినము లోడిపోయిన పైక మించు మించుగ గెల్చుకొనె నని మండలాధీశ్వరుఁడు గుర్తించెను. అతఁడు నావేశ పూరితుఁడయి తన సంచిలో నున్న దంతయు గల్గున నేలఁ బోసి యొక్క కట్టు కట్టివేసెను. సాహెబు సాహసించి యా పందె మంగీకరించెను; పొట్టేళ్ల కుత్సాహములు గలిగించుచుఁ జక్కగఁ బోరించిరి. సాయంత్రము ప్రొద్దు గ్రుంకినది. మండలాధీశుని పద్దు గ్రుంకినది. ఆ పందెము సాహెబు గెలుచుకొనెను. ప్రజలు విచార గ్రస్తులై వింజ మాకిడిన కరణిని నిస్తబ్ధులై నిశ్శబ్ద

ముగా జమీాందారిగారి వైపు చూడ సాగిరి. అంతతో నాఁటికిఁ బందె మూఁగిపోయెను. రేపు మరల వచ్చెద నని చెప్పి పరమోత్సాహ భరితుఁడై సాహేబు తన యనుచరు లతోఁ గవ్వనఁ గేకవైచుకొని ధన భస్త్రికను మోయించుకొని తన గ్రామము దారి పట్టెను.

జమీాందారుగారికి మతిపోయెను. శ్యామసుందరుని ధన మంతయుఁ బందెము కట్టి యతఁ డోడిపోయెను. ఎట్టులో రెండు కాసులు మాత్రము వాని దగ్గఱ మిగిలి పోయెను. ఎవ్వరు నే మాటయుఁ బలుకక మహాజను లందఱును సన సన్నగా సెలవు పుచ్చుకొని యిండ్ల కేగిరి. భట్టు నాచార్యులువారును వాయుసేవనార్థము కోనేటిప్రక్క కేగిరి.

కొంతసేపటి కటనుండి మరలి భట్టు నాచార్యులు గారు నూరిలోనికి వచ్చుచుండ, "ఏఁడీ యా దొంగ, పోకిరి, మోసగాఁడు? వీఁడు జమీాందారుఁడా? నా కగుపింపనీ! వీని పరువు భవిష్యము జలకడిగి వేసెదను" అని పలుకు లెదురుగ వచ్చు మనుజుని మొగమునుండి వారికి వినిపించెను. భట్టున కంతలో విషయము తెలిసిపోయెను. ఆచార్యులు గారి కా వాక్యములలోఁ గల యర్థము సుబోధము కాలేదు. ఇంతలో, వాఁడె భట్టుగాఁడు, "భట్టూ! ఓరి తులువా! నీవు జమీాందారుఁడవా? ఎందఱిబాకీ లెగఁబెట్టి జమీాందారుఁడ వైతివిరా? జూదరీ! రమ్ము. రమ్ము. నీ పని పట్టించెదను" అని యొకఁడు తమ దెసకుఁ బరువెత్తి వచ్చుచుండుట చూచి సమయస్ఫూర్తి గల భట్టు, ఆచార్యులువారి హస్తము పట్టుకొని, 'గురువుగారూ! కొంప మునిఁగినది. మాట లాడక

నా వెనుక రండు ' అని పలుకుచు సమీపమున నున్న యొక తుప్పవార గోతిలోని కాచార్యు నీడ్చుకొని పోయి దాగుం డెను. "ఏ డీ యా పలుగాకి? ఎటుపోయినాఁడు? ఔరా! దుండగీఁడా! నిలువు మెక్కడి కేగెదవు? నా బాకీ తీర్చుటకు నీకు డబ్బు లేదా? ఎగనామము పెట్టి పరారయి పోయెదవా? బోగపు ముండలతో జూద మాడుటకును, పొట్టేళ్ళ పందెము లలో వందలు వందలుగ నొడ్డి యోడి పోవుటకును నీకుఁ బైక మున్నదా? ఎంత వేషము వేసితివిరా! మా యూరి వారి నందఱ నెంత మోసగించితివిరా? నీ గుట్టు బయలుపడె నది. నీ పాపము పండినది. ఏఁడీ? ఏఁడీ? పాఱిపోయినాఁడు పాఱుఁ బోతు" అని తిట్టుచున్న యాసామీని గిరుతించి భట్టు పరారయ్యెను. ఆచార్యుని చేయి పట్టుకొని జర జర లాగుకొనిపోయి, రాలనక ముండ్లనక, గట్టులనక పుట్ట లనక, తుప్ప లనక తిప్ప లనక, తోఁట లనక, దొడ్లనక ముక్కునకు సూటిగా దారి తీసి కొంత దూర మరిగి భట్టు, "గురువు గారూ! క్షమింపవలయును. చాల శ్రమ యిచ్చినాను. వాఁడు వెఱ్ఱి కుక్క; మా సంస్థానములో నొకసారి నన్నుఁ గఱచి వేసినాఁడు. నేను గట్టిగఁ గొట్టినాను. ఇప్పుడీ యూరి కెట్టులో వచ్చినాఁడు. వాని కాటుతో నెంతో బాధ పడినాను. పాపము! వృద్ధులు, పండితోత్తములు, మిమ్ము వాఁడు కఱచు నేమో యని నా గుండె జాఱిపోయినది. మంచి కాలము. అదృష్ట వంతులము. పదండు పదండు. ఆ యూరికి మఱి పోవద్దు. ఆ వెఱ్ఱి ముండకొడుకు పసిపట్టి కసి తీర్చుకొన వచ్చియు న్నాఁడు" అని వచించి యమాయకుఁ డగు నాచార్యుని

నమ్మించి చిమ్మ చీఁకటిలో వడి వడి నడపించి యట్లే తీసి కొని రాత్రి కొక యూరు చేర్చెను.

అట్లు గేకలు పెట్టుచు వచ్చినవాఁడు రామలింగయ్య; మొట్ట మొదటి ప్రకరణమునఁ బాఠకులకుఁ బరిచయమైన వాఁడు. వాని జన్మస్థాన మీరాయవరము. నాలుగైదేండ్ల నుండియు నతఁడు వ్యాపారార్థియై మైసూరు, బెంగళూరు మున్నగు ప్రాంతముల కేగియుండెను. భట్టీయవలసిన నన్నూఱు రూపాయలు నామము పెట్టి లేచి చక్క వచ్చుటయు, మైసూరున వ్యాపారములో నష్టము వచ్చుటయుఁ గారణముగాఁ బాప మాతఁ డా వృత్తి మానుకొని స్వగ్రామము నకు నప్పుడే వచ్చెను. జమీందారుగారి తోటమీ యూరం తయు మాఱు మ్రోఁగుచున్నందున నతని చెవినిఁ బడి సంగతి విచారించి, యతఁడు రామచంద్రభట్టే యని రూపవర్ణనా దుల నిశ్చయించి, కోపము పట్టలేక భట్టుగుట్టు బయటఁ బెట్టి యీ విధమున వెంటఁబెట్టి వచ్చెను. జిత్తులమాఱి తన్నేమ ఱచి సురిగి పోయె నని తిట్టుచు, రామలింగయ్య, భుజంగరావు గారి యరుగుమీఁదఁ గూర్చుండి భట్టు నెత్తి మోటఁ గలిపి వేయసాగెను. ఊరంద ఱత్యాశ్చర్య మగ్ను లయిరి.

మొదటిభాగము ముగిసెను



# చిత్రాపూర్ణిమ

## రెండవ భాగము

## 1

## పురాణపఠనము

రామచంద్రభట్టును, ననంతాచార్యులును జీఁకటిలో రాయవరమునుండి బయలుదేఱి యొక జాము, పడుచు లేచుచుఁ బ్రయాణముసేసి యొక గ్రామము చేరి, యాఁకలితో నొక కోవెలలో నా రాత్రి వేఁగించిరి. అది యొక శూద్ర గ్రామము; మంచి వసతి గలది. ధనికులు పలువు రా యూర నుండిరి. కోవెల పూజారి మాత్రము బ్రాహ్మణుఁ డొకఁ డా పల్లెలోఁ గాపుర ముండెను. మఱు నాఁటి యుదయము, మన బాటసారు లిరువురు నా విప్రు నింట బసచేసిరి. భట్టు వింత చరిత్ర చూడఁ జూడ నాచార్యుని కనుమాన ముదయించెను. అతఁ డొక మోసగాఁ డనియు నిట్లు వేషము వేసి తన్నును, దనతోపాటు లోకులను వంచించుచుఁ దిరుగుచున్నాఁ డనియు, మండలాధీశ్వరుఁడు గానేరఁ డనియు నను దలంపు లంత కంతకు నతనికి దృఢపడియెను. కాని, యమాయికుఁ డాచార్యుఁడు నోరు మెదల్పలేక, ఏ మాటయు ననఁ జాలక యూరకుండెను. ఆతని కాళ్లు బొబ్బ లయినవి. మఱి యడుగుతీసి యడుగు పెట్టఁ జాలకుండెను. చేత నొక కాసయినను లేదయ్యె. భట్టు విచిత్ర ప్రతిభ యతఁ డెఱుఁగును. ఎట్టులయిన భట్టు మరలఁ దన్ను శ్యామసుందరుని బసకుఁ దోడు

కొని పోఁగలఁ డను ధైర్య మాతని కున్నది. కావున నతఁ డేమియు, ప్రశ్నింపక భట్టేమి చెప్పినను దాంటి యట్లే చిత్తము చిత్తమనుచుండెను. భట్టు మాత్ర మాచార్యులు గారి యనుమానమును గ్రహింపక పోలేదు. అయినను మించి వచ్చినదాని కేమిచేయఁ గలఁడు? తెల్లవాఱి నంతనే మంగలిని బిలిపించి భట్టు, తన పాదములందును, నాచార్యు నడుగులందును గ్రుచ్చుకొన్న ముండ్లు తీయించెను. ముదుసలి యయిన పండితున కతఁడు సకలోపచారములు సేసెను; వండి పెట్టెను. నాఁడంతయు వారిరువురును దేవాలయములో నొరు లెఱుంగకుండఁ బండుకొనిరి. సాయంత్ర మాచార్యులు గారికి జ్వర మంకాపోంకములతో వచ్చెను. కన్న కొడుకును మెప్పించి భట్టు సంరక్షణ సేసెను; తనకడ నున్న కాసు మార్పించి వంట సామగ్రి తెప్పించి యా పూజారి గృహ మున నొక గదిలోఁ జక్కఁగ వండి యాచార్యునికిఁ బెట్టి తాను దినెను. తా నెఱిగిన కషాయము పెట్టి మూఁడు పూట లాచా ర్యున కిచ్చి, కాళ్లు పట్టి వేళ్లుపట్టి సతంత మాతనిని సేవించుచు నా యూర నాలుగు దినము లుండెను.

ఆచార్యుని జ్వరము కట్టిపోయెను. భట్టు చేసిన సంర క్షణ కతఁ డెంతో సంతోషించెను; నాఁడు స్నానము చేసి కడుపార భుజించెను. అది మొదలు ప్రభువువారు చిత్తము చిత్త మను మాటలుమాని, తన తమ్మునివలె భట్టుం జూచుచు దానికిఁ దగినట్టులు ప్రసంగింప సాగెను. ఆ మార్పునకు భట్టేమియు ననుకోలేదు. వారిరువురి ప్రసంగము, శాస్త్ర చర్చలు పురాణ గాథలు, కావ్య నాట కాలంకార

ప్రసంగములును విని యా పూజారి, మహాపండితులు దన యదృష్టముచే నతిథు లయి వచ్చి రని యుప్పొంగి వారికిఁ గావలసిన యుపచారము లన్నియు నెంతయు భక్తిశ్రద్ధలతోఁ గావించుచుండెను. గురువుగారికి బాగుగ నారోగ్యము గలుగుట కొక వారము పట్టెను. భట్టు గుణగణముల నాతఁ డెంతో స్తుతించి యతఁ డొక కారణ జన్ముఁ డని నిశ్చయించు కొనెను.

ఆ నాఁడు జ్యేష్ఠ శుద్ధైకాదశి. భట్టు నాచార్యులు గారును ఫలాహారము చేసిరి. పూజారియు, వారును వీధి యరుగుమీఁదఁ గూర్చుండి యెద్దియో ప్రసంగము చేయు చుండ గ్రామస్థులు,సంపన్న నాయకు లిర్వురు ముగ్గురు వచ్చి మ్రొక్కి, పూజారిం గాంచి, "స్వామీ! నేఁ డేకాదశి. ఏదైనఁ బురాణముఁ జదివి చెప్పి కొంత సత్కాలక్షేపము చేయింప వేఁడెదము" అని వేఁడిరి. "మహానుభావులు,పండితోత్తములు వీ రిరువురు. మన తపస్సు పండినది. ఈ దినమున భాస్కర రామాయణము వీరివలన విని సంతసింతము. అందఱును రండు" అని పూజారి నాయకులతోఁ బలికి, 'స్వామీ! ఆచార్యులువారు! తమకుఁ గొంచెము శ్రమ యిచ్చుచున్నాము. దయ యుంచి నేఁడు పురాణము చెప్ప వేఁడుచున్నాము' అని ప్రార్థించెను. ఆచార్యులుగారు, 'అయ్యా! నేను దెలుఁగు పురాణము నంత బాగుగఁ జెప్పఁ జాలను' అని పల్కి "అన్నా! నీ వన్నిటను మిన్నవు. నీవు నేఁడు పురాణము చదివి శ్రావ్యముగా నర్థము చెప్ప వలయును" అని భట్టుతో నన, నవ్వుచు భట్టంగీకరించెను.

రెండు గడియలలో నూరి వారందఱును నచ్చటికిఁ జేరిరి. అప్పటికి నాలు గైదు గడియలు ప్రొద్దు మాత్ర మున్నది. భాస్కర రామాయణము సుందరకాండము తాటియాకుల పొత్తము దెచ్చి పూజారి యంబా స్తవముం జేసి, యాంజ నేయుఁడు రావణసభలోఁ బ్రసంగించు పట్టులోఁ జదువ నారంభించెను. భట్టు తన సహజ మధుర కంఠ స్వరమ్ము నకు రాగం బను సంధించి కోకిల లులుకునట్లు, తేనె సోనలు చాలువాఱునట్లు చక్కని యుక్తులతో వాల్మీకి హృదయ భావము నభివర్ణించుచుఁ బురాణమున కర్థము చెప్పుచుం డెను. క్రమక్రమముగానూరివా రందఱునువచ్చినిశ్శబ్దముగాఁ గూర్చుండి పురాణ శ్రవణము గావించుచుండిరి.మంచి రక్తి కట్టుచుండెను. శ్రోతలు పరవశులయి వినుచుండిరి. అట్టి సమ యమున, "వాఁడె భట్టు, దొంగ, మోసగాఁ డీ యూరు వచ్చి పురాణ భట్టయినాఁడు" అని దవు దవ్వులకు వచ్చి రామలింగయ్య యఱచెను. భట్టు,వానిం జూచి లక్ష్య పెట్టక చూడ నట్టులు, వానిమాటలు విన నట్టులు నటించుచుఁ గంఠ స్వరము రెట్టించి, నడుమ నడుమ రాగమును బెంచి, కళ లెంచి విసరుచు నావేశముతోఁ గథ నడపించు చుండెను. రామలింగయ్య యా వాకిటికి వచ్చి మరల నా విధముగనే వేలుచూపి నిందింప సాగెను. ఆ గ్రామ నాయకుఁడు దటా లున లేచి, "ఏ మయ్యా! రామలింగయ్యా! ఎందుల కా లాగున నఱచెదవు? ఇది పురాణ మనుకొన్నావా? తమాషా లనుకొన్నావా ? తిన్నగా నోరు మూసికొని వినవయ్యా!" అని మందలించెను. అంతతో నూర కుండక రామలింగయ్య

"వీఁడు నాకు న న్నూఱు రూపాయ లీయవలెను; నన్ను గికురించి ఈ ప్రాంతాలకు వచ్చి పెద్ద మండలాధీశ్వరుఁడ నని వేషము వేసి మా యూరివారి నందఱను మోసగించినాడు; మొన్నను నే వెంట బడినంతనే చీఁకటిలోఁ గాలికి బుద్ధి చెప్పి యీ యూరు వచ్చినాఁడు. వీని వెదకుచు నూ రూర దిరిగి తిరిగి దిమ్మ వట్టినాను. నా సొమ్ము నేను వసూలుచేసికోవలె నందురా వద్దందురా?" అని గద్దించి ప్రసంగింప నారంభించెను. అక్కడి నాయకుల కందఱికి నొక్క సారి "రామలింగయ్యమీఁదఁ గోపము వచ్చినది. చేతికఱ్ఱ లెత్తి, రామలింగయ్యా! ఏకాదశి, బ్రాహ్మణుఁడవు. నీ వీ పాటి నీ గొడవ చాలించి వెళ్లిపోయెదవా? నిన్నుంపకము పెట్టుమందువా? అతఁడు మహనీయుఁడు; రామభక్తుఁడు. అంత చక్కఁగఁ బురాణము చెప్పుచున్నాఁడు. మంచి రక్తి సమయములో విఘ్నము చేసితివి? పో, పొమ్ము. మాట లాడక మగిడి పొమ్ము" అని పల్కిరి. అప్పటికిని రామలింగయ్య యూరకుండక యేదో పలుక నుద్యుక్తుఁ డయి నంత నాయకులు చేయి చేసికొన నుద్యుక్తు లయిరి. అది కనిపెట్టి భట్టు చట్టున లేచి వచ్చి, "నాయకులారా! మీరు మహానుభావులరు. మీ రితని నేమియు సేయ వలదు. ఇతనికి నే నప్పు వడి యుండుట నిజమే. అయ్యా! రామలింగయ్యా! నీ ఋణము తీర్చుకో లేక పోను. నీ వింత పాటి దాని కింత రసాభాసము సేయ వలయునా? నా మాట వినుము. నేను బెంగళూరు వెళ్ళునప్పుడు నా వెంట రమ్ము. వడ్డితో నీ సొమ్ము చెల్లించి వేసెదను. ఎగఁబెట్ట వలయు నని యెప్పుడు ననుకో లేదు.

అందఱికిని సమ యాసమయములు గలుగును. ఇన్నాళ్లో ర్చినవాఁడవు నాలుగు దినములోర్చుము. మన మిరువుర మును బెంగళూరు వెళ్ళుదము" అని భట్టు ప్రణిమాలెను. "నీ బెంగళూరి చరిత్రయుఁ దెలిసినదోయి భట్టూ! జాటా" అను నంతలో నల్వురు నాయకులు వచ్చి రామలింగయ్యను జేతులమీఁద నడపించుకొని తీసికోఁ బోవుచుండ వారి కెదు రుగ నిరువురు గుఱ్ఱపు రౌతు లెదురైరి. ఆ కలకలము విని వారు గుఱ్ఱములను నెమ్మదిగా నడపించుచుఁ బూజారి వాకి టికి వచ్చిరి. భట్టు మరలఁ బురాణము చెప్ప నుద్యుక్తుం డగునంతలో నతని దృష్టి తురగారూఢుల పయిం బడెను. అతఁడు నిలువున నీ రయ్యెను. "స్వామీ! రామచంద్ర భట్టుగారూ! తమ రీలాగున దయచేయించినా రేమి విశే షము? తమరా వనపర్తి సంస్థానాధీశులు? ఓహో! అనంతాచార్యులుగారు నిక్కడనే యున్నారా! ఇరువురికి నమస్కారములు! అయ్యా! ఆచార్యులు గారూ! మీ శిష్యుఁ డేఁడీ? అతనిని విడిచి మీ రేల యీ లాగునవచ్చితిరి?" అని యా పురుషులలో నధిక తేజస్వియైన యాతఁడు తుర గమును దిగి వచ్చి వాకిట నిలిచి ప్రశ్నించెను. భట్టు నోరు విప్పలేదు. ఆచార్యులుగారు, "చిత్తము, చిత్తము. పొర పాటు జరిగినది, క్షమింప వలయును" అని పలుకుచు గడ గడ వడఁకి పోవుచుండెను. "సరి లెండు, నా కంతయుఁ దెలిసినది. భట్టూ! మీ మేనత్త యుత్క్రాంత జీవితయై నీ కొఱకు మైనూరునకుఁ గబురు పంపినది. నీ పేర నామె స్థిర చరాస్థులు వ్రాసిన దఁట. నీవు తడవు సేయక వనపర్తి

వెళ్లుము. మహా మహుఁడయిన నీ తండ్రిపేరు నిలఁ బెట్టుము. మైసూరు వచ్చితివేని నీ కేదైన నుద్యోగము సంస్థానమున నిప్పించెదను. కర్చుల కీ పదిరూకలు తీసికొని తగినంత వేగముగా టెక్కలు కట్టుకొని వనపర్తిలో వాల వలయును" అని, యా రాజపురుషుఁడు పలుక, భట్టు, 'చిత్తము చిత్తము' అని తల వంచుకొని నిలువంబడెను. ఇంతలో రామలింగయ్య తిరిగి యచ్చటికి వచ్చి యా రాజ పురుషుం గాంచి, "గోపాలరాజుగారు! సుదినము, సుదినము. ప్రభువా రీ యూరికేల విచ్చేసితిరి?" అని పలుకరించి భట్టు తనకు నన్నూఱు రూపాయలు బాకీ యని గోపాల రాజుగారితో మనవి చేసెను. "అయ్యా! రామచంద్రభట్టూ! ఈతని పల్కులు సత్యము లవునా?" అని గోపాల రాజడుగ, "చిత్తము. నేను బాకీయున్నాను" అని భట్టు ప్రత్యుత్తర మిచ్చెను. "అయ్యా! నిన్ను నే నెఱుఁగను. భట్టు ప్రస్తుతము వేల సంపన్నుఁ డయినాఁడు. నీ సొమ్మునకు భయము లేదు. ఒక నెలలో నీ సొమ్మాతఁడు నీకుఁ బంప నప్పుడు నా పేర నుత్తరము వ్రాయుము. నేఁ బంపించి వేయుదును. అతని నీ లోపున నేమియుఁ జీకాకు పెట్టవద్దు" అని గోపాలరాజుగారు సెలవీయ, చిత్తమని రామలింగయ్య యంగీకరించి వెళ్ళిపోయెను. గోపాలరాజుగారి బండియుఁ బెద్ద గుమాస్తాయు నా వేళ కచ్చటికి వచ్చిరి. "ఆచార్యులు గారూ! తమరు నేను నా బండిలోఁ గూర్చుందము రండు. భట్టూ! మేము వెళ్లి వత్తుమా? నెల్లాళ్ళలో నతని కా సొమ్ము పంపెదవు గదా?" అని గోపాలరా జన నిరువురును

జిత్తము చిత్తమనిరి. ఆచార్యులుగారు రాజుగారితో బండి యెక్కెను. బండి సాగిపోయెను. భట్టారాతి రచ్చట నుండి వేకువనే బయలుదేఱి హుటాహుటీ ప్రయాణముల వన ప్రర్తి కరిగెను. భట్టు దివ్య చరిత్రమును, శ్యామసుందరు నాటవిక సంచార చరిత్రమును జెప్పుకొనుచు గోపాలరాజు నాచార్యులును ధర్మవర మా రాత్రికే చేరుకొనిరి.

## 2

### ఇద్దఱు నిరాబారులు

రాత్రి పండ్రెండు గడియ లయి యుండును. పూర్ణ చంద్రుఁడు విను వీధిని విరాజిల్లు చుండెను. శివా రుతములు, ఘూక ధ్వనులును దప్ప నింకే శబ్దమును వినరా దయ్యెను. నిదాఘ సమయ మగుటచేఁ బగలెల్లను ప్రపంచ మట్టుడికి నట్లుడికి, యుడికి, యా నిశా సమయ చండ నాచ లాగత వాత పోత వ్రాతముచేతను, జందమామ వెన్నెల వెల్లిచే తను జల్లఁబడి హాయిసెంది సుఖ సుప్తమగుచుండెను. అట్టి తరుణమున నార్వురు బోయీలు లొక పల్లకి నెత్తుకొని నిశ్శబ్దముగా నొక మార్గమునం బడి యతి త్వరిత గతిం బరువెత్తు చుండిరి. ముప్పది యేండ్లు నిండిన పురుషుఁ డొకఁడును నందు సగము వయస్సు గల బాలుఁ డొకఁడును నా పల్లకి వెనుక దాని గమన వేగము ననుసరించి పోవుచుండిరి. కుఱ్ఱ వాఁ డలసి సొలసి యవుర్లు గ్రక్కుకొనుచు నతి ప్రయాస మునఁ బరువెత్తుచుండెను. ఆ పల్లకి యట్లు వచ్చి వచ్చి యొక గ్రామమును సమీపించెను. 'ఈ యూరి వెలుపలి

గోరిజ నుండి యవతలి తోటలోని కరుగ వలయును " అని పల్లకి వెనుక వచ్చు పురుషుఁడు బోయీల కాజ్ఞాపించి 'యబ్బాయీ! మనము నేఁటి కవ్వలి సత్రమున నిలిచి యుదయమునఁ బయనము చేయుదము. నాలు గడుగులు వేయుము' అని తనవెంట వచ్చు బాలునితోఁ బలికెను. పల్లకి యూరిలోనికిఁ దిరుగక వెలుపలి గోరిజంబట్టి యవ్వలి తోఁటఁ జేరెను. పురుషుఁడు వడి వడి సత్రము వాకిటి కరిగి, 'ఇదిగో, ఇక్కడఁ బల్లకి దింపుఁడు' అని బోయీల కాజ్ఞాపించెను. ఆ సత్రము వాకిట నున్న కల్జువ్వి క్రిందఁ బల్లకి యాఁగెను. పురుషుఁ డనాయాసముగా మాఱు తాళపుఁ జెవితో సత్ర ద్వారములు దెఱచి లోనఁ బ్రవేశించి వెలుపలికి వచ్చి యిటు నటుఁ జూచి, మెల్లగా, 'నోరీ! దాని నింటిలోనికిం దెండు' అని బోయీలకుఁ జెప్పెను. పల్లకి దెఱచి, పల్లకి నుండి యొక బాలికను వెలువరించి యనాయాసముగా నొకఁడు లోనికిం గొనిపోయి దించెను. ఆమె మూలుగుచుండెను. బోయీలు వంటఁ జేసికొన నేగిరి. పురుషుఁ డింట దీపము వెలిగించి, బాలిక నోటినుండి గుడ్డ దీసివైచెను; చేతి బంధములు విప్పెను.

పురు:- పిల్లా! లెమ్ము. లెమ్ము. ఈ యాహారముం దీసికొమ్ము.

పిల్ల:- ఓరీ! పిశాచమా! నీ వెవ్వఁడవు? న న్నిట్లేల బలవంతముగ మాయఁ జేసి తెచ్చితివి?

పురు:- నా వంటి పురుషుఁడు నీ వంటి చక్కని బాలికామణి నెందులకుఁ దెచ్చియుండునో గుర్తింపలేవా?

పిల్ల:- ఛీ! దురాత్మా! నోరు మూయుము. నీవు పురుషుఁడవా? అయినచో నిరపరాధిని నైన నా పయిఁ జేయి చేసికొని బలాత్కారముగా నన్నిట్లు దెత్తువా! హఠాత్తుగా మీఁదఁ బడి కాలు సేతులు బంధించి నోట గుడ్డలు గ్రుక్కి పల్లకిలోఁ బడవైచి నిర్దయుఁడవై యింత దూరము మోయించి తెత్తువా? నీ వెవ్వఁడవు? నీకు నే నే మపకారము చేసితిని? నా పయి నింత పగఁ బూనుటకుఁ గారణ మేమి?

పురు:- కళ్యాణీ! కోపింపకుము. నేను బ్రాహ్మణుఁడను. నిన్నుఁ బెండ్లియాడఁ దలంచి యిట్లు దెచ్చితిని.

పిల్ల:- బ్రాహ్మణుఁడవా నీవు చండాలుఁడవా? మా యమ్మ నడుగక నన్ను మాయఁ జేసి తే నేల?

పురు:- నీకు సంబంధము నిశ్చయ మయి నట్లు విన్నాను. వాఁడు నాకుఁ బరమ శత్రువు. దుర్జాతి, దురాత్ముఁడు, జూదరి, మాయకాఁడు, దివాలాదీసిన తులువ, దేశభ్రష్టుఁడు. అట్టివాని గుట్టు తెలియక రామ చిలుకవంటి యమాయిక బాలికవు నీవు వాని వలలోఁ బడి వాని యందు మరులుకొంటి వని విని, నిన్నా యాపద నుండి రక్షింప నెంచి కపటోపాయమున నిన్నుఁ దోఁటకు రప్పించితిని. నీవును, నీ తల్లియు వానిని బ్రహ్మణ్యుఁ డనుకొని యున్నారు. మీకు నిజము తెలిపినను లాభము లేదు. కాఁబట్టి నిన్ను బలవంతమునఁ దేవలసి వచ్చినది. నీ క్షేమము గోరి చేసిన యీ పాటి నా తప్పు మన్నించి నీ

యంగీకారమును దెల్పుము. తెల్లవాఱు సరికి ని న్నిల్లు సేర్పించెదను.నన్ను బెండ్లాడెదనని నీవు తల్లితోఁ జెప్పుము; సుఖ మనుభవింపుము.

పిల్ల:- ఈ దుస్తంత్ర మంతయుఁ జేసిన పరమ చండాలుఁడవు నీవా? రాజరత్నమునకు గానిసకాఁడవై యమ్మహా పురుషునిం దోఁచుకొని యవమానింపఁ జేసిన తుచ్ఛుఁ డవు నీవా! నీ యట్టి మహానుభావునిం బెండ్లాడ నేనంగీ కరింప వలయునా? ఇంతకంటె నొక బండ కట్టుకొని బావిం బడుట మేలు గాదా? ఓరీ! నరాధమా! ఎంత పని చేసితివిరా?నీయందున్న దుర్గుణ పుంజము నంతయును సు గుణ రాశియగు నతనియం దారోపించు చుంటివా? నీ మొగముఁ జూడరాదు. నీతో నింతవఱకు మాటలాడి నందులకుఁ బ్రాయశ్చిత్తము చేసికోవలెను. ఛీ. ఛీ.

పురు:- ప్రియురాలా!

పిల్ల:- ఛీ! తులువా! ఎవతెరా నీ ప్రియురాలు? పళ్లు రాలఁ గొట్టువారు లేకపోయిరి సరిపోయినది.

పురు:- పిల్లా! నా మాట వినుము. నీ యందలి ప్రేమ చేతను గదా యింత శ్రమపడితిని. ఆ మోసగానినా వరించెదవు?

పిల్ల:- ఛీ, ఛీ, నోరుమూయుము. నీ నోటఁ బుర్వులు రాల వలెను. నీవు చచ్చినను నిన్నుఁ గన్నెత్తి యైనం జూడను.

పురు:-ఆలోచించుకొనుము. నీవు సంపూర్ణముగ నా వశ మున నున్నదానవు.

పిల్ల:- తులువా! పయిని( బరమేశ్వరు( డున్నా(డురా? దీన బాంధవు( డాత(డే నా కా(పును బ్రాపునయి యున్నా(డు. నో రెత్తకు.

పురు:- తిన్నగ నే( జెప్పినట్లు విందువా బ్రాహ్మణో త్తము(డనైన నేను నిన్నుంచు కొందును. అడ్డ దిడ్డముగ మిడిసి పడెదవా నిన్ను( గఱకు( దురక కిచ్చి నిక్కా చేయించెదను. నా ప్రాణ చూడుము.

పిల్ల:-నీ మొగ మీడిచి నట్లే యున్నదిలే. తుంటరీ! ప్రపంచ మంతయు నీ వశమున నున్న దనుకొనుచుంటివి. నీకు వచ్చిన యేండ్లు గాడిదకు వచ్చినవి. చండాలుడా! న న్నుంచు కొందువుగా! నీకు( జావు సమీపించుటచే నిట్లు ప్రేలుచుంటివి; ఇట్టి దుండగముల కొడిగట్టితివి. నీ కుంచము నిండినది. నీ పాపము పండినది. నీ తల నూఱు వ్రక్కలగును.ఈ పాటున నీతలపై( బిడుగు పడవలసినది.

పురు:- అబ్బాయీ! ఆ తలుపు వేసి రమ్ము. దీని కాలుగాయ తనము వడిగా నున్నది. ఇది మంచికి( గాలము గాదు.

పిల్ల:- ఛీ, మహాపాపి! నీ కండలు గోసి కాకులు గ్రద్దలకు వేయవలయును. గంపంత కన్ను పెట్టుకొని యాపద్బాం ధవు( డా సర్వేశ్వరు(డు నీ యీ దుండగము నత్యాచా రమును జూచు చున్నా(డు. నీకు( జేటు కాలము దాప రించినది. నాకు దిక్కు లేకపోదు.

పురు:- దిక్కే, దిక్కే, అరమైలు దూరమున నే యూరును లేదని నీ వెఱుఁగవు. పాపము! నిన్నిక్కడఁ గాపాడు వా రెవ్వరును లేరు. నా మాట లాలించి యాలోచించినచో నీకు గతి గలదు. లేకున్నఁ బచ్చి తురకల పా లగుదువు. నీవు సాని దాని కూఁతురవు. బ్రాహ్మణుఁ డెవఁడు నిన్నుఁ బెండ్లాడును? వాని యాశ వదులుకో. ఈ జన్మమున మరల నీవు నీ తల్లి మొగము చూడఁ జాలవు. దాని గర్వము, మిడిసిపాటును నణఁగి పోయినవి లే.

పిల్ల:- ఛీ, ఛీ, పశువా! ఛీ, పశువు గూడ నీకంటె నయము. ఇట్టి తుచ్ఛ గుణములు పశువున కుండవు.

పురు: ఊరకున్నకొలఁది నోటికి హద్దు పద్దును లే కున్న దే. చూడు ని న్నేమి చేసెదనో! వెంకటేశ! తలుపు వేసి రారా, దీని పని పట్టించెదను.

బాలుఁడు:-అయ్యా! మీ యభిప్రాయ మేమి? ఇష్టము లేని బాలిక నేల నిర్బంధించెదరు? ఇది పాపము గాదా?

పురు:-"ఓరీ కుఱ్ఱ పశువా? నోరు మూసికొని తలుపు వేసి రా. పోనీ నేనే వేసెదను" అని యా పురుషుఁడు లేచి ద్వారము చెంత కేగునంతలో హఠాత్తుగా నిర్వ రాజానుబాహువులు లోనఁ బ్రవేశించి తెప్పవేయునంతలో న ప్పురుషుని పయిఁబడి కట్టి పడవైచిరి. వా రిరువురు నిరాబారు లగు జడదారులు. వారిం గాంచి నంతనే ప్రాణములు లేచి వచ్చి, యా బాలిక కెవ్వనఁ గేక వైచి వారి కాళ్ళ

పయిం బడెను. నిరాబారులలో నొకఁడు, "అబ్బాయీ! నీవు మంచివాఁడవు. ఆ యమ్మాయిని దోడ్చుకొని మా వెంట రమ్ము. చెంత నున్న గ్రామమునకుఁ బోవుదము" అని పలికి, 'అమ్మా! రమ్ము. లెమ్ము' అని యామెకాలి బంధము లెడలించి చైతన్యము తప్పి పోవుచున్న దాని నెత్తి, బుజముమీఁద వైచికొని బైరాగి ద్వారము దాఁటి వచ్చెను. లోపలినుండి యా పురుషుఁడు గేకలు పెట్టసాగెను. బాలుఁ డా పురుషు నేవగించుకొని బైరాగుల వెనుక నరుగ బయలుదేఱెను. బైరాగులు వాకిట నా బాలికను దించిరి. ఆ పిల్లకుఁ జక్కఁగ స్మృతి గల్గెను. వారు పయనము చేయ నుద్యుక్తు లయి నంతలో బోయీ లాఊవురును నచ్చటికి వచ్చిరి. లోపలినుండ పురుషుఁడు బోయీలకై కేకలు పెట్టుచుండెను. "ఈ దొంగ బైరాగులను బట్టుకొండు; కొట్టుఁడు" అను కేకలు వినవచ్చి నంతనే బోయీలు బైరాగుల పయిం బడిరి. బైరాగు లిరువురి కడ చిక్కని బడియ లున్నవి. వా రా బాలిక నా బాలుని కొప్పఁజెప్పి సన్న సన్నగ నూరిలోనికిఁ దోడ్చుకొని పొమ్మని చెప్పి తమ లాటీలను దీసి బోయీల నెదుర్కొని పోరాడఁ దొడంగిరి. బాలుఁడు తమ జట్టులోని వాఁడే కదా యని యనుకొని బోయీలు వాని దారి నాక్రమింపక బైరాగులతో యుద్ధముసేయఁ బూనుకొనిరి. అసాధ్యు లా జడదారులు. కను ఱెప్పవేసి నంతలో నిరువురు బోయీలను నేలఁ గూల్చిరి.

నిదర్శనము. నిన్ను క్షమించితిని. ఇంక నేడో రేపో నే నీ యస్థిర సంసారమును వీడి శ్రీ రామచంద్రమూ_ర్తి చరణ సన్నిధానముం జేరుకొందును. అంతవఱకు నన్నుఁ గని పెట్టి యుండి నన్నింత బుగ్గి చేసివేయుము. నీవు వెళ్ళి స్నానముచేసి వచ్చి, యధ్యాత్మ రామాయణమో, సుందర కాండమో చదివి నాకు వినిపించుము. నీవు వచ్చిన పిదపఁ బిన్ని వంట సేయ నేగును. పోయి రమ్ము" అని పలికి యాయాసముచేఁ గన్నులు మోడ్చెను. భట్టు స్నానముసేయఁ బోయెను.

భట్టు స్నానముచేసి మడి బట్ట కట్టుకొని ముద్రా ధారణము సేసికొని సుందర కాండము విప్పి, మేన_త్త కెదురుగఁ గూర్చుండి చక్కఁగాఁ జదువుచు నక్కడక్కడ నర్థముచెప్ప సాగెను. సుందరమ్మ వంటసేయ నేగెను. జానకమ్మ శ్రద్ధతో భట్టుచెప్పు నంశములు వినుచు నతని ధోరణి, తన యన్న ధోరణిని దలఁపించుటచే శోకానందాశ్రువులు గన్నుల నించెను. ఆ నాఁడామె హృదయమునుండి పెద్దబరువు తీసి వేసిన ట్లయ్యెను. మధ్యాహ్నము వఱకును బారాయణము సేసి యామె సెలవొంది భట్టు భుజించి యించుక విశ్రాంతిఁ దీసికొనెను. జానకమ్మ యా నాఁ డేమియు నాహారము వల దనెను; సాయంత్రము జాము ప్రొద్దుండువఱకు శ్రీ రామ నామమును జపించి, భట్టును బిలిచి దాన ధర్మములు సేయింపు మనెను. గ్రామస్థులను, బంధువులను బిలిపించి భట్టు జానకమ్మకుఁ బ్రాయశ్చి_త్తము చేయించి విరివిగా నన్ని దానములు చేయించెను; జానకమ్మ జ్ఞాతులను మంచి మాటలాడి రప్పించెను. జానకమ్మ మేనల్లుని బిలిచి, యధ

శ్చయ్యే యమర్చ మనెను; రోదనము చేయరా దని శాసిం చెను. ఆమె యాజ్ఞానుసారము రాత్రి యామె నథశ్చయ్యను బరుండఁ బెట్టి భట్టును, సుందరమ్మయుఁ, గావలసిన బంధువులును శ్రీ రామ నామస్మరణ సేయుచుండిరి. భట్టు,తనతొడపయిం జానకమ్మ శిర ముంచుకొని యామె చెవిలో బిగ్గఱగా శ్రీ రామ రామ యని నిరంతరము రామ నామమును వచించుచుండెను. పెద్దలు తెచ్చియుంచిన కాశీ గంగను గుళ్ళిమూఁత విప్పి సుందరమ్మ, యుద్ధరిణెతో జానకమ్మ నోటఁ బోసెను. నిర్విచారముగా హృదయమును శ్రీ రామ చంద్ర చరణార విందమ్ములఁ బాదుకొల్పి, నోరార రామ నామమును వచించుచు, జానకమ్మ యశాశ్వతమైన యీ లోకమును విడిచి శాశ్వత మగు పరంధామమును జేరెను.

## 4

### సీ తా క ళ్యా ణ ని శ్చ య ము

జాము న్నర ప్రొద్దెక్కునప్పటికి శ్యామల కల్లకితో స్వాములవా రున్న యూరు వచ్చి చేరెను. ఆమె రాకకై నిరీక్షించుచున్న సీత పరుగెత్తికొని వచ్చి శ్యామలను గౌఁగిలించుకొనెను. శ్యామలయు సీత నక్కునఁ జేర్చుకొని, నష్టమయ్యె ననుకొన్న నిధానము మరల లభించినట్టు లుప్పొంగి, యొక కంట దుఃఖాశ్రువులు నొక కంట నానంద బాష్పములు రాల్చుచు సీత నోదార్చి నెమ్మది పఱిచెను. సన్యాసియు వా రిరువురి యన్యోన్య ప్రేమం జూచి, యెద్దియో తలంచు

కొని తల వంచుకొని ఖిన్నుఁడయి యొక్కింత తడవు దన్నుఁదా మఱచెను.

శ్యామలతో దుర్గాప్రసాదుఁ డప్పుడు వచ్చియుండెను. వానికిని వేంకటేశ్వరునకు నొక్క నిమేషములో జట్టు కలిసి పోయెను. రాత్రి జరిగిన యద్భుత సంఘటనముం గూర్చి యా బాలు రిరువురు ముచ్చటించుకొనుచు సత్రమున కరిగిరి. దుర్గాప్రసాదుని యాశ్చర్యమునకు మేర లేదయ్యె. వీధి యరుగు మీఁద ననంతాచార్యులుగారు జపము చేసికొనుచుఁ గూర్చుండి యుండిరి. "సామీ! గురువుగారూ! నమస్కారము. తమ రెప్పు డిక్కడికి దయచేయించినారు? శ్యామసుందర ప్రభువుగారును, మా ప్రభువువారు నేరి?" అని యడుగ నాచార్యులుగారు పక్కున నవ్వి, "మీ జమీందారుగారా? గట్టి వాఁడ వోయి యబ్బాయీ? నీవు గూడ నన్ను మోసగించితివే. రా! రా! సమాచార మేమి? నీ వెందుల కిట్లు వచ్చితివి?" అని యడిగెను. ప్రసాదుఁడు తన యుదంతము నెఱిఁగించి స్వాముల వారిని గూర్చి ప్రశంసించెను. "ఏమీ! బదరీనారాయణ స్వాముల వారు విజయం చేసి యీ చేరువ యగ్రహారమున విడిసి యున్నారా? పద! పద! నేను వారిని సందర్శింప వలయును" అని ఆచార్యులుగారు లేచిరి. "అయ్యా! రాత్రి యిచ్చటి కరుదెంచిన గుఱ్ఱపు సవారు లెవరు?" అని వేంకటేశ్వరుఁడు ప్రశ్నింప, "వారు మైసూరు గోపాలరాజుగారును, వారి కుమారులు శ్యామసుందర ప్రభువును, వారి ప్రరిచారకులును మొదట నిక్కడికి వచ్చిరి. తరువాత బండిలో నేను

వచ్చితిని" అని ఆచార్యులుగా రుత్తరమిచ్చిరి. "అయిన రాత్రి దొంగలను బొంట్రోలిన వారు గోపాలరాజు గారా? వారును వారి పుత్త్రులును బ్రస్తుత మిక్కడనే యున్నారా?" అని వేంకటేశ్వరుం డడుగ, "ఔను మా ప్రభువు వారును, కుమారప్రభువును బైరాగులను గొట్టుచున్న బోయీలను గొట్టి తఱిమి వేసి రంట. నేను వచ్చు నప్పటి కీ దంతయు ముగిసిపోయినది" అని యాచార్యులు గారు జవాబు చెప్పుచు నగ్రహారమునకుం గాలు సాగించుచుండిరి. బాలురు గురువుగారి వెనుక నడచుచు రాత్రి కట్లతోం బడియున్న రంగారావును గుఱించి ప్రశ్నించిరి. "వాండా! వాం డతి దుష్టుండు. ఒకనాం డాటలలో నొకని వెనుక వేసికొని వచ్చి మా శ్యామసుందరుని గొట్ట వచ్చిన పలుగాకి యంట వాండు. శ్యామసుందరమూర్తి, రాజుగారితోం దత్సమాచారము చెప్పెను. గోపాలరాజు గారు, దయాళురు; బ్రాహ్మణ భక్తులు. కాంబట్టి వానికి బుద్ధి చెప్పి యుదయముననే విడిచిపెట్టిరి" అని యాచార్యులు గారు బదులు చెప్పిరి. "శ్యామసుందరమూర్తిని దర్శించుటకు వీలు కలుగునా?" అని ప్రసాదుండు పృచ్ఛింప, "వీలుండదు. అతం డస్వస్థచిత్తుండై యెవ్వరితోడను మాటలాడకున్నాండు" అని యాచార్యులుగారు పలుకు నంతలో వా రూరిలోనికి వచ్చిరి.

స్వాములవారు వ్యాఘ్రాసనమ్మున నాసీనులయి పీఠమున నెలకొన్న బదరీనారాయణమూర్తి పాదుకలను బూజించి హారతి యిచ్చుచుండిరి. గ్రామస్థులందఱును వినయ [illegible] చేతులు జోడించుకొని నిలువ

బడి యుండిరి. ఒక వృద్ధ విప్రుఁడు, "సామ్రాజ్యం భోజ్యం, స్వారాజ్యం వైరాజ్యం" అని యుచ్చైస్స్వరమ్మునఁ జెప్పు చుండ వామకరమున ఘంటా నాదమును గావించుచు దక్షిణ హస్తమున నున్నయారాత్రికముం ద్రిప్పుచు నర్ధనిమాలిత నేత్రులయి స్వాములవారు, రెండవ దత్తాత్రేయ మునీంద్రుని దలఁపించుచు వెలుఁగొందు చుండెను. అట్టి సమయమున ననం తాచార్యులుగారును బాలు రిరువురు నచ్చోటికి వచ్చిరి. ఆ దృశ్యమును గాంచినంతనే యనంతాచార్యులుగారి నయ నాబ్జము లానందాశ్రు మరంద మిళితము లయ్యెను. అతఁడు వేద మంత్రమును జెప్పుచుఁ బీఠమున కెదురుగ సాష్టాంగ ముగా నమస్కారము చేసి లేచి భయభక్తులు పెనఁగొన స్వాములవారి సన్నిధిని మోకరించి యుండెను. హారతి యిచ్చు టయి నందున స్వాములవారు, కన్నుఁ దెఱచి తన యడుగుల కడ మోకరించి యున్న యనంతాచార్యునిం జూచి విస్మయావిష్ట మానసు లయి, యారాత్రిక పాత్ర మట్టులే పీఠ సోపానంబున నుంచి, "అనంతా! ఎప్పుడు వచ్చితివి? సేమముగా నున్నావా? ఎక్కడ నున్నాఁడవు? ఇక్కడ మే మున్న సంగతి నీ కెట్లు తెలిసెను?" అని యడిగిరి. ఆచార్యులును దన యుదంత మంతయు రెండు మూఁడు వాక్యములలో ముక్తసరముగఁ జెప్పెను. తమ పూర్వాశ్రమ సోదరుఁ డితఁ డని స్వాములవా రనంతాచార్యుని గూర్చి గ్రామస్థులతోఁ జెప్పి యతని నెత్తి కౌఁగిలించుకొని, "నీ వీ పూట నిక్కడ నుండుము. గోపాలరాజుగారి బసకు నేను గబురు పంపెదను" అని పల్కిరి. దుర్గాప్రసాదుఁడును

వేంకటేశ్వరుఁడును మరల సత్రమున కరిగి గోపాలరాజు గారిని దర్శించి స్వాములవారి యాజ్ఞను నివేదించిరి; శ్యామ సుందరుం గాంచి మాటలాడిరి. 'నీవు వనపర్తి కేగి భట్టును నే నతి త్వరితముగ రమ్మంటి నని చెప్పుము' అని శ్యామ సుందరుఁడు పదిరూపాయలు ప్రసాదుని కిచ్చి పంపెను.

మధ్యాహ్నము వచ్చి గోపాలరాజుగారు స్వాముల వారిని దర్శించి పాద పూజ చేసి, యాచార్యుల వారిం దోడ్కొని పోయి యా నాఁడే మైసూరున కచ్చటినుండి బయలుదేఱి పోయిరి. అనంతాచార్యుని మూలమున, రామ చంద్రభట్టు మహా విద్వచ్ఛిరోమణియగు నరసింహాచార్యులు వారి కుమారుఁడనియు, నతి ప్రతిభాశాలి యనియు స్వామి వినెను. నాఁటి యపరాహ్ణముననే దుర్గాప్రసాదుని కొక జవా నుం దోడిచ్చి భట్టుం దోడ్కొని బెంగళూరునకు రావలయు నని వనపర్తికిఁ బ్రయాణము సేసి యంపెను; రాత్రి, శ్యామ లయు, సీతయుఁ దనకుఁ బాద సేవ సేయుచుండ వారితోఁ గొంత సేపు ముచ్చటించెను. అప్పుడు శ్యామల, "స్వామీ! ఈ మధ్య సీత, చనిపోయినదే బ్రతికిన దనుకొండు. రాత్రి పదు నొకండు గంటల వఱకు భజన సేసి యుయ్యాల మంచ మున శయనించి నిదురించుచుండి, సీత, సర్ప దష్టయై తెల్ల వాఱు నప్పటికి శవ ప్రాయయై పడియుండెను. మే మెల్లర మును గోలు గోలున నేడ్చుచుండ రామచంద్ర భట్టను నాతఁ డకస్మాత్తుగా నరుదెంచి తన మంత్రశక్తి న త్యద్భుత రీతిం గానిపింపఁ జేసి పామును రప్పించి, విషమును దింపించి సీతం బ్రతికించెను. అది యభూత పూర్వము. అంతవఱ కట్టి

విద్య గల దని వినుటయే కాని కనుట లేదు. నాఁ డాతఁడు రానినాఁడు సీతయు నేనును స్వాములవారి నిట్టులు దర్శించి సేవించి యుండము. ఆయనకు ముప్పది యేండ్లు వయస్సు. చక్కని మాధ్వ బ్రాహ్మణుఁడు. సీత యాతని మనసార వరించినది. అతనికి సీతయం దపరిమి తాను రాగము గుది రెను. కాని, సీతా జనన రహస్యము మాకుఁ దెలియక పోవుటచే నేమి చేయుటకును దోఁచక స్వాములవారి కా సంగతి తెలియఁ జేసి తమరు సెలవిచ్చి నట్లు చేయ నిశ్చ యించుకొంటిమి. అంతలో నతఁడు తలవని తలంపుగాఁ బరారయి పోయినాఁడు. ఆ విషయము వేంకటేశ్వరరావు మూలమునఁ దమ కంతయు విశద మయి యున్నది గదా! అంతయు సీత దలంచి నష్టే యయిన దని యిప్పుడు దృఢపడి నది. కాని, తొలుత నేను మోసపోతిని. సీతయు నేను నొక నాఁ డీ విషయమునఁ బ్రసంగించు చుండ దుర్గా ప్రసాదుఁ డొక యుత్తరమును దెచ్చి యిచ్చినాఁడు. రామ చంద్ర భట్టు వ్రాసినదే యది. ఇదిగో భట్టు పంపిన యాలేఖ. ఇది తమరు చిత్తగించి జరిగింప వలసిన విధానమును సెల వింపు" అని పల్కి యుత్తరమును స్వాములవారి చేతి కిచ్చెను. స్వాముల వా రా యుత్తరమును జదువుకొని చెద రిన చిత్తమును బదిల పరచుకొనిరి. శ్యామల యా మార్పును గుర్తించెను. "ఏల యీయన కీ తత్తరపాటు? ఎట్టి విడ్డూ రము లీ లోకములో నున్నవి! నే ననుమాన పడినది యథార్థ మయినది. ఏమి చెప్పుదురో వినవలయును" అని శ్యామల తనలో ననుకొను చుండెను. "శ్యామలా! భట్టును

దో డ్తిమ్మని ప్రసాదరావును బంపినాము గదా! నీవు ప్రభాత మున సీతను దోడుకొని బెంగళూరున కేగి భద్రముగాఁ జూచు చుండుము. మేమును నాలుగు నాళ్లలోఁ బీరముతో నచ్చటి కేతెంతుము. సీతా కళ్యాణము జరిగించి కాని మే మీ ప్రాంతముల విడిచి పోము. తక్కిన యేర్పాటులు మేము చూచుకొందుము. అన్యోన్యానురాగము గలదు గావున సీతా రామచంద్రులకుఁ దగినంత వేగముగాఁ గళ్యాణోత్సవము జరుగును" అని యు య్యతిశేఖరుం డాన తిచ్చెను. సీతయు శ్యామలయు బ్రహ్మానంద మనుభవించిరి; మఱునాఁటి ప్రాతః కాలమునఁ దగిన సాహాయ్యముతో బయలు దేఱి వారు బెంగళూరు చేరిరి.

## 5

### మ ళ యా ళ వి ద్య లు

ఆషాఢమాసపు టెండ లత్యుష్ణము లయి ప్రాణుల వేధింప సాగెను. ప్రయాణికులు పదు సిలుగుల కంతు లే కుండెను. వేఁడిగాలి దిన మంతయును దన నిరాఘాట పరా క్రమమును జూపించుచు విహరింపఁ దొడఁగెను. ధర్మ చింతకు లా యా యూరఁ ద్రవ్వించిన చెఱువులు, బావులు నడుగంట నెండిపోయెను. స్నాన పానంబులకు నీరు దొరకక ప్రజలు తహ తహ పడుచుండిరి. పశు మృగ విహంగాదు లా బాధ పడ నోపక గతాసువు లగుచుండెను. తొలకరిలో నొకటి రెండు వానలు పడిన కతంబున నింటఁ గల విత్తనం బులు పొలములలోఁ జల్లి వేసి సేద్యగాండ్రు మిన్నుఁజూచి మీాన మేషములు లెక్కించు చుండిరి. త మ్మాము గంటఁ

జేదుచున్నారీ జను లను భయమ్మున నున్న పాటి నూతుల లోని జలమ్ము పాతాళమునఁ బట్టి పోవుచుండెను. ముంతెఁడు నీరు ముక్కాలు రూపాయ యను దినములు వచ్చెను. అను దినమును సహస్కరుఁడు వేయి చేతుల దోఁయిలించి పృథ్వింగల రస తత్వమును బీల్చివేయుచే కాని పర్జన్య రూపము నొంది వర్షించు మాట పరాకుపడియెను. ఉదయ మెనిమిది గంటలు మొదలు సాయంత్ర మై దాఱు గంటల వఱకు జంతు జాల ముస్సురస్సు రనుచు నుష్ణాతి శయమునఁ గుత కుత యుడికిపోవుచు నాపసోపాలు పడిపోవు చుండెను. ప్రత్యహము నాల్గవజామున మబ్బు కాచి మాయ చేయుచుండెను. కఱవు, కఱవు, చచ్చితిమి, చచ్చితి మను పేద సాదుల కని కారపు గోలు వాలాయ మయ్యెను. ధాన్య జాతుల ధర హెచ్చి పోయెను. నిఱు పేదల పుస్తెలు పూసలు నమ్ముడు వోయెను. పేరుగల భూస్వాములును, వర్తకులును నింకను ధరలు వచ్చునని ధాన్యపుఁ గొట్టులకు సీళ్లు వేసి, బీద సాదు లెంత మొఱ్ఱ వెట్టుకొన్నను ధాన్య మమ్మకుండిరి. స్ఫోటకము, మహా మారియు నుగ్ర రూపము లొంది తమతోఁ బుట్టువులతో నూరూరఁ దిరుగుచు నవ గ్రహ బాధలకుం గుతికా కుండ జన సస్యమును నూర్చి పొట్టలం బెట్టుకొను చుండెను. అవి ప్రవేశించిన గ్రామములు విడిచి భయాతురులై బ్రతుకఁ గోరి వలసఁబోవు ప్రజలను జాలిమాలి తమ గ్రామములఁ జొర నీయక సాటిప్రజలే తఱిమి వేయు చుండిరి. వారితో మహా మారీ దూతలు వచ్చి తమ యూరు ధ్వంసము సేయు నని యా కటికవారి నమ్మకము.

దుర్భరమగు నిట్టి యవస్థకుఁ బాల్పడి దత్తమండల నివాసు లనేకులు చనిపోయిరి. ఆ మండల మల్లకల్లోలమై వెల్లలు వేఁగిపోవుచుండెను. తన్నివారణార్థము ప్రతి గ్రామము నందును జనులు రామభజనలు సేయుచుండిరి; అమ్మవారి కనేకవిధముల మ్రొక్కులు మ్రొక్కుచు, ముడుపులు ముడుచు చుండిరి. వర్షము కురియుటకై విప్రులు విరాటపర్వము నధ్యాత్మ రామాయణమును, సుందర కాండమును దీక్షతోఁ బారాయణములు సేయుచుండిరి. ఉన్నపాటి యుదకంబుల తో నుమాజానికి సహస్ర ఘటాభిషేకములు సేయుచుండిరి; అహల్యాయీ జా రే త్యాది బిరుద పదంబుల పర్జన్య మూర్తిని సంబోధించుచు వాన కురియింపు మని ప్రార్థించు చుండిరి; వరద పాయసముఁ బోయుచుండిరి. ప్రతి దినమును వారి వారి సత్కర్మలకుఁ జేయూఁత యొసంగి యాస కొలు పుచు సాయంత్రము మేఘాడంబరము గాన వచ్చు చుండెను.

అట్టి దుర్భిక్షమున రావూరను నొక గ్రామమునఁ జౌడప్ప శాస్త్రియను సంపన్న గృహస్థుఁడు బీద సాదులకు, నార్తులకు నని యొక పెద్ద సత్రమును బెట్టి వారు వీరనక యే వర్ణమువారు వచ్చినను నిలువ నీడయుఁ దినఁ దిండియు నొసంగి కాపాడుచుండెను; సోమరులుగాఁ గూర్చుండ నీయక వర్ణోచితమగు వృత్తిని గల్పించి వారిచేఁ గొంచెము పని బహు పురుషార్థముగాఁ గైకొనుచు గొప్పగా నాద రించుచుండెను; అవగ్రహదోష శాంతికై బ్రాహ్మణులచే శాంతిక క్రియలు, జపములు సేయించుచుండెను; నాలవజాతి వారికి దగు పనులు లొసంగి వారిచే, నుదయాస్తమయముల

రెండు గంటలు కాల మొక పెద్దచెఱువు త్రవ్వించుచుండెను. ఒక నెలకే చెఱువు గట్టుపోయుట పూర్తి యయ్యెను. ఆర్త జన కల్పద్రుమ మయిన యా చౌడప్ప శాస్త్రిని గూడ నాక్షేపించు మహానీయులు లేకపోలేదు. ఆ యూర నతని కెనయగు ధనికులు నలుగు రైదుగురు కుక్షింభర స్వాములు గలరు. ఒకరికిఁ బెట్టక తాము దినక, 'యాత్మవ త్సర్వ భూతాని. యందఱి సొమ్ము మనకే రాని.' యను లుబ్ధాగ్రేస రులా సంపన్నులు, శాస్త్రిని డాంబికుఁ డనియు, దూబరి యనియు నిందించుచునే యుండిరి; తన భార్యకుఁ బట్టిన బ్రహ్మరక్షస్సు విడిచి పోవుటకై యీ దాన ధర్మములు సేయుచున్నాఁడు గాని పరోపకారబుద్ధితోఁ గనికారపు హృదయముతోఁ జేయలే దని యట నటఁ దమబోంట్లతో ననుచుండిరి. వారు తప్పఁ దక్కిన యా గ్రామస్థు లేమి, చుట్టుపట్టుల గ్రామస్థు లేమి చౌడప్పశాస్త్రి నవతార పురు షునిగాఁ గొండాడ సాగిరి. సర్వేశ్వరుఁడు నతని సత్కృత్య ములకు సంతసించె నని సూచించుచు నొక నాఁడు సాయం కాల మారంభించి మఱునాఁటి ప్రాతఃకాలము వఱకు నెడ తెంపు లేక ధారా సంపాతముగాఁ గుంభవృష్టి గురిసెను. జనుల యానందకోలాహల ధ్వనులు మిన్ను ముట్టెను. శాస్త్రి త్రవ్వించిన చెఱువు సగము నిండెను. అలజడి యడుగం టెను. రెండు మూఁడు దినములలోఁ దెగులు బాధలు నశించెను. ప్రకృతి ప్రకృతిం జెందెను.

చౌడప్పశాస్త్రి లఘాధికారి యయిన నంద వర నియోగి బ్రాహ్మణుఁడు; వైదికాచార పరతంత్రుఁడు; లౌకిక

ప్రజ్ఞాధురంధరుఁడు; నలువదియై దేండ్లు దాఁటిన నడి వయసువాఁడు; స్ఫురద్రూపి; వినయ సంపన్నుఁడు. ఆయనకు సంతానము లేదు. భార్య సద్గుణవతియే; కాని, వారి పురాకృత కర్మవశంబున నా సతీమణి నొక బ్రహ్మరక్షస్సావేశించి ప్రతి రాత్రియు బాధ పెట్టుచుండెను. ఎన్ని ప్రతిక్రియలు చేసిన నాపీడ తీఱకపోయెను. శాస్త్రికదొక్కటే తీఱని వ్యాధి యయ్యెను. తచ్ఛాంతికై యతఁడు వేన వేలు వెచ్చించెను; మాంత్రికులను దాంత్రికుల నెందఱనో రావించి జపంబులు సేయించెను. భూత వైద్యుఁ డొకఁడు వోయిన నింకొక డరుగుదెంచి యా బ్రహ్మ రక్షో బాధం దొలఁగింపఁ బ్రయత్నించుచుండెను. ఎవ రెన్ని మంత్రములు జపించినను, దంత్రములు చేసినను బ్రహ్మరక్షస్సా యమ్మను విడువ దయ్యెను. ప్రస్తుత కథావసరమ్మున నహోబిల శాస్త్రి యను నొక మళయాళ భూత వైద్యుఁడు వచ్చి పదునేను దినంబుల నుండియుఁ జికిత్స చేయుచుండెను. ఏ భూత వైద్యుని లక్ష్య పెట్టని యా బ్రహ్మరక్షస్సు, వాని చికిత్సకు భయపడసాగెను. భూతవైద్యునిపై నెదురు తిరిగి వాదమునకు డీకొని పో పొమ్మని తృణీకరించు రక్షస్సీతనికి భయపడి లొంగి యుండినను చౌడప్పశాస్త్రి భార్యను మాత్రము విడిచి పో దయ్యెను. క్రమ పద్ధతిని దిన దినమునకును గుణ మగుపించు చున్నందున నహోబిలశాస్త్రి యన్న చౌడప్పశాస్త్రికే కాక గ్రామస్థులకును, నతిథులకును నెంతో యాదర ముదయించెను. అహోబిలుఁడును బ్రతిదినము మూఁడవ జామున మంత్రశాస్త్రము, తంత్రవిద్య, యక్షిణి

మున్నగు విద్యలనుగూర్చి యుపన్యసించు చుండుటయు నెల్లరు నాలకించుటయు వాడుకగా నుండెను. ఒక నాఁడు మళయాళ తంత్ర విద్యలు చేసి చూపుఁడని యెల్లరుఁ గోరుటచే నహోబిలుఁ డంగీకరించి సాయంత్రము కూలీల పెద్ద సాలలోఁ దద్విద్యఁ బ్రదర్శింప నారంభించెను. వందల కొలఁది ప్రజలు స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు వచ్చి మళయాళపు మజాలను జూడ నుద్యుక్తులై కూర్చుండి యుండిరి. ఆ సమయమునకు సరిగా మన రామచంద్రభట్టును దుర్గాప్రసాదుఁడు నక్కడికి కరుదెంచిరి. చౌడప్పశాస్త్రి వారి నాహ్వానించి గౌరవించి కూర్చుండఁ జేసెను. అహోబిలుఁడు తన విద్యా పాటవమును జూపింపసాగెను. హస్తలాఘవమునఁ గొన్ని వస్తువులను మాయము చేసి మరలఁ దెప్పించెను; చన్నీరు వేఁడినీరు గాను వేఁడినీరు చన్నీరు గాను మార్చెను; జడ పదార్థములను బరువెత్తించెను; మామిడి టెంక పాతి యప్పటికప్పుడు నీళ్లుచల్లి మొలపించి, పూపించి కాపించెను; నిప్పులేకయే యన్నమును వండెను; బట్టలతో రెండు గదులుగాఁ గట్టించి యొక గదినుండి రెండవ గదిలోని కేరికిఁ దెలియకుండ నరుదెంచెను; కేక వేసి పాములను రప్పించెను; వాని నోం డొంటితోఁ బోరాడించెను; గరుడ పక్షులను రావించి వానిం దన్నుకొని యెగిరిపోఁ జేసెను; తేళ్లచేఁ గుట్టించియుఁ బాములచేఁ గఱపించియు విష బాధ లేకుండఁ జేసెను. ఇట్టు లత్యద్భుతముగా రెంటికోట విద్యలు మళయాళ యక్షిణీలను జేసి చూపించి యహోబిలుఁడు చూపఱ నాశ్చర్య పరవశుల నొనర్చెను.

అంత, భట్టు కుతూహ లా విష్టుఁడయి మళయాళ భాషను కొంత తడవు తాంత్రిక విద్యా విషయమున నహో బిలశాస్త్రితోఁ బ్రసంగించెను. వా రిరువురికి నభిప్రాయ ములు కొన్ని విషయములలో భేదించెను; వాదము ప్రబ లెను. అహోబిలుఁడు తొందరపడి మించి మాట లాడి చేత నయ్యే నేని నాతో మోళీకట్టు మని భట్టును డీ కొట్టెను. భట్టు నంగీకరించి చేయి కలిపెను. మఱునాఁ డా యిరువురు మోళీ కట్టుటకును, నోడినవాఁడు గెలిచినవాని శిష్యుఁడ నని యొప్పుకొనుట యే పణముగాను నిర్ణయించిరి. చౌడప్ప సభాపతిగా నుండుట కంగీకరించెను. నాఁటి కంతతో సభ ముగిసెను.

మఱునాఁడు తెల్లవాఱినంతనే మోళీకిఁ దగిన పరి కరములను గూర్చిరి. భట్టును, నహోబిల శాస్త్రియు స్నానము చేసి యిష్ట దేవతల నుపాసించుకొని లోలోన మంత్రములు గొణుగుకొనుచు సభ కేతెంచిరి. అప్పటికే దిదృక్షు జనాకీర్ణమై సభ కిటకిట లాడు చుండెను. సభాపతి, చౌడప్పశాస్త్రి యున్నతాస నాసీనుఁడయి, వచ్చిన యిరు వురు తాంత్రికులను బహూకరించెను. తొలుదొల్త భట్టు తా నేర్చిన యక్షిణీ విద్యల నతి విశృంఖల వృత్తిని బ్రద ర్శించి, తొలినాఁ డహోబిలుఁడు చూపిన విద్యలకంటెఁ దన వత్యద్భుతములుగా నున్నవని సభ్యులచేఁ బొగడఁ బడెను. ఒక భృంగారువున నిండ నీరు పోసి యందుఁ దన పొడి కాయయుఁ దాళపుఁ జెవియును వైచెను. తాళపుఁ జెవి మునిఁగెను;పొడికాయ తేలెను.పొడికాయ మునిఁగి తాళపుఁ

జెవి తేలవలయు నని భట్టాజ్ఞాపించు నంత,నవి యట్లయ్యెను. పదంపడి మునుగు మన్న దే మునుఁగుటయుఁ దేలు మన్న దే తేలుటయుఁ బోట్లాడుఁ డన్న రెండును లేచి పోట్లాడుటయు నయినది. చూపఱు కెవ్వునఁ గేక వేసి చప్పట్లు చఱచిరి. తదుపరి భట్టు నాలుగు వెండి నాణెములను దీసి, యొకచో నుంచి నిడుపుగా నొక గీతయు నడ్డుగా నొక గీతయు గీసి, యా గీతలకుఁ జుట్టును వలయాకారమున నొక గీత గీసి యందు నడుమ నాలుగు రూకలు నుంచివానిని నలు తట్టులకుఁ బరగెత్తించెను; వలయాకారముగఁ దిరుగఁ జేసెను. ఒకచోఁ గూడుటయు, విడిపోయి నలుదిక్కుల కేగుటయుఁ జుట్టుఁ దిరిగి కలిసి కొనుటయుఁగా నా నాణెములు భట్టు చేసిన యుత్తరువులను జెల్లించెను. ఆ సభావసథమున కెదురుగ నున్న టెంకాయ ప్రమానిం జూపి భట్టు, దాని గెలలో నే కాయలోని కీ నాణెము పోవలయు నని సభాధిపతి నడిగెను. చౌడప్పశాస్త్రి, మీఁది వరుసలోని నాల్గవ కాయలోనికిఁ బోవలయు నని పలికెను. భట్టారూక నెల్లరుఁ జూచుచుండ ముని వ్రేళ్ళతోఁ బట్టుకొని యెగుర వేసి పట్టుకొని చేయి మూసి యా కాయలోనికిఁ బోవలయు నని దాని కాజ్ఞాపించి చేయి విప్పెను. అందు రూపాయ లేదు. చౌడప్పశాస్త్రి తన నౌకరు నా కొబ్బరి చెట్టెక్కించి గుఱుతుపెట్టిన కాయఁ దీయించి యొలిపించి పగులఁగొట్టింప నం దా నాణెము గాని పించెను. సభాజనుల యానంద కోలాహలమునకును, భట్టును నుతించు నుతులకు మేర లేదయ్యె.

ఇట్టి తమాషాలు గొన్ని చేసి భట్టు మెప్పొందిన పిదప నతఁడును సామాన్యుఁడుగాఁ డనియుఁ, దాంత్రిక విద్యా విశారదు లగు నయ్యిరువురును దన కతిథు లయిన కారణము చేత వారు చఱచిన పన్నిదము వినోదార్థముగా నుండుట శ్రేయస్కర మనియుఁ దలంచి చౌడప్పశాస్త్రి యహోబిలుని, భట్టును గౌరవ ప్రతిపాదకము లగు వాక్కుసుమంబులఁ బూజించి యా యిరువురికిని మైత్రి గలిగించెను. సాయంకాలము వినోదార్థము మోళీవిద్య ప్రదర్శింపఁ బడును గాన నెల్లరును దయచేయింప వలయునని సభవారిని వేఁడి సభాధిపతి లేచెను. ఎవరి యిండ్లకు వారేగి యెప్పుడు సాయంత్రమగునా, యెప్పుడు వినోదములను గాంతుమా యని యువ్విళ్లూరు చుండిరి.

నిర్ణీత సమయమున కెల్లరును సభావసథముం జేరిరి. తాంత్రికు లిరువురు సంప్రతించు కొనిరి. వా రొక్క గురుని శిష్యు లని తేటపడెను. ఒండొరు మన్నింప వేఁడికొని వినోద ప్రదర్శ నాయత్త చిత్తులై యా సతీర్థ్యులు చెట్టాపట్టాలు పట్టుకొని సభ కేతెంచిరి. సభ్యులు సంత సించిరి. సభాపతి వచ్చి తన పీఠమునఁ గూరుచుండెను. తాంత్రికు లిరువురు విద్యా ప్రదర్శనమున కుపక్రమించుటకు ముందు భట్టు, తంత్ర విద్యను గూర్చి యి ట్లుపన్యసించెను:-

"మంత్రము, తంత్రము, యంత్రము నని యాగమ శాస్త్రము ముప్విధంబయి పొలుపొందు చుండును. మంత్రము:లు, మహా మంత్రము లనియు క్షుద్రము లనియు నిరు దెఱంగులం బరఁగు చుండును. అందు మొదటిది మోక్ష

దాయక మనియు, రెండవది యైహిక ఫల దాయక మనియుఁ బెద్దలు నిర్ణయించిరి. యంత్రములు రెండిటికి నుపయోగ కరములు. తంత్రములు క్షుద్రముల కుపయోగ కరములు. కడచిన యుగ త్రయమునందు నీ తాంత్రిక విద్య విశృంఖల వృత్తిని వ్యాపించి మహా పురుషుల మన్ననకుం బాత్ర మయ్యెను. అస్త్రములు, వాని ప్రయోగోప సంహారములును దాంత్రిక విద్యా సంపన్నంబులు. ఈ విద్య కలియుగంబునఁ గూడ రెండు మూఁడు వే లేండ్లవఱకు నాదరింపఁ బడుచు వచ్చెను. బ్రహ్మజ్ఞాన సంపత్తి గలిగించు పొంటె మహాత్ముఁ డగు శ్రీ కృష్ణ ద్వైపాయన మహర్షి, వేదముల నుపనిష త్తులను మథించి బ్రహ్మసూత్రములు భగవద్గీతలు రచించి వెలయించెను. పండిత జనాదరణంబును బడసి యవి యెంత విజృంభించినను దాంత్రిక విద్య యడుగంట లేదు. బుద్ధావ తారంబున దాని కొక యాఘాతము దగిలెను. పదంపడి, శ్రీమ జ్జగద్గురు శంకరాచార్య మహాస్వాములు బౌద్ధ మత మును ద్రుళ్ళఁగొట్టి, హిందూమత మద్వైత ప్రధానముగా స్థాపించి, దాని కంగముగా సాత్వికోపాసనము నంగీకరించి మహా మంత్రము లని కొన్నిటిని వేఱు చేసి, క్షుద్రము లని కొన్నింటిని మట్టువెట్టి, తాంత్రిక విద్య తామస ప్రధాన మని నిందించి నిరసించినట్లు పొడఁగట్టు చున్నది. అది మొద లా ధ్యాత్మిక విద్యయే పరమ పురుషార్థ దాయక మని యెల్లరచే నాదరింపఁ బడుటయు, బ్రహ్మసత్యము, జగత్తు మిథ్య యను సూత్రము చొప్పునఁ దదంగ మగు మహా మంత్రోపాసన ప్రబలుటయుఁ ద దితర మని నిందిత మయిన తాంత్రిక విద్య

యుడు గంటుటయుఁ దటస్థించినది. నాటంగోలె నా నాఁటికిం దాంత్రిక విద్య క్షీణింప సాగెను. త ద్విద్యా సంపన్నుల కాదరము లే దయ్యెను. అయినను యక్షిణీ విద్య లతి చాక చక్యముగాఁ జేయుచున్న ప్రతిభాశాలు లిప్పటికి నున్నారు. కొందఱు మహనీయు లా విద్యకుఁ దగిన గ్రంథములు వ్రాసి పెట్టి యున్నారు. ఇట్టి మనో వినోదకర మగు విద్య కీ దుర వస్థ పట్టుట కడుం గడు శోచనీయము."

అని పలికి భట్టు తన ప్రతిద్వంద్వితో సంప్రతించి మోళీ విద్యఁ బ్రదర్శించుట కుపక్రమించెను. వారొకరి కొక రే విధ మయిన హానియుఁ జేసికొనకుండ మంత్ర ప్రయోగ మాహాత్మ్యమును వ్యక్తపఱిచిరి. నల్లగా మాడిపోవుట, అంతలోనే ధగధగ మెఱసిపోవుట, కందురీగలు గ్రుద్దినట్టు లొడల్ల బొబ్బలెక్కుట, నిమిషములో నవి మాయ మగుట, మినుప గింజలతోఁ గొట్టుకొనఁ దుపాకి గుండ్లతో బోట్లాడి నట్లు చిటపట ధ్వను లెగయుట, అంతలోనే యుపశమిల్లుట, ఒకరు, సర్పము సర్పమయము సేయ నిం కొకరు గరుడ మయము చేసి దానిని మాయించుట, ఒకరు పావురము లెగురఁజేయ రెండవవారు డేగలచేఁ దన్నుకొని పోఁ జేయుట, ఒకరు మనుజు నొకనిం జైతన్య రహితుం జేయ నిం కొక రంతలోనే ప్రజ్ఞావంతునిం జేయుట, సభ నంతయు నొకరు సమ్మోహ పరవశముగా నొనర్పఁ గనుఱెప్ప వేయు నంతలో నిం కొకరు బ్రకృతికిం దెచ్చుట, ఒకరు మనుజుల దృష్టికి మాంద్యము గలిగించి చీకాకు పఱుప మఱొకరు దాని మాయించి వెలుఁగొందఁజేయుట, ఒకరు పరిమిత

ముగా నాహార పదార్థములఁ గల్పించి వడ్డింప రెండవ వార వన్నియు నశ్రమంబునఁ దినుటయు నను మొదలగు నద్భుత కృత్యములు చూపి య య్యురువుర తంత్ర విద్యా విశార దులు సభ్యుల నానం దాశ్చర్య పరవశుల నొనర్చిరి. సభా పతి, మహా పండితు లని య య్యురువుర నెంతయు నగ్గించి గొప్ప బహుమానము లొసంగి గౌరవించెను. సభ ముగిసెను.

ఆ రాత్రి భుజించుటకు మునుపు చౌడప్ప శాస్త్రిగారి భార్య నెప్పటియట్ల బ్రహ్మరక్ష స్సావేశించెను. దాని వాలక మంతయు భట్టు పరికించెను. అహోబిలుఁడు పట్టు పెట్టి యామె నందుఁ గూర్చుండఁ బెట్టి భూతముచే నన్నియును బ్రేలించెను; ఆమెను విడిచి వెళ్ళిపోవలయునని బ్రహ్మరక్ష స్సున కాజ్ఞాపించెను. ఆమె పక పక నవ్వి యది మాత్రము జరుగ దని పల్కెను. అంతవఱ కోపికతోఁ దత్సమాచార మంతయు గమనించుచున్న భట్టు పెద్ద యట్టహాసముచేసి, తన యభిమాన మంత్రరాజమునకు నుచ్చాటన బీజము సంపుటిచేసి నూట యెనిమిది సారులు జపించి ధ్యానించి, గురువునకు నమస్కరించి లేచి వచ్చి, యా భూతావేశ జటను బట్టుకొని మళయాళ పురాతన సంప్రదాయాను సారముగ గీర్వాణభాష నొక సంబోధనయు నొక విధి మధ్యమ పురుష క్రియయు జోడించి యాజ్ఞాపించెను. వెంటనే భూతరాజు తద్వనితా వాఙ్ముఖమున నామెను విడిచి వెళ్లి పోవుదు ననియు, నాలలన కుదయించు పుత్త్రి నకుఁ దనపేరు పెట్టుకొని యేటేట వాని పుట్టిన దినమునఁ

దన కుత్సవము చేయుచుండ వలయు ననియుఁ బ్రస్తుతము సహస్ర గాయత్రీ జప ఫలము తనకు దారపోయవలయు ననియుఁ దనపేరుగా బీద సాదుల కొక వేయి మందికి నన్న ప్రదానము సేయ వలయు ననియుఁ గోరెను. చౌడప్పశాస్త్రి సంతోష వాహిని కూలంకష యయినది. సాష్టాంగముగా నమస్కరించి యన్నియుఁ జేయుదు నని చేతులు కట్టుకొని యొప్పుకొని యతఁడు వెంటనే సహస్ర గాయత్రీ జప ఫలము పోసెను. అతని భార్యయు నంతలోనె ప్రకృతిస్థురాలయ్యెను. ఒక కొండబరువు పయినుండి దిగిపోయి నట్లు లామెకుఁ దోఁచెను. చౌడప్ప శాస్త్రి జరిగిన యుదంతము తన వనితా రత్నమున కెఱిఁగించి యామెతోఁ దా నా మహా పురుషుఁ డగు రామచంద్రభట్టు యడుగుల కెఱఁగెను. "శీఘ్రముగా సుపుత్త్రప్రాప్తి యగుఁగాక" అని భట్టు, దేవునిం బ్రార్థించి పలికెను. భూతోచ్చాటన మగుట యొక యానందము, తనకు సుపుత్త్రప్రాప్తి యయి వంశాభివృద్ధి యగు నని రెండవ యానందమును నా యన్నదాత నిరుపైపులఁ బట్టి మిన్నందించి బ్రహ్మానందము నొందించెను.

భట్టు రెండు గడియలలో బ్రహ్మ రక్షస్సును బరిగెత్తించుట కాశ్చర్య పరవశుఁ డయి యుపాంశమున నహోబిలుఁడు, 'అన్నా! పదునాలు దినములనుండియు దీనితోఁ దంటాలు పడుచున్నాను. లొంగి లొంగక దాఁటి పోవుచున్నది. నీ వే విధానము నవలంబించితి' వని యడిగెను. 'అన్నా! రోగము గుఱుతించి మందీయ వలయును. మీ మంత్ర శక్తికి రక్షస్సు తల వంచినది; కాని, దాని యాగ

మ నోద్దేశము నెఱవేర్చుకొనక యది పోవదు. మందునకను పానవిధి, శబ్దమున కుపసర్గవిధి, మంత్రమునకు బీజాక్షరవిధి ముఖ్యములు గదా! సంపుటీకరణ భేదముచే గుణము, నర్థము శక్తియు వరుసగా వానియం దుద్భూతము లగుచుం డుట మన మెఱుఁగమా? భూతజాతింబట్టి యుద్దేశమును గ్రహించి యుచిత బీజ సంపుటీకరణముచేసి గురుధ్యానము చేసి జపించి యాజ్ఞాపించి నప్పుడు చెప్పినట్లు వినక తీరదు. దాని బల మంతయు మీ రంత మొందించితిరి. నేను ఫల సిద్ధిని బాల్గొంటి" నని భట్టు ప్రత్యుత్తర మిచ్చెను. అంత నందఱును భుజించి శయనించిరి.

నడురేయి యయ్యె నని ఖగోళపు గడియారము సూచించుచుండెను. ఆషాఢ మాసారంభ దినము లగుట నంధకారమునకుఁ దోడు కాఱుమబ్బు లంబరవీధి నల్లుకొని జగత్తంతయుఁ జీఁకటి కోణముగాఁ జేసివేసెను. తూర్పుగాలి చెలరేఁగి దుమ్మెత్తి పోయుచుండెను. ఈ వ లావలఁ బండు కొన్న వా రులికిపడిలేచి ప్రక్కలు సవరించుకొని యిండ్ల లోని కరిగి పండుకొనిరి. మూఁడవ జామునఁ జుక్కల గడి యారపు ముండ్లు దిరుగ నారంభించినవి. ఇండ్లలోఁ బండు కొన నేగిన వారి కింక ప్రామాగన్ను పడకయే పెద్ద గల్లత్తు వినవచ్చెను. "నిప్పట్లో నిప్పంటుకొన్నది" అను బెద్ద పెద్ద కేకలు వినుచు శయనంబులు విడిచి యెల్లరును లేచి యేమి సేయుటయో తెలియక, నిప్పో! నిప్పో! చచ్చితిమి చచ్చితిమి, లెండు, లెండు, ఎక్కడరా? ఏ వీధిలోనురా, ఇంటిలో భద్రమే, పిల్లలు జాగ్రత్తయే, యని పలుకుచు

నెల్లరు గగ్గోలువినుపించు వైపున కరుగఁ గాఁపు వీధి యుత్తర శ్రేణి పయినుండి యాకసము నంటు మంటలు కనిపింపఁ బెద్ద లా దెస కరిగిరి; చేత నయినంత ప్రయాసపడిరి. కట్టయిన యూరు గావున, నెవరింటికర్జము వారి దని యూరంతయుఁ బరశురామప్రీతిగా నిచ్చు మహానుభావులం బోలక, యా యూరి ప్రజ లంద ఱొకచోఁ జేరి నిప్పంటుకొన్న యింటి కిరుగుపొరుగు గృహంబు లంటుకోకుండ వాసములు పెండెలు నఱికి వేసి యా యింటి నాహుతిగాఁ బుచ్చుకొని యగ్ని చల్లారునట్టి యేర్పాటులు చేసిరి. గాలి విసరు జోరుగా నుండుటచే నిప్పంటుకొన్న యింటిపైనుండి యొక యగ్గిచుప్ప వినువీధి కెగసి బ్రాహ్మణవీధిలోఁ బడెను. గడబిడలో నొక్కచో నందఱు నుండిపోవుటచే గ్రామస్థులా బరాటా మెగిరిన వైపు మెఱుంగకపోయిరి. ఈ వల నంటుకొన్న యిల్లారినంతలో బ్రాహ్మణ వీధినుండి నిప్పు నిప్పను కేకలు చెలరేఁగెను. ఒక్కపరుగున నందఱు నక్కడికిఁ బరుగెత్తిరి. పిల్లలు పాపలు నేడ్చునేడ్పులు, బీదసాదులు పెట్టుచున్న గోలు, కుక్కల యఱపులు, నగ్ని యార్పఁ బ్రయత్నించు వారి కేకలు నొక్కపెట్ట మున్ను ముట్టెను. నిచ్చెనలు పట్టుకొని వెళ్ళువారు, కత్తులు గొడ్డళ్లు గైకొని వెళ్లువారు, నీళ్ళ కడవలు మోసికొని పోవువారు, ఊరి నూతులకుఁ గ్రొ[illegible]వు ప్రాఁత చెఱువులకు బిందెలు పట్టుకొని పరుగెత్తి నీరు దెచ్చువారు, గృహోపరిభాగంబులు తడుపుచు నీళ్లకడవలు, బిందెలు నింటి వెన్నులపైఁ బెట్టుకొని కూర్చుండువారు, [illegible]వగల నగలు, నగదు, వెండి సామా

నులును గ్రైసములం గట్టుకొని ప్రాణాధారములఁ బదిల పఱచుకొనువారు నయి యూ రాబాల గోపాల మల్లకల్లోల మయ్యెను.

విప్రవీధిలో నంటుకొన్నది యూరిచావడి. వీధులలో దేనికి నంటక యది కొంతదూరమున నుండుటచేత మఱే యింటికి నంతలో ని ప్పంటుకొనును నను భయము లేక పోయెను. ఆ చావడి వెనుక భాగమునఁ బడిన యగ్గిమ్ము యంటు కొని దాని నాహుతిగాఁ బుచ్చుకొనుచుండెను. మహా భూతము లుద్రేకించునపుడు తగిన ప్రతిక్రియ చేయవలయును గాని వాని నెదిరింపరాదు. ఊరిచావడి వెలుపలి కొకటియే ద్వారము గలదు. ఇంటిచుట్టు మూఁగిన ప్రజను జ్వాలా కలాపము దరిఁ జేరనీయ కున్నది. ఆ చావడి తలుపు మూసి యున్నది. లోపల నెవ్వరో చిక్కుకొని తలుపును గుంజుచు బిగ్గరగాఁ బిలుచుచుండిరి. కొంత వఱ కా సంగతి యెరును గమనింపరైరి. మంటలు, చావడి వెన్నునుండి వీధిప్రక్కకుఁ దిరిగి చుట్టివేయుచుండెను. ఆ యింటఁ జిక్కినవారు కట్టకడ పటఁ దలుపు గట్టిగాఁ దన్నుచుఁ జచ్చిపోయినామో పుణ్యాత్ములారా! తలుపు తీయుఁ డని పెద్దపెట్టున నఱచిరి. మూఁగిన జనమున కా యార్తరవము వీనులం బడియెను. వెంటనే యా జన సమూహమునుండి మహాసాహసికుఁ డగు నొక పురుషుఁడు బయలువెడలి భయంకర జ్వాలానల పరివృత మగు న గ్గేహమును దరిసి గుమ్మమెక్కి తలుపు దెఱవ నుంకింప నా తలుపునకుఁ బైనిఁ దాళము వేసి యుంటచే నది తెఱవఁ బడదయ్యె. ఆ తెగువరి తన బలిమి కలిమిని నాఁచి

రెండు మూఁడు తాఁపులా తలుపుపై దన్నెను. సంధిబంధము లతోఁ గవాటము జవజవలాడి బీటవాఱెను. అప్పటి కప్పుడే యనల జ్వాలాకలాప మా గృహమ్మునాక్రమించెను. జను లందఱప్పరమోపకారి తెగుదారి తనమున కచ్చెరు వొంది వద్దు, వద్దు, తిరిగి రండు తిరిగిరం డని యఱచువారే కాని యతనికిఁ దోడు పడువాఁ డొక్కఁడును లేఁడయ్యెను. పొగ, మించి యా తెగువరి నావరించెను. ఐన నతఁడు పూనిక విడువక, 'జయ భగవతీ! జగజ్జననీ!' అని యొక్క కేక పెట్టి యెగిరి తలుపుపై నొక్క తాఁపుతాఁచెను. దానితోఁ దలుపు రెండు చెక్కలయి దారి యిచ్చెను. విడిన తలుపు చెక్కల నిటు నటు నెట్టి ధారాళముగా దారిచేసికొని లోపలి కేగి, యా పరమోపకారి తత్రత్య జనమును దడవెను. ధూమావృత మయియున్న యా బాహ్య మందిరాంతర్భాగమున నొక మనుష్య శరీర మతనికాళ్లకుఁ దగిలెను. వెంటనే సంతోష మును బట్టఁజాలక మించి ముంచు పొగను దిగ మ్రింగుచు న క్క శీబరమును బట్టుకొని యొక్క విసరున వాకిటికి దుమికి వచ్చి జనమధ్యంబున డించి, రివ్వున మరల నతఁడమ్మహాజ్వాలన జ్వాలా మాలికలలోని కేగెను. 'వలదు, సాహసము వలదు వల' దని జను లల్ల కల్లోలముగా నఱచుచుండినను వినిపించు కొనక ధూమావృత మయిన నట్టింటఁ దడవి మఱియొక వ్యక్తినిం బట్టుకొని యతఁడు ద్వారము సమీపించెను. వాని కెదురుగ ముంజూరంటుకొని కాలుచు మంటలతో నతని నాహుతిఁ గొనఁ గోరి నట్లు భయంకరరూపమున నగ్ని చెల రేఁగెను. ఆ మహా పురుషుఁ డించుకయు జంకక గడపలోఁ

గాలు వెట్టెను. చిటపట ధ్వనులతో నెలుకచూరు పట్టె విఱిగి యాతని భుజముపయిం బడెను. పయినుండి చూచు చుండిన గ్రామస్థుల కీ సంగతి కానరా దయ్యెను. ఆ మహాపురుషుఁ డం దాహుతి యయ్యె ననియే వారేడ్చు చుండిరి. అట్లు తన పయింబడిన చిఱుదూలము నొకచేతితో నిమిషములో వెను కకుఁ ద్రోసి పొగ బాగుగ ద్రిమ్మింగుచు నవుర్ల గ్రక్కు కొనుచు నొడలంతటఁ బడిన యగ్గిరవలచే బగ్గున మండుచుండఁ దెలివి తప్పి పోవుచుఁ దూలుచు నొక్క దాఁటున రా దారికి వచ్చి తనచేతి భారము నటుడించి యతఁడు వివశుఁడయి యిటు వడి పోయెను. జను లంద అచ్చట మూఁగి కాలుచున్న యయ్యిరు వురి బట్టలు నార్పి పరిచర్యలు సేయుచుండిరి. అతఁడే, ఆ మహానుభావుఁడే యని యందఱుఁ గన్నుల నీ రుంచిరి.

చౌడప్ప శాస్త్రి కీ యుదంతము దెలిసి పరుగు పరు గున నహోబిలునితో నచ్చటి కేతెంచి వచ్చి చూచు నంత నప్పరమోపకారశీలుఁడు రామచంద్రభట్టే, తా నను కొన్నది సత్య మయ్యె నని తెలిసికొనెను. తెలివితప్పి పడి యున్న తక్కిన రెండు వ్యక్తులు స్త్రీలని యెఱింగి వారి ముప్వు రను డోలీలతో నతఁడు తన యింటికిఁ గొంపోయి తగిన చికిత్సలఁ జేయించెను. ముప్వురికిని దెలివి వచ్చెను. అప్పు డచ్చటి కేడ్చుచు నొక పురుషుఁ డరుదెంచెను. అతఁడు నట్టిం టికి వచ్చి రెండు మంచములపయిం బండుకొనియున్న యా యిరువురు స్త్రీలను జూచి గోలు గోలున నేడ్చెను. వా రా తని నోదార్చి, 'అయ్యో! మీ రెక్కడికిఁ బోయితిరి? తలు పెవరు వెలుపల బిగించిరి?' అని యడిగిరి. "నేను నే

బాధకై పెద్ద చెఱువున కేగుచు బాహ్య మందిరము గదా దొంగలబాధ కలుగునేమో యని జంకి వీధి గుమ్మమునకుఁ దాళము వైచి పోయితిని. నేను దిరిగివచ్చునంతలో శూద్ర వీధిని నిప్పంటుకొన్న మంటలు గానవచ్చినవి. అచ్చటికిఁ బరుగెత్తి పోయితిని. సిప్పార్పుటకు నాచే నయిన సాయము చేసితిని. నే నక్కడ నుండఁగనే బ్రాహ్మణశ్రేణి యంటు కొనె నని కేకలు వినిపించినవి. మన బస యింటి కీ యుప్పెన వచ్చు నని నే ననుకోలేదు. ఆ వీధిలోఁ బని ముగించుకొని త్వరితగతి నే నా చావడికి వచ్చినంతలో నంతయు ముగిసి పోయినది. పాపము! దాసి యా యింటిలో మ్రగ్గిపోయినది. తెలివి తప్పియున్న మి మ్మొక మహాపురుషుఁడు వెలువరించి యిచ్చటికిఁ దోడుకొని వచ్చెనని విని యిట కరుదెంచితిని. అయిన దానికి వగచిన ప్రయోజనము లేదు. ఈ గడియకుఁ గృతార్థులమే. మీ ప్రాణములు దక్కినవి. ఆ యాపద్బాంధ వునకుఁ గూడఁ బ్రాణాపాయస్థితి గలిగిన దఁట. ఆయన యెచ్చట నున్నారో దర్శించి నా కృతజ్ఞతను దెలిపి నమస్క రింపవలయును. ఏఁడీ యా మహాపురుషుఁడు!" అని ప్రశ్నించెను. మా కా సంగతియే తెలియ దని యా తెఱవలు పలికిరి. అక్కడ నా ప్రసంగము వినుచున్న పరిచారకుఁడు వారితో, 'అయ్యా! ఆయన యయ్యవారిగదిలో నున్నారు. రండు పోదము, అని యా పురుషుం దోడ్కొని ప్రక్కగదిలోనికి వచ్చెను.

భట్టునకుఁ దెలివి వచ్చెను. అతని యొడ లంతయు బగుబగున మండుచుండెను. చౌదపు శా సిఁగియు. దుర్గా

ప్రసాదుఁడును, సుందరమ్మయు నహోబిలుఁడును నతనికి సకలోపచారములు సేయుచుండిరి. చౌడప్ప శాస్త్రిగారి భార్య వారికిఁ గావలసిన వస్తువులు దెచ్చియిచ్చి, పొదిగిట నిలువంబడి బాష్పపూరిత నయనయయి భట్టును జూచు చుండెను. నూతనాగతుఁ డా దృశ్యమును జూచెను. వాని హృదయము ప్రక్కలయ్యెను. వాని నోట మాట వెడల దయ్యెను; లోని కేగఁ గాలు సాగదయ్యెను. ఒక్క నిమేష మట్టులే చూచి గిరుక్కునఁ దిరిగి చావడిలోనికి వచ్చి యటఁ బండుకొన్న యతివలతో నేమో మెల్లగాఁ జెప్పి తన దారిని బోయెను.

తెల్లవాఱి జాము ప్రొద్దున కా ముప్పురికి నించుక యారోగ్యము గలిగెను. అహోబిలుఁడు మంచి మందుల నెఱుఁగును. అవి యుపయోగించి యా ముప్పురికిని జికిత్స చేసెను. కాలుచున్న యెలుకచూరుపట్టె బుజమునఁ బడి కాలినచోటుమాత్రము భట్టును మిగుల బాధించుచుండెను. భట్టు,దుర్గాప్రసాదుని బిలిచి యొక పసరాకు తెమ్మని చెప్పెను. వాఁడు వెతకి వెతకి యెట్టకేలకు గుప్పెఁడాకు తెచ్చి పసరు తీసి యా గాయమునకుఁ బూసెను. దానితో గాయము మంట చల్లారెను. ఆ పసరొడలంత పొక్కిన పొక్కులకుఁ బూయ, వాని యుడుకును జల్లార్చెను. రెండుజాము లగు నప్పటికి భట్టు నెమ్మది నొందెను. చౌడప్పశాస్త్రి యందఱికిని బథ్యమునకు గావలసిన పదార్థములు సేయించి పెట్టించెను. ఎల్లరును భుజించి విశ్రాంతి తీసికొనిరి. మూఁడవ జామున జవసత్వోత్సాహములు గలిగి భట్టు, తనచే

రక్షింపఁబడిన వనితామణులఁ జూడఁ గోరి చావడిలోనికి వచ్చి తన కన్నులనే తాను నమ్మలేకపోయెను. తమ ప్రాణరక్షకుఁడు రామచంద్రభట్టని యీ పురుషుని వలన విన్నప్పటి నుండియుఁ బాప మా కాంతల స్వాంతములు నీరగుచుండెను. తమ నిమిత్తము ప్రాణములకుఁ దెగించి తా నాపదలోఁ బడి తమ్ముద్ధరించిన యపూర్వ పావనుని దర్శనమయినంతనే యీ యిరువురంగనలు బోరున నేడ్చుచు లేచి వచ్చి భట్టు పాదములపై సాష్టాంగముగాఁ బడి మ్రొక్కి తమ యపరాధమును మన్నింపు మని వేఁడుకొనిరి. "పెనుగొండ జమీందారిణి గారికే యిట్టి యవస్థ పట్టినదా? ఊరడిల్లుఁడు. సర్వము సర్వేశ్వర విలాసము. మీ రీ యూరేల వచ్చితిరి?" అని భట్టు రాజరత్నమును బ్రశ్నించెను. రాజరత్నము జమీందారిణి వేషమునఁ జీట్ల యాటలో భట్టును దోఁచుకొని పరాభవించిన సంగతి పాఠకులు జ్ఞప్తికిఁ దెచ్చుకొనియే యుందురు. అప్పు డవ్వెలవెలఁది కన్నీరు తుడుచుకొనుచు, "స్వామీ ! అమాయిక బ్రాహ్మణున కకారణముగా నపకారావమానము లొనరించిన వారి కిట్టి గతి కాక యింకెట్టి గతి కల్గును? తుంటరి యగు రంగారావు పలుకుల మోసపోయి మిమ్ము రప్పించి పరాభవము చేయించితిని. శ్యామల యింటిదాసి మూలమున మీకు సీత దక్కకుండఁ జేయ వలయు నని చేత నయినంత ప్రయత్నము సేయించితిని. ఆ దాసి ముండ నిన్న రాత్రి యీ యింటిలోనుండి పోయి యగ్గిమంటల కాహుతి యె పోయినది. ఆ తులువ రంగారావునకు లోఁబడి సీతను

గపటోపాయమున నింటినుండి రప్పించి యమాంతముగాఁ బల్లకిలోఁ బడవేయించి వాని గిప్ప గించితిని. పాపమునకు శుభ పరిణామము లేదు. వాఁడా బాలికం గొంపోవుచుఁ ద్రోవలో బైరాగుల చేతులలోఁ బడెను. వారు వానిం బంధించి సీతను దోడ్కొని పోయిరి. శ్యామలకు నాకును వలవని వైర మగుటచే నామె నా దుశ్చారిత్రమున కలిగి నన్ను రచ్చ కీడ్పించునేమో యని భయపడి రంగారావు వెంటరా, ముది దాసినిగూడ వెంటఁ బెట్టుకొని, నాకూఁతురు నేను నూ రూర దిక్కుమాలి తిరుగుచు నిన్న సాయంకాల మీ యూరికి వచ్చి యీ వీధి చావడిలో బస చేసితిమి. అర్ధ రాత్రివేళ మ మ్మాయింటఁ బెట్టి తలుపు బిగించి రంగారావు వూరు వెలుపలికిఁ బోయెనఁట. మే మా యింటిలో నుండి పోయితిమి. దానికి రెండవ ద్వారములేదు. నిప్పంటుకొన్నది. పొగ యి ల్లంతయు గిరవేసినది. ఊపిరి సలుపనీయ లేదు. తలుపుతీయఁబోవ నది రాలేదు. చిటపటధ్వనులతో నగ్గి చెలరేఁగి యంటుకొనెను. పెంకెకట్లు తెగి పెడేలు పెడేలు మని పిడుగులు పడ్డట్లు భయంకర ధ్వనులు సేయుచుండెను. మంటలతో వేఁడిగాలి యింటఁ బ్రవేశించెను. గోలు గోలున నేడ్చుచు మే మెంత మొఱపెట్టినను నడవి రోదన మాయెను. మ మ్మాయింటఁ బెట్టి యీ పాపాత్ముఁడు నిప్పు ముట్టించి తలుపు బంధించి పగా రయ్యె నను కొంటిమి. మీకుఁ జేసిన యపకృతియే మ మ్మీ విధమునఁ జుట్టు ముట్టి యంత మొందించుచున్న దనుకొని మే మిద్దఱము నీశ్వరునికిఁ జేతులెత్తి మ్రొక్కి కడుపునిండఁ బొగ మింగి యగి దనరునఁ గాగి

తెలివి తప్పి తలుపు గుంజి గుంజి క్రిందఁ బడిపోయితిమి. తరువాత నిక్కడ మా కొడలి పయిని స్మృతి గలిగెను. ఒక మహాపురుషుఁడు మమ్ము రక్షించెనని యిచ్చటి పరిచారకులు పల్కిరి. ఎవ్వరో యను కొంటిమి. స్వామి కఱచిన వారినిం బ్రాణ బంధువై కాపాడిన మీ పరమకారుణికత్వము నే మని కొనియాడఁ గలము? మా ద్రోహ బుద్ధి నే మని మన్నింప నడుగుకొనఁ గలము? రంగారా విచ్చటికి వచ్చి మమ్మును మిమ్మును గాంచి మీ వలన నిట్టి యుత్కృ ష్టోప కారము గలిగె నని యెఱింగి యా ద్రోహి, మీ పాదములు పట్టుకొని మన్నింపఁ వేఁడు కొనుటకు మూఱు, మోము చూపింప నోడి యీ యూరు విడిచి, మ మ్మిట్టి దు స్థితిలో నిట డించి తనదారిని దాఁ బోయినాఁడు" అని రాజ రత్నము పలుకుచుఁ దమ్ము మన్నింపుమని యేడ్చుచు మరల నతని పాదములు పట్టుకొనియెను. అంత, భట్టు సర్వేశ్వర విలాసమున కబ్బురపడి, తగిన రీతిని వారి నోదార్చి వారి కభయ మిచ్చెను. భట్టు నాలు గైదు దినము లా యూరిలో నుండి, ముష్వరును జక్కఁగ నారోగ్యము చెందిన పిదప రెండు బండ్లు చేయించుకొని, చౌడప్ప శాస్త్రిని వీడుకొని, రాజరత్నమును నామె కుమార్తెను, సుందరమ్మను దుర్గా ప్రసాదుని దోడుకొని బయలుదేఱి కొన్ని పయనములకు బెంగళూరు చేరి, సీతకును శ్యామలకును జరిగిన వింతల నెల్ల నెఱుఁగఁ జేసి, వారివలన నెఱుంగ వలసిన సమాచా రము లెఱింగి సుఖంబుండెను.

ఆ మఱునాఁడు. శ్యామలయు భట్టును బదరీనారా యణస్వాముల వారిని దర్శింపఁ బోయిరి; ఇరువురును వందన ములు చేసిరి. ఈయనయే రామచంద్ర భట్టుగారని శ్యామల స్వాములవారితో మనవి చేసెను. స్వామి, వారిం గూర్చుండ నియోగించి యేవేవియో సంగతులు మాట లాడి శ్యామలకు సెలవిచ్చి పంపివేసి భట్టుతోఁ బ్రసం గించెను.

స్వామి:- భట్టూ! సీతను నీవు బ్రతికించితి వనియు మీ రిరువు రన్యోన్యానురాగము గలిగి యున్నా రనియు శ్యామల చెప్పినది. సీతకుఁ గల విద్యాబుద్ధులును, స్థితి గతులును, రూప సౌశీల్యాదులును నీ వెఱుంగుదువు. నీ వా బాలికను బెండ్లియాడుట కంగీకరించితివి గదా?

భట్టు:- చిత్తము. అంతయు నిశ్చిత మయినది; కాని, యా బాలిక తలిదండ్రు లెవలో తెలియకుండుటచే లోకాప వాదమునకు గుఱి యగుదు నేమోయని వెఱచు చున్నాఁ డను. ఆ యడ్డు తీర్చివేయుట దమకుఁ దక్క-ఁ దక్కి-తరుల కలవి కాని విషయము. తమ యానతిఁ దలఁ దాల్చి తిరు గుటకు బద్ధుఁడనయి యున్నాఁడను.

స్వామి:- తండ్రీ! నీ కన్నియుం దెలియును. ప్రాజ్ఞుఁడవు. ఆ యంశము రహస్యముగానే యుండవలయును. నీవు పయి వాఁడవు గావు. మీ తండ్రి నరసింహాచార్యులు గారు, పూర్వాశ్రమమున నా మేనత్త కుమారుఁడు. జాన కమ్మయు సుందరమ్మయునాకుఁ గావలసిన వారలు. మా

తెమ్మఁ డనంతాచార్యుఁడు నీ సర్వాంగీణ ప్రజ్ఞయు,సమ ధిక లోకజ్ఞాన వేత్తృతయును, సమంచిత సకల శాస్త్ర పరి జ్ఞాతృత్వమును నా కెఱిఁగించినాఁడు. సీతకు నీకును బొత్తు కుదురుట నా తపఃఫలము. కార్యమగు నంత దనుక సుందరమ్మను నోరెత్త వల దని చెప్పము. సీతకును,శ్యామ లకును ప్రస్తుతము మన చుట్టఱికమును దెలుప వలదు. మీ వివాహమునకు నేను దగిన యేర్పాటు చేయుదును. ఈ నగరమున జనార్ద నాచార్యుఁ డను సంపన్నుఁడు నాకుం గడుఁ గూర్చు మిత్రుఁ డున్నాఁడు.అతనితో నాలో చించినాను. తాను సీతను దత్తత చేసికొని నీకుఁ గన్యా దానము చేయుదునని వాగ్దానము చేసినాఁడు. ఛే పీ గ్రామంబునం గల మాధ్వ మహాజనుల కందఱి కాహ్వాన ములఁ బంపి పెద్ద సభ చేయించి, సీత జననము పవిత్ర మయినదని నేను సాక్ష్యము చెప్పెదను.నా మాట మీఱు వా రీ యూరఁగా దీ ప్రాంతమున నెవ్వరును లేరు. కళ్యాణ మగు వఱకు నే నీ నగరముననే యుందును. ఇది యాషాఢమాసము. శ్రావణమాసమున సీతా రామ చంద్రుల కతి వైభవమునఁ గళ్యాణము గాఁ గలదు. అన్నియు ననుకూల పడును. నీ కీ వఱకే పది పదునేను వేల కాస్తి యున్నది. శ్యామల స్థితి యంతయు సీతకే చెందఁగలదు. జనార్ద నాచార్యునికి సంతానము లేదు. ఆయనకుఁ గల సొత్తంతయుఁ దుదకు మీకే చేరును. కాల క్రమమున నీవును, సీతయు సంపన్న దంపతు లయి, లోకమున కా దర్శక రూపు లయి,పిల్లపాపలను గనుగొని

సిరి సంపదలతోఁ దులఁదూఁగుచు వేయిండ్లు మొదలుగ వర్ధిల్లఁ గలరు. రహస్యమును సర్వథా కాపాడ వలయును. కన్యాదానము సేయఁ గన్నతండ్రికిఁ ప్రాప్తము లేదు. చూచి మిన్నందు వ్యక్తి యీ లోకమును వీడినది" అని పలుచు నతఁడు జలజల కన్నీరు జాలువాఱ నేడ్చెను. తగిన రీతి స్వామి నూరడించి యాతని కడ సెలవొంది భట్టు, శ్యామలా నికేతనమున కేతెంచెను. వడ్డితో నన్నూఱు రూకలు రామలింగయ్యకుఁ బంపెను.

మఱునాఁటి మాధ్వజన మహాసభలో స్వాములవారు సీతా జననము పరమ పవిత్రమైన సంగతి తా మెఱుఁగుదు మని సెలవిచ్చి యా కన్యను దత్తత చేసికొన జనార్దనా చార్యునకు నను మతి యొసంగిరి. సభవా రందఱుఁ ద దాజ్ఞ శిరసా వహించి యేక గ్రీవముగా దాని నంగీకరించిరి. శ్రావణ మాసమున ననంత వైభవమున సీతారాముల కళ్యాణోత్సవము జరిగెను. శ్యామల యేఁబదివేల రూప్యములు సీత కొసంగి పెండ్లి వెచ్చ మంతయుఁ దానే భరించెను; మహానందమున నోల లాడెను.

## 7

### చిత్ర చూలాలయ్యెను

శ్యామసుందరుఁడు తలవని తలంపుగాఁ జిత్రాబాయిని వీడి విధి యీడ్చిన దెస కరిగెను గదా! నాఁటిరాత్రికే యాతఁడు వచ్చునని యా ముద్దుగుమ్మ తలంచెను. కాని, యట్లు జరుగలేదు. ఏదో పని గలిగి యుండిపోయె ననియు,

తేపు తప్పక వచ్చుననియు మన స్సమాధానము చేసికొని యా విరిబోఁడి యా రాత్రి యెట్టులో వేఁగించెను. మఱు నాఁటి ప్రాతః కాలమున లేచి,యా యంచయాన, ఫలాహార మును సిద్ధముచేసి పాలుకాచి యవి పట్టుకొని వనాంతర్భాగ మునకు వచ్చి మేఁక పిల్లలతో నాటలాడుచుఁ గూరు చుండెను. ప్రొద్దాకసమ్మునఁ బరుగిడు చుండెను;కాని శ్యామ సుందరుఁడు రాఁడయ్యెను; ఆ ముద్దియ తద్దయు నాత్రపడి సహవాస ప్రాణులు తోడ రాఁ బైగుట్ట లెక్కి తన తల్లి, తండ్రి పోయిన దెసఁ జూచుచుఁ గూర్చుండు రావి చెట్టు మొదట నిలిచి ధర్మపుర మార్గమున దృష్టి పఱపెను. అశ్వ ఖురోద్ధూతమగు పరాగ మగుపింప దయ్యెను. ఆ చిన్నారి హృదయము చేయిపెట్టి కలఁచి నట్లయ్యెను. తన తల్లి యాదికి వచ్చునంత నామెవలెం దానును బ్రాణనాథు నాగమమును నిరీక్షించుచు వలవంతకుం జిక్కి యంత మొందవలసి వచ్చు నని కన్నీరు నును జెక్కులఁ జాలువాఱ నామె యేడువసాగెను; తటాలున వెనుక నుండి వచ్చి పతి త న్నాదరడించు నను నాసతో వెనుదిరిగి చూచెను. ఏ దెసఁ జూచినను దన ప్రియుని సుందరమూర్తి గానరాక పోవుటచే జగ మంతయు నంధకార బంధురము, శోభా దరిద్రాణముగా న చ్చిఱుతు కకుం దోఁచెను. రెండు జాములు ప్రొద్దెక్కువఱ కచ్చటనే చిత్రాకృతిని దిగ్భ్రమఁ జెంది యామె నిలిచి యుండెను; అంతలో గణగణమని ఘంటానాదము వినుపింపఁ దన యవ్వ మాట జ్ఞప్తికి వచ్చి కన్నీరు తుడుచుకొనుచు నురలి మరల చూచుచుఁ గుటీరమునకు వచ్చెను. అవ్వకుఁ గావలసిన పరి

చర్యలు చేసి వండి యామె ప్రక్కను గూరుచుండి ముని ప్రేళ్లతో నాలుగు మెతుకులు నోటవేసికొని యెంగిలిపడి యవ్వను బరుండఁబెట్టి యావును మేఁకలను దోలుకొని గుట్టల వై పేగెను. సాయంత్రము దనుక మెట్టపయిఁ గూరుచుండి యా సాసల నమ్మ త్త కాశిని, దెసలఁ దిలకించుచుండి యుండి చీఁకటి పడినంతఁ బర్ణశాలకువచ్చి యవ్వ కుపచారములు సేసి, యా రాత్రి భుజింపకయే పండుకొని హృదయ కమల కర్ణికాంతరమున సర్వాంతర్యామి యగు శ్యామసుందరు నుంచి స్వామీ నా శ్యామసుందరమూర్తిని నాకు మరలఁ బ్రసాదింపుముని ప్రార్థించెను. పట్టక పట్టక తెల్లవాఱుజామున నిద్రపట్టి యా ప్రేమాంబురాశి కొక స్వప్నము వచ్చెను. వెంటనే యా వాల్గంటికి మెలఁకువ వచ్చెను. అక్కల నిక్కల యనియే యామెకుఁ దోఁచెను. ఉస్సురని వేఁడి నిట్టూర్పులు పుచ్చుచు, " గుండె ఱాయిచేసికొని, విడిచేతులతో నేటి కెదురీఁత నీఁది యొడ్డెక్కవలయునా! " అని మనసులో ననుకొనుచు నా నవబోణి తన మనోనాథు నింతలోఁ జూచు భాగ్యము లేదని నిశ్చయించుకొని లేచెను; ముదుసలికిఁ గావలసిన సేవలు చేసి మూఁగ జంతువులం దోలుకొని విపినావని కేగి యాస విడువ లేక గుట్ట లెక్కి కూర్చుండి చూచుచుండెను. నాఁడు నట్లే కడచిపోయెను. ఆ మఱునాఁడు నట్లే వెళ్ళిపోయెను. బలవంతమగు విధి ప్రేరణచేఁ దీరని దురవస్థకు లోనయి శ్యామ సుందరుఁడు త న్నెడఁబాసి దూర మరిగి యుండు ననియుఁ దప్పక వచ్చు

ననియు నా యొప్పుల కుప్ప తలంచుకొని యేదో విధముగాఁ బ్రొద్దులు గడపుచుండెను.

అట్టు లొకమాసము రెండుమాసములు చల్లచల్లగాఁ జాటి వెళ్లిపోయినను దన హృదయేశ్వరుఁడు రాకుంటచే నప్పల్లవాధర మనోవ్యాధికి లోనయ్యెను. ప్రియుఁడు రేపు వచ్చును మాపు వచ్చునను నామె యాస లడియాస లయ్యెను. ఆ సుందరాంగునితోఁ గూడి విహరించిన వనభూములు, జల క్రీడ లాడిన చిఱు స్రవంతిని, వేడుక క్రీడల వినోదించిన క్రీడాద్రులు, నొండొరుల నలంకరించుకొనుచు నవునవ్వుచు జదువు చదువుకొన్న పూవు టీరములు నెదుర నగుపించు చుండ నవి యన్నియుఁ దలంపువాఱ నదంతయు నొక స్వప్న మయి యుండునేమోయని యా మోహనాంగి వెఱ్ఱిచూపుల నటు నిటు చూచుచు మనోవ్యాధికి లోనయి నా నాఁటికిఁ గృశాంగి యగుచుండెను. ఆ లలితాంగి కాహారము రుచింప దాయె. అననుభూత పూర్వం బగు నొక వింత మార్పాప డంతి యొడలఁ గాన నయ్యెను. తొలుదొల్త నది యేమియో యా తరుణీ రత్నమున కెఱుంగ రా దయ్యెను, ఇంచుక జ్ఞానము వచ్చినది మొద లచ్చిగురాకుఁబోఁడి యేమి యను భవించెనో నిర్భరానందము మూఁడు వారములు మాత్రమే యనుభవించెను. పదంపడి యా యానందచ్ఛట లంతరించెను. అంతలో నెల మసలెను. వేవిళ్ళారంభ మయ్యెను. శ్యామసుందర విరహమే యన్నహితము లేమికిఁ గారణము గా దని యా మె తెలిసికొనెను. నాల్గవ మాసమున గర్భ ధారణ చిహ్నములు సువ్యక్తము లయ్యెను. ఒడల నలసత

పొడసూపెను. నీరుమోసి శరీరము నవ నవ లాడ సాగెను. తన స్థితిని గూర్చి యా యనద పరితాప పడఁ దొడంగెను. ఏ నాఁటికిని శ్యామసుందరుని సుందరవదనారవింద మామంద యానకు మఱి కాన్పింపదాయెను. అట్టి దయామయుఁ డట్టి దలఁపుల వలరాయఁ డట్టి ప్రియాలాప సల్లాప కలాపుఁడు తన్నుఁ జూఁడ జుట్టమును ప్రెుక్క దైవమును లేని యా నట్టడివిని గుట్టలఁ బట్టించి మఱి తిరిగిచూడని కట్టిడి యగు నని యా యన్నుల కన్నా కెన్నఁడును దలంచి యుండ లేదు. కొన్ని దినము లాశా లేశముతోఁ ప్రాణము లెట్టులో యఱ చేతిలోఁ బెట్టుకొని యామె కాలక్షేపము సేసెను. కాని, యేక మాత్రాధార మయిన తన ప్రియుఁ డెక్కడ నున్నాఁడో యే నాఁటికైనను వచ్చునో మఱి రానే రాఁడో యేమియుఁ దెలియక యగమ్య గోచరావస్థలో దినములు గడపుట యా వెలందుల తలకట్టున కెంతయు దుర్భర మయ్యెను. అట్టి సమయమున గర్భధారణ చిహ్నములు పొడ సూపుట గోరుచుట్టుపై రోకటిపో టయ్యెను. ఎవరికి నేమియు నెఱిఁ గింపఁ జాలక తహ తహ పడుచు నారఁగూరిన కూరిమి పేరిమి నిజ హృదయ నాథునకు మీఁదు మిక్కిలి యాపద లేమెన నలముకొనియె నేమో యను బెంగతో నా యంగ నామణి లో లోన ననుక్షణము నంగలార్చుచుండెను. చిత్ర యిట్టి విచిత్ర ఘటనా లంపట చిత్తయై యుత్తలపడు చుండ, సర్వేశ్వరుఁ డాపద లన్నియు మూటగట్టి యా నో రెఱుఁగని బొట్టియ తలపైఁ బెట్టఁ దల పెట్టెనో యన్నట్టు లా చిన్నారిం గన్నులలోఁ బెట్టుకొని పెంచి పెద్ద దానిం

జేసిన యీ యవ్వకు నా జీర్ణతృణాధారమునకుఁ గాల మాసన్న మాయెను. అవ్వ యీ మవ్వాంపుఁ బువ్వారుఁ బోఁడిం జేరఁదీసి యశ్రుధారా సంసిక్త పలిత వలితాననయై, ముద్దిడి తన కొంగుమూట విప్పి మూఁడు మొహరీలు చేత నిడి, "తల్లీ! నేను నిన్ను విడిచి లోకాంతరమున కేగు చున్నాను. నీవు మైసూరు రాజవంశ పురుషులలో నొకనిం జెట్టఁబట్టి మర్యాద తప్పక మెలంగుము. తలిదండ్రులం బాపి దైవము నిన్ను నా యధీనముఁ జేసినాఁడు. నేను మరల నిన్నాతని యధీనము చేసిపోవుచున్నాను. ఎవ్వరి సాయమున నేని మైసూరు చేరుకొనుము. నీకుఁ గావలసిన బలగ మక్కడ నున్నది. చిరంజీవినివై సౌభాగ్యవతివై పదిమంది పిల్లలను గనుఁగొని మగనితో హాయిగా మనుము. నాకయి దురపిల్లకుము. పండుటాకు రాలిపోక యెన్నాళ్లుండును? నీ బుద్ధి నే నెఱుంగుదును. నీకు మేలు గలుగును" అని నాలుగు మాటలు చెప్పి యీ రాత్రి యీ వృద్ధురాలు కను మూసెను; మఱి తెఱవలేదు. అవ్వ పలుకు పలుకు లన్నియు శ్రద్ధగా వినుచు హృదయము నీరయి కన్నులు బాష్ప వర్షము గురియుచుండ వట్టిచూపుల నా వాత్సల్యనిధా నముం జూచుచుఁ జిత్ర చిత్రాకృతి నవ్వ ప్రక్కను గూరు చుండెను. ఇం కేమయిన నవ్వ చెప్పునేమో యని పెద్దయుం బ్రొద్దు నిరీక్షించి నిరీక్షించి యెట్టకేల కా యేకమాత్రా ధార మీ సంసారమునుండి జాఱిపోయె నని గుర్తించి చిత్ర, కంటికి నేలకు నేకధారగా నీరవయై రోదనము సేయుచు రాత్రి యంతయు శవజాగరణము చేసెను. ఆ చిన్ని హృదయ

మెంతగా నీరయ్యెనో కాని యేఱు గంగా గోదావరులును బట్టవయ్యె. తగిలిన చోటనే తగులుటయు, నొగిలిన కొంపయే నొగులుటయు, విధి నిర్ణీతము కాఁబోలును! పాపము! చిత్ర యవస్థ వర్ణనాతీత మయ్యెను.

కోడి కూసెను. ప్రభాత వాయువులు వీచెను. అరుణోదయ మయ్యెను. ఆదిత్యుఁ డుదయాద్రి శిఖరమున కరుదెంచెను. చిత్ర యొక్కింత తెలివి తెచ్చుకొని, యవ్వ కగ్నికార్యము సేయవలయునని తలపోసి, తల సవరించుకొని కన్నులు మోమును దుడుచుకొని పొరుగూరికిఁ బోవ నిలువెలు వడియెను. తమ సహవాసప్రాణి వెలుపలికి వచ్చి తమ దెసఁ జూడక యరుగుచుండ నేమి ముప్పు వచ్చెనో యెఱుంగలేని యా వంబాయని యఱచెను. మేఁకలు, మేఁక పిల్లలును ఆమెం గాంచి దమ యసహాయిక కంఠ స్వరము నెత్తి యఱచెను. చిత్ర వెనుదిరిగి చూచి, మించి ముంచి వచ్చుచున్న దుఃఖము నాఁచికొనుచు, దూఁగాడు కాళ్ళతోఁ దడఁబాటు నడకలతో గుట్టలదారిని బడి చేరువ కు గ్రామమున కరిగెను. అంతకు ముందా పల్లె కాఁపులు చిత్రం గాంచినంతనే చూపు నాదర మా దినమునఁ గానరాదయ్యెను. స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు నా నాఁడు చిత్రం బలుకరింపక మొగములు చిట్లించుకొనుచు మెటికలు విఱుచుచు గొణుగుకొన సాగిరి; ఏవగించుకోఁ దొడఁగిరి. అదంతయు న య్యంగనామణికి స్వప్నతుల్యముగాఁ దోఁచుచుండెను. తనకుఁ బరిచయమైన యొక కాఁపువాని యింటి కేగి నిలిచి యా యింటివారు గనిపింపఁగానే దుఃఖము పొంగి పొరలిరా

నమ్ముగ్ధ యేడువసాగెను. దానిం జూచి యా యింటి కాఁపు టిట్టున లేచివచ్చి, "ఛీ, ఛీ, చెడిపె! ఏల వచ్చితివి మా యింటికి! పో పొమ్ము. ఈ నంగియేడుపులు చాలించుము. లేచి పొమ్ము. నిన్నుఁజూచి మా పిల్లలుగూడఁ చెడిపోవుదురు. మచ్చ యెఱుఁగని తల్లికడుపు చెఱపం బుట్టినావు. పో, పో; నీతో మాటాడిన పాపము వచ్చును. నీ మొగము చూడరాదు. పో పో" మ్మని పదరి తిట్టెను. ఆ పిడుగుపాటుల కర్థ మేమో యా దీనురాలికిఁ దెలియ రాదయ్యె. ప్రపంచ మంతయుఁ జీఁకటి కోణముట్లు తోఁచి పరమ పావని యైన యయ్యభాగిని దిగులొంది యింతలో నింత మార్పునకుంగల కారణ మారయలేక వలవల నేడ్చుచు గిఱ్ఱునఁ దిరిగి, చంద్రన్న యింటికి వచ్చెను. ఇంట నా బాలుఁడు లేఁడు. ఆ యింటఁ గూడఁ జిత్ర కట్టి గౌరవమే జరిగెను. ఇంకఁ బ్రయో జనము లేదని తలంచి యా గ్రామమునుండి మరలి కుటీర మున కరుగుచుండఁ జంద్రన్న పరుగు పరుగున వచ్చెను. కుటీరమున కిరువురు నొక్క సారియె చేరిరి. వాఁడ త్తరుణీ తిలకము నోదార్చి యవ్వ మరణించిన దని తెలిసికొని, "అమ్మా! నీవు పూతచరిత్రవు. నే నెఱుఁగుదును. ఆ బాబుగారు ని న్నన్యాయము సేయరు. వారి. యయ్యగారు వచ్చి యాయనం దోడ్కొని పోయినారఁట. నా చేత నయిన యుపకారము నేఁ జేసెదను" అని పలికెను. వాని ప్రసంగ మమృత రసధారవలె న య్యభాగినిని దేర్చెను. అట్టి సాను భూతికే యామె హృదయము నీ రయ్యెను. బాష్పధార లతోఁ జెక్కుటద్దములు దొప్పఁదోఁగ సూర్య భగవానుని

దిక్కు చేతులెత్తి మ్రొక్కి యతఁడు నిన్ను రక్షించు చుండునని దీవించు సంజ్ఞ యామె చేసెను. ఇంతలో వాడుకగాఁ బాలుపితుకు ముసలిబోయ యచ్చటికి వచ్చెను; అవ్వ చని పోయిన సమాచారమును గ్రామస్థులు చూపిన యనాదరణమును చంద్రన్నవలన విని దహన కృత్యమునకుఁ గావలసిన యేర్పాటులు నిమిషములోఁ జేసెను. చిత్రయు, వారిరువురు నెండు కట్టెలు పోఁగుచేసిరి. ఇంట నున్న పిడుకలు తీసికొనిపోయిరి. అల్ల చిన్న యేటిగట్టునఁ జితిపేర్చి, యొక తడకపయి నవ్వ శవముం బెట్టి ముగ్వురును మోసికొనిపోయి చితిమీఁదఁ జేర్చిరి. అగ్గితెచ్చి రవులుకొలుపు నప్పుడు చిత్ర దుఃఖావేగమును భరింపలేక యా నేలను బొరలి పొరలి యేడిచెను. ఎట్టులో యా దీనురాలి నోదార్చి యా దీన బాంధవు లిర్వురు నవ్వ కామెచే నగ్ని సంస్కారము చేయించి యనాథప్రేత సంస్కారము వలని యగణ్య పుణ్యమును బంచుకొనిరి. వాడి వరుగయి యున్న యవ్వ కళేబరము రెండు గడియలలో బూది యయ్యెను. చిత్రను నదికిఁ దీసికొనిపోయి స్నానము చేయించి యా యుపకారశీలు రామెను బర్ణశాలకుఁ దోడుకొని వచ్చిరి. బలవంతపఱిచి యోదార్చి యెట్టులో యా బాలిక యింత యెంగిలి పడునట్లు చేసి యిరువు రొకరు విడిచి యొకరామెకుఁ దోడుగా నుండిరి; పశువులకు గడ్డి గాదర వేసిరి.

చిత్రకు సర్వము శూన్య మయినది. తలిదండ్రులు లేరు. తమ్ముఁడు పిడుగడచి చనిపోయెను. ప్రాణపద మయిన శ్యామ సుందరమూర్తి తలవని తలంపుగా నంతర్ధాన మయి

పోయినదే పోకగా నాఁటికి నేఁటికి మఱి గానుపింపఁ డయ్యె. తల్లి దండ్రులను మఱపించి యఱచేత నడిపించి సంరక్షిం చిన యా ముసలి ప్రాణియును దానిం బాసిపోయెను. ఇం కే మున్నది? దాని కీ ప్రపంచ మంతయు నంధకార బంధు రము భయంకర గహనమువలెఁ దోఁచెను. సహచరము లగు నైదు చతుష్పాద జంతువులు, చిర నివాసమగు పర్ణ కుటీరము, తోఁట, దొడ్డియు మిగిలెను. అటు గ్రామవాసులు నిటు బోయపల్లె వాండ్రును దయాలేశము లేక దిక్కుమాలిన య క్కుమారీ రత్నమును నిందింప సాగిరి. ఆమె యెక్కరిత యు నే చుట్టమును బక్కమును లేక య క్కాఅడవి నెక్క రణిం గాపురము సేయ నేర్చును? గుండె రాయి చేసికొని మూఁడవ జామున ముసలి బోయవానికిఁ దన సంసార మంతయు నొప్పఁజెప్పి తనకుఁ గల రెండు మూఁడు బట్టలు నవ్వ ప్రాణధనముగా నొసంగిన మూఁడు బంగారు నాణెము లును బట్టుకొని, తోఁటయు దొడ్డియు నొకసారి తిరిగి కన్నీరు కార్చుచు వచ్చి పశువుల చెంతకేగి వానిని లాలించి బాష్ప వారిం దడిపి ముద్దులాడి యా ముసలివానికి వాని నొప్పగించి తన ప్రయాణము చెప్పి యడ్డుపెట్టవలదని బ్రతిమాలి యిలు విడువలేకవిడువలేక విడిచి చిత్ర కన్నీరుమున్నీరుగా నేడ్చుచు నదీతీరమున కరుదెంచెను. పాప మా వృద్ధుని హృదయము నీరయి యక్కడనే నిలిచి చిత్ర పోవుదెస నీక్షించు చుండెను.

శ్యామసుందరుఁడు తొలుదొల్తఁ దన్నుఁ జూచిన యా తేవునకు వచ్చి నిలిచి నంతఁ జిత్రకు దుఃఖ ముప్పొంగి

వచ్చెను. ఆఁపరాని దుఃఖాటోపంబున, నా దీను రాలా యేటిలోఁ దన ప్రియునితోఁ జలక్రీడ లాడి యానందించిన యా యేటిలోఁ బడి ప్రాణములు విడువ నిశ్చయించి నీటి యొడ్డున కేగెను. నాఁటి వలె నేఁ డా నదీనీర మల్పమై యనావిలమై యుండ లేదు; ఇరు దరుల నొఱసి కలుషితమై ఝుంకార ధ్వని సేయుచుఁ గడువడిగాఁ బాఱుచుండెను. చిత్ర నీటిలో నడుగు పెట్టి నలుదెసలు విలోకించెను; గట్టున ముది బోయ యేడ్చుచు నాత్రముతోఁ బరువెత్తి వచ్చుచుండుట చూచి యాఁగెను. నదివంకఁ జూచి, యస్తాద్రి కేగు నాదిత్య దేవునిం గాంచి చేతు లెత్తి మ్రొక్కి చిత్ర, నేత్ర ద్వయి మోడ్చి యొక్క నిమిషము సర్వేశ్వరుని ధ్యానించెను. అంతలో, నంబర తలంబున నిండి నిబిడీకృతమై యుండు నభ్రచ్ఛటల నుండి మెఱయు మెఱపు చందంబునఁ దళు క్కని యొకతలంపా చిన్నారి బుద్ధిని స్ఫురించెను.తనయొడలు చూచుకొని తనప్రియుని ప్రేమానుబంధ బంధుర గ్రంధి యగు ఫలము గర్భస్థమై యున్న సంగతి యా తరుణికి జ్ఞప్తి వచ్చెను. ఎట్టిలో కష్టముల కోర్చి తన ప్రియుఁ డున్న తావుఁ జేరినచోఁ దన్నా ప్రేమనిధి గారవింపక పోఁ డను నాశాంకురము హృదయక్షేత్రమున నంకురింపఁ జిత్ర, నీట నుంచిన పాదమును మరల్చి వెనుకంజ వేసెను. తన మనో హరుఁడు నతని ప్రేమానుబంధమును స్మరణకు వచ్చినంతనే పరిపూర్ణము నిష్కళంకము తగు నన్నెలంతప్రేమ, హృద యము నావరించెను. మెల్ల మెల్లగ మె ల్లెక్కి గట్టుఁ జేరి బోయ నోదార్చి పంపివేసి యటు కదలి గుట్టల సందున నున్న

సన్నపు దారింబడి యా మెలంతపోవుచుండ నెదురుగా వచ్చు చున్న చంద్రన్న యామె కగుపించెను. యెక్కడికీ పయన మని వాఁ డడుగ ధర్మవరము వైపు చూపించి యంత వఱకుఁ ద న్నంపకము పెట్టుమని చిత్ర చంద్రన్నను వేఁడుకొనెను. 'అమ్మా! ఆయన యా యూరు విడిచి నాలు గైదు నెల లయినది. నీ వక్కడికిఁ బోయి యేమి చేయుదువు?' అని చంద్రన్న యడుగ, సంజప్రొద్దు ప్రొద్దుంజూపి, నుదుటి వ్రాఁతను సూచించి, సర్వేశ్వరుండు వ్రాసిన తల వ్రాఁత ననుసరించి పోయెద నని చిత్రాదేవి సంజ్ఞ చేసి ముం దంజ వేసెను; తన తల్లి, తండ్రిదారిం జూచుచుఁ గూర్చుండెడి రావిచెట్టుం జేరి మ్రొక్కి బయలుదేఱెను. చంద్రయ్య మఱు మాటాడక యా బాలిక వెనువెంట నడుగుచుఁ దన యూ రగుపించి నంతనే తాను ముందయి త్రోవ తప్పించి మాఱు త్రోవ నా నారీమణిని దీసికొని ప్రొద్దు పోవునప్పటికి ధర్మవరముం జేర్చెను. శ్యామసుందరుఁడు బస చేసిన యింటికిఁ దోడుకొనిపోయి యెవ్వరును లేక తాళము వేసి యున్న యా యింటి యరుగుమీఁదఁ జిత్ర నుండు మని చెప్పి యామె కడఁ గొన్ని డబ్బులు పుచ్చుకొని బజాఱున కేగి చంద్రన్న యామెకుఁ దినుబండములఁ గొని తెచ్చి యిచ్చెను. కృతజ్ఞతా సూచకములగు చూపు లా బాలుని మోమునఁ బఱపి చిత్ర వానికిఁ గొంత పైక మీఁబోయెను. వాఁ డది గైకోక, "తల్లీ! నీతోఁ దోడుగా వచ్చి మీ యిరువురిని గలుపవలయు ననుకొంటిని గాని, మా యూరంతయు నిన్నే వగించుచుఁ గంటగించుచున్నది. నే నేమి సేయుదును? నీ

వెంట నింత దూరము వచ్చితినని తెలిసినా, మా యయ్య మఱి నన్నింటికి రానీఁడు. నీ వమాయికురాలవు, యోగ్యురాలవు నని నే నెఱుంగుదును; నీ వల్ల నిసుమంతయైనఁ దప్పు లేదు. దైవము నిన్ను వీఁడఁడు. ఆ సామి కిదె మ్రొక్కుచున్నాను. నీవు నా బాబుగారును గలిసి హాయిగా నుండెదరు. అప్పుడు చంద్రన్నకు బహుమతి యిత్తురు గాని, ఇప్పుడు వలదు. అమ్మా దారిలో భద్రము సుమీ! ప్రొద్దు పోయినది. నేఁ దడయరాదు పోయి వచ్చెదను" అని పలికెను. చిత్రకు డెందము చెరివచ్చెను. వాని మంచి తన మున కచ్చెరువంది, వాని చెక్కులు నిమిరి పోయిర మ్మని సంజ్ఞా మూలకముగా ననుజ్ఞ యిచ్చి పంపి చిత్ర యా యరుగుమీఁదఁ గూర్చుండెను. రెండు మూఁడు కళలు తక్కువగా నర కొఱ వెన్నెల లప్పుడే వ్యాపింపఁ జేయుచు నంబరవీథిం బయనము సేయ వచ్చిన చందమామం జూచుచుఁ జిత్ర ఫలాహారము సేసి, యిన్ని నీళ్ళు త్రాగి శ్యామసుందరుని ధ్యానించుచుఁ దన గమన ప్రయాసము నదృష్టము నెట్లు ఫలించునో యని యోచించుకొనుచుఁ బరుండి కొంత రాత్రికి నిద్దురకు లో నయ్యెను.

## 8

### చిత్రప్రయాణము

మలి కోడి కూసినంతనే చిత్రాబాయికిఁ దెలివి వచ్చి లేచెను. ఆ నాఁ డామె కీ ప్రపంచ మంతయు నూతనాకృతిం దాల్చి యున్నట్టులు పొడఁ గట్టెను. కలలోఁ దా నిం కొక

లోకమునకుఁ గావించు ప్రయాణమువలె నప్పటి ప్రయాణ మామెకుఁ గానవచ్చెను. అంతకును సర్వేశ్వరునిదే భార మనుకొని యొక్కట్రెక్కు ట్రెక్కి తన బట్టల మూటఁ జంక నిడి శ్యామసుందరుని హృత్పీఠంబున నుంచి తల ట్రేల వైచి రాజమార్గంబునఁ గాలు సాగించుచుఁ జిత్ర దక్షిణాభి ముఖముగా నరుణోదయ కాలంబున నడువసాగెను. ఎంత సే పా విధమ్మునఁ దాను నడచినదో యామె కెఱుక లేదు. కాని, యెండ వేఁడి యెక్కువయి చుఱుకుటయు నెదుర నొక గ్రామ మగుపించుటయుఁ జిత్ర యా పూట నట నిలువఁ గోరి యూరిలోని కేగెను; అది భట్టు పురాణము చెప్పు చుండ గోపాలరాజు వచ్చినయూరు. అచ్చటఁ గోవెల యున్నట్లు మన మెఱుఁగుదుము. చిత్ర యా గుడిలోనే బస చేసెను. పూజారి మంచివాఁడు. అతఁడు చిత్రను జూడఁగానే వింతపడెను. రూపము సౌధాంతఃపుర నివాస యోగ్యము. ఒడ లలంకార శూన్యమయ్యు సహజాలంకార విరాజితము. బట్టలు ముదుగువయ్యు ముఱికి యెఱుంగని నీరు కావి రంగువి. ఒక నిమిషము తటపటాయించి యా పూజారి, యా యువతి రత్నమును సమీపించి, "తల్లీ! నీ దేయూరు? అమ్మా! ఇచ్చటి కేల వచ్చితివి? బిడ్డా! ఏ యూరి కేగెదవు?" అని యడిగెను. చిత్ర యేమియు ననక కన్నీరు నించి నిలువు గన్నుల నతనిఁ జూచు చుండెను. ఆ యువతి దుఃఖ వివశయై తనతోఁ బలుక నేరకున్న దను కొని జాలిగుండె వాఁ డగు నా పూజారి తన యింటి కేగి భార్యను బంపెను.

ఆ పాటుత వచ్చి యెన్నో ప్రశ్నలు, మనసు చేరి వచ్చు నట్లు ప్రశ్నించి చిత్రను నక్కునఁ జేర్చుకొని యోదార్చెను. ఒక దానికిని జిత్ర జవాబు చెప్పలేక కొన్నిటికి సన్నలచేఁ జక్కఁగఁ బ్రత్యుత్తరము లిచ్చెను. 'అమ్మా! నీకు మాటలు రావా?' అని బ్రాహ్మణి యనఁ, చిత్ర తల యూఁచెను. ఆ విప్ర వనితకుఁ బిల్లలు లేకుండుటచే నంత చక్కని పిల్లకు మూఁగతనమును, నంత లేఁ బ్రాయమునఁ గడగండ్లును దటస్థించెనా యని విచారించి యెద నీరుగా నామె యప్పడుచుల మిన్నం గౌఁగిలించుకొని ముద్దిడి, 'తల్లీ! నీవు నా బిడ్డవు. నా యింటనుండుము, నీ కే లోపమును రానీను' అని పలికి యా పుణ్యస్త్రీ యా జవ్వనిం దోడ్కొని యింటి కేగి య చ్చిటుతుక దీన స్థితిని భర్త కెఱిఁగించెను. అతఁడును వింతపడి, "యిది మూఁగతనము కాదు. ఇ దేదో కారణముచే నడుమ వచ్చిన దయి యుండును. ఈ తల్లికిఁ జెవుడు లేదు; వికార చిహ్నములు లేవు. ఈమె నెల తప్పియున్న ట్లున్నది. భద్రముగా సంరక్షింపుము. నీ కనంత పుణ్యము గలుగును" అని పూజారి పత్ని కాజ్ఞాపించెను. బ్రాహ్మణపత్ని చిత్ర నోదార్చి, తల యంటి నీళ్ళుపోసి, యొడ లంత పసుపుపూసి జలక మాడించి తుడిచి తల తడి యొత్తి ధూపము వేసి పీటపైఁ గూర్చుండఁ జేసి నెరులు చిక్కుఁదీయుచు, 'అమ్మా! నీకుఁ బుత్రుఁ డుదయించును. నీ భర్త యెక్కడ నున్నాఁడు?' అని యడిగెను. చిత్ర నేత్రముల గిఱ్ఱున నీరు దిరిగెను. ఆమె, రాచ బాట వంకఁ జూపి చాల దవ్వు కేలు సాగించి మనోభిప్రాయము నెఱిఁగించెను. "అతఁడు నన్నుఁ బెండ్లాడి విడిచి, దూర

దేశమున కేగి యున్నాఁడా? నీ వాతని వెదకుచు నిట్లు బయలు దేఱి పోవుచున్నావా? నా చిట్టి తల్లీ! నీ విట్టి తరుణమున నెట్లు లంత దూరము నడచి పోఁగలవు? ఏ యూరని పోవుదువు? ఆయాస పడియెదవు సుమీ! నా మాట విని మా యింట నుండుము. మీ తాతగారితోఁ జెప్పి నీ భర్తకుఁ గబురు పంపించి రప్పించు నేర్పాటు నేను జేయించెదను" అని పాఱుత పలికెను. ఆ యమ్మ యాదరణ వాక్యములచే బంధువు లందఱు లేచివచ్చినట్లయి చిత్ర కొంత యూరడిల్లెను; అవ్వపెట్టిన చలిది యన్నముం దినెను. ఆ నాఁడు మాత్రమే యక్కడ నుండి మఱునాఁడు చిత్ర ప్రయాణ మయ్యెను. పూజారియు నతని భార్యయు నెంత వేఁడుకొన్నను నట నింకొక పూట యైన జాలము సేయుట కంగీకరింపక వారి యడుగులకు మ్రొక్కి ప్రతిమాలి యనుజ్ఞనొంది యా యమ యొసంగిన యోట్టెను మూటలోఁ గట్టుకొని వారిని వీడుకొని చిత్ర పయనము సాగించెను. ఇట్లు దిన మొకచోట నిలుచుచుఁ జిన్న చిన్న మజిలీలు సేయుచు బ్రాహ్మణు లేయూర నున్న నక్కడ దిగుచుఁ దినుచు బహు ప్రయాసమున దారి నడచి యొక సాయంకాలమున హిందుపురము చేరెను.

హిందుపురము చిన్న పల్లెకాదు; పెద్ద పట్టణము గాదు. చిత్ర యా గ్రామము చేరునప్పటికే ప్రొద్దు పోయెను. ఎచ్చటి కేగుటయో తెలియక వీధుల వెంబడి కొంత ప్రొద్దు దిరిగి తిరిగి చిత్ర, తుదకు నొక శ్రీమంతుని వీధి యరుగు మీఁద నాయాసముతోఁ బరుండెను; ఉదయము నుండియు

బువ్వఁ దినలేదు. దారి నట నట రాలి దొరకిన కాయ గస
రులు, పండ్లును దిని నీరు ద్రావుచు వచ్చెను. గర్భభారా
లస యైన య య్యిగ్మలిని దారి నడచిన యలజడి బాధింప
సాగెను. అప్పటికే యా తొయ్యలి మృదు పద తామరసం
బులు కంది పొక్కులెక్కి సలుపు చుండెను; కాళ్లు పీకు
చుండెను; ఒడ లంతయు ధూళి ధూసరితమై చెన్నుఱి నవసి
యుండెను. ఆమె కాఁకలి వేయుచుండెను. లేచి యెక్కడికి నరు
గ లేక వగర్చుచు నొడలు ముడుచుకొని బట్ట కప్పుకొని చిత్ర
యీశ్వర ధ్యానము చేయుచుఁ బండుకొని యుండెను.
అంతలో నా యింటిలోనుండి దాసి చీపురుకట్ట పట్టుకొని
యరుగులు తుడుచుటకై వచ్చి పండుకొన్న చిత్రం జూచి,
'ఎవ రిక్కడఁ బండుకొన్నారు. లెండు లెండు' అని యఱ
చెను. ఉలికిపడి లేచి చిత్ర కూర్చుండెను. "పో, ఎవరు నీవు!
ఇక్కడఁ బండుకో వీలు లేదు. దిక్కుమాలిన వా రందఱు
మా యరుగుల మీఁదనే చేరుదురు. వీరితో నేను వేఁగలే
నమ్మా. ఏమి? మొద్దులాగునఁ గదల వేమి! లేచి పోయె
దవా లేదా!" అని దాసి గర్జించి పదరెను. చిత్ర భయ
పడి బల్లిలాగున గోడ నంటుకొని పోయెను. తన యాజ్ఞ నను
వర్తింప లేదని మండిపడి దాసి, 'ఏమే మొండి ముండ! నీకుఁ
జెవుడా! పొమ్మని చెప్పిన వినిపింపలేదా! చూడు, చీపురు
కట్టతో వీపు విఱుగఁ గొట్టెదను' అని యఱుముచుఁ
జీపురు తిరుగవేసి చిత్రం గొట్టెను. ఆ యవమానమునకును
దెబ్బకును దాళలేక చిత్ర కారున నేడ్చుచు, లేవలేక లేక
లేచి యరుగు దిగుచున్న యవసరమున, దాసి చేసిన

సింహ గర్జనము వినిపింప లోపలినుండి యింటి యజమాను రాలు దీపము పట్టుకొని వచ్చి, ఏ మే యీ సంత యని యడిగెను. అమ్మా! చూడుఁడు. ఈ మొద్దెంత చెప్పినను నరుగు దిగ కున్నది. అని దాసి ఫిర్యాదు చేసెను. దాసికిఁ దగిన యా గృహిణి, దీపము చిత్ర మొగము వంకఁ ద్రిప్పి 'ఓసీ, పెనుభూతమువలె నున్నదే. దీని నిక్కడ నిలువ నీయకు. కొట్టి తఱిమివేయుము' అని యన, నామె తన విషయమున నేమే నక్కటికముఁ జూపునేమో యని యాశించి యున్న చిత్ర యచ్చెరువొంది భయపడి యరుగు దిగి వీధి వాకిలి దాఁటి పోయెను. దాసియు యజమాను రాలును గలసి తమకు వచ్చినన్ని తిట్లు గరిసెల కొలంది వర్షము కురియించిరి. ఆహా! నాగరిక శిఖామణుల మని విఱ్ఱవీఁగు నగరవాసుల కంటె నమాయికు లగు నాటవికులే యక్కటికము గలవారు గదా! ఐశ్వర్యము, మిడిమిడి జ్ఞానము నరు నంధతమసమ్మున దింపివేయును. తమ నిమిత్తమే లోక మున్న దని తలంతురు గాని, తాము గూడ లోకము నిమిత్త మున్నవార మని వారు తలంపరు. వెల్తురున్న చోటనే క్రీనీడ!

నాఁటి రాత్రి చిత్రకుఁ ద న్నగరమున నాలు గైదు చోట్ల నట్టి గౌరవమే లభించెను. అట్టివారు లోకమున నుందు రని యప్పుడే యామెకుఁ దెలిసెను. దుఃఖయు పొంగి పొరలి రా నేడ్చుచుఁ దిరిగి తిరిగి చిత్ర యెదురవచ్చు నొక వనితంజేరి, యన్న మెక్కడ దొరకు నని సంజ్ఞచేసి యడిగెను. అదిగో. ఆ సందులో నెడమచేతి ప్రక్క మూఁడవ యిల్లు పూట

కూలిల్లు. అక్కడికి బొమ్మని యా వనిత చెప్పెను. ఆ పాటి మాట సాయము లభించుటే పరమ భాగ్యమని సంతసించి చిత్ర, కాళ్ళీడ్చుకొని తుట్ట తుద కా పూట కూలి యింటి కేగెను. అక్కడఁ జావడిలోఁ జాపపైఁ గూరుచున్న గత భర్తృక వృద్ధురాలిం గాంచి చిత్రదీనముగా నన్నము పెట్టుమని సంజ్ఞ చేసెను. 'అఱు డబ్బు లొకపూట కీయ వలెను' అని యా యవ్వ యన చిత్ర యొక వెండి నాణె మును దీసి యవ్వచేతఁ బెట్టెను. అవ్వ యామోదించి, వీధి యరుగు ప్రక్కగదిలోఁ జిత్రకుఁ బండుకొనఁ జావు చూపి కడుపునిండ భుజింపఁబెట్టి, యొక చాప యిచ్చి పరుండు మనెను. చిత్ర మేనువాల్చిన నిముసములో సుఖనిద్రకు లో నయ్యెను. మఱునాటి యుదయమునఁగాని చిత్ర మూఁగ దన్నసంగతి యవ్వ గుఱుతింపలేదు. గుఱుతించిన పిదప నమ్ముసలి జాలిపడి చిత్రకుఁ దలయంటిపోసి సకలోప చారములు సేసి శ్రమ వాపెను. అక్కడఁ జిత్ర నాల్గు నాళ్లుండెను. తనకడ నున్న యొక బంగారు నాణెమును మార్చి యిమ్మని చిత్ర యవ్వకు సంజ్ఞసేయ నామె మార్పించి తెచ్చి యిచ్చెను. చిత్ర మైదవనాఁడు ప్రయాణ మయ్యెను. అవ్వ యొక బండి తెప్పించి బెంగళూరునకుఁ గుదుర్చి, బండివాని కీయ వలసిన మొత్తె మిచ్చి వేసి, త్రోవలో నామెకు నన్నపానములకుఁ దగిన సదుపాయ ములు సేయుమని చెప్పి చిత్రను బండి యెక్కించి, తనకు రావలసిన పైకముగాక మిగిలినది చిత్ర కిచ్చి భద్రమని మఱి మఱి చెప్పి వీడు కొలిపెను. బండి సాగి నాలుగైదు మజిలీ

లకు బెంగళూరు చేరెను. చిత్ర నొక పూటకూలి యింట దింపి, యామెకుఁ గావలసిన యేర్పాటులు చేసి వీడుకొని బండివాఁడు తన దారిని బోయెను.

చిత్ర, యా పూటకూలి యింట రెండు దినములు మాత్రమే యుండి యక్కడ నీయవలసినది యిచ్చివేసి యక్కడినుండి మైసూరునకుఁ బ్రయాణము సేయ నిశ్చయించి బయలుదేఱు నంత నాఁ డామె కపరిమితముగా జ్వరము వచ్చెను. పూటకూలి యవ్వ యామె నాఁపివేసి, వైద్యుని బిలిపించి మంచి మందిప్పించి సంరక్షణ చేసెను. చిత్రకు బాగుగ నారోగ్యము కలుగుటకు నైదాఱు దినములు పట్టెను. ఆమె దగ్గఱనున్న రెండు కాసులును సెలవయి కొన్ని రూకలు మాత్రము మిగిలెను. అక్కడినుండి కాలినడకనే పాప మామె యోపలేని యింతి పయనము కావలసి వచ్చెను.

## 9

### వీరాసామి

బెంగళూరు నగరము నుండి శ్రీరంగ పట్టణమునకుఁ బోవు మార్గమున బెంగళూరునకుఁ జేరువగాఁ గా అడవి యుండుట మన మెఱుంగుదుము. దారికిఁ గూఁత వేటు దూరమున నగ్గహనంబున రాక్షసకంటకా కీర్ణంబయిన గుట్టల గుంపు గలదు. అందు రెండు మూఁడు శబరాలయంబులు గలవు. ఒకొక్క పక్కణంబునఁ బది పండ్రెండు కుటీరములున్నవి. కాని యవన్నియు వరుసగా లేక మళయాళ మందిరంబులవలె నక్కడక్కడ వృక్షలతా కీర్ణములయి

దేని కదే ప్రాపును గాఁపయి యుండెను. అయినను వాని వానికి సంబంధము లేకపోలేదు. అందలి కబరులు పగలు కూలి నాలి చేసి, ప్రక్కయూళ్లకు బోయి కూరగాయల నమ్మి ధనార్జనము సేయుచు, రేల శృంగాటకంబుల నరికట్టి బాటసారుల తలలు పగులఁ గొట్టి వారిని దిరుపతి వెంకన్న వలె నిలువు దోఁపులు దోఁచుచు గడించుచుండిరి. ఆ రెండు మూఁడు పల్లెలా గుట్టల నడుమ నున్న మాటయే రాచరికము వారికెఱుక లే దనుకో వచ్చును; లేదా వారిని సాధించుట దుస్సాధమని తలంచి తమ పరువు నిలువఁబెట్టుకొన నుదాసీనులయినం గావచ్చును. ఏ దెట్లయిన నా దోపిడి గాండ్రెదురులేక తమ దుర్వృత్తిని సాగించుకొనుచు విచ్చలవిడిగా విహరించుచుండిరి. ఆ త్రోవను దొంగభయము గల దనియు దాని ప్రక్కనున్న పెద్ద మఱ్ఱిని దొంగలమఱ్ఱి యని పిలుచుటయుఁ బట్టపగలా దారి నరుదెంచు బాటసారులు గూడ నఱచేతుల నసువులు నిలుపుకొని చనుచుండుటయు లోక విదితములే. టిప్పుసుల్తాను పాలనమునఁ జోరబాధ యీ ప్రాంతమున నంతగా లేదు. వారిలోఁ జాలమందిని బట్టించి యీ చండశాసనుఁ డురిదీయించు చుండుటచే నక్కాలమునఁ గొన్నాళ్లు నిర్భీతికముగా నుండెడిది గాని సుల్తాను రాజ్య మంతరించిన పిదప మన కథా కాలము వఱకు రాజ్య వ్యవస్థలు పాదునఁ బడకుండుటచే నందం దణఁగిమణఁగి యున్న చోర బృందము తలయెత్తి, యెదురు లేకుండుటచే నంతంతకు విజృంభించి స్వేచ్ఛా వృత్తిని దురంతములు సేయుచు బాటసారుల

దోఁచుకొన సాగెను. రామయ్య భీమయ్యలఁ గొట్టి దుర్గాం బను మోచుకొని పోయిన దీ చోర బృందమే.

ఆ దొంగల గుంపునకు నాయకుఁడు వీరాసామి యను యువకుఁడు. తండ్రి చనిపోయిన వెనుకఁ దన్నాయకత్వ మీత నికి వచ్చి యెన్నాళ్లో కాలేదు. వీని కిరువది యైదేండ్లు వయస్సు. ముదివగ్గు తల్లి తప్ప వీని కిం కెవ్వరును బంధువులు లేరు; ఇంకను పెండ్లి కాలేదు. తండ్రి వీనిని దన వృత్తిలోఁ ద్రిప్పుకొని త ద్విద్యా రహస్యములు, నాచారములు, నియ మములు, ముహూర్తములు, పద్ధతులు నివి యిట్లని యుపదే శించి తనయంత వానిం జేసి తన పదవి కభిషిక్తుని జేసి మేను వాసెను. వీరాసామియుఁ దన పరివారమును జక్కఁగా నాజ్ఞ వెట్టుచుఁ బనిపాటులు సేయించుకొనుచు వారి వారికి రావల సిన భాగములు సకాలమునఁ బంచి యిచ్చుచుఁ గ్రొత్త క్రొత్త త్రోవలుద్రొక్కి వారి మెప్పొందుచు నేర్పుతోఁ దన యేలిక తనమును మెఱయించు చుండెను. వీనికి రెండు ఱాతిగోడల యిండ్లు గలవు. ఈ రెండు నిరుగు పొరుగున నే యున్నవి. వానికి దిట్టమయిన తలుపులు ద్వార బంధములు తాళములు, గడియలు నఱదండములు మున్నగునవి గలవు. వాఁ డం దొకటి తన తల్లితోఁ దాను నివసించుట కుపయో గించు కొనుచు, రెండవది చెఱదెచ్చిన వారి నుంచుట కేర్పాటుచేసెను. ఆ రెండును బోనులవలె నుండును. వానికి వెనుకభాగము బమ్మరకస్సి ముండ్ల డొంకలును కోరండమ్ము మున్నగు ముండ్ల బద్దను దట్టముగా నల్లుకొని పట్టపగలే చీఁకటి జీమూతాకార మయి యుండును. ఆ రెండవ యింటనే

మన దుర్గాంబ యున్నది. వీరాసామి మున్నగు వారా గాలి వాన రాతిరి రామయ్య భీమయ్యల మూర్ఛఁ గొట్టి యామెం దెచ్చి యా యింటఁ జెఱయుంచిరి. తొలుదొల్త నత్యాచారము సేయ నొకరిద్దఱాలోచనలు సెప్పినను వీరాసామి వారి మాటల కంగీకరింపక దుర్గాంబను గన్న తల్లివలె భావించుచు నామె కే విధమయిన బాధయు లే కుండ నేర్పాటు చేసి శ్రీ మహాలక్ష్మియే తన యింట నున్న దను భావముతో దుర్గాంబను బూజించుచుం డెను. ఆ యిల్లు దాఁటి యెక్కడికి నరుగ రాని నిర్బంధము తప్ప దుర్గాంబ కే విధమయిన కష్టమును లేదు. ఆ సతీ తిలకమును వీరాసామి యుదార బుద్ధికి సంతోషించి, యతఁడు సకల సాధు ప్రియుఁ గాని దేర మంచిమంచి రుచ్యములగు భక్ష్యములు భోజ్యములు చేసి వానికిఁ బెట్టుచుఁ జక్కని కథలను, రామాయణము భారతము మున్నగు నుద్గ్రంథము లందలి చరిత్ర ములను మృదు మధుర ధోరణిని బ్రతిదినమును జెప్పుచుఁ గాల క్షేపము సేయుచుం డెను. దుర్గాంబ సేయు మధురోప హారములు దినుచు, నా సాధ్వీరత్నము వచించు పురాణ గాథలు వినుచు వీరాసామియు వాని పరివారమును నా పెను దమ తల్లిగాను, జగజ్జనని యగు దుర్గాంబగాను భావించుచు సేవించుచుండిరి. ఇట్లు కతిపయ దినంబులు గతించిన పిదప దుర్గాంబ సమయము మరసి వీరాసామితోఁ దన దుఃఖో దంతముఁ గొంత కొంత చెప్పి, "తండ్రీ! నీవు నా తనయుని వంటివాఁడవు. ఆపదలలో మునిఁగియున్న నన్ననుగ్రహించి నా పిల్లలను జూడ విడిచి పుచ్చవా! నీ కనంత పుణ్య ముం

డును. నీ వెంతో మంచివాఁడవు" అని కనికరము గలుగ వేఁడుకొనెను. వీరాసామి గుండె నీ రయ్యెను. కాని, యామెను విడిచి పుచ్చినచోఁ దనకు మధు రాహారము లెవరు పెట్టుదురు? వీరాంజనేయుని కథలు, భీమన్న కథలు నొడలు పొంగఁ దన కెవరు చెప్పుదురు? దుర్గాంబను విడు చుట వాని కేమియు నిష్టము లేదు. అయినను గాదన లేదు. 'అమ్మా! నేను నీ కొడుకనే కదా! ఇంకఁ గొన్నాళ్లి క్కడ నుందుము. ఇంతలో నాలోచించెద,నని పలికెను. ఆ పలుకులలో నర్థము దుర్గాంబ గ్రహించి యింకఁ గొన్ని దిన ములు తనకు నిర్బంధమున నుండక తీర దని నిశ్చయించు కొనెను. నాఁటి మూఁడవ యామమున దుర్గాంబ వీరాసామి మున్నగువారికి మైరావణ చరిత్రను జెప్పుచుండెను. హను మంతుఁడు, మత్స్యవల్లభుఁడు నను పేరు లను చున్నప్పు డంతయు వీరాసామి యొడలు పొంగి పోవుచుండెను. మంచి కథాభాగమున, "జయ సీతారామ, బాబా! భీక్దేవ్, మాయీ! భూక్లగ్గా హై! బడాబూజు గలుగు తుంది, బడాబూజు గలుగుతుంది" అనుచు నాజాను బాహుఁ డయిన యొక జడదారి యచటికి కరుదెంచెను. అందఱి దృష్టులు నా బైరాగి మీఁదబడెను. ఒడలినిండ విభూ తియు, మెడలో రుద్రాక్షమాలికలు, దాడీ, జడలు గల బైరాగిం గాంచిన నతఁడు సాక్షా త్సాంబశివుఁడనియే వీరా సామి యభిప్రాయము. దిగ్గన లేచి వాఁ డెదురుపోయి బైరా గికి మ్రొక్కి చావడిలోనికి వచ్చి కూర్చుండుమని కోరెను. బైరాగియు నే వేవియొ తక పిక వచనములు నదువుచు

వచ్చి చేతిసంచి చావడిలో దింపి గది ద్వారమున కెదు రుగాఁ గూర్చుండెను. సాక్షాత్ లక్ష్మీదేవి వలె వాని కెదు రుగ గదిలో దుర్గాంబ కానిపించెను. ఆ బైరాగి యానందమునకు మేరలేదు. "అప్పా! నీ యింటిలో లక్ష్మీదేవి వచ్చియున్నది. నీ వదృష్ట వంతుఁడవు. నీ కింతలోనే పెండ్లి కానున్నది. దొరకిన పెన్నిధి నా లక్ష్మీదేవిని వద లితివో నీ పని సరి. భద్రముగా భక్తితో సేవ సేయు చుండుము. నీ మొగమున సిరి యున్నది. నీ యెదలో హను మన్న యున్నాఁడు. వీరాధి వీరుఁడవు నీవు" అని నోటికి వచ్చినట్లుగా నా జటాధారి వీరాసామిని జూచి నవ్వుచుఁ జెప్పసాగెను. వీరాసామి పొంగి పోవుచుండెను. దుర్గాంబ సంతోషమునకు మేరయే లేదు. ఆ బైరాగి వీరాసామికే కాక దుర్గాంబకును దక్కిన వారికిని దోఁచిన రీతిని గోడమీఁది పిల్లి వాటముగా నుండు వల్లించిన వచనము లే కరువు పెట్టి వారి మెప్పుపొంది, "బాబా! ఆఁకలి మాడ్చు చున్నది. రాత్రినుండియు బువ్వలేదు. ప్రొద్దు పోవుచున్నది. వంట చేసికోలేను. పట్టెఁడన్న మున్నఁ బెట్టింపుము. ఈ పొట్టకుఁ జాలును" అని వీరాసామితోఁ బల్కెను. "అమ్మా! నేఁటి కింతతోఁ బురాణము నిలుపుదము. పాప మీ సామి కాఁకలి బాధ మిక్కుటముగా నున్నది. లేచి యింత వండి యీ బైరాగికిఁ బెట్టుము. మాకును బని యున్నది. మేము పోవుదుము. సామగ్రి యంతయు నున్నది గదా! సామీ! మీ రీ యరుగు మీఁద నొక్క గడియఁ బండు కొనుఁడు. ఆ యమ్మ నిముసములో వంట చేసిపెట్టును"

అని వచించి వీరాసామి పరివారముతో వెలుపలికి వచ్చెను. బైరాగియు రామస్మరణ సేయుచు నరుగుమీఁదికి వచ్చెను. వీరాసామి వీధి తలుపునకు దాళము వేసి తాళపుఁ జెవుల గుత్తి పట్టుకొని తనయింటికిఁ బోయెను.

దుర్గాంబ రెండు గడియలలో వంట చేసి, తాను గడుపునిండ భుజించెను; వీరాసామి కింత పెట్టెను. బైరాగి భాగ మంతకు ముందే వాని కర్పిత మయ్యెను. బైరాగి కడుపునిండఁ దిని వీరాసామిని బాగడి వీడుకొని రామ స్మరణ సేయుచుఁ జంద్రప్రొద్దున నిజేచ్ఛం జనియె.

వీరాసామి యెప్పటియట్ల తలుపు తాళము వైచి యింటికిఁ బోయెను. జాబిల్లి మింట విరాజిల్లుచుండెను. వీరాసామి యాలఁగొట్టఁ గత్తులు గటారులు పట్టుకొని తోడి దొంగలు చేరిరి. వా రందఱు నొకచోఁ గూడి దైవ ప్రార్థనఁ జేసికొని త్రోవ దోపిడికేగిరి. వా రూరు దాఁటిరో లేదో వీధి పశ్చిమ భాగమునుండి మనకుఁ బరిచితుఁ డగు బైరాగి యింకొక బైరాగితోఁ గూడి సీతారామ స్మరణ సేయుచు వీరాసామి యింటి వాకిట నిలిచెను. ఆ సవ్వడి విని లోపలినుండి వీరాసామితల్లి యీవలి కేతెంచి బైరాగులను గాంచి మ్రొక్కెను. దానికి బైరాగులన్న భక్తి యింతంత కాదు. చప్పిదౌడలు నెండి కట్టుగట్టిన నిడుపాటి మొడలుఁ గడు సన్నములగు కాలుసేతులుఁ జికిలి కన్నులుఁ జింపిరి తలయుఁ గొక్కిరి పండ్లును గల యా ముదుసలిం జూచి బైరాగులు నవ్వాఁపుకొనిరి. అందుఁ బెద్దవాఁడు, "మంచి తల్లివి. చందమామను జూచి నీ మొగము సూచినాము.

మాకుఁ గడుపునిండఁ గూడు దొరకును. భాగ్య శాలి యగు నొక్క ప్రాణిపై నాధార పడియున్నావు. వాఁడు నప్పు డప్పుడు నీ మీఁదఁ గుట్టు మనుచుండును. అయినను మంచి వాఁడు. నిన్నుఁ బిడికెఁడు బుగ్గి చేసివేయును. రేపో నేఁడో వానికిఁ బెండ్లియగును. నీకుఁ గోడలు వచ్చును. మనుమల మనుమరాండ్ర నెత్తుకువు. తొంబది యేండ్లు బ్రతుకుదువు. నీ వంటి యదృష్టవంతురాలు లేదు. అమ్మా! ఆఁకలిగా నున్నది. ఈ నాపై దోడున కింత యన్నము పెట్టవా! ధర్మాత్మురాలవు!" అని మనసు కరుఁగ వేఁడెను. చూచి చూడఁగ నేయట్టుముట్టానవాళ్లతోఁ దన యుదంత మంతయు నెఱిఁగించిన బైరాగిపై నా వృద్ధాంగన కపరిమితమైన భక్తి గలిగెను. "సామీ! యే జాతిమీఁది? మా యింటఁ దిందువో" అని యది యడుగ, "అమ్మా! అ దంతయు నిప్పు డెందులకు? అ దంతయు గతించి పోయినది. బైరాగు లకుఁ గులము గోత్ర మేమిటి వెఱ్ఱి తల్లివి. అమాయికు రాలవు. నీ మంచి తన మంతయు నీ మొగముమీఁదనే కని పించు చున్నది. నిన్నుఁ జూచిన నేఁడు మాయమ్మ లేచి వచ్చి నట్లయినది" అని గద్గద స్వరంబునఁ బల్కి కుత్తుకసవ రించుకొని పైబట్టతోఁ గన్నులు తుడుచుకొని పెద్ద బైరాగి, యవ్వమోముపై దీన దృష్టులు పరఁగించెను; అవ్వకు మనస్సు నీరయ్యెను. 'సామీ! ఉండుము. ఇప్పుడే వచ్చెదను' అని పలుకుచు నింటిలోని కరిగి తాళపుఁ జెవులగుత్తి తెచ్చి, 'నాయనా! ఆ యింట నొక యిల్లాలున్నది. ఆమె వంటచేసి యుంచును. మీకుఁ బెట్టించెద నుండుము' అని వడి వడిం

బోరు గింటికిఁ జని, తాళము తీసి లోపలికి వెళ్ళి, "దుర్గమ్మా! దుర్గమ్మా! దీపము లేదేమి? వెలిగించుము. అప్పుడే పరు న్నావా? పాప మొక బైరాగి యాఁకొని వచ్చియున్నాఁడు. ఇంత కూడున్నఁ బెట్టుము" అని ముదుసలి చెప్పుచుండఁ గానే దుర్గాంబ మెఱపు మెఱసినట్లు వెలుపలికి తెంచి తలుపు గొళ్ళెమువేసి వీధిలోనికి వచ్చెను. బైరాగు లిరు వురు నామె చేరి యొక చెక్క పట్టుకొని, వడి వడి నడచి పోయిరి. ముసలిది, తలుపువేసిన సవ్వడి విని, 'దుర్గమ్మా! దుర్గమ్మా! వీధిలోనికిఁ బోతివా? వీరన్న విన్నచో నీకును నాకును మఱి యాబు రుండదు' అని యఱచు చుండెను. అది యరణ్యరోదన మయ్యెను.

దుర్గాంబను దోడ్కొని బైరాగు లిద్దరును మాట లాడక నిలువక యతి శీఘ్ర గమనంబున, కండ్లనక ముండ్ల నక, గట్టనక పుట్టనక, వెన్నెల వెలుఁగులోఁ ద్రోవఁ జూచు కొనుచు నడచి యా యూరి పొలిమేర దాఁటి భయస్థాన మున కెడమై యొక గంట ప్రయాణముచేసి యొక పల్లెం జేరిరి. "రామయ్యా! భీమయ్యా! మీ ఋణ మెట్లు తీఁగఁ గలను? నా శరీరము గోసి మీకుఁ జెప్పులు కుట్టి యిచ్చినను జాలదు. కన్నులు పోఁగొట్టిన దేవుఁడు మంచి మతి యిచ్చె నన్నట్లు లాపదలలోనుంచి నాతఁడుమి మ్మాధారముగాఁజూపి నాఁడు. హంతకులు నాఁడు మిమ్ముఁ గొట్టినప్పుడు మీరు చనిపోయియుందురని యెంత యేడ్చితినో సర్వేశ్వరునికే యెఱుక. ఒకనాఁడు స్వప్నమున మీరు క్షేమముగా నుండి నన్ను విడిపింపఁ దిరుగుచున్నారని యెవరో చెప్పినట్టు లయి

నది. అది నేఁటికి నిక్కల మైనది. మీ గాయము లెవరు మాన్పిరి? నే నిక్కడ నున్నట్లు లెట్లు గుఱుతించితిరి? మీ యుదంత మెఱిఁగింపుఁడు" అని దుర్గాంబ యడిగెను. బైరాగు లిద్దరును రామయ్య భీమయ్యయు నని మా పాఠకుల కీవఱకే తెలిసియుండును. తమ చరిత్రమును సంక్షేపముగా వా రిట్లు చెప్పిరి.

"తల్లీ! నాఁటిరాత్రి మా తలలు పగులఁగొట్టి నిన్ను దొంగలు తీసికొని పోయినపిమ్మటఁ గొందఱు బాటసారులు వచ్చి మమ్ము మన బండిలో వేసికొని బెంగళూరు తీసికొని పోయి యొక వైద్యు నింట విడిచిరి. దయాశాలి యయిన య వ్వెజ్జు మా గాయములకుఁ దగిన మందులు వైచి కట్టి మాకుఁ దగిన చికిత్సఁ జేసెను. పది పదునేను దినములకు మేము నెమ్మది నొందితిమి; ఏమి సేయవలయు నని యాలోచించుకొని యే దెట్టులయినను నిన్ను వెదకి నీ పిల్లలతోఁ జేర్పక మా యిండ్లకుఁ బోరాదని నిశ్చయించి మా యెద్దులు బండియు నా వైద్యునికే విక్రయించి, సొమ్ము జాలెలం గట్టుకొని, నిన్ను వెదకుట కనువగు ననియు బిచ్చము లభించు ననియు బైరాగి వేషములు ధరించి యూరూరఁ దిరుగుచు నిన్నన్వేషించు చుంటిమి. ఒక రాత్రి యొక సత్రమున మే మిద్దఱమును దుర్మార్గులనుండి యొక బాలికం గాపాడి చెంత గ్రామమునకుం గొంపోయి యొక మఠాధిపతి కొప్పించితిమి. తిరిగి తిరిగి వేసరితిమి! కాని, యే యూర నే పల్లెను నీ యునికిఁ దెలియరాకపోయెను. ఏమయిన నగుఁ గాక యని దొంగల మఱ్ఱికి మొన్నరాత్రి వచ్చి చెట్టెక్కి దాఁగియుంటిమి.

వీరాసామియు వాని యనుచరులును వికృతాకారములు ధరించి యా చెట్టుక్రిందఁ గూర్చుండి యేవేవో ప్రసంగములు చెప్పుకొనుచు, నడుమ నడుమ, దుర్గమ్మ వంటి తల్లి లేదనియుఁ గమ్మగా వండిపెట్టు ననియుఁ జిత్ర విచిత్రము లగు కథలు చెప్పు ననియు ననుకొనిరి. నీవే యా తల్లి వని యనుకొంటిమి. మొన్నను వారికేమియు దోపిడి దొరకలేదు. విసివి వారు మరలి తమ గ్రామమునకు బయలు దేఱిరి. మేమును జాల దూరమున వారిని వెన్నంటి యిటుకు త్రోవ నీ గ్రామము వచ్చి చూచితిమి; నిన్ననంతయు నీ చుట్టుపట్టులు పరికించుచువచ్చిసంగతి సందర్భము లాలోచించుకొని పోయితిమి. నేఁడీ వేషమున వచ్చి నిన్ను దర్శించినంతనే నా ప్రాణములులేచి వచ్చినవి. సర్వేశ్వరుఁడు మనపాల నున్నాఁడు. ఇంకమనకే భయమునులేదు. రేపు బెంగళూరు వెళ్ళి రక్షకాధికారులకు వీరిని గుఱించి విన్నవింతము. తల్లీ! మా శ్రమకై విచారింపకుము. పెనమున నున్నదానిం బెడలోనికి గెంటి నీకిట్టి కష్టము వచ్చుటకు నేనే కారణ మయితిని. ఏదో స్వామి కృపవలనఁ గృతార్థుల మయితిమి" అని రామయ్య తమ యుదంతమును జెప్పి ముగించెను. రాత్రి వారా కుగ్రామమున నిదురించి తెల్లవాఱినంత బెంగళూరునకు బయలు దేఱిరి. అల్లనాఁడు రంగారావు బారినుండి సీతను సంరక్షించిన యాపద్బాంధవులు జడదారులు మన రామయ్యయు భీమయ్యయు నని బుద్ధిమంతులగు మా పాఠకు లప్పుడే గ్రహించియుందురు.

# 10

## దొంగలమఱ్ఱి (2)

బెంగళూరినుండి చిత్ర యొకనాఁటి నాల్గవ జామున బయలుదేఱి నడవ సాగెను. గవ్యూతి మార్గ మెట్టులో నడచు నప్పటి కా యువతి కాయాసము మెం డయ్యెను. దారి ప్రక్క నొకచోఁ గూరుచుండి యించుక శ్రమ నపన యించుకొని, తపనుఁ డపరాంబుధిఁ గ్రుంకుచున్నందునఁ దొందరపడి లేని సత్తువ తెచ్చుకొని యా మచ్చెకంటి లేచి యడుగులు వేయసాగెను. అఱక్రోసు నడచు నప్పటికే సాయంత్ర మయ్యెను. చుట్టుపట్టుల నెట్టి కుగ్రామ మయిన నామెకుఁ గానరా దయ్యెను. చంద్రోదయ మయ్యెను. ఆ తరుణి కారాట మధిక మయ్యెను. అది శరదృతు వగుటచే నిండు పున్నమ రేయి జాబిల్లి వెన్నెలవెల్లిలోఁ బ్రకృతి తేలి యాడుచుండెను. 'అలజడిని గమనింపక కా ళ్ళీడ్చుకొనుచు నతి ప్రయాసంబున న య్యబల నాలుగుగడియలు పయనము సేసెను. ఒకచో నొకటి రెండు గడియలు గూర్చుండి మరల నాలుగు గడియలు నడచెను. ఆ పై నా దీనురాలికి మఱి యడుగు పడ దయ్యెను. విధిలేక య క్కుసుమగాత్రి యా నట్టడవినే యా రాత్రి గడపఁ దలంచి యటు నిటు చూచి యొక యూడలమఱ్ఱి గానరా నా వనస్పతిం జేరి త న్మూలమునఁ దలఁ దాచుకొన నిశ్చయించి, మూట క్రిందవైచి యొక్కింత తడవు గూరుచుండి చుట్టునున్న కికారణ్యమును జూచి వెఱ పొంది యా వృక్ష మూలమున నొక కోక పఱచుకొని మఱి

-యొక కోక యాపాద మస్తకమును గప్పుకొని ముడుచుకొని పరుండెను. దాని తలంపు లెట్టు లుండునో పాఠకులే యూహింపుఁడు. చీమ చిటుక్కుమన్న నులికిపడి లేచి చూచుచు శ్రమాతిరేకమునఁ గొంత తడవున కొడలు మఱచి చిత్ర నిద్రకు లోనయ్యెను.

పట్టపగలు, చిత్ర నడచుచుండె నఁట. దాని వెన్నంటి నల్వురు భయంకరాకారులగు పురుషులరుదెంచి పైనిఁ బడఁ బోయి రఁట. అది యఱచుచుఁ బరువిడ సాగె నఁట. అంతలో నెక్కడినుండియో ఢామ్మను శబ్దము వినిపించె నఁట. అది వెనుదిరిగి చూచు సరికి దానిని వెంటాడి వచ్చుచున్న నలువురు రక్కసులును నెత్తురు గ్రక్కుకొనుచు నేలఁ బడి రఁట. ఒక దివ్య పురుఁషు డా దీనురాలి కట్టెదురఁ బ్రత్యక్ష మయ్యె నఁట. వాని దివ్య తేజోరూపమును జూడ నామె కన్నులు మిఱుమిట్లు గొనె నఁట. అతఁ డామెతలపైఁ జేయి వైచి, "చిత్రా! చిత్ర! భయపడకు. నేను నీ యండ నుండ నీ కేమి భయము? నే నాపద్బాంధవుఁడను. నాయందే మనస్సుంచి యోపికమైఁ గష్టముల కెదురు నడపుము. ఇంకెంతో కాలము లేదులే" అని పలికె నఁట. ఆ పల్కులు వీనుల సోఁకి నంతనే యద్భుతముగాఁ జిత్రకు మాటలు వచ్చిన వఁట. దివ్య ధోరణి నప్పరమ పురుషునిం జిత్ర యపురూపపు వర్ణనలతో వర్ణించె నఁట; స్తుతించె నఁట. అంతలో నే యతఁ డగుపింపక మఱిఁగి పోయెనఁట. తత్‌స్థానమున శ్యామసుందరుని దివ్యమూర్తి వెలుఁగొందు చుండె నఁట. ఆనందంబున మేను మఱచి నేత్రాబ్జము లఱ మోడ్చి చిత్ర

చిత్రాకృతిని నిలువంబడియుండ శ్యామసుందరుఁ డా తరుణీ మణిం జేరఁదీసి మనసారఁ గవుంగిలించుకొని చెక్కిలి నొక్కి చుబుకంబు పుణికి ముద్దిడి కొనియె నఁట. అంతలో నామె తలిదండ్రులు చెఱియొక వైపున నరుదెంచి చిత్ర నాలింగ నము చేసికొని ముద్దులలో ముంచివేయు చుండిరఁట. చిత్ర సింహాసనంబున గూర్చుండె నఁట. ప్రక్కను శ్యామ సుంద రుఁడు నిలువంబడె నఁట. ఆమె తలిదండ్రులించుక యెడము గలిగి యున్న తాసనంబులఁ గూరుచుండి యా దంపతుల నానంద బాష్ప బిందు సందోహంబు చిందులు ద్రొక్కు వాత్సల్య దృష్టులఁ దిలకించుచుండిరఁట. చిత్రా యుత్సంగ మున నున్న యొక చిన్ని బాలుఁడు పాలపం డ్లగుపింపఁ బక పక నవ్వుచుఁ జిత్ర మెడలోని ముక్తాహారంబులం దన చిన్ని చేతులతోఁ జిక్కుపఱుచుచుండె నఁట. అంతలో నొక దేవీ మూర్తి చిత్ర యెదుటఁ బొడఁగట్టె నఁట. 'మన మిరువుర యొక్క మే నొక్క ప్రాణముగా మెలంగు వారము. చింతిల్లక రమ్ము' అని చిత్రచేయి పట్టుకొనె నఁట. నిమిషములో నింత యానంద ప్రదమగు దృశ్యము నంతర్ధాన మయి పోయె నఁట. ఎట్టయెపిట ఘుంకార ధ్వని సేయుచు నెగిరియెగిరి యొక నేనుఁగు పరుగెత్తుకొని వచ్చుచుండె నఁట. వెను దిరిగి చూచు నామె పాఱఁ దలంచునంత, నంతకు ముందు రక్తము గ్రక్కుకొని పడిన భయంకరాకారులు, కరాళ దంష్ట్రిలు, నాలుకలు చాచుకొని, చింపిరి తలలతోఁ గొక్కిరిపండ్లతో మిడిగ్రుడ్లతో హుంకారధ్వనులు సేయుచు నామెపయిం బడ వచ్చుచుండిరఁట. ఏమి చేయుటకును తోఁపక చిత్ర యొక్క

కేక పెట్టెనఁట. దానితోఁ జిత్రకుఁ దెలివి వచ్చి యది యంతయు స్వప్నమని స్పష్ట మయ్యెను. దాని గుండెలు దడ దడఁ గొట్టుకొనఁ దొడంగెను. పండు వెన్నెలలో నలుదెసలు పరికించి చూచి భయహేతు వేదియు లేదని గుర్తించి చిత్ర మరల ముసుఁగిడి పండుకొనెను. అంతలో మనుష్యులు గుస గుస లాడుచు వచ్చుచున్నట్టు లామెకుఁ దోఁచెను. దూర మున నామె కన్నుల కెదురుగఁ గలలోఁ గన్న వికృతా కారులు ప్రత్యక్ష మైరి. అదియు స్వప్నమే మోయని కన్నులు నులుపుకొని మరలఁ దేఱి పాఱఁజూచిన చిత్రకు స్పష్టముగా ఘోరాకారులు నల్వురు పురుషు లగుపించిరి. కాని, చెట్టు నీడ నుండుటచేఁ జిత్ర వారి కింకను గనిపింపలేదు. వారిలో వారిట్లు విశృంఖల వృత్తిని మాటలాడ నారంభించిరి. చిత్ర వినుచుండెను.

వెంకయ్య:-లచ్చయ్యా! యీ ప్రొద్దొకరును రాలే దేమిరా? మంచి సకునము కాలేదు కాఁబోలురా!

లచ్చయ్య:- ఏదిరా! వచ్చి సిటమైనఁ గాలేదు. అప్పుడే యెవరు వచ్చి పడుదురురా? నీవు తలవఁగానే తాతకుఁ బెండ్లి గావలె నందువురా! మంచి సకునమే యయిన దిరా? నక్క మన ప్రక్కనుండి పరుగెత్తినది గాదురా!

కిత్తయ్య:- వెంకయ్యా! మన దినాలు తిన్నగ లేవురా! వీరా సామి నిన్న నగ్గిరాముఁడయి పోయినాఁడు. ఆయమ్మ తప్పించుకొని పోయినది మన నేరమా! నిన్నఁటి నుండి యతఁడు పిచ్చిపట్టినట్లు గంతులు వేయుచున్నాఁడు.

వెంకయ్య:-కిష్టయ్యా! ఆ లాగున ననకు. ఎంత మంచి తల్లిరా! ఎంతమంచి కథలు సెప్పెడిదిరా? ఎంత సక్కని తల్లిరా! దుఃఖము కా దంటరా యంత మంచి తల్లి వెళ్లిపోయినది!

లచ్చయ్య:- ఓరీ! మన వీరాసామి తాళము గట్టిగా వేయ లేదు కాఁబోలునురా! ఆ బైరాగి నాకొడుకే యా తల్లిని దరలించుకొని పోయియుండునురా? నూకాలమ్మ (వీరాసామి తల్లి) వానితోడ వచ్చినవానికిఁ గూడు పెట్టించుట కా తలుపు తీసిన దంటరా! అంతలో నా యమ్మ వెలుపలికి వచ్చి వీధి తలుపు గొళ్ళెము పెట్టి బైరాగి ముండకొడుకులతోఁ బాఱిపోయిన దంటరా!

కిష్టయ్య:- లచ్చన్నా! ఏ యమ్మరా! దుగ్గమ్మవంటియమ్మ మఱి దొరకదురా! ఎంత రుచిగా వండి పెట్టెడిదిరా! ఆ తల్లిని జూచినఁ గడుపు నిండెడిదిరా? కాని, వీరాసామి మనమీఁదఁ గన్నింత గ్రుడ్డింత సేసినాఁడేమిరా! నిన్న నేఁడు నెంత వెతకినాామురా! కాళ్లు లొల్లయి పోయిన విరా! ఆ పకీరు నాకొడుకు లెవరురా?

లచ్చయ్య:- అల్లా నాఁడు గాలి వాన రాతిరి బండి వానికిని వెనుక నడచుచున్న వానికిని దలలు పగులఁగొట్టి దుగ్గమ్మను దెచ్చినాము కాదురా? ఆ ముండకొడుకులు నాఁడు సావలేదు కాఁబోలునురా! దొంగ సన్నాసి వేసాలు వేసికొని యా యిద్దఱే వచ్చి యుందురురా! కాని నాము గామురా! మనకుమతులుపోయినవిరా! వీరాధి వీరుఁడు వీరాసామిగూడ నీ జాలములోఁ బడిపోయి

నాఁడురా! ఏమి సోద్దెమురా! ఈ నాఁ డింకను వీరా సామి రా లే దేమి సెప్పుమా?

సింగయ్య:- ఆ యమ్మ దూటి వేసిన దని వీరాసామి వెఱ్ఱెత్తి పోయినాఁడు రా బాబూ! ఉం డుండురా! ఈల విని పించుచున్నది. అదిగో, బదు లీరా?

అందఱును, ఈలకు బదు లిచ్చిరి. ఆ దొంగల ప్రసంగము చిత్రకు స్పష్టముగా వినిపించెను; వారి యాకారములు స్పష్టముగాఁ గనిపించెను. భయముచే నామె యాపాద మస్తకము వడంకుచున్నను నొకా నొక పలుకు విన వచ్చుటచే నా దీనురాలి హృద యాకాశమున నానంద సుధాంశు రేఖ యుదయించెను. దుర్గమ కాంతా రాంత రంబున నడురేయిని యమ కింకరులం బోని యప్పురు షాధములం గాంచి యట్టి యబల, నిలువున నీ రగుటకు బదులు సంతోషించుటకుఁ గల హేతు లేశ మేమి గలిగెనో!

అంతలో సమీపమున మరల నీల వినవచ్చెను. మరల నొక్కసారిగా నలుగురు కింకరులును నీలలు గొట్టిరి. కన్నులు తెఱచుకొని చూచుచున్న చిత్రకు వీరాసామి వెన్నెలలో నెట్టయెదుటఁ గన్పట్టెను. ఒడలు జల్లు మనఁ జిత్ర సర్వాంగ ములును గంపించిపోయెను. వీరాసామి యాఱడుగుల మానిసి. ఒడ్డు పొడుగునకుఁ దగిన యొడలి బందోబస్తు గలవాఁడు. మదిరా పాన ఘూర్ణిత నయనుండయి వాఁ డిటు నటుఁ దూఁగి పోవుచు నచ్చటికి వచ్చి నిలిచెను; జుట్టు నున్నగ




ఓరీ! కిత్తన్నా! చూడు; చూడు. అదిగో మన దెయ్యపుమఱ్ఱి క్రిందఁ
తెల్లగా నేదో కనిపించుచున్నది. (323-324 పుటలు.)

దువ్వి కోడికత్తులు గలిపి తలపై నెడమ ప్రక్కను పెద్ద సిగ వేసికొని యుండెను. గడ్డము మీసమును బాగుగా నెదిగి వాని నల్లని మోమునకు భీకరత్వము నిమ్మడి చేసెను. దుక్కి పూజులవలె వాని దండ లతి బలిష్ఠము లయి మెలికలు దిరిగి యుండెను. కుడి దండ నున్న బంగారు దండ కడియమునున్న, వానియంజన చ్ఛాయనుండి వెన్నెలలో మిల మిల మెఱయు చుండెను. వాఁడు వచ్చి నిలిచి నంతనే వాని కింకరులు లేచి చేతు లెత్తి మ్రొక్కిరి.

వీరాసామి:- లచ్చయ్యా! దుగ్గమ్మ జాడ గనుగొంటిరా!

లచ్చయ్య:- (తల గోకికొనుచు) లేదు జియ్యా!

వీరా:- ఛీ! పసులురా మీరు! మిమ్ములఁ బెట్టుకొని యే పని చేయుటకును గాదు. మెకాలైన మీకంటె నయము. ఏబ్రాసిముండకొడుకులారా! ఆ సన్నాసి నా కొడుకుల బుఱ్ఱలు పగులఁ గొట్టి దుగ్గమ్మను దెమ్మని యెప్పుడు చెప్పి నాను? ఇం దాక సోమరిపోతులయి యటు నిటుఁ దిరిగి లేదు జియ్యా! యని చెప్పుటకా వచ్చితిరి?

కిత్తయ్య:- బాబూ! ఏమి సెయ్యఁగలము! కాళ్లు ఱో ళ్లయి నవి. తిరిగి తిరిగి దిమ్మ పట్టినాము. మేము నీ పనిలోఁ బ్రాలుమాలుదుమా? మా సంగతి సందర్భాలు నీకుఁ దెలియవా?

వీరా:-ఉస్సు! ఉండురా. ఓరీ కిత్తన్నా! చూడు సూడు, అదిగో, మన పెద్దమఱ్ఱిక్రిందఁ దెల్లగా నేదో కనిపించు

చున్నది.అ దేమిటో చూచిరా. భద్రము. సన్న సన్నగ నడుగులు వేసికొని వెళ్ళు.

కత్తయ్య:- (చిత్రను సమీపించి తొంగిచూచి, చేతితోఁ దాఁకి, 'సామీ! దొరకినది. దొరకినది. దుగ్గమ్మ దుగ్గమ్మ' అని పెద్ద కేకపెట్టెను. వీరాసామియుఁ దక్కిన ముప్పురు నొక్క దూఁకున నక్కడికి వెళ్ళిరి. చిత్రనిండ ముసుఁగుదన్ని కాలుసేతులు దగ్గఱగాముడుచుకొని భయభ్రాంతయై గడ గడ వడఁకి పోవుచుండెను. వీరాసామి, చిత్ర నమాంతముగా రెండు చేతులతోఁ బట్టుకొని యెత్తి వెన్నెలలోనికిఁ దెచ్చి నిలిపెను. చిత్ర నిలువలేక కూలఁబడెను. వెన్నెల వెలుఁగులలోఁ జందమామ నెకసక్కెములాడు చిత్ర వదనారవిందము వీరాసామి చూచి పరమానంద భరితుఁడై పోయెను. "లచ్చయ్యా! హనుమన్నకు మ్రొక్కి యిల్లు బంగులు దేజినానురా? చిన్న పడుచు, చక్కని చుక్క దొరకినదిరా? దుగ్గమ్మ పోయినదని విచార మింక లేదురా. తామసింపక పట్టుకొని యింటికిఁ బొఁజె పోదాము పదండురా" అని వీరాసామి పలుకుచు బిక్కనచ్చి యేడ్చుచున్న చిత్ర నవలోకించి, "పిల్లా! ఎందులకేడ్చెదవు? ఏము నీకేమి యుహాని సేయము. నే నందఱి కేలికను; ని న్నేలికసానిం జేసెదను. ఊరడిల్లుము. ఇంక నీవు రాణిలాగున నుండవచ్చును లే. విచారింపక లే. ఇంటికిఁ బోవుదము" అని చిత్ర నోదార్చెను. చిత్ర వలవల నేడ్చుచుఁ జేతు లెత్తి మ్రొక్కి, వీరాసామి కాళ్లమీఁదఁ

బడి, కొంగు ముడి విప్పి మిగిలి తన దగ్గఱ నున్న వెండి నాణెములు వీరాసామి కరమున నుంచి సంజ్ఞలతోఁ దన్ను విడిచి పెట్టు మని కొంగు సాచి వేఁడు కొనెను. "పిల్లా! నీకు మాటలు రావా! మూఁగ దానవా? పోనీ లే. అయినను పరవాలేదు. నేను నిన్ను నిక్కా సేసి కొందునులే. వజ్రాల కెంపుల నగలు నీ కిచ్చెదను. ఏడువకు. దిగులుపడకు. గుండె పదిల పఱచుకో. వెంకయ్యా! చూచితివా? ఆ దేవునికి బుద్ధి లేదని నే నన్నమాట సత్తెమే కదా! లేకున్న నింత సక్కని చుక్కకు, బంగారు బొమ్మకు మాటలు లేకుండ మూఁగ దానిని జేసివేయునా! పిల్లా! నీ పైని గనికారముగా నున్నది. నిన్ను విడువలేను. దొంగ నా కొడుకు లెవ రైన నిన్నెత్తుకొని పోదురు. నా మాట విను. దిగు లొందక లేచి నా యింటికి రా? నిన్నుఁ గన్ను లంటోఁ బెట్టుకొని పూవులతోఁ బూజచేసెదను. రామ చిలుక లాగున నున్నావు. నిన్నొంటరిగా నీ నట్టడవిని డించి పో లేను. లే. పద" అని వీరాసామి చిత్ర చెక్క పట్టి లేవ నెత్తెను. చిత్ర యేడ్చుచు నీడిగిలఁబడెను. "అదిగో అదే పిశాచి గుణము. మంచి కిది కాలము కాదు. లచ్చయ్యా! మీా నల్వురు నీమెను పట్టుకొని భద్ర ముగాఁ బూవు మాదిరిని గందకుండ మన యిల్లు సేర్పుఁడు. నేనును వెనువెంట వచ్చెదను" అని వాఁడు లెంకల కాజ్ఞా పించెను. వారు చిత్రను బట్టుకొని వచ్చిరి. ఆ బాలిక బుద్ధిశాలిని; మోటుతనమువలనఁ బ్రయోజనము లేదని

గ్రహించి గుండె రాయిచేసికొని కన్నులు తుడుచుకొని లేచి నిలువఁబడెను. ఆమె నడచి వచ్చుట కంగీకరించె నని గుర్తెఱిఁగి దాని మూట నొకఁడు పట్టుకొని ముందు దారిచూపుచు నడవసాగెను. వాని యడుగు జాడలఁ బోవుచుఁ జిత్ర పరమేశ్వరుని నిశ్చల హృదయముతో రక్షింప వేఁడుకొనుచుండెను. వీరాసామి మున్నగువారు మిన్నంది పెన్నిధిఁగన్న యనువున నామె వెంబడి నడవఁ జొచ్చిరి. తిన్నగ వీరాసామి యింటి వాకిటికి వా రేగి తలుపుఁ గొట్టిరి. నూకాలమ్మ తలుపు తీసెను. దుర్గమ్మను బ్రక్కయింట నుంచుట చేతనే యామె పాఱిపోయినదని యూహించి వీరాసామి చిత్రను తన గదిలో నుంచుట కేర్పాటు చేసి పరివారమునకు సెలవిచ్చిపంపి చిత్రను దీసి కొని లోపలి కేగెను. తన గదిలో బల్లమంచము మీఁదఁ జిత్రను బరుండుమని చెప్పి యరటిపండ్లు, టెంకాయయు నామెకుఁ దెచ్చి యిచ్చి, "ఇవి తిని యీ మంచము మీఁద హాయిగాఁ బండుకొనుము. ప్రొద్దున నేను వచ్చె దను. నీ కేమియు భయము లేదు. నెమ్మదిగా నిద్రపో" అని మాటలతోను సంజ్ఞలతోను దెలియఁ జెప్పి వీరా సామి గది తలుపు చావడి వైపు గొళ్లెముపెట్టి తాళము వేసి ప్రక్కవసారాలో నా రాత్రి నిదురించెను.

## 11

### ఆగంతుకుఁడు

తెల్లవాఱి నంతనే నూకాలమ్మ చిత్రను వెలుపలికిఁ దీసికొనిపోయి లోఁడి తెచ్చెను. ఆ యిల్లు దుర్గంధ భూయిష్ఠ

మయి యుండెను; రౌరవమును బోలియుండెను. ఒక మూల నులకమంచము, వేఱొక మూలఁ గొల్లిగంప, ఒక యెడ నెండుతోళ్లు, వేఱొక యెడఁ బచ్చిమాంసము, ఒక చోటఁ జేపల పోలుసు, వేఱొక చోట నగ్గినెగడు, ఒక ప్రక్కను రెండు గడ్డిపఱపులు, వేఱొక ప్రక్కఁ బెద్దబోను పెట్టె, ఒక తావున ధాన్యపు గాదె, వేఱొక తావునఁ గత్తులు గటారులు, తుపాకులు, నీటెలు, పిస్తోళ్లు మున్నగు మారణ సాధనములు నుండెను. ఇల్లు పెద్దదే కాని శుచి గలవారు నిలుచుటకుఁ దావులేదు. చిత్ర పలు దోముకొని నంతనే నూకాలమ్మ యామెకుఁ జల్లంది తెచ్చి పెట్టెను. అది చూచి నంతనే చిత్రకుఁ బెద్ద వమన మయ్యెను; వెంటనే తలయేరు వచ్చెను. అచ్చట నిముస మయిన నిలువ నోపక చిత్ర, గదిలోని కేగి రాత్రి శయనించిన బల్లమంచము మీఁదఁ బరుండి యేడ్వ సాగెను. కాల్యకృత్యములు దీర్చు కొని వచ్చి వీరాసామి యామె ననేక విధముల నోదా ర్చెను. చిత్ర వాని పాదముల పైఁ బడి తన్నెట్టు లయిన విడిచి పుచ్చుమని సంజ్ఞలతో బ్రతిమాలు కొనెను. అంతలో నూకాలమ్మ వచ్చి, "నాయనా! యీ పడుచునకు నెల మసలి నది. ఇది మూఁగది, చెవిటిది. ఇదెందులకు మనకు? ఏది పెట్టినను దినదు. ఇంత వమనము చేసికొన్నది. కంటికి నేలకు నొక్క ధారగా నేడ్చుచునే యున్నది. ఎక్కడదొర కినదో యక్కడికి గొంపోయి విడిచిరమ్ము" అని పలికెను. వీరాసామి, దానివైపు దృష్టితో దహించునట్లు చూచి

మాటలాడక యక్కడినుండి లేచి పొమ్మని గద్దించి పలికి గది వెలుపలికిఁ దాళము వైచి తన పనిమీఁదఁ బోయెను.

చిత్ర, రెండుజాములు తిరుగు వఱకు నట్లు గూర్చుండి విరామము లేకుండ రోదనము సేయుచు నడుమ నడుమఁ జేతులు జోడించి రక్షింపు మని సర్వేశ్వరుని వేఁడుకొనుచుండెను. తలుపు తెఱచి వీరాసామి మంచి మంచి పండ్లు నెళనీరు బొండములు తెచ్చి చిత్ర కిచ్చి పరిపరి విధముల సంజ్ఞలు చేసి యామె నోదార్చెను; ఆ రాత్రి చిత్రను బెండ్లి చేసికొనఁ దగిన యేర్పాటులు చేసికొని వచ్చెను; గుమ్మము లకుఁ బచ్చని తోరణములు కట్టెను; చిత్రకు మంచి కోక కొని తెచ్చెను. ఆ సంరంభ మంతయుఁ జూచియు, వాఁడు తన పరిజనులతోఁ జేయు సంభాషణము వినియు వాని ప్రయత్నమును జిత్ర గుర్తించెను. తుమ్మికపండ్లు, వెలగపండ్లు నరటి పండ్లును దిని, యెళనీరు త్రావి సర్వము నీశ్వరాధీనమని నిశ్చయించి సాయంత్రము వఱకు నట్టు లా గదిలోఁ జిత్ర పండుకొనెను.

సాయంత్ర మయ్యెను వీరాసామి కొల్లగాఁ గల్లు త్రావి తోడి దొంగలకుఁ గల్లు పోయించి విందుఁబెట్టి తగిన యుత్తరువులొసంగి దోపిడి కా తెరువాటు గాండ్ర నంపెను; తా నెంతో వింతగ నలంకరించుకొని భుజించి, మరలఁ గొన్ని పండ్లు దెచ్చి చిత్ర కిచ్చి తినువఱకు నక్కడ నుండి, పరవశుఁడయి యుండుటచేఁ దన యైశ్వర్యము నాయుధములును, రత్నములు సువర్ణమును నింతింతని యెన్నిఁ చెప్పి యా సుందరి కౌఁగిలిం గోరి యుబలాట పడఁజొచ్చెను;

పాటలు పద్యాలతో ని ల్లెగురఁ గొట్టుచుండెను. వాఁడు త్రాగి యొడలు మఱచి యుండుట తన కొక విధముగ మేలే యని చిత్ర యూహించి ధైర్యము వహించి రానున్న యాపత్తు నెదురుకొన సన్నద్ధ యయి యుండెను. వాని కించు కంత నిషా తగ్గినంతనే చావడిలోని కేగి సారాయము వీక బంటిగాఁ ద్రావి మరల వాఁడు చిత్రయున్న గదిం జేరెను. అప్పటికి రాత్రి పది పదునొకండు గడియ లయి యుండును. ఎఱ్ఱగాఁ గాఁగిన యావుపాలు తెచ్చి నూకాలమ్మ చిత్ర కొసంగి వెలుపలి కేగెను. చిత్ర యా పాలు త్రావెను. వీరా సామి యామె పాద సన్నిధిని గూరుచుండి, "పిల్లా! నేను మంచి వాఁడను గానా? చక్కని వాఁడను గానా? పడుచు వాఁడను గానా? పేదనా? చూడు, నా యిల్లు, నా వాకిలి, అదిగో, ఆ పెట్టె నిండ నగ లున్నవి. పో, వెళ్లి నీ కిష్ట మయి నవి తెచ్చుకొని పెట్టుకో, ఈ కోక కట్టుకో. నీ సింగారము నెవరు కాదనఁ గలరు? లే, నా మాట వినుము. నా వంటి దొడ్డవాఁడు నీకు మఱి దొరకఁడు. వీరాసామి యన్న వీరాధి వీరులకు గడగడలే. నా మాటవిను. పెండ్లికూఁతు రీలా గుననా యుండుట? చిలుక, గోరింక, పావురా, నెమలి, హంసలాగునఁ గదా యుండవలయును, లెమ్ము" అని వాఁ డా యంతర్వాణి యడుగుదోయి పట్టుకొని బ్రతిమాలెను. చిత్ర లేచి, వానికి మ్రొక్కి, తన యవస్థను నిరూపించి తన్ను విడిచి పెట్టు మని సన్నలతో వేఁడెను. "పరవా లేదు. మా కిట్టి కులము తప్పులు లేవు. నీకుఁ బుట్టఁగల బిడ్డను, నా బిడ్డని సాకెదనులే. న న్నీ ప్రొద్దు గాదనకు. రేపటి నుండియు నేను

నీకు గులా మనముకో" అని వీరాసామి సమాధాన పలుప నామె వలవల నేడువసాగెను. "అదిగో యదే పిశాచ గుణము. నా కసహ్యము. చూడు ఈ నగ లన్నియు నీ వే" అని వీరాసామి గదిలోని చిన్న పెట్టె తెఱచి, కడియాలు, హారములు, ఉంగరములు, పోగులు, కంటెలు, కాసుల దండలు, వడ్డాణములు గట్టిన యొక పెద్ద మూట తెచ్చి చిత్ర యొడిలో వేసి, 'ఇవిగో యి వన్నియు నీవే. నీవే మా కందఱకు నేలిక సానివి' అని పకపక నవ్వెను. చిత్ర యా నగల దెసనైనఁ దేఱి చూడక యవి క్రిందఁ బాఱవైచి తన్ను విడిచి పుచ్చు మనియు న వన్నియుఁ దనకు వల దనియుఁ దనకుఁ బెండ్లి యయ్యె ననియు సంజ్ఞచేసి వీరాసామిని వేఁడు కొనెను. 'ఇదిగో! పిల్లా! నీ వీలాటి టక్కులు చేసితివేని నేను మంచివాఁడను గాను! జుమీ!' అనియు నింక ననేక రీతులఁ జిత్రను బెదరించెను. చిత్ర బోరన నేడువ సాగెను. మరల వీరాసామి కనికారపడి చిత్ర నెంతో నోదార్చెను. ఎప్పటికి నామె సుముఖురాలు గాదయ్యెను. వాఁడు విసివి వేసారి యంత కంత కాగ్రహావేశ పరవశుఁ డయి, యామెను బలాత్కరింపఁ గృత నిశ్చయుఁ డయ్యెను. లేచి నిలువఁబడి వాఁ డా విరిబోఁణి పాణిం బట్టుకొనఁ బోయెను. చిత్ర తప్పించుకొని మంచ మవ్వలిప్రక్కకు దిగిపోయెను. వాఁ డా మంచమును లాగి దూరముగాఁ బడవైచి చిత్రను సమీ పించెను. ఇంతలో 'నయ్యో చచ్చిపోతిని. దొంగలు దొంగలు, దోపిడిగాండ్రు. రక్షింపుఁడు. రక్షింపుఁ' డని వీధితలుపు తట్టుచు నెవ్వరో పిలుచుచున్నట్లు విన వచ్చెను.

వీరాసామి విసువుకొనుచుఁ దటాలున నట్టింటికి వచ్చి గది గొళ్ళెము పెట్టి వీధి తలుపు తెఱచెను.

నడివయసు దాఁటిన యొక రాజపురుషుఁ డా నట్టింట నడుగిడెను;వగర్చుచు నతఁడు నేలఁ గూలఁబడెను. వీరాసామి యా పురుష పుంగవుం జూచి యచ్చెరువొంది, 'సామీ! తమ దేయూరు? తమకు వచ్చిన యాపద యేమి?' అని యడిగెను. చిత్ర తలుపు సందులలోనుండి యాగంతుకునిం జూచి సర్వేశ్వరుఁడే యా రూపునఁ దన్నుఁ గాపాడ నరుగుదెంచె నని యెంచి యెంతో సంతోషించి, కేలుదోయి యుత్తమాంగమునఁ గీలించి యా రక్షకుని మనసార ధ్యానించి యతని కరుణా నిలయతకు, దీన బాంధవతకును వేవిధములఁ గొండాడ సాగెను; కాని, హంతకుల యింటి కిట్టు లవేళ నేతెంచిన యా మహానుభావున కేమి హాని వాటిల్లునో యని ప్రాకృత బుద్ధి నవలంబించి విచారింపసాగెను.

వీరాసామిగాబరాకు మితిలేదు. వగర్చుచున్న యాగంతుకుఁ డించుక డెందము పదిలపఱుచుకొని, "నాయఁడా! నన్నీ రాత్రి నీవు కాపాడవలెను. పని గలిగి నేను బెంగళూరు వెళ్ళి వచ్చుచుండఁగాఁ ద్రోవలో దోపిడి గాండ్రు మమ్ము ముట్టడించిరి. నా నౌకరు లేమయిరో తెలియదు. నే నేరీతిని దప్పించుకొని యిటు వచ్చితినో యెఱుంగను. ఈశ్వరుఁడే నీ శరణము శరణముగాఁ జూపించెను. నీ కెంత ధనము గావలసినను గైకొనుము. నా ప్రాణమును గాపాడి యీ రాత్రి తల దాఁచి కొన నింత చోటొసంగి పుణ్యము గట్టుకొమ్ము" అని యాగంతుకుఁడు స్ఖలిత వచనముల

వీరాసామిని వేఁడెను. తన పరివారము చేతనే తన యతిథి కిట్టి గతి పట్టినదని యెఱింగియు వాఁ డెఱుంగనట్లు నటించి, 'సామీ! మీకు వచ్చిన భయ మేమియు లేదు. ఈ యిల్లు తమదిగానే భావించి యీ రాత్రి యిట విశ్రమింపుఁడు,' అని పలుకుచు, 'అమ్మా! ఇటు రమ్మ' అనిపిలువ నూకాలమ్మ లేచి వచ్చెను. 'చూడు. ఆ గదిలో నీ యమీరు పండుకొందురు. హుషారుగా సుబ్బరపఱుచుము' అని తల్లితోఁ జెప్పి, 'సామీ! మనము రవంతసేపు వీధి గడపలో నిలుచుందము రండు' అని వీరాసామి యమీరుని హస్తము పట్టుకొని లేవనెత్తి వీధి గడపలోనికిఁ దోడుకొని పోయెను. అంతలో నూకాలమ్మ గదికేగి చిత్ర చేయిపట్టుకొని నట్టింటికిఁ దెచ్చి వెనుక యింటిలోనికిఁ దోడుకొని పోయి, 'నాయనా! రావచ్చును' అని చెప్పెను. వీరాసామి యా పురుషుని గదిలోనికిఁ దోడ్కొని పోయి బల్లమంచము మీఁదఁ బీచు పఱుపు వేసి తలగడలు పెట్టి హాయిగా, నిర్భయముగాఁ బరుండుఁడని చెప్పి చావడిలోనికి వచ్చునంతలో ఢామ్మఢామ్మని వరుసగా నైదాఱు గుండ్ల బారు చప్పుడు వినవచ్చెను. ఏదో కొంప మునిఁగిన దనుకొని, కత్తులు, పిస్తోళ్లు పట్టుకొని, వీరాసామి "అమ్మా! జాగ్రత్త! ఇప్పుడే వచ్చెదను. భద్రముసుమీ! రో మఱకు" మని చెప్పెను. వాఁ డామాటలు చెప్పి వీధి వాకిలి దాఁటి వెళ్లెనో లేదో, చిత్ర యొక్క దాఁటున నూకాలమ్మమీఁదఁబడి చెంతనున్న యొకపంచెతో దానిని మంచమునకుఁ గట్టివేసి, వెనుకింటి తలుపు వెలుపలికి గొళ్ళెముపెట్టి యొక్క పరుగున గది కఱదెంచి తలుపు



రెండు పిస్తోళ్లుతీసి పురుషునిచేతికిచ్చి తానొకటి పట్టుకొని వీధిలోనికిఁ వచ్చెను. (333-పుట)

తెలిచి యప్పుడే ప్రమాఁగన్ను పెట్టుచున్న యీ నూతన పురుషుని లేపి, నోటిమీఁద లబలబ కొట్టుకొని, వీరందఱును బీకలు గోయు హంతకు లని సంజ్ఞ చేసి, యతనిచేయి పట్టుకొని చావడిలోనికిఁ దెచ్చి, యాయుధము లున్న తావుఁ జూపెను. అందు రెండు పిస్తోళ్లుతీసి పురుషుని చేతి కిచ్చి, తా నొకటి పట్టుకొనివీధిలోనికిఁ దెచ్చెను. వెనుకింటిలో నూకాలమ్మ పెట్టుచున్న గోల, వాయు వశంబున నాకాశమున విహరించుచుండెను. ఆ గంతుక పురుషుఁ డ దంతయు నద్భుత స్వప్న చరిత్ర యను కొనుచుఁ జిత్ర తీసిన దారిం బట్టి వడి వడి నడువ సాగెను. ఇట్లు లా యిరువురు నొక్కగడియ పయనము చేసిరో లేదో, మరల ధామ్మనుశబ్దము రెండు మూడుసారులు వినిపించెను. కాగడాలు రా దారిని వారి కంటి కగుపించెను. కాగడాల వెలుఁగునఁ దమదెసకు వాయువేగమునఁ బరుగెత్తుకొని వచ్చుచున్న యొక వ్యక్తిని జూపించి చిత్ర, యాపురుషుని పిస్తోళ్లు పేల్చుఁ డని సంజ్ఞ చేసెను. ఆ యమీరు సరుదుకొను సరికి నెదుటవచ్చు వ్యక్తి స్పష్టముగా వెన్నెల వెలుఁగు లో నగుపించెను. వెనుకనుండి వచ్చు తుపాకి ధ్వనులకు బదులుగా నా యమీరు గుఱిచూచి గుండ్లబా రా వ్యక్తిపైని బ్రయోగించెను. చచ్చితినోయి యనుచు నా వ్యక్తి(వీరాసామి) నేలఁ బడెను. అంతలో రాదారి నుండి రాజ పురుషులు కాగడాలతో నచ్చోటికి వచ్చిరి. మన యమీరును జిత్ర చరిత్రయగు మన కథానాయకురాలును నచ్చోఁ జేరిరి. పడినవాఁడు కోడెగాఁడు, దొంగల మొనగాఁడు, వీరాసామి యని చూచి చిత్ర

కెవ్వునఁ గేక వైచెను. రక్షక భటులు నా యమీరును నన్యోన్య పరిచయము చేసికొని రాచబాట కరుదెంచిరి.

మీరా యాగుఱ్ఱపుబండిలో వచ్చినవారని రక్షకభటాధికారి యమీరు నడుగ, నౌను, నాపరిజనులగతి యేమయ్యెనని యమీరుఁ డడిగెను. "మీ నౌకరు లొక్కరును జావలేదు. నలుపురు దొంగలును వారిని జుట్టు ముట్టినంతలో మే మరుదెంచి దొంగలం బడఁ గొట్టితిమి. మీ నౌకరున కొకనికి గట్టి దెబ్బ తగిలినది. వానికి మేము చికిత్స చేయు చున్నంతలో వే ఱొక దొంగవచ్చి మాపైఁ బిస్తోలు పేల్చెను. మే మెల్లరమును వానిం బట్టుకొనఁబోవ దొరకక యా నరాధముఁడు పాఱిపోయెను. వానినే కాఁబోలు త్రోవలో మీరు పడఁ గొట్టితిరి!" అని రక్షక భటాధికారి యన, "ఔను. వాడేఁ యీ తెక్కలి కాండ్ర కేలిక. మీ కిక్కడ దొంగ లున్న యాచోకీ యెట్లు తెలిసెను?" అని యమీరు ప్రశ్నించెను. నేఁటి యుదయ మిరువురు బైరాగులు మాఠాణా కరుదెంచి వీరి యాచోకీ యంతయు మాకుఁ దెలియఁజేసిరి. దొంగల మట్టి కడ రాత్రి వారు దోపిడి చేయుచుందురనియు, సమీపమున నేకూఁత వేటుదూరమున దుర్గమారణ్య మధ్యమున వారి నెలవు లున్నవనియు, వానికిఁ గల యిఱుకు త్రోవ యిట్టిదనియుఁ జెప్పిరి. మేమును బాటసారులవలె వేషములు వేసికొని బండ్లెక్కి సాయంత్రముననే యీ ప్రాంతముల కరుదెంచి దాఁగియుంటిమి. మీ బండి యరుదెంచుటయు నా ముచ్చులు మి మ్మాక్రమించుటయు దవ్వులం గాంచి పరుగెత్తి మే మందఱమును వచ్చితిమి. మీరు గాన రాకైతిరి.

మీ సేవకులలో నొకఁడు స్మృతి తప్పి పడియుండెను. రెండవ వానికిని బలమైన దెబ్బలు తగిలినవి; కాని యతఁడు స్మృతి తప్పి పడిపోలేదు. మఱి మిగిలిన యిరువురును నలువురు హంతకులతో భరంపడి పోరాడుచుండిరి. మే మత్తి వేగముగా వచ్చి యడ్డపడి యీ నరాధములపైఁ బిస్తోళ్లు గాల్చితిమి; కాగడాలు వేయించితిమి. మేము మీ సేవకుల కుపచరించుచుండ చోరనాయకుఁడు వచ్చుటయు, భయపడి పలాయన మగుటయు, మీ చేతిలోఁ బడి చచ్చుటయు నైనది" అని రాజభటులు పలికిరి. అప్పటికి వీరాసామి శవమును మోచికొని రక్షక భటు లరుదెంచిరి. దొంగలైదుగురును జచ్చిపోయిరి. అమీరు చిత్రను దనబండిలోఁ గూర్చుండఁబెట్టుకొని రక్షకభటుల బండిలోఁ దన యిరువురి సేవకుల నుంపించి, రక్షకభట పరివృతుఁడై బయలుదేఱి యక్కడికి నాలుగుమైళ్ల దూరములోనున్న యొకపల్లెం జేరి, రక్షక భటులకుఁ బారితోషిక మిచ్చి పంపివేసెను. ఆ పల్లెలో నా యమీరున కొక బంధు వుండుటచే నతని యింట నా రాత్రి యతఁడును బరిజనులును వేఁగించిరి. రక్షక భటులు ముప్పది మందియు విచ్చుకత్తులు పట్టుకొని దొంగల గూడెముల కరిగి మిగిలిన వారిం బట్టుకొని యమదండములు వైచి, వారి సొత్తంతయుఁ గొల్లపెట్టి తెల్లవాఱు నప్పటికి బెంగుళూరు ఠాణాకుఁ గొంపోయిరి.

మఱునాఁటి యుదయమున నయ్యమీరుఁడు చిత్రను బిలిచి, తనకుఁ బ్రాణదాన మొసంగినందుల కామె నెంతయుం గొనియాడి, నీ వెక్కడి కేగు చుంటి వని యడిగెను. ఆ

యమీరు బెంఘూగరునుండి మైసూరున కరుగుచున్నాఁడని, యతఁడు వీరాసామితోడను, రక్షక భటాధికారి తోడను గావించిన ప్రసంగము మూలమున నెఱింగియున్న దగుటచే, చిత్ర,మీరెక్కడి కేగుచున్నారనిసంజ్ఞామూలమునఁ బృచ్ఛ చేసెను.అమీ రామూఁగకుఁ జెవుడులే దని గుర్తించి సంతో షించి, 'నేను మహీశూర వాస్తవ్యుఁడను. మా నగరము నకే పోవుచున్నాఁడను' అని పలికెను. నేను నా నగరము నకే వచ్చుచున్నాను. నన్నెట్టులయినఁ దమతోఁ దోడ్కొని పొండని చిత్ర సన్నలతో నతనిం బ్రతిమాలెను. మా నగ రమున నీ కెవ రున్నారు? నీ భర్త యెక్కడ నున్నాఁడు? యని యమీరు ప్రశ్నింపఁ జిత్ర తల వాంచి కనుల నీరు నించెను. 'ఏమీ పలుగాకియై యతఁడు నిన్ను పేక్షించి తిరుగుచున్నాఁడా? వాని పేరు చెప్పుము. నేను వానికిఁ దగిన బుద్ధి చెప్పి నిన్నుఁ జేపట్టునట్లు చేసెదను' అని యమీరన, 'ముక్కుపై వ్రేలుంచి, యట్లు తన ప్రాణనాథుని దూషింప వల దనియుఁ దన నుదుటి వ్రాఁతను సూచించుచు,నా యదృష్ట మిట్టిదనియు నెఱింగించి చిత్ర వల వల నేడ్చెను. పాప మా యమీరున కాఁడు పిల్లలు లేరు. ఆ మూఁగ బాలిక యం దాతనికిఁ బుత్రీవాత్సల్య ముదయించెను. "తల్లీ! నీ భర్త పై రెఱిఁగించితివేని నిన్నాతని కడఁ జేర్చి మీకుఁ గావలసిన సాయము చేసెదను. నా యుసురులు నిలిపిన నీ విషయ మున నే నెంత శ్రమమైనఁ బడి యెట్టి యుపకార మయినఁ జేయుట నా విధి గాదా? దుఃఖింపకు మమ్మా! నీ పతి యు దంత మెఱిఁగింపుము. నేను దగిన యేర్పాటు చేసెదను" అని

చిత్ర నతఁ డోదార్ప నెట్టకేల కూరడిలి యామె తన పతిపే రచ్చట నేలపై "శ్యామసుందరమూర్తి" అని లిఖించెను. "ఏమీ! మా శ్యామసుందరుఁడా నీ భర్త?" అని పలికి యా యమీ రించుక జంకి యాలోచించి, "తల్లీ! మీ దే యూరు? ఎట్లు లో శ్యామసుందరునకును, నీకును సంబంధము కుదిరెను?" అని యామె నడిగెను. చేత నయినంత వఱకు సంజ్ఞలతోఁ దన యుదంతమును, శ్యామసుందరునితోఁ దనకుఁ గలిగిన ప్రణయ సంబంధమును, నతని తండ్రివచ్చి యతనిం దోడ్కొని పోవుటయుఁ దా నంతర్వత్ని యగుటయుఁ దన యవ్వ మృతియుఁ దాను బడిన బన్నములును జక్కగా వివరించి చిత్ర యతని కెఱిఁగించెను. ఆ యమీరుఁడు విభ్రాంతుఁడై ప్రాన్పడి యొక్కగడియ మాటాడక యట్టె కూర్చుండెను. అతని నేత్రము లశ్రుపూరితము లయ్యెను. పాపము! మహాపురుషుల హృదయములు దీన జన చరిత్ర శ్రవణంబునఁ గరఁగిపోవును గదా! కర్తవ్య మేమి యా యెఱుఁగక కొంత తడ వట్టి యనిర్వాచ్యస్థితి నుండి యాలోచించి హృదయము పదిలపఱుచుకొని కంఠస్వరము తిన్నపఱుచు కొని యతఁడు ప్రసంగింప నారంభించెను. సునిశిత ప్రతిభాశాలిని చిత్ర యతని వదనమ్మునఁ బ్రతిఫలించు హృదయచ్ఛాయలను గుఱించి యాలోచింపసాగెను. శ్యామసుందరమూర్తికి న మ్మహాపురుషునకు నే దేని బలమగు రక్త సంబంధ ముండ యుండు నని చిత్ర విశ్వసించెను. "తల్లీ! శ్యామసుందరమూర్తిని నే నెఱుంగుదును. అతఁడు నాకుఁ గావలసినవాఁడే. అతఁ డిట్లు నిన్ను వరించి మోసగించు

నను‌కో నేరను. ఆ పేరు పెట్టుకొని యొండొకఁ డిట్టి పని గావించి యుండును. ఐనను నీకు వచ్చిన భయ మేమియును లేదు. నీవు నా బిడ్డవు; నా ప్రాణదాత్రివి; నెలతప్పి యున్న దానవు. అతండును దండ్రిచాటు బిడ్డం డని చెప్పుచున్నావు. నీ విట్టి స్థితిలో నచ్చటికి వచ్చినచో నతని తండ్రి మున్నగు వా రెట్లు తలంతురో యోచించు కొమ్ము. అతఁ డెవఁడో నేఁ గనుగొని, నీ యుదంత మెఱిఁగించి వారి పెద్దలతో సంప్రతించి నీకుఁ దెలియఁ జేసెదను. నీవు ప్రసవించు నంతకు నీ యూర నీ నా బంధు గృహంబున నుండుము. నీకుఁ గావల సిన యేర్పాటు లన్నియు నేఁ జేసెదను; నీ క్షేమమును తఱచుగాఁ దెలిసికొను చుందును. నేను నీకుఁ బితృ సమానుఁ డను. నా మాట పాటించి నీ విక్కడ నుండుట కంగీకరింపుము. నీకు మే లగును'' అని యమీరు బోధింపఁ జిత్ర యాలోచించి యది యుక్తముగా నున్నదని యెంచి యంగీకరించెను. ''తల్లీ! నా ప్రాణరక్షకురాలవు గావున నీకు నే నొక యుపాయన మొసంగెదను. ఈ దీనారముల సంచి గైకొని ప్రాణ ధనముగా నీ దగ్గఱ నుంచుకొనుము. నెల నెలకు నీకుఁ గావల సిన వాని కన్నిటికిని నే నీ గృహపతికిఁ గొంత ధన మిచ్చెదను; ఊరి కేగి మరలఁ గొంత కొంత పంపుచుండెదను. నీ కేమియు భయము లేదు. నీ సంరక్షణ భారము నాది. నీ వలజడి నొందక ప్రసవించు నంత కిచ్చటనే యుండుము'' అని యా యమీరు చిత్ర నోదార్చి యాసరా యిచ్చి యొడంబఱిచి, యచ్చటి తన బంధువునకుఁ గొంత ధన

మొసంగి యతనికిని నతని సతికిని సతీమణియగు చిత్ర నొప్ప చెప్పి వీడుకొని మైసూరు నగరమున కరిగెను.

## 12

### రఘురామరాజు

శ్యామసుందరుఁడు, మైసూరు చేరినది మొదలు చిత్రా శోక విహ్వల చిత్తుఁడై చిక్కి మాసి యుండెను; ఎవరితోడను మాటలాడఁడు; ఏ పనియుఁ జేయఁడు; పిలిచిన బలుకఁడు; పలికియు నడిగినదానికి బదులు చెప్పఁడు. చెప్పినను సందర్భపడి యుండదు. అతని కాహారము రుచింపదు; నిదుర కన్నుల చెంతఁ జేరదు. దినదినమున కయ్యువకుఁడు త్సాహ రహితుఁడై నీరసించుచుఁ జిక్కి శల్యమగుచుండెను; సంతత చిత్రాదేవీ ధ్యాన నిమగ్నుఁడై యొంటరిగాఁ దన గదిని మంచముపట్టి యుండెను. ఇదంతయు గమనించి గోపాలరాజు దిగులొంది సుతు చెంతఁ జేరి, బుజ్జగించి, యతఁ డట్లుండుటకుఁ గతంబేమని యెన్నోసారులు ప్రశ్నించెను. తండ్రి స్వభావ మెఱింగినవాఁ డగుటచే శ్యామసుందరుఁడు చిత్రా ప్రణయమును గూర్చి రవంతయయిన నతని యెదురఁ బ్రసంగింప నేరకయు నిచ్ఛారతిం బ్రవర్తింపఁ జాలకయు విచార పిశాచావేశుండై మౌనము వహించి యుండెను. దానం గలిగిన తజ్జనకుని వంత కంతము లేదయ్యె. ఒక్కఁడాని యొక్క కొడుకు; సద్గుణనిధి; విద్యా విశారదుఁడు, పితృభక్తి తత్పరుఁడు, సుందరుఁడు, బాలుఁడు, ప్రాణాధికుఁడు నయిన ప్రియసుతం జాం కూర మట్టు లెడ తెగని

మనోవ్యాధికిం జిక్కి క్రుగ్గుచున్నచోఁ దన యానంద మూల కందమని యా తనయుని నమ్ముకొని యున్న జనకుని మన స్సెట్లు లుండునో చెప్పవలయునా?

గోపాలరాజు కొన్ని నాళ్లాలోచించి యాలోచించి యనంతాచార్యులు వారిని రప్పించి యతనితో సంప్రతించి శ్యామసుందరుఁ డిలు సేరిన నాల్గు నెలలకు బయలుదేఱి తగిన పరివారముతో ధర్మవరమున కరిగెను. తత్ప్రాంతా టావిక నివాసంబుల కేగి తన కుమారుని ప్రవర్తనమును గూర్చి తెలిసికొని, చిత్రా కుటీరమున కరిగి యతఁ డచ్చటి ముదిబోయచేఁ జిత్రా వృత్తాంతమును దెలిసికొనెను; చిత్ర మగనిని వెదక బయలు వెడలుటచేఁ జేయునది లేక మిగిడి బెంగళూరున కరుదెంచి, భట్టును జూడ శ్యామలా మందిర మునకుఁ బోయెను. భట్టూర లేఁడనియుఁ గార్యాంతరా సక్తుఁడై యతఁడు వనపర్తి వెళ్ళి యున్నాఁడనియుఁ బది పదునేను దినములలో మరలి వచ్చుననియు శ్యామల దెలుప, గోపాలరాజాలోచించి, భట్టు బెంగళూరునకు వచ్చిన వెంటనే మైసూరునకుఁ బంపుమని చెప్పి సాయంత్ర మక్కడినుండి బయలుదేఱి వచ్చుచుఁ ద్రోవలో మూర్ఛ వచ్చి పడిన తన సేవకున కుపచారము చేయించి చీఁకటి పడినను లక్ష్యము సేయక పయనముచేసి దారిలో దోపిడి దొంగల చేతులలోఁ బడెను. క్రిందటి ప్రకరణము చదివిన మా పాఠకుల కా యమీరీ గోపాలరాజే యని తెలియక పోదు. శ్యామసుందరుఁడు తన, భర్త యని చిత్ర వ్రాసినప్పుఁ డతఁ డొందిన తకపిక మా చదువరులు గమినించి యుండక

పోరు. అమీరు బిడ్డఁడయిన తన కుమారుఁడు విద్యా సుందరుఁడు, రసికుఁ డయిన తన యొక పుత్త్రిఁడు, జాతి మతము లెఱుంగరాని యీ మూఁగ బాలికను, బేద నవద పడచును బెండ్లాడి కాపురము చేయవలసి వచ్చెఁగదా యని యతఁ డెంతో విచారించెను. రాజ గృహంబునఁ దనకుఁ గల బాంధవ గౌరవాదులకును, లోకమునఁ దనకును, దన వంశ మునకును,దన తనయునకును గల గౌరవాతి శయములకును, తన యైశ్వర్య విభవములకును దన తలంపులకు నది యొక పెద్ద యాఘాత మని యతఁ డెంచెను. అట్టి యనాథ బాలిక తన కోడ లయినచో రాజ బంధువులలోఁ దల యెత్తుకొని యెట్లు దిరుగ నేర్తు నని యాతఁ డెంతో చింతించెను; కాని, యమాయిక బాలగు చిత్రను ద్రోహము సేయరాదనియు నతఁడు తలంపక పోలేదు.ఎందరో యమీరులు నుమ్రావులు తన తనూజాతునకుఁ దమ తనూజాతల నొసంగెద మని చెప్ప వచ్చినను, శ్యామసుందరునకు వ్యతిరేకింప నోడిన ప్రాజ్ఞుఁ డగు గోపాలరాజు, తన కొమరుఁడు తానుగఁ బ్రేమించి వరించిన కన్యను, నంతర్వత్నియయిన యమాయిక బాలికం దెగడి యా యిరువురకును దుర్భరమగు సంతాపము నేరీతిం గూర్పఁ గల్గును? అప్పు డాతని కేమి సేయుటకును దోఁపక చిత్ర నా పల్లెలోనే యెరికి నెఱుంగ రాకుండ నుంచి తగిన యేర్పాటులు చేసి మైసూరునకు వచ్చియుండెను; కాని, యా యుదంతము తన కుమారున కెఱిఁగింపఁ జాలఁడయ్యెను; ఎవరి చెవిని బడిన నేమి యపకీర్తి వచ్చునో యని యా సంగతి ననంతాచార్యునకు నెఱిఁగింపఁ డాయె.

తన తండ్రి తన దుఃస్థితి నూహించి చిత్రను దోడ్కొని వచ్చుటకు ధర్మవరమునకుఁ జనియె నని గురువుగారి వలనఁ దెలిసికొని శ్యామసుందరుఁ డా దినములలోఁ గొంత వింతగ మూతెను; గాని, నిజ జనకుఁ డొంటరిగా నరుగుదెంచుట గాంచి మరలఁ జింతలలోఁ బడ చివుకు చుండెను. గోపాల రాజును దా నరిగి వచ్చునంతలోఁ గుమారుఁ డించుక తేఱె నని గుఱుతించి యతఁడు చిత్రార్పిత చిత్తుఁడై యుండెనని బాగుగఁ దెలిసికొనియుఁ గులమర్యాదలకు నోడి యేమి చేయుటకును దోఁపక విచారింప సాగెను.

ఒకనాఁడు గోపాల రా జొంటరిగాఁ గూర్చుండి కొమ రుని గూర్చియే చింతించుచుండ ద్వారపాలకుఁ డరుదెంచి ద్వారమువద్ద నెవరో యొక యమీరు వచ్చియున్నారని విన్నవించెను. దిగ్గనలేచి గోపాలరాజు తగిన యుడుపులను ధరించి తన కచ్చేరి చావడిలోనికి వచ్చెను. అప్పటి కచ్చ టికి వచ్చి యుచితాసనంబునం గూర్చుండి యుండిన యా గంతుక మహాపురుషుం డతనిం గాంచి లేచి చేతులు జోడించి, "రాజాజీ! క్షేమమే కదా! నమస్కారములు" అని పలికెను. "ఓహో! నా పరమ మిత్రులు రఘురామ రాజుగారా! వందనములు, వందనములు, దయసేయింపుఁడు. నేఁడు సుదినము బహుకాలమునకుఁ దమ దర్శన భాగ్యము లభించెను. తలవని తలంపుగాఁ దమవంటి సుహృద్వతంసుల సందర్శనము శుభసూచకము" అని పలుకుచు గోపాల రా జాతనిం గౌఁగిలించుకొని తన ప్రక్కం గూరుచుండఁ బెట్టు కొనెను.

వా రిరువురును సవయస్కులు. అందు రఘురామ రాజు చాల పొడవరి. నెరసిన గేరాయును, గడ్డమును మీసములు నతఁడు వృద్ధని సూచించుచున్నను, నతని దృఢకాయమా సూచన కడ్డుగట్లు వేయుచుండెను. ఎఱ్ఱని దేహచ్ఛాయ, యాజానులంబి బాహుకాండ ద్వయము, విశాలోరస్సు, లోహిత రేఖాంచితములగు పెద్ద కనులు, విశాలమగు ఫాలపట్టము నున్నతమగు నాసికయు నతఁడు వీర పురుషుఁడని చెప్పక చెప్పుచుండెను. అతఁడు హైదరాబాదున నైజామువారి సర్వసేనా నాయకుఁడుగా నుండి ప్రస్తుతముపకార వేతనమొంది స్వదేశమగు కర్ణాటమున కనతి కాలముననే వచ్చి యుండెను. ఆ రాజు లిరువురికిని జిఱుత తనము నుండియుఁ దగినంత పరిచయముగలదు. తొలుదొల్త మైసూరున హైదరాలికడ నుభయులును సేనానులుగా నుండి, యనంతరము టిప్పుసుల్తానుతో విరోధించి, గోపాల రా జాంగ్లేయుల పక్షమును, రఘురామరాజు నైజాము వారి పక్షము నవలంబించి, టిప్పు ముప్పునకుం గారకు లయిరి. రఘురామరాజును జాల ధన మార్జించెను; నైజాము వారి వలన మంచి జాగీరును బహుమతిగాఁ గైకొనెను; క్రొత్తగా నాతనికి భార్యా వియోగము గలుగుటచే నుద్యోగము చాలించి వైరాగ్య వృత్తి నవలంబించి స్వసంపాదిత ద్రవ్యముతో స్వగ్రామమున కేతెంచి, పూర్వపు భూములు స్వాధీనపఱుచుకొని, వాని సమీపమునఁ గ్రొత్తగా నొక గ్రామము గొని కావేర్యుత్తరవాహినీ తీరమున నొక చక్కని మేడ గట్టించి యటఁ దన యేక పుత్త్రికతో నివ

షించు చున్నవాఁడు, గోపాలరాజు కుమారునకుఁ దన పుత్త్రిక నీయఁ దలంచి ప్రస్తుత మా విషయమున మాటలాడుటకై వచ్చియుండెను. మీ రాక శుభసూచకమని గోపాలరా జని నంతనే యా మాట నందుకొని రఘురామరాజు, "బావ గారు ప్రాజ్ఞ శిరోమణులు" అని ముక్తసరుగా జవాబిచ్చి కొంత దనుక లోకాభి రామాయణముగాఁ బ్రసంగించి, పిదప, రాజ్యతంత్రములను గూర్చియు, నాంగ్లేయుల యదృష్ట దశను గూర్చియు, దివాను పూర్ణయ్య పంతులుగారి యేలు బడిని గూర్చియుఁ గొంత కొంత ముచ్చటించి, తుదకుఁ దా వచ్చిన కార్య ప్రసంగమునకు దింపి మెల్లగా, మా యమ్మాయిని దమ కోడలిఁగాఁ జేయఁ దలఁచి యిపు డిట్లు తమ దర్శనమునకు వచ్చితి నని పలికెను.

గోపాలరాజున కేమనుటకును దోఁచదయ్యె. కొంత తడ వాలోచించి యతఁడు, "మిత్రమా! మీ తలపెట్టిన శుభకార్యము జరిగెనేని నే నెంతయుఁ గృతార్థుఁడ నగు దును. దీనికి మా శ్యామసుందరుని యంగీకారము ముఖ్యము గదా! తొలుదొల్త వధూవరు లొండొరులం జూచుకొని యిష్టపడినచో మన మీకార్యమునకుం గడంగుదము. మంచి ముహూర్తము చూచికొని యమ్మాయిని దోడుకొని నే నుత్తర వాహినికి వచ్చెదను. మీ యుద్దేశ మేమి?" అని యడుగ, "సిరి రా మోకాలొడ్డు వా రెందైనం గలరా? తప్పక దయచేయింప వేఁడెదను. తమ చిత్తాను సారము నడచుకొనుటకు నేఁ జేతులు కట్టుకొనియున్నాను" అని రఘురామరాజు తన యంగీకారమును దెలిపెను.

నాఁటికి మూఁడవనాఁటి సాయంత్రము త్తర వాహిని కేగుట కు త్తమ ముహూర్త మని నిశ్చయించి, రఘురామ రాజు మిత్రునికడ సెలవొంది యుత్తర వాహిని కరిగెను. బంధుత్వము సేయఁగోరు వారు వివాహమునకు మును పొకరియింట నొకరు భుజింపని యానువాయితి నెఱింగిన వారగుట నా మిత్రులు భుజింప నుండుఁ డనుట గాని యుం డుట గాని చేయరైరి.

## 31

### పూర్ణిమా దేవి

ఉత్తర వాహినీ పరిసర భూములు నూత్నాలంకార పరిశోభితము లయి వెలయుచుండెను. సుమారు నాలుగైదె కరముల ప్రదేశమునకుఁ జుట్టు గోడలు లేచినవి ఆ నడుమ నతి సుందరము లు కుసుమ ఫల భరిత తరు లతా వితానోద్యాన పరివృతము లు రమణీయతరలీల నొక భవన రాజ మల రారు చుండెను. ఆ సౌధమున కిరుగెలంకుల, సుమారిరు వది ముప్పది యిండ్లతో రెండు రెండు వీధు లొప్పుచుండెను. విమల జల ప్రవాహినియగు కావేర్యుత్తర శాఖకుఁ గొ త్త రుచుల నీను త ద్వీపుల రమణీయ సౌధ ద్వార దేశము నుండి సోపాన పరంపర చెన్నొందుచుండెను.

సాయంత్రము నాలుగు గంటల వేళకు గోపాలరాజు గారి గుఱ్ఱపు బండి యుత్తర వాహినీ సౌధద్వార దేశంబున నిలిచెను. గోపాలరాజు తన ప్రియ తనయుని కేలు కేలం గీ లించి బండినుండి దిగెను. నూత్న మందిర ప్రాంగణ

సుందర వేది కాసనాసీనుండయి బండిరాక కెదురు సూచు చున్న రఘురామరాజు తటాలున లేచి వికసిత వదనుం డయి మెట్లు దిగి, యెదురేగుదెంచి 'వందనములు, వందన ములు, బావగారు! దయచేయుఁడు, దయచేయుఁడు' అనుచుఁ జేర వచ్చి యా యిరువురి హస్తంబులం బట్టి తోడి తెచ్చి చావడిలో నుచితాస నాసీనులఁ గావించెను. 'పత్తన వాసపుఁ జీకాకులు లేక సౌఖ్యముం గొల్లగొనుచున్నారు బావగారు' అని గోపాలరా జన 'నానాను. తాము దయ చేయించుటచే నేఁడు సుఖ సర్వస్వముఁ గొల్లగొంటిని. నా గేహము ధన్య మయ్యెను. నేఁ జరితార్థుఁడ నైతిని' అని రఘురామరాజు నవ్వుచుఁ బ్రత్యుత్తర మిచ్చెను. 'ఇదంతయు నడుగిడరాని కాననభూమి. ఏ స్థలంబున కే వేళ కే దశ పట్టునో తెలియరాదు' అని గోపాలరా జన, "చిత్తము చిత్తము. ఏ వేళ కే మనస్సున కెట్టియానందము కలుగునో యదియు నగో చర మయినదే. మేడ మీఁదికి దయచేయుఁడు" అని గోపాలరాజును, శ్యామసుందరుని నిరుకేలఁ గేలూఁది రఘు రామరాజు సౌధోపరి భాగంబున కమర్చిన మేడమెట్లెక్క సాగెను. దాసదాసీజనము 'అమ్మాయిగారికిఁ గాఁబోవు వరుఁ డీ రాజపుత్త్రుఁడే' అని యనుకొనుచు గుసగుస లాడఁ జొచ్చిరి.

మేడ మెట్లెక్కి సౌధశిరో గృహ ద్వారంబున నా మువ్వురును నిలిచిరి. గోపాలరాజును శ్యామసుందరుఁడును నంతర్భవనమునఁ జూపులు పఱగించినంతనే యత్యాశ్చర్య మగ్నమానసు లయిరి. వారి కంత యచ్చెరువు గలిగించిన

దృశ్య విశేష మేమయియుండును? ఒక రత్న కంబళిపై రెండవ వాణింబోలి వీణాపాణియై కూరుచుండి వారికి దృగ్గుచుల నీరాజనం బిచ్చిన యొక బాలికా వతంసము. అంత దనుక నుదాసీన భావమును వహించి కళా విహీన మయియున్న శ్యామసుందరుని నెమ్మోము చందమామ తటాలున నానందజ్యోత్స్న వికాసిత మయ్యెను. గోపాలరాజు స్వప్నావస్థ నున్న వానివలె నివ్వెర గొంది నిలిచియుండెను.

వారిం గాంచినంతనే పెండ్లికూఁతురు లేచి,నిలువంబడి సిగ్గుచేఁ దలవంచి నిలుకడ నొందిన మెఱుపు తీఁగవలె మెఱయు చుండెను. ఆ బాలికా వతంసము నును జెక్కు లెఱ్ఱవాఱెను. "అమ్మా! వీరికి నమస్కరింపుము" అని రఘురామరా జతిథులను లోనికిం గొంపోవ లజ్జారుణిత కపోలయగు నబ్బాల యొయ్యారముగ నడచి వచ్చి గోపాల రాజునకుఁ బాదాభివందనము చేసెను. వేగమ పెండ్లికూఁతురవు గమ్మని గోపాలరా జామెం దీవించెను. అతని హృదయాకాశమున నాశాలత లల్లు కొనియెను. రఘురామరా జా బందుగుల నుచితాసనాసీనులుగాఁ జేసి తానును గూర్చుండి, 'తల్లీ! వీ రితరులు గారు; మన కాత్మీయులు. వీణ వాయించుచు నించుక సేపు పాడుము' అని కుమారిత కాజ్ఞాపించెను. తొలుదొల్త న వ్వికసితారవింద సుందర వదన, యొక్కింత మొక్కసపడెను. మరలఁ దండ్రిచేఁ బ్రేరేపింపఁబడి తివాసిపైఁ గూరుచుండి వీణ నందుకొని శ్రుతులు సరిచేసి యించుక సేపు వాయించి తదుపరిఁ దన కోమల కల కంఠ కంఠస్వరము నెత్తి సుతిం గలిపి చక్కగా నొక కృతిం

బాడెను. అది లలిత మంజుల వల్లకీ నాదమో, కలకంఠి కంఠ నాదమో తెలిసికొనరాక మేళనమొంది, శుష్కించియున్న శ్యామసుందరుని హృదయము నిగురెత్తఁజేసెను.

అంత రఘురామరాజు 'తల్లీ! పూర్ణిమా! వీరు మన కాపు బంధువులు. వీరినిగూర్చియే మొన్నరాత్రి నీ కెఱింగించితిని. మోమోట మొందక నీ వింకం గొన్ని వర్ణములును కీర్తనములును బాడుము. కుమారా! నీ వీగానమును వినుచుండుము. నీకును వీణాగానమునఁ బాండిత్యము గల దని విన్నాను. గానము సేయుము. మీ రిరువురు నిటఁ గొంత తడ వుండుండు. నేనును నాన్నగారును దోఁటలోని కేగి యిప్పుడే వచ్చెదము' అని వధూవరులకుఁ జెప్పి గోపాలరాజుం గోడ్కొని తోఁటలోని కరిగెను.

పూర్ణిమాదేవినిఁ జూచినంతనే శ్యామసుందరుఁ డామె చక్కఁగ నలంకరించికొని వల్లకీ పాణియై కూరుచున్న చిత్రాదేవియే యనుకొనెను. ఆ రాజ బిడ్డలును దగ్గఱ లేకున్నచో నా లలనామణిం గాంచినంతన శంకాతంకములు లేక తటాలున నతఁ డామెం గౌఁగిలించుకొనువాఁడే; కాని, సమీపించి పరికించిన పిదప నది తన ప్రాణపదమగు చిత్ర కాదని యతఁడు తెలిసికొనెను. ఏకాంత సమయము. ఏ యడ్డును లేదు. పరమ లావణ్యవతి యగు వేఱొక కన్యక యెదుట నున్నది. శ్యామసుందరుఁడు తుంటరివాఁడు కాఁడు; యోగ్యుఁడు. అయినను నాతఁ డా చిన్నారి వదన మండలమును ఱెప్ప వేయక పుల్కు పుల్కునఁ జూచుచు ననిర్వచనీయమగు నానందము ననుభవించెను. అనాగరక,

మూఁగ, విద్యాగంధ మెఱుఁగ నిది, పరిష్కార రహిత, కుటీరవాసిని, పరుషవసన ధారిణియు నగు చిత్ర యేడ? నాగరక తావతార, శుకకోకిలాలాప, గాన విద్యావిశారద, మహా రజత రత్నాలంకార భూషిత, కాశేయ వసన ధారిణి, హర్మ్యాంతర్భవన వాసిని, విలాస విహారిణియు నగు పూర్ణిమ యేడ? పూర్ణిమ ధరించినట్టి వస్త్రాభరణాదుల ధరింపఁ జేసి, వీణియ చేతి కిచ్చి, చిత్ర నచ్చటఁ గూర్చుండఁ జేసినచో నెట్టు లుండునో యని శ్యామసుందరుఁడను కొను నంతలో నతని కనుఁగొలుఁకులనుండి రెండశ్రు బిందువులు జాఱెను. పూర్ణిమ తలవంచుకొని కూరుచున్న దగుట నతని యవస్థను గని పెట్టలేదు. అట్టు లా యిరువురును మంత్ర ముగ్ధు లయిన భాతిం గొన్ని నిమేషము లూరక యుండిరి. అంతలోఁ దెలివి తెచ్చుకొని యాకార గోపనము గావించుకొని శ్యామసుందరుఁడు పూర్ణిమను మరలఁ బరికించి చూచెను. పూర్ణిమ కీ యవస్థాంతరములు లేవు. నవనవోన్మేష యౌవన విలాస భాసురుండును, సుందర మూర్తియు నగు శ్యామసుందరమూర్తి యెదుట నున్నాఁడు. తనకుఁ గాఁగల వరుఁ డతఁడే యని నిశ్చిత మయినది. తన్నుం దిలకింప నయ్యామీారు బిడ్డఁడు వచ్చి యొంటరిగఁ జెంత నున్నాఁడు. తాను బాల గాని ప్రౌఢ కాదు. సిగ్గు, సంతోషము, మొగమోటము, ఇష్టము, వెఱపును బెనఁగొని యనను భూతములగు భావనల కామె మనస్సును లో పఱిచెను. వీణాతంత్రులపై నా చిలుకల కొలికి తరుణాంగుళులు విశ్రాంతి తీసికొని తా మచ్చట నున్నసంగతియే మఱచి

యున్నట్లుండెను. శ్యామసుందరుఁ డాపోవని చూడ్కులతో న య్యెల జవ్వనిం జూచుచునేయుండెను; నెమ్మోమును నిత రావయవములను జూపులతోఁ బరామర్శించుచుఁ జిత్రావయ వంబులతో సరిపోల్చుచుండెను. పూర్ణిమయు నప్పు డప్పు డించు కించుక వదన సరోజ మెత్తి దోబూచులాడు నును సిగ్గు చూపులతో నాతని పరీక్షకు సాయము చేయుచుండెను. పది నిమిషములు నిశ్శబ్ద మచ్చోట రాజ్య మేలెను. తరువాతఁ బ్రసంగ మారంభ మయ్యెను.

శ్యామసుందరుఁడు:- చిత్రా—పూర్ణిమా! ఎన్ని వర్ణ ముల నేర్చుకొంటివి!

పూర్ణిమ:— ముప్పది నాలుగు.

శ్యామ:—కృతులో

పూర్ణిమ:—నలువది యైదు.

శ్యామ:—స్వరజతులో?

పూర్ణిమ:—ఇరువది యెనిమిది.

శ్యామ:—పల్లవి పాడఁగలవా?

పూర్ణిమ:—విశేష పరిశ్రమ లేదు.

కొంతసేపు ప్రసంగించిన పిదప నతని యిచ్ఛాను సారము పూర్ణిమ మరలఁ గొంత సేపు జంత్ర గాత్రముల రాల్గరఁగించు విమల గాంధర్వ విద్యను వెలయించెను. కిన్నర గాయంబోని యపూర్వ మృదు మధుర కోమల కోకిల కల స్వరమ్ముంబోని య పూబోఁడి కంఠస్వర మంత కంతకు హెచ్చి రవద్రుల్లి పసదేఱి వాని హృదయకుహు గరఁగించి

వేసెను. సాయంకాల సమయము; నిరుపహతి స్థలము; కావేరీ తరంగ లహరీ శీతల శీకర విహార నూతనోద్యాన తరులతా సురభిళ కుసుమ సమవాయ పరిమళ పాటచ్చర సమీర కిశోర ఖేల నావసరము. శ్యామసుందరుని బోలు రాజకుమారునివంటివాని మానస మానంద సుధా తరంగ మాలికా డోలికల నూఁగులాడెనన్న నబ్బురఁ మేమి గలదు? ఆ కుమార శిఖామణి పరవశుఁ డై పోయెను. చిత్ర నించుక మఱచినను మరలఁ దెలివి తెచ్చుకొని, 'అయ్యో? చిత్రా! చిత్ర! నీకు మాటలు వచ్చునేని నీ పూర్ణిమ లాగున జిలిబిలిపలుకులు పలుకుదువు గదా! కలనినాదంబునఁ గోకిల లులుక గానము సేయుదువు గదా! నీ వేమయితివో?'అనుకొని శ్యామసుందురుఁ డుస్సురని నిట్టూర్పు పుచ్చెను. మరల నొక యశ్రుబిందుద్వయ మతని నయనద్వయమునుండి జాఱిపాలియున్న చెక్కుల పైఁ బడియెను. ఉస్సురను శబ్దము వినఁబడుటచేఁ బూర్ణిమ తటాలునఁ దల యెత్తి చూచెను. శ్యామసుందరుఁ డంతలోఁ జేతి రుమాలుతో నశ్రువులు మడుచుకొనియెను. ఇంతలో దీపము వెలిగింపఁ బరిచారికలు లోపలికి వచ్చిరి. దీపము వెలిగించు లోపున శ్యామసుందరుఁడు సరుదుకొనెను. పూర్ణిమ కేమియు బోధపడలేదు. గోపాల రఘురామరాజు లంతలో నచ్చటికి వచ్చి కూర్చుండిరి. శ్యామసుందరుని వీణ వాయించుచుఁ బాడు మని గోపాలరా జాజ్ఞాపించెను. తండ్రిమాట కాదనలేక శ్యామసుందరుఁడు సుందరి చేతివల్లకి నందుకొనెను. ఆ సందర్భమున నా సుందరీ సుందరుల హస్త పల్లవము లొండొంటిని సోకినవి. ఇరు

వురి మొడళ్లను బులకరించినవి. పూర్ణిమా సంపూర్ణ ముఖ చంద్రమండలము షోడశ కళా కలితమై యనురాగ రంజిత మయ్యెను. శ్యామసుందరుఁ డా శోభం దిలకించుచు వీణను మెలమెల్లనఁ బలికించుచు నించుకసేపు చల్లగా గానము చేసెను. అతఁడు తాను రచించిన గీతములనే పాడెను. ఆ కీర్తనల తుదిని, "శ్యామసుందరార్చితపద, శ్యామసుందరా" యను వాక్యమును విని పూర్ణిమ యతని గాన కవితా విశారదత్వమున కబ్బురపడి య ప్రయత్నముగఁ గటాక్ష మాలికల నతని ముఖమండలమునకు నీరాజన మర్పించెను. పర్యవసాన మే మనఁ బూర్ణిమకు శ్యామసుందరుని పయిని నమూల్యమగు ననురాగ మంకురించి యంతంత నాశాఫలక ముల నల్లుకొనెను. శ్యామసుందరుని హృదయమునఁ జిత్రను మఱపించు చిత్రమగు భావ ముదయించెను. అనురాగ మని దాని ననలేము గాని యనురాగోదయ కారణ మగు నింపు జనించె ననఁగలము.

"శ్యామసుందరా! తప్పుదారి నడుగుపెట్టుచుంటివి. చిత్ర నేమిసేయఁ దలంచితివి? ఇంక నియ్యవస్థ ముదుర కుండ మెలఁకువ గలిగి మెలంగుము. అగతికయగు నమ్మాఁగ బాలిక నన్యాయము సేయుట నీ వంటి యుదార శీలునకు ను త్తమరాజ పుత్త్రునకు ను త్తమము గాదు" అని యతని హృదంతరమున నొక దివ్యవాణి హెచ్చరింప సాగెను. అతనిబుద్ధి యా సుద్దుల కుద్దులగు సుద్దులను వెదక సాగెను. విధి నిర్ణీతమును దాఁటరాదు గదా!

# 14

## పూ ర్ణి మా వి వా హ ని శ్చ య ము

నాఁటి రేయి గోపాలరాజును, శ్యామసుందరుఁడును రఘురామరాజు కోర్కెపయిని నచ్చట నాతిథ్యము గైకొన నంగీకరించి నిలిచిరి. రాజు లిరువురును, పెండ్లికి ముందు సంబంధు లొండొరుల యిండ్ల భుజింపరాదను నియమమును గారణాంతరమున మీఱవలసిన వారైరి. గోపాలరాజు నుత్తల పాటొక్కింత సద్దణఁగెను. అతఁడు పూర్ణిమను జూచి నప్పుడే యాబాలిక చిత్రను మఱపించి తన తనయుని హృదయము నాకర్షింపఁ జాలు ననుకొనెను. అది పుట్టు రత్నము. ఇది సానదీరిన జాతిరత్నము. శ్యామసుందరుఁడు మైసూరునకు బయనము గాకుండుటచే మఱునాఁడును వా రచ్చటనే యుండిపోయిరి. రాజు లిద్దఱు నేదో పని గల్పించు కొని వధూవరుల నేకాంతగోష్ఠిని విడిచి, సేవకుల నేరి నట కేగకుండఁ గట్టడంజేసి పూర్ణిమా సుందరులకుఁ బ్రేమాను బంధము గలుగఁగల దని విశ్వసించి సంతోషిత స్వాంతు లయి యట నటఁ దిరుగుచుండిరి. వారి విశ్వాసము పొల్లు పోలేదు. చిత్రాకారము పూర్ణిమా మూర్తిని సర్వాంగీణ మయి నెలకొనియున్నట్లు శ్యామసుందరుం డెంచుటచే నెడ తెగక య వ్వధూమణితో నేకాంత గోష్ఠిని బ్రొద్దు పోఁజేయ నతఁ డుత్సుకుఁడై యుండెను. దానిం బోషింపఁ గావలసినంత సమయము చిక్కెను. పూర్ణిమ సంపూర్ణముగా నతనివశం వద యయిపోయెను. ఇరువురి హృదయములు నేక మయ్యెను.

సుందరుఁ డొకప్పు డన్యమనస్కుండై చిత్రాధ్యాన నిమ
గ్నుఁడయి యుండుటం జూచి పూర్ణిమ యందులకుం దగిన
కారణ మారయ నేరక యా గడియ చిక్కు పడుచుండెను.
తొలుదొల్తఁ బూర్ణిమయందు సుందరుని కించుకే ననురాగ
ముదయింప లేదు. చిత్రాకార సందర్శ నోత్కంఠయే
యేకాంతమున న య్యింతితోఁ గూడి మాడి యుండుట కతని
నంగీకరింపఁ జేసినది. కాని, రెండు మూఁడు దినముల కా
భావము వానికిఁ దెలియకుండఁ గ్రమపద్ధతిని దాఁటుమాఁటయి
యామెయే చిత్ర యనుకొని యతఁడు ప్రేమించునట్లు పరి
స్థితులు గల్పించి తెచ్చిపెట్టెను. ఆ ప్రేమాంకుర మంత
కంత కెదిగి కొనసాగి వేఱు పాఱి దెస లల్లుకొనెను. ఇంకె
క్కడి చిత్ర! మఱేటి నియమము!

గోపాలరా జెంతయు సంతసించి యింక నచ్చట
నుండుట భావ్యము గా దని యెంచి, రఘురామ రాజును
బూర్ణిమను దమయింటికి రా నాహ్వానించెను. వారు నల్వు
రును మైసూరున కేగిరి. అందును గోపాలరాజు, సేవకులకు
గట్టి కట్టడ చేసి పూర్ణిమా సుందరుల కేకాంత వాస విహా
రము గలుగఁ జేసెను. వారి ప్రణయ లత, క్రొంగ్రొత్త నన
లతోఁ గొనలు సాగి మనోనివాసముల నల్లిబిల్లిగ నల్లుకొన
సాగెను. మైసూరులోఁ బూర్ణిమయు, రఘురామరాజును
రెండుదినము లుండిరి. మూఁడవనాఁటి సాయంత్రము
ప్రయాణ మగుచు రఘురామరాజు శ్యామసుందరు నేకాంత
ముగఁ బిలిచి యిట్లు వచించెను: "కుమారా! నీవు ప్రాజ్ఞుఁ
డవు. నీ కధికముగఁ జెప్ప నవసరము. పూర్ణిమను నీ

కొసఁగి పరిణయము చేయఁ దలంచి యుంటిని. ఇది నీ జన కునకు నంగీకారమే. పూర్ణిమయు నీయందు బద్ధానురాగయై యుండుట నీ వెఱుంగనిది గాదు. నీ వీ యింటి కొక్క కొమరుండవు. పూర్ణిమ నాయింటి కొక్క కొమరిత. మీ కిద్వరికిఁ గళ్యాణము సేసి మిమ్మే ప్రాణపదముగాఁ జూచుకొనుచున్న మా ముదుసలి ప్రాణములు రెండును మీ నీడను విశ్రాంతి దీసికొన నెంచుకొన్నవి. నీ యభిప్రాయ మేమి?" ఆ మాటలు విన్నంతనే, "ఇంకఁ జిత్రగతి యేమి?" అను తలంపు శ్యామసుందరుని స్మరణకు వచ్చెను. దాన న తనికే ప్రత్యుత్తరమును వెంటనే చెప్పనేరక సుందరుఁ డొక్కింతసేపు తకపికపడి మనస్సు కుదురు పఱుచుకొని, "చిత్తము, కొన్నాళ్లు నాకు గడు వింము. ఆలోచించి నా యభిప్రాయమును మనవి చేసెదను" అని బదులు పలి కెను. పూర్ణిమ, సుందరుని కడ కరిగి పోయివచ్చెద నన్న ప్పుడు త ద్వియోగము దుస్సహమని తోఁచినను శ్యామ సుందరుఁడు తత్కాలోచితము లగు పలుకులు పలికి తన భావము బయల్పడ నీక యా కుసుమగాత్రిని వీడుకొల్పెను.

ఒకటి, రెండు, మూఁడు, నాలుగు నాళ్లు చల్ల చల్లగా గడచి పోయెను. శ్యామసుందరుఁ డొ వనుకొనుటకును గా దనుటకును దోఁపక యూరకుండెను. వాని రాగామృతాంశువు విచార మేఘచ్ఛన్నుఁ డయ్యెను. ఒక్కొక్క వార మా రీతినే జరిగిపోయిన దోఁ దన తనయునికిఁ బూర్ణిమ యెడం గలిగి పెంపొందిన ప్రణయ ప్రవాహము చింతా సంతాపానలంబునఁ జక్కఁ గ్రాగి యింకిపోవు నని తలంచి

యుపాయ శాలి యయిన గోపాలరాజు, పుత్త్రుని చెంత కరిగి, యా మాటయు నీ మాటయుఁ జెప్పి చల్లగాఁ బ్రకృత ప్రసంగమునకు దింపి, 'తండ్రీ! చూచితివా రఘురామ రాజుగారి యవసరపాటు! నీ కడనుండి యెట్టి ప్రత్యుత్తర మును రాలేదని తొంటి తలంపు వీడి, పూర్ణిమను- నీ వంతగాఁ బ్రేమించిన పూర్ణిమను మన బంగారురాజు బాబుగారి కుమారున కీయ మాటలాడుచున్న వాఁడఁట విన్నావా?' అని పల్కెను. ఇది శుద్ధాబద్ధము. తా నిష్ట పడినను బూర్ణిమ యిష్టపడదు, అని శ్యామసుందరుఁడు వచించెను. "అమ్మ కిష్టము లేనప్పు డాతఁడు స్వతంత్రించి యెట్లు కబు రంపఁ గలఁడు? ఇది మన కెంతో యవమాన హేతువు సుమీ! మొదట మన మే మయిన నీ ప్రసం గము దెత్తుమని యతనిం బ్రతిమాలితిమా! నా హృదయ మవమానానలంబున మఱుగుచున్నది" అని గోపాల రాజు పితుఁడై గర్జించెను. "సరియే నేనీనాఁ డుత్తరవాహి నికిఁ బోయి యథార్థ మెఱిఁగి వచ్చెదను. తమ రాగ్ర హింపవలదు. యథార్థము తెలిసికోక యే మాటయు ననుట తగవు గాదు గదా!" అని శ్యామసుందరుఁ డన, "మంచిది. మర్యాదమీఱి ప్రసంగింపకుమీ! వారి యుద్దే శమును గనిపెట్టి మనకు వ్యతిరిక్తముగా నున్నట్లు పొడఁగట్టె నేని పల్లెత్తి పలుకక చల్లచల్లగా జాఱి వెడలి రమ్ము" అని గోపాలరాజు పలికెను. "చిత్తము" అని యప్పుడ పయనమయి తన యశ్వము నధిరోహించి శ్యామ సుందరుఁ డుత్తరవాహిని కరిగెను.

రఘురామరాజింట లేఁడు. సుందరుఁడు పయి యం తరువునకుఁ బోవ నెట్టి యాటంకమును గలుగలేదు. పూర్ణిమ చెక్కిటఁ జేయిచేర్చి విచారించుచుఁ గుర్చీపయిం గూర్చుండి యుండెను. శ్యామసుందరుఁ డామె గదిలోని కరిగి, "ఏమి పూర్ణిమా! మాకు శుభలేఖ యయినం బంప రాదా?" అని పలుకరించెను. పరాకుగా నున్న పూర్ణిమ తటాలున లేచి, యాతనిం గూర్చుండ వేఁడి, సేమమే కదా! శుభలేఖ యేమిటి? అని యడిగెను. "ఏమియు నెఱుఁగవు కాఁబోలును! ఎందుల కీ దాఁపఱికము? నేఁడు దాఁచిన రేపు బయలు పడకుండునా" యని సుందరుఁ డన, "మీ రేదో మనస్సులో నుంచుకొని మాటలాడు చున్నారు. అదేదో స్పష్టముగా వచింపరాదా?" అని సుందరి వింత పడి వచించెను. "నీ వివాహ శుభరేఖ" అని సుందరుని నోట వచ్చినంతఁ బూర్ణిమ చెక్కు లెఱ్ఱ వాఱెను. క్రేఁగంట నతనిం జూచుచు మందహాసాంకురము మోవి పయిం జిందులు ద్రొక్క, 'మీ చమత్కార ప్రసంగము నా కర్థము కాలేదు. నే నంత చదువుకొన్నానా? ఏదో వివరించి చెప్పుడు" అని వాని మోమునం జూడ్కులు నిలిపెను. 'మా బంగారు రాజు బాబుగారి కుమారునకు ని న్నిచ్చుటకు మీ బాబయ్యగారు నిశ్చ యించిరఁట; నీ వంగీకరించితి వఁట. నే నంత చదువుకొన్నా నా? యని నీ నెఱజాణతనమును గన్పఱుచు చుంటివి. ఇంతలో నింత చపలత యేల?' అని శ్యామసుందరుఁడు మో మొక్కింత చేసికొని వచించెను. పూర్ణిమ కాఁపుకొన

రానంత నవ్వువచ్చి పకా పక నవ్వి, "మఱి మీ రేనాఁటికి నే మాటయుఁ జెప్పక నా మాటయే తలంపక యూరకున్నచో మానాన్నగారు బ్రహ్మచారిణిగా నన్నుంచి వేయుదురా? ఏదో గంతకుఁ దగిన బొంత దొరకదా?" అని పలికెను. 'నీ వంగీకరించితివా!' అని యతఁడన, 'మీ రుపేక్ష చేసిన నే నేమి సేయుదును?' అని పూర్ణిమ పలికెను. 'నే నుపేక్ష చేసితి ననుటకుఁ దార్కాణ మేమి?' అని సుందరుఁ డించుక యలుక పొడమ నడుగ, 'తార్కాణమిం కేమి కావలెను? తమదర్శన మయి నేఁటికి నాల్గు నాళ్లు గతించినవి. పశ్చాచ్ఛద్రము నాస్తి పర్యాయ మని మీ వంటి వా రందురు' అని పూర్ణిమ హాస స్మ్ఖమై వచించెను. "సరియే, కానిండు. మీ కంతె తొందర యయినచో మీ యిచ్ఛ వచ్చినట్లు జరుగనిండు" అని కుటిల భ్రుకుటియై శ్యామసుందరుఁడు చివాలున నాసనము నుండి లేచి పోఁబోవ, దారి కడ్డముగ వచ్చి యాబాలి కావతంసము 'కోపమా! ఇంచుక సేపు గూర్చుండుఁడు. మీతో ముచ్చటింపవలసిన యంశము లెన్నో యున్నవి' అని వేఁడెను. 'మా కిక్కడ నేమి పని? పర స్త్రీల కడ నే కాంతమున నిలుచుట పాడి గాదు. దారి విడువుము' అని సుందరుఁడు చిడిముడి పడసాగెను. 'ఇందుఁ బర స్త్రీ లెవ రున్నారు? ఎందుల కీ చిడిముడిపాటు?' అని యా పూర్ణేందువదన వచింప, 'నీవు పర కాంత వైతివి గదా!' అని యతఁడు పలికెను. ఎట్లని వధువు ప్రశ్నింప, 'నీ వితరుని వరించితివి గద' అని యతఁ

డ నెను. 'అటు లెవ రన్నారు ?' అని యా శ్యామ, శ్యామ సుందరుని చేయిపట్టుకొనెను. చేయి విడిపించుకొని, 'మా నాన్నగా రన్నారు' అని సుందరుఁడు పలికెను. వారి కెవరు సెప్పి రని యామె ప్రశ్నింపఁ దనకుఁ దెలియ దని యతఁడు వచించి తెల్లఁబోయెను. 'ఏదో తలయుఁ దోఁకయు లేనిమాట యెవ్వరో కల్పింప నిజ మని నమ్మి నాపయిం గోపము వహించితిరా ? బాగాయె' అని పలికి పూర్ణిమ మరల నవ్వెను. 'నీవు నిజముగ నితరుని వరింప లేదా ?' అని యతఁ డడుగ 'శ్యామసుందరుని కర్పిత మయిన చిత్త మన్యాయ త్త మగుట యసంభవ మని తమ రెఱుఁగరో ?' అని పూర్ణిమ మరల నతని కేలుదమ్మి కేలం గీలించెను. 'ఇది నిక్కువమా ?' అని యతఁ డడుగ 'ముమ్మాటికి నిక్కువము' అని యమ్ముగ్ధ నవ్వుచు బదులు పలుకుచు నతని చేతిలోఁ జేయి వైచెను. శ్యామసుందరుని కోపము పంచ బంగాళమై పాఱిపోయెను. దానిచోటఁ దొంటికంటె ముమ్మడిగ ననురాగ మావరించెను. అతఁ డొక నిమిష మీ ప్రపంచమును మఱచెను. ప్రేమావేశమున నొడలు మఱచి తటాలునం బూర్ణిమను బిగియారఁ గౌఁగిలించుకొని, ముద్దులతో నమ్ముద్దుగుమ్మ నెమ్మోమును, నును జెక్కులను ముంచి యెత్తివేసెను. ఆ సమయమునకు సరిగా నా ద్వార దేశమునకు వచ్చి యా నూత్న వధూవరులం గన్న రఘురామరాజు వారి కంటఁ బడెను.

# 15

## పూర్ణిమా వివాహము

శ్యామసుందరుఁ డొడలు మఱచి ప్రేమాభిరాముం డయి పూర్ణిమను ముద్దులాడు చున్నప్పుడు త జ్జనకుని నట్లు గాంచిన వాఁడగుటచే నెంత పశ్చాత్తాప పరిపీడితుం డయినను బూర్ణిమను బెండ్లాడ ననఁజాలక పోయెను; ఆ రాత్రియే తన యంగీకారమును రఘురామరాజున కెఱిఁగించి మఱునాఁటి యుదయమున మైసూరునకు వచ్చెను. ఇంటికి వచ్చి తన గదిలో నొంటరిగాఁ గూరుచుండి యతఁ డెంతో నేడ్చెను. అయిన నేమి ప్రయోజనము! మించి పోయిన దాని కెంత యేడ్చినను వెనుకకువచ్చునా! చిత్రా లక్షణ లక్షితగాఁ బూర్ణిమ యతనికంటి కగపడుటయే యింతకుం గారణం బయ్యెను. చిత్రా విరహాభర వివశుండై యున్న య క్కుమార తిలకునకుఁ దా నాచరించు చున్నది ధర్మవిరుద్ధ మని తెలిసియు నాచరింపక తీరినదిగాదు. గోపాల రాజుతో నాతఁ డేమియుఁ దెలుపకున్నను మఱునాఁడు రఘు రామరాజు మూలమున గోపాలరాజున కా యుదంత మంత యును దెలియవచ్చెను. గోపాలరాజు డెందము కుదుటఁ బడెను. వెంటనే మౌహూర్తికుల రావించి యతండు వివాహ ముహూర్తమును బెట్టించెను. రెండు పక్షముల వారును నుద్దండముగాఁ గళ్యాణ ప్రయత్నములు సేయం దొడంగిరి. మైసూరునందే పూర్ణిమా శ్యామసుందరుల వివాహ మహోత్సవము సేయ నిశ్చిత మయ్యెను. బంధు మిత్రు లెల్ల

రును శుభలేఖ లందుకొని వచ్చి చేరిరి. ఫాల్గున శుద్ధ సప్తమి నాఁడతి వైభవంబునఁ బూర్ణిమా శ్యామసుందరుల కళ్యాణ మహోత్సవము నిర్విఘ్నముగా నెఱవేఱెను. తన మన సెట్లు లున్నను, పెండ్లి కఱదెంచిన రామచంద్ర భట్టు తన్నెంత దూఱుచున్నను, న దంతయు నొక మూల నుంచి లేని యుత్సాహమును దెచ్చుకొని తనహృదయస్థితి నేరికిం దెలియనీయక శ్యామసుందరుఁడు, తానుగా నట్లు నటించి తండ్రిని సంతసింపఁ జేసి పూర్ణిమను బెండ్లాడెను. ఈడు జోడుగ నున్న యీ దాంపత్యమునకును, సమానస్థితి నున్న యీ వియ్యమునకు నెల్లరును సంతసించిరి. శ్యామసుందరుఁడు పూర్ణిమం జేరియున్న యీ సమయమున నా సుందరీ తిలకము చిత్రాదేవియే యని భావించు చుండెనుగాని, చిత్ర యొక పల్లెటూరిలో నా సమయమునఁ బ్రసవ వేదన పడుచున్నదని యెఱుంగజాలఁడయ్యెను. దివ్యవిమానంబుఁ బోని శోభన భవనంబున, హంసతూలికా తల్పంబున ననంగసుందరి యనంజాలు పూర్ణిమా రమణీ రమణుఁడై యాతఁడు విలసిల్లు చున్నప్పుడు, తన నోముల పంటయై, దివ్య తేజో విరాజితుఁడై, యొక కుగ్రామంబునఁ దన బంధు గృహంబునఁ జిత్రా గర్భ శుక్తి ముక్తా ఫల మయి తనకొక కుమారుఁడు పుట్టె నని పాప మతఁ డేమి యెఱుం గును? ప్రథమ సుపుత్త్రి జనన సమయంబున, నూతన వధూ మణి కౌఁగిటిలో శోభనపు గదిలో మోహ పరవశుఁడై తన భర్త నిదురించుచున్న వాఁడని పాప మమాయికురాలగు చిత్ర మాత్ర మే మెఱుంగును? శరీరములును, వానికిఁ గలి

గిన నూాత్నావస్థలును నెట్టు లున్నను నెంత దూరమున నున్నను జిత్రా శ్యామసుందరుల హృదయములు మాత్రము కలిసియే యున్నవనుమాట సత్యేతరము గాదు. చిత్రను వీడి యన్యకాంతను చేపట్టినట్లుగాని, యామెను మోసపుచ్చి యీమెను సుఖపెట్టుచున్నట్లు గాని శ్యామసుందరున కిసుమంతయుఁ దోఁపదయ్యె. నడచిన, నెటుతిరిగిన, నవ్విన, సిగ్గుపడినఁ, గనులెత్తిన, బొమలు వంచి బిత్తరి చూపులు చూచినను, గన్నుమోడ్చినను సర్వలక్షణంబులను, సర్వావస్థలను, సర్వావయవములను, జిత్రకంటెఁ బూర్ణిమ యందు వానికి భేద మగు పింపదయ్యె. మీఁదు మిక్కిలి పలుకుట, పలుకరించుట, కోయిల లులుకఁ బాడుట, పద్యములు చదువుట, చిత్రవిచిత్ర ప్రసంగములు సేయుట, నవ్వించుట, నవ్వుట-మున్నగు శృంగారోద్దీపన విభావానుభావ విలాసములిచ్చుట హెచ్చయి యతనిం జిత్రయే యిన్నియు నలవడి యనంత సుఖసుధాతటినీ వీచికల నూఁగిస లూఁగించి పరవశుం జేయుచున్నట్లు గన్పట్టుచుండెను. ఇంకెక్కడి చిత్ర! ఇంకెక్కడి ధర్మవర ప్రాంతాటవిక నివాసము! మ రెక్కడి కుటీర సవిధ ప్రదేశ విహార చరిత్ర! అంతయు విస్మృతం బయ్యెను. ఆహా! దైవనిర్ణీతమునకు నడ్డుగట్టు లెవరును గట్టలేరు గదా! ఏటికెదురీఁద రాదు గదా! విధి యెట్టివాని నెట్టులయినం ద్రిప్పి వేయఁగలదు. సుడులలోఁ బెట్టి నడుగుఁ బట్టింపఁ గలదు. తన కనుకూలములగు సంఘటన లది యంతంతలో వింతగా జత కూర్చుకోఁగలదు. అది యనంతశక్తి.

# 16

## పుత్త్రోదయము

అచ్చట రామయ పల్లెలోఁ జిత్రకు పాల్గున మాసమునం దొక కుమారుఁ డుదయించెను. ఆ దీను రాలి యానందము కోటి కెక్కెను. త ద్గృహాధిపతి, చిత్రకుఁ గుమారుఁడు పుట్టె నన్న సంగతి గోపాల రాజునకుఁ దెలియఁ జేసెను. గోపాలరా జొక కంట నానంద బాష్పములు నింకొక కంట శోకాశ్రువులును విడిచెను. బాలుఁడు బాల చంద్రునివలె దిన దిన ప్రవర్ధమానుఁడై తల్లికి హృదయానంద వర్ధనుండై యొప్పుచుండెను. అక్కడికిఁ జిత్ర వచ్చి యైదాఱు మాసము లయినను, మాట యిచ్చిన ప్రకారము గోపాలరాజు రాఁడయ్యెను. అతని యుదంతమే తెలియ రాదయ్యెను. పుత్త్రి నద్దాల వైచికొని చిత్ర వానిని ముద్దులలో మునిఁగి తేలుచుండినను శ్యామసుందరునిఁ గూర్చి యేమియుఁ దెలియ రానందున విచారము మాత్రము పూర్తిగ నామెను విడిచి పోదయ్యెను. గోపాలరాజు నొద్ద నుండి యాయిలు జేనికి నెల నెలకు రావలసిన పైకము మాత్రము వచ్చుచుండెను. గృహపతి చిత్రను, దత్పుత్త్రుని నెంతో గౌరవముతోఁ జూచుచుండెను. తలిదండ్రులు చెంత లేని లోపము చిత్ర మనమున కిసుమంతయుఁ దోఁపదయ్యెను. చిత్ర మంచి యారోగ్య స్థితిలో నుండెను. పెద్ద పురుడు తీతెను. చిత్ర కొడల జవ సత్త్వములు చేరుకొనుచుండెను. ఆమె రూపము వర్ణనాతీత సౌభాగ్య

భాగ్య గరిమ నెంతో యలరారు చుండెను. మంచి భోజనమును, మంచి గాలియు, నీరును, మంచి బట్టలును సమకూఱి యుండుటచేఁ జిత్ర రెండవమాసముననే తేఱి తేటఁబట్టెను. ముద్దు లొలుకు మ సంపూర్ణ పూర్ణిమా సుధాకరునిం గేరుచున్న చిన్ని తనయుని నెమ్మోముం గాంచుచు నామె యుప్పొంగి పోవుచుండెను. తన పతి, సుతునిం జూచిన నెంత యానందించునో, తన్నెంత ప్రేమించునో, యెట్టి సుఖ సౌభాగ్య భాగ్యములు తన కల వడునో యని యా బాలింతరా లువ్విళు లూరుచుండెను. దినములు గడచి పోవుచుండెను. మాసములు మరగి పోవుచుండెను. శ్యామసుందరుని దర్శన మామె కెన్నఁటికిని లభింపదయ్యెను. ఏ నాఁటి కైనను రాకపోవునా యను నాసతోఁ జిత్ర హృదయము పదిల పఱుచుకొనుచు నిరంతరమును దన చిన్నిపాపని గన్నులలోఁ బెట్టుకొని కాపాడు చుండెను. తన శరీర లావణ్యమును బరికించుచు శ్యామసుందరుఁ డట్టి తఱిఁ దన సన్నిధి నున్నచో మెచ్చి యెట్టి మధుర మధురములగు పద్దెములచే వర్ణించునోయని యూట లూరుచు రేపు వచ్చును, మాపు వచ్చు ననియుం దన్నుం దన పుత్త్రు నెంతో గౌరవమున నింటికిం గొంపోవు ననియు దినములు లెక్కించుకొనుచుండెను; కాని, తన్ను మీఱిన మఱి యొక యన్నుల మిన్నం దవిలి, పతి క్రమ క్రమముగాఁ దన యుదంతమే మఱచు చున్నాఁడని యా ప్రమదా రత్నమెఱుంగదు గదా! పాపము! అమాయికురాలు! అనురాగనిధి! సర్వేశ్వరుండు తన కొక యానంద సేవధిం బ్రసాదించినందున

నతనిం గొంచాడుచు వాని ముద్దులో మునిఁగి ప్రపంచమునే మఱచి దినములు నిముసముల వలెఁ బోఁజేయు చుండెను.

బాలుని కైదవ మాసము వచ్చెను. వాని యవయవములు మంచి యేపును, నునుపును బొంది చూడ సొంపై వెలయుచుండెను. ఊసులాడుచు నుగ్గుగ్గనుచు, నవ్వుచు నా చిన్నపాపఁడు దల్లి దుఃఖాంధకారము పటాపంచలు సేయుచుండెను. తన చిన్ని చేతులు జనని కంఠంబునం బెనవైచి మోము నివురుచు, నేల దోఁగాడుచుఁ బకపక నవ్వుచు బంగురును లేచుచుఁ బడుచు, విద్దెములు సేయుచు నత్తత్త యనుచుఁ జిత్ర కొడుకుఁ బదినెలల వాఁ డయ్యెను.

చిత్ర, పతి విరహము నింక సహింపఁ జాలక కొడుకును దోడుకొని మైసూరునకుఁ బోయెద నని తన సంరక్షక దంపతుల కెఱిఁగించెను. తమ దత్తపుత్త్రికను, మనుమనిని విడువనోపక యా దంపతులు రేపు మా పని యెప్పటి కప్పుడేవో సాకులు చెప్పుచు నట్లులో రెండు నెలలు గడపిరి. బాలున కొక వత్సరము నిండెను. వా డిల్లంతయుఁ బరుగులిడుచుండెను. తల్లి నమ్మా యనియు నయ్యాలుత్రే నిం దాత యనియు నతని పత్ని నవ్వవ్వ యనుచుఁ బిలుచుచుఁ దన తొక్కు ముద్దు పలుకుల వారిని ముదాంబుధిఁ దేలించుచుండెను. బాలుఁడు నాన్న నాన్న యన్నప్పుడు చిత్ర హృదయము నీరగుచుండెను. గృహాధిపతి బాలునికి మంచి దుస్తులు కుట్టించి ముస్తాబు చేసెను. ఇంకను జిత్రప్రార్థనమును ద్రోసివేయఁ జాలక భార్యనోదార్చి, చిత్రకు మంచి

చీరలు గొని యిచ్చి యొక మంచి ముహూర్తము చూపించి బండిలోఁ గూర్చుండఁబెట్టి, చిత్రను దత్తనయునిని ప్రయాణము చేయించెను. ఊరు దాఁటువఱకు వచ్చి యంపకము పెట్టి చిత్రను బాలుని ముద్దాడి యశ్రుపూరిత నయనయయి మరలెను. చిత్రయు నాతో నెడఁబాయ లేక యేడ్చెను. ఆ తాత యొక మకాము వఱకు వారి నంపకము పెట్టి పదిలమని బండివాని కొప్పఁజెప్పి బాలుని ముద్దులాడి చిత్రను వీడుకొని మఱునాఁ డింటికి మరలెను. బండివాఁడు మంచి వాఁడు; చిన చిన్న మజిలీలు సేయించుచు నా ఱేడు దినములకు శ్రీరంగ పట్టణమునకుఁ దీసికొని వచ్చెను. ఒక సత్రమునఁ జిత్రను విడియించి వంట సామాను దెచ్చుటకయి బజారున కేగెను. అప్పటికి జామున్నర ప్రొద్దెక్కెను.

## 17

### వంచనము

బండివాఁడు వెడలిన పిదపఁ జిత్ర వసించియున్న సత్రమునకు నొక పురుషుఁ డరుదెంచెను. వాఁడు మనకుఁ బరిచితుఁడగు రంగారావు. ఆ నాఁడు భట్టు మోమునఁ జూడఁజాలక రాజరత్నమును, దాని కూఁతును వీడి పరారయిన రంగారావును మా పాఠకులు మఱచియుండరు. నాఁడు మొదలు వానికి నుండ యిల్లును గట్ట గుడ్డయుఁ దినఁదిండియు లేక యూరూరఁ దిరుగుచు నే వృత్తి సేయుటకును మన సొప్పక రాజరత్నము కడ నున్నప్పుడు దొంగిలించి దాఁచుకొన్న పది తులముల బంగారును గరఁగింపఁజేసి కడ్డీలుగాఁ

గొట్టించి, కొన్నాళ్ళచ్చటచ్చటఁ దిరిగి గడ్డము మీసములు పెంచుకొని కాషాయాంబరములు ధరించి రసవాద శాస్త్రజ్ఞుఁడ ననియు, బంగారు చేయుదు ననియు, మంత్ర వాది ననియు బంగారును బూజలోఁ బెట్టి దైవ శక్తి వలన రెండింతలు చేయఁగల ననియుఁ జెప్పుచుఁ బల్లెటూళ్ళలోని పామర జనులను నమ్మించి తొలుదొల్త నొక రిద్దఱికిఁ దన వద్దనున్న బంగారు కడ్డీ లొందు రెండొసంగి ప్రభావ సంప న్నుఁడని పేరొంది, నమ్మి యమాయిక జను లొసంగిన పుస్తెలు పూసలు మొదలుగ నొలిచి పూజలోఁ బెట్టి న దురాతిరేకిం దెలియకుండ నా గ్రామము విడిచి కడుదూర మరిగి యచ్చటచ్చట నా విధముగానే బంగారు సంపా దించి యెవ్వరికిని దొరకకుండఁ దిరుగుచు నప్పుడు శ్రీరంగ పట్టణమున కేతెంచినవాఁడు. ఆ దురాచారుఁడు, చిత్రను దత్తనయుని నా సత్రమునఁ గాంచి, బాలుం జేరఁదీసి ముద్దాడి, యమ్మా! మీ దేయూ రని చిత్ర నడిగెను. ఆమె పలుకకున్న సిగ్గుచే మాటలాడ లేదనుకొని రంగా రావు మఱేమియుఁ బ్రశ్నింపక, వంటఁజేసికొని భుజించిన పిదప బండివానిం జేరి చిత్ర యుదంతము నడిగి తెలిసి కొనెను. ఎండ చల్లఁబడిన వెనుక బండివాఁడు బండి పూఁచుచుండ రంగారావు చిత్రకడ కేఁగి, 'తల్లీ! నీ యుదంతము విన్నాఁడను; నేను శ్యామసుందరమూర్తి నెఱుంగుదును; నీ వనుమతింతు వేని నేను నీ వెంట వచ్చి నిన్ను శ్యామసుందమూర్తి యింటికిం గొంపోయెదను' అని పలుక చిత్ర యుప్పొంగి తన కృతజ్ఞతను నమస్కార

మూలమున నెఱిఁగించెను. చిత్రయుఁ జిన్ని బిడ్డఁడును బండిలోఁ గూర్చుండిరి. బండి వాఁ డెద్దులఁ దోలుచుండెను. రంగారావు వెనుక నడచుచుండెను. అది గాంచి చిత్ర, యతనిని బండిలోఁ గూర్చుండు మని సంజ్ఞ చేసెను. బండి నాయఁడు గూడఁ గోరెను; కాని, రంగారా వంగీకరింపక దారిపొడుగునఁ జిత్రకుఁ జిత్రములగు ముచ్చటలు చెప్పుచు బండి వెనుక నడిచియే పయనము చేసెను. చీఁకటి పడు నప్పటికి బండి మైసూరు చేరెను.

రంగారావు మైసూరు బాగుగా నెఱింగిన వాఁడు గావునఁ జిత్ర బండి నొక సత్రమునకుఁ బట్టించెను. ఆ రాత్రి వా రచ్చట నుండిరి. మఱునాఁటి ప్రాతః కాలమున రంగారా వూరిలోని కరిగి తిరిగి వచ్చి చిత్రతో, శ్యామ సుందరుఁడు గ్రామాంతరమున కేగి యున్నాఁ డనియు, రెండు దినములలో వచ్చు ననియుఁ జిత్ర యంతవఱకు నివ సించుటకుఁ దన మేనత్తగారి యింటికిఁ దీసికొని పోయెద ననియుఁ జెప్పి యంగీకరింపఁ జేసెను. వెంటనే చిత్రను బండిలోఁ గూర్చుండఁ జేసి, బాలుని దా నెత్తుకొని, యా సత్రమునుండి రెండుమూఁడు సందులు త్రిప్పి యొక భవ నంబు నెదుట నిలిపి, 'అమ్మా! యింక నీ బండివాని నంపివేయు' మని రంగారావు చిత్రతో ననెను. చిత్రయు సమ్మతించి బండివాని కీయవలసిన యద్దె యిచ్చి, కొంత బహుమతి యిచ్చి తన సంరక్షకులకుఁ దాను క్షేమముగాఁ బ్రవేశించిన సంగతి చెప్పుమని సంజ్ఞల మూలమున నెఱిఁ గించి పంపివేసెను. ఇంతలో నింటిలోనుండి యొక గత

భర్తృక వెలుపలికి వచ్చి చిత్రను, బిడ్డనిని గృహాంతర్భాగ మునకుం గొంపోయెను. వారి కా నాఁడచ్చట సకలోప చారములును జరిగెను.

ఒక రోజు గడచెను. రెండవ రోజును గడచెను. మూఁడవ నాఁడు రంగారావుగారు దిరిగివచ్చి, శ్యామసుం దరుఁడు వచ్చె ననియు, సాయంత్రము వారియింటికిఁ బోవుద మనియును జిత్రతోఁ జెప్పెను. చిత్ర యుబలాటమునకు హద్దు లేక పోయెను. చిత్ర కా నాఁడు నలుగిడి యభ్యంగన స్నానము చేయింప నా యింటి ముదసలి పెరటిలో వేఁడి నీళ్లు గాఁచి తలంటుకొనఁ జిత్రను రమ్మనెను. చిత్రయు బాలుని రంగారావున కొప్పగించి తలంటుకొనఁ బోయెను. రంగారావు దొంగతనములో నాఱితేఱిన వీరుఁడు; చిత్ర మాట నవరించెను. గోపాలరాజు చిత్రకుఁ బ్రాణ ధన ముగా నిచ్చిన కాసుల సంచి వాని చేతికిఁ జిక్కెను. ఆ సంచి, వాఁడు శ్రీరంగ పట్టణములోనే చూచి పసి పట్టి యింత పన్నాగము దాని నపహరించుటకే పన్నియున్న వాఁ డగుట నట నొక నిముస మయిన నిలువక క్రిందికి దిగివచ్చి యవ్వను బిలిచి, చెప్పవలసిన మాటలు చెప్పి యొక బం గారుకాసు చేతిలోఁ బెట్టి తనదారిం దాఁ జనియెను. చిత్ర కభ్యంజనము సేయించి, బాలునికి నామెకును బువ్వఁబెట్టి యా యవ్వ, తా నింత దిని, 'యింట భద్రము, వీధిలోనికి వెళ్లి యిప్పుడే వచ్చెద'నని చెప్పి పోయినదే పోకగాఁ బోయెను. పాపము! చిత్ర కీ సంగతి తెలియనే తెలియదు. బాలునితోఁ గొంత తడ వాడుకొని, సాయం

త్రము తన ప్రాణ వల్లభుని దర్శన మగునను నుల్లాసముతో చిత్ర యొడలు మఱచి నిదురించెను.

సాయంత్ర మయ్యెను. అవ్వయు రాలేదు. రంగా రావును దిరిగి రాలేదు. చిత్ర దిగులుపడి చీఁకటి పడు వఱకుఁ బ్రతీక్షించెను. వారు రాత్రి గూడ నింటికి రారైరి. చిత్ర దిగులుపడి వాఁడు మోసగాఁ డేమో, యామెయు మోసకత్తె యేమో యని యనుమానపడి తన కాసులసంచి మూట యాదిరా, మీఁదికి రిగి మూట వెదకెను. అందు సంచి లేదు. అది రంగారావు దొంగిలించుకొని పోయె నని యామె యూహించి దిగులుపడెను; అవ్వ మధ్యాహ్నము వండియుంచిన యన్న మింత కొడుకునకుఁ బెట్టి తా నింత తిని, తలుపులు బిగించి యా రాత్రి యా యింటనే బాలుని నిదురపుచ్చి తానును నిదురించెను. తెల్లవాఱఁగానే లేచి చిత్ర, యిల్లంతయు వెదకి యేమియుం గానక రంగారావు వచ్చునేమోయని జామున్నర ప్రొద్దువఱకు నిరీక్షించి హతాశయై బాలునిం జంక నిడుకొని తన బట్టలమూటఁ బట్టుకొని యిల్లు వెలువడి గుర్తుపట్టి తొలినాఁడు దిగిన సత్ర మునకు వచ్చెను. కనికరించి ముసాఫరులు పెట్టిన యన్న మింత బాలునికింబెట్టి తానుం దిని యెండ చల్లపడు వఱ కా సత్రమునందే పండుకొని సాయంత్రము బాలు నెత్తుకొని యూరిలో నింటింటికిఁ జని శ్యామసుందరుఁడు గాని, గోపాలరాజు గాని, యగుపించు నేమో యని చీఁకటి పడు దనుకఁ దిరిగి తిరిగి విసివి యొకచోఁ జదికిలఁబడి చిత్ర యేడువసాగెను. అది చూచి బాలుఁడు బావున నేడువఁ

జొచ్చెను. ఇంకఁ దా నేమువ రాదని యెంచి యా దీను రాలు గుండె రాయిచేసికొని బాలునిం జంక నిడుకొని మరలఁ దిరుగఁ దొడఁగెను; పెద్ద పెద్ద భవనంబు లా నగరం బున నెన్నిగలవో యన్నియుఁ దిరిగెను. ఎచ్చటను ద్వార పాలకు లామెను లోనికిఁ బోనీయక వెడలఁ గొట్టుచు వచ్చు చుండిరి. బాలుఁ డాఁకలి కోర్వలేక యన్నము పెట్టుమని మారాము పెట్టసాగెను. ఆమెకును క్షుద్బాధ భరింప శక్యము గాకుండెను. ఆమె మైసూరు రాజభవన ప్రాంత మునఁ బలుమారు నిటు నటు పోయి గోపాలరాజు గారి మందిరమును జూచుచునే యుండెను; కాని యదియే తన కుమారుని స్వంత మందిరమని పోల్చుకో లేకపోయెను. తుట్ట తుదకు క్షుద్బాధకుఁ దాళఁజాలక యెట్టులో కాళ్ళీడ్చు కొనుచుఁ జిత్ర, బజారువీధికి వచ్చి యటఁ దనమూటలోనివి రెండు చీర లొక యంగడివానికి విక్రయించి యొక వెండి నాణెమును బుచ్చుకొని సన్నలతో నొకనిం బూటకూలి యి ల్లెక్కడ నని యడిగి తెలిసికొని యట కేగి యా రాత్రి కొడుకున కింత బువ్వఁ బెట్టించి తా నింత దిని, మిగిలిన డబ్బులు మూట కట్టుకొని మరల సత్రమున కరుదెంచి యా రాత్రి యట వేఁగించెను.

మఱునాఁటి యుదయము మొదలు పదు నొకండు గంటల వఱకును జిత్ర, తనయు నెత్తుకొని మైసూరు వీధు లన్నియుఁ దిరిగి తిరిగి దిమ్మ వట్టెను; కాని, గోపాలరాజు దర్శనము కాలేదు. శ్యామసుందరుఁడు నగుపింప లేదు. రెండు యామము లయినంత మరలం బూటకూలింటి కేగి

కొడుకున కింత పెట్టి తా నింత దిని చిత్ర యక్కడనే యించుక విశ్రమించెను; పదంపడి యపరాహ్ణంబున రాజవీధి కే తెంచి, పెదపెద్ద యిండ్లలో నొక్కటియు విడువక నేగుచుఁ జీవాట్లు, కసరులు, గదుములు, తిట్లును దినుచు నేడ్చుచు రాతి రొక జామగునంతవఱకుఁ ద్రిమ్మరి దిమ్మవట్టి, యొక యంగడియందు రెండు రొట్టెలం గొని యొకటి కొడుకున కుం దనిపించి రెండవది మూటకట్టి తా నేమియుం దినక యే చిత్ర యా రాత్రి సత్రమ్మున వేఁగించెను.

మూఁడవ నాఁటికి బాలునిమోము చిన్నవోయెను. చిత్ర యవయవములు వసివాళ్ళు వాడెను; కాళ్లు లొళ్ళయ్యెను; ఆఁకలిచే నుదరము దహించుకొని పోవుచుండెను. అంత పట్టణమందును నట్టి నోరెఱుంగని దీనురాలి గోడాలకించి యాదరించు పుణ్యాత్ములొక్కరును గానరారైరి. దైవము విపరీతమయినపు డమరావతి నున్నను గాఱడవి నున్నట్టులే యగును గదా! చూడఁ జట్టమును ద్రొక్కె దైవమును గానక చిత్ర,కంటికి మంటికి నేక ధారగా నేడ్చుచుఁ దన్నుఁ జూచి దిగులుగొని బాలున నేడ్చు చంటివానిం జూచి యూరడిల్లి, యప్పటికి మిగిలిన చీర యొక్కటియు నొక రూక కమ్మివేసి యది పట్టుకొని పూటకూటింటి కేగి కొడుకును దానును భుజించిన పిదప మరల సత్రమున కరుదెంచెను. సాయంత్ర మగునంతవఱకు చిత్ర లేవలేక పోయెను. ఆ రాత్రి కుఱ్ఱవానికిఁ బక్కలు వెచ్చగా నుండెను. చిత్రకుఁ బ్రపంచమే మునిఁగి పోయినట్టు లయ్యెను. ఇం కొక దిన మా నాగరిక నగరంబున నివసించినచోఁ దన

చిన్న పాపఁ డేమగునో యని దిగులొంది చిత్ర, వేఁకువనే లేచి బాలుం బుజముమీఁదఁ బరుండఁ బెట్టుకొని, బయలు దేఱి యొక పెద్ద రాచబాటం బట్టి, యెద్దియే నొక కుగ్రామమునకు నరుగ సంకల్పించి పయనము చేసెను. చిత్ర కాళ్లు వాచినవి; పాదములలో బొబ్బ లెత్తినవి; ఒడ లంతయుఁ జిదుకఁ గొట్టినట్లు సలుపుచుండెను. పాపమామె యడుగుఁదీసి యడుగు పెట్టఁజాలు నవస్థలో లేకున్నను నెట్టులో లేనిసత్తువను దెచ్చుకొని యోపికతో నడు గొక యామడగా నడచి జామున్నర ప్రొద్దెక్కు నప్పటికి, నుత్తరవాహినీ ప్రాంతమున కరుదెంచెను; మైనూరు, దూర మగుచున్న కొలఁదిఁ దన మగఁడును దూర మగుచుండెనని చిత్ర దురపిల్లుచుండెను; కావేరీతీరంబున గల చిన్న పల్లె చేరువగా నగుపించుకొలఁదిఁ దనకన్నవాని కారోగ్యము గలుగునను నాసతో ముద మొందుచుండెను. అట్టులొక ముహూర్తము నడచి చిత్ర, బాలుని నొక చెట్టు నీడం గూరుచుండఁ బెట్టి, కావేరిలో దిగి స్నానము చేసి సూర్యునకు నమస్కరించి యొడ్డెక్కెను. అంతలో నామె యొడలు జలు జల్లు మనియెను. తనకు జ్వర మంకురించె నని యామె గుర్తించి తుడుచుకొని కోక పిడిచి కట్టుకొని కొడుకున కొక ఒట్టెఁ బెట్టి, యిన్ని నీళ్లు పట్టి, చంకఁ బెట్టుకొని యెట్ట యెదుటఁ జూపుమేర దూరంబునఁ గాన వచ్చు పల్లెఁ జేర నా ప్రొద్దుమీఱిన వేళఁ గా ళ్లీడుచుకొనుచు నడవ సాగెను. ఆహా! చిత్ర చరిత్ర మెంత జాలిగొలుపునది!

# 13

## చి త్రా పూ ర్ణి మ లు

శ్యామసుందరునికిఁ గళ్యాణమయి యొక వత్సర మయ్యెను. కొన్నాళ్లుత్తర వాహినీ తీరమందును గొన్ని నెలలు మైసూరు నందును నతఁడు పూర్ణిమా దేవితోఁ గాఁపురము సేయుచుండెను; కాని యతని హృదయ ఫలక మున ననురాగ రసచిత్రితమయిన చిత్రా చిత్ర స్వరూపము మఱుగు పడక నిర్మల కాంతులతో వెలుగొందుచునే యుండెను. అతఁడీలోపున, ధర్మవర ప్రాంత గ్రామవాసియు తనకుఁ దొలుతొల్తఁజిత్రా చరిత్రమును జెప్పినవాఁడు నగు చంద్రన్న పేర నొకటి రెండు జాబులు వ్రాసి చిత్ర నేమము నెఱుంగఁ గోరెను. ఆ జాబులకేమియుఁ బ్రత్యుత్తరము రాదయ్యె. తరువాత నతఁడొక లేఖావాహకునిం జంద్రన్న కడకుఁ బంపెను. వాఁడు తిరిగివచ్చి చిత్ర గర్భవతియై నిందిత చరిత్రయయి యెటకో పోయెనని చంద్రన్న చెప్పిన వార్త శ్యామసుందరుని కెఱిఁగించెను. అది మొదలు శ్యామసుందరునికి సంతోష మన్నది మందునకైనం గాన రాదయ్యె. తుది నాలుగు మాసా లతఁడు పూర్ణిమా సంపూర్ణానురాగ సుఖముల ననుభవించు చున్న వాఁడైనను హాయి నొందలేక పోయెను. అనాశ్వాసితమై దుఃఖించు చున్న మనస్సునకు సర్వము నసహ్యమే కదా! ఆ మార్పును జూచి పూర్ణిమ దిగులొంది కొన్నాళ్లోపికతో నోర్చి పదంపడి యోరువఁజాలక యాతని హృదయ వేదనకుం గ

తం బేమని యడిగెను. శ్యామసుందరుఁడు యథార్థముం దెలుప సాహసింప నోపక, శరీర మస్వస్థముగా నున్న దని యొకప్పుడును, తల నొప్పి యని యొకప్పుడును, కడుపు నొప్పి యని యొకప్పుడును. నీ రీతిగా నేదో యొక మాయ కారణమును జెప్పుచుఁ గాలక్షేపము సేయుచు వచ్చుచుండెను. కాని, దాని మూలమునఁ బూర్ణిమకు ననుమానము తీర దయ్యెను. ఇంకేదో మనోవ్యాధికిఁ గారణాంతర ముండి యుండు ననియు నది తెలుపఁ జాలకున్నాఁడనియు న మ్మగువ యూహించి తెలిసికొన, నెంతో ప్రయత్నించి కృతార్థురాలు గాఁ జాలకపోయెను. ఆమె కది యొక మనోవ్యాధి యయ్యెను. ఇవ్విధముగా నా జాయా పతులు మనోవ్యాధులతో గ్రుగ్గుచు లేని యానందమును దెచ్చుకొనుచు పలపలుచనగు శృంగార చేష్టలతో న ప్రథమ యావనానురాగ వైభవం బాభాసముగా దినములు వోఁ జేయుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు రఘురామరాజు, తా నిలు విడిచి దేశాంతరమున కరుగ వలసిన పని గలిగె ననియుఁ బూర్ణిమాయుతుఁడవై యుత్తర వాహినీ తీరముననే యుండు మనియుఁ దాను గొన్ని నెలలోఁ దిరిగి వత్తు ననియు శ్యామసుందరునితోఁ జెప్పి యిలుదీర్చు భార మొప్పగించి కుమార్తెను వీడుకొని భద్రమని చెప్పి, రామచంద్రభట్టును వెంటఁ బెట్టుకొని తగిన పరివారముతో బయలు వెడలి పోయెను. అతఁ డరిగిన రెండు మూఁడు మాసములకు హైదరాబాదునుండి యొక యుత్తరము వచ్చెను. రఘు రామరాజునకు నైజాము వా రొసంగిన జాగీరునకు మంచి

వెల వచ్చిన దనియు, వెంటనే దయచేయించి జాగీరు విక్రయించి ధనము పట్టించుకొని వెళ్ళవలయునని ప్రార్థించుచున్నాననియు నా జాగీరుపైఁ బారు పత్తెముపూని పని చేయుచున్న యుద్యోగి యా యుత్తరమును వ్రాసెను. పూర్ణిమయు, శ్యామసుందరుఁడు న య్యుత్తరమును జదువుకొనిరి. రఘురామరాజు తన యావత్సంపత్తును దన తనయతోపాటు శ్యామసుందరుని కిచ్చివేసిన వాఁ డగుటఁ దత్కార్యమును నెఱవేర్ప శ్యామసుందరుఁడే వెళ్ళ వలసి వచ్చెను. అట్టి స్థితిలోఁ బ్రియుని విడిచియుండ నిష్టము లేక పూర్ణిమ, లాభనష్టముల గణింప నక్కఱ లే దనియు, శ్యామసుందరునిం బోవలదనియు వేఁడుకొనెను. అదియే చిత్రను వెదకుటకుం దగిన యద నని మనంబున నిశ్చయించి శ్యామసుందరుఁ డనేక భంగులం బూర్ణిమను బోధించి తన పయనమున కంగీకారము వడసి తగుపాటి పరివారమును దోడుకొని హైదరాబాదున కరిగెను. మగఁ డరిగి నప్పటి నుండియు నుల్లాస మన్నది యెఱుంగక పూర్ణిమ మైసూరునందే మామగారి సేవసేయుచునుండి, కొంచెము శరీర మస్వస్థతఁ జెందుటచేఁ బది దినము లుత్తర వాహినీ తీరమున నుండి వత్తు నని మామగారి సెలవొంది వచ్చి యుండెను. ఉదయము తోఁటలోఁ దిరిగి వచ్చుటయుఁ గొంత తడవు వీణ వాయించుటయు, భుజించి యించుక విశ్రాంతి తీసికొని సద్గ్రంథ కాలక్షేపము సేయుచు సాయంత్రము చెలులతోఁ గూడి యుద్యాన వనమునఁ దిరుగు

టయుఁ దిన చర్యగా నచ్చట నా యువతి కాలమును బోఁ
జేయుచుండెను.

ప్రొద్దు, క్రుంకు మెట్ట నూటున కరిగెను. తోఁటలోఁ
జెలులతో విహరించివచ్చి పూర్ణిమ సౌధోపరి భాగంబున
నటు నిటుఁ బ్రచారము సేయుచు శ్యామసుందరార్పిత చిత్త
వృత్తియై యేదియో కూనరాగము దీసి పాడుచుండెను. ఆ
సుందరి దృక్చకోరములు కల క లావ్యక్త నాద మనోహారిణి
యగు కావేరిం బ్రతిఫలించుచున్న సుధాకర బింబము నాట
లందగిలి వినోదించుచుండెను. అట్టి వేళ హఠాత్తుగాఁ దమ
దేవిడీ గుమ్మము నొద్ద నొక స్త్రీ ప్రకృతి నడయాడుచున్న
ట్టులు పూర్ణిమ కగుపించెను. అది యేమని యా వనితా
మణి దృష్టి సాగించునంతలో నా స్త్రీ వ్యక్తి తన చంక
నున్న బాలుని గుమ్మమునొద్ద నిలువఁబెట్టి లోనికి రా నుం
కించి దబాలునఁ బడిపోయెను. తల్లి పాటుం గాంచి యా
చిన్ని బాలుఁ డేడువ సాగెను. ఆ దృశ్యమును బొడఁగాంచి
నంతనే పూర్ణిమ గిఱ్ఱున మేడమెట్లు దిగి యొక్క పరుగున
నచ్చోటికి వచ్చెను. ఆమె వెనుక నామె చెలులను బఱ
తెంచిరి. ద్వారపాలకుఁడు బాలు నోదార్చు చుండెను.
చెలు లిర్వురును బూర్ణిమయుఁ జిత్ర నెత్తి దేవిడీ యరుగు
మీఁదికిఁ దెచ్చిరి. చన్నీరు తెమ్మని పూర్ణిమ యాజ్ఞాపింప
నొక చెలి పరుగున నంత ర్భవనమున కరిగి తెచ్చి చిత్ర
నెమ్మోము పయిం జల్లెను. తల్లి చెంతఁజేరి బాలుఁ డమ్మా
యమ్మా యని పిలుచుచు నేడ్చుచుండెను. కొంత తడవు
నకుఁ జిత్ర తెప్పిఱిల్లి కనుదెఱచెను. తా నొక దేవ వనితా

మణి యొడిలో నున్నట్లు చిత్ర తలంచెను. ఏడ్చుచుఁ దన ప్రక్కనున్న చక్కనయ్య నక్కునం జేర్చి చిత్ర కన్నీరు నించెను; పిదప నించుక లేచి తన కుపచారములు సేయు చుండిన పూర్ణిమా ముఖకమలముం దిలకించి మయి మఱచి తటాలున నామె నాలింగనము చేసికొని వలవల నేడ్చెను. పూర్ణిమ మనస్సు నీ రయ్యెను. అవిరత గతి నశ్రువారి ప్రవహింప, నమృత మిళిత మగు గందపుం బూతం బోని చిత్రాలింగన సుఖ మనుభవించుచు న య్యువతి రెండు నిమిషములు మాటాడ లేక పోయెను. ఆ సుదతి చిత్రా తనయుని మోము దుడిచి పరికించి చూచి యాశ్చర్య నిమగ్న మానసయై య దంతయు నింద్రజాల మనుకొనెను. బాలుఁడును బూర్ణిమం గాంచి వింతపడక యొడిలోఁ గూర్చుండి తల్లివైపుఁ జూపి, యమ్మ యమ్మ యని కన్నీరు నించెను. పూర్ణిమ, తండ్రీ! మీ యమ్మ కేమియు భయము లేదు. ఏడువ కేడువ కని వానిం గౌఁగిలించుకొని చెక్కులు దుడిచి ముద్దిడికొనియెను. బాలుఁ డా పలుకుల కూరడిల్లెను. పిల్లల నోదార్చు దివ్య మంత్ర శక్తి వనితామ తల్లుల పాలి సొమ్ముగదా!

పూర్ణిమా సఖులును, ద్వారపాలుఁడును నా చిత్ర దృశ్యమును జూచుచు నచ్చెరువొంది చిత్ర ప్రతిమలు వోలె నిలువంబడి యుండిరి. చిత్రయు నా బాలుఁడును నాఁకలి దప్పుల కోర్వఁజాలక యలజడి పడుచున్నారని గ్రహించి పూర్ణిమ, యొక చెలికత్తెం బిలిచి తన గదితాళపుఁ జెవుల గుత్తి యొసంగి కొన్ని తినుబండములను, ఫలములను

దెమ్మని పంపెను. ఆమెయు నంతలో నవి దెచ్చి యిచ్చెను. బాలుఁడును జిత్రయు నవి తిని నీ రింత ద్రావి సేదఁదేఱిరి. చిత్ర కా పూర్ణిమా సమ్మిళనంబున ననుభూతంబగు నానంద ముదయించెను. అనన్య భావముతోఁ ద న్నంత యాదరించి, తన చిన్నతనయు నక్కునఁ గదియించి ముద్దు లిడుచు కౌఁగిలించి వేయుచుఁ జుబుకంబు పుణుకుచుఁ జంచు దువ్వుచు నేవేవో మాట లాడుచు, నవ్వించుచున్న యా యనురాగ నిధి యెవ్వతెయో, యే శ్రీమంతు నిల్లాలో యని చిత్ర వింతపడి చూచుచుండెను. పాపమామెను జ్వరము వేధించుచున్నను దనకును దన పుత్త్రునకును గలిగిన యా యాదరణ రస ప్రభావంబున నా దీనురాలా నిమిషములు దుఃఖమును, వేదనను మఱచియుండెను. అంతఁ బూర్ణిమ, చిత్ర నుద్దేశించి, "అమ్మా! నీకు వచ్చిన భయ మేమియు లేదు. నీవును నీ బిడ్డఁడును నారోగ్య వంతులగు నంత కీ బహిర్మందిరమున నివసింపుము. మీకు సమస్తోపచారములు మేము సేయుదుము" అని కనికారపుఁ జూపు లామె మోమునఁ బ్రసరింపఁ జేయుచుఁ బలికెను. చిత్ర బాష్ప పూరిత నయనయై, యా సుందరి తన పాలిటి త్రిపుర సుంద రియే యని యెంచి తన యంగీకారమును సూచించుచుఁ దల యాడించెను. పూర్ణిమ తన చెలికత్తెల తోడ్పాటునఁ జిత్రను బహిర్మందిరమునఁ జేర్చి మంచము పయిం బరుండఁ బెట్టెను; సమీప గ్రామముననున్న యొక వైద్యుని కడ కొక సేవకు నంపించెను. వైద్యుఁడు జాము రాతి రయినంత నేతెం చెను. చిత్ర చేతి నాడి బరీక్షించి యా పెజ్జు, కేవల మలజడి

మూలమున జ్వరము దగిలె ననియు, రెండు మూఁడు దినము లాహార నిద్రలు సరిగా నున్న నారోగ్య వతి యగు ననియుం జెప్పి జ్వరము పోవుటకుఁ గొన్ని మాత్ర లిచ్చి యను పానమును బథ్యమును జెప్పి పూర్ణిమ యొసంగిన పైకముం బట్టుకొని వెళ్ళిపోయెను. పూర్ణిమయుం జెలులు నొక రొక రుగాఁ జిత్రను గనిపెట్టియుండి భుజించి వచ్చిరి. జ్వరతీవ్ర తచేఁ జిత్ర యా రాత్రి మ తేమియు భుజింపలేకపోయెను. బాలుఁడన్నమునిని కొంతసేపు పూర్ణిమ నమ్మా నమ్మా యని పిలుచుచుఁ గౌఁగిలించు కొనుచు నవ్వుచుఁ దన తొక్కుపలు కులచే నామెను నవ్వించుచు నడుమ నడుమఁ జిత్రకడ కరిగి చూచుచుఁ గొంత సేపటికి నిదురించెను. ఒకరు తప్పి మఱి యొకరు మేలుకొని పూర్ణిమా సఖు లా రాత్రి చిత్రను గని పెట్టికొని యచ్చటనే పండుకొనిరి; ఆయాసముచేఁ జిత్ర మాటాడ లేకుండె ననుకొనిరి; కాని, వా రా రాత్రి చిత్ర మూఁగదన్నమాట యెఱుంగరైరి.

తెల్లవాఱు నప్పటికి జ్వరము విడువఁ జిత్ర నిదురించు చుండెను. పూర్ణిమ సంతోషించెను. వా రొక రొకరుగాఁ బోయి యాహ్నిక కృత్యములఁ దీర్చుకొని స్నానము సేసి వచ్చిరి. బాలుఁడును లేచి వారితో వింత లేక మెలంగు చుండెను. కొంత సేపటికిఁ జిత్రయు లేచి కూర్చుండి జరిగిన దంతయు సత్యమా స్వప్నమా యని యనుకొను చుండ బాలుఁ డమ్మాయని యామెకడ కరిగెను. చిత్ర పలుదోమి కొని కూర్చుండెను. వైద్యుఁ డిచ్చిన మందిచ్చి పూర్ణిమా దులు బాలునిం జిత్రను మందిరమునకుఁ గొంపోయి చావ

డీలోఁ గూర్చుండఁ జేసిరి. అమ్మా! మీ దేయూ రని పూర్ణిమ చిత్ర నడిగెను. చిత్ర పలుకదయ్యె. నీ తలిదండ్రు లెవ రని మరలఁ బూర్ణిమ ప్రశ్నించెను. చిత్ర కన్నుల గ్గిఱున నీరు దిరిగెను. నీ భర్త యెందున్నాఁ డని పూర్ణిమ యడిగెను. 'నిన్ను నీ పతి విడిచిపోయెనా? అతనిని వెద కుచు నీ వీ బాలునితోఁ దిరుగుచుంటివా!' అని మరలఁ బూర్ణిమ ప్రశ్నించెను. తనకు మాటలు రావని చిత్ర సంజ్ఞ చేసెను. పూర్ణిమ యచ్చెరువొంది, 'నీకుఁ జెవుడు లేదే, నీ కీ మూఁగతనము నడుమంత్రమున వచ్చెనా!' అని పూర్ణిమ యడుగ నౌ నన్నట్లు చిత్ర తల యూఁచెను. "పాపము! మూఁగ, నిరు పేద రాలు, దిక్కు లేని దీను రాలు, ఇట్టి దానిని విడిచి కట్టిడియై మగఁ డెం దేగినాఁడో. ఇట్టి స్థితియందున్న జవరాలు త న్నెట్లు గనుంగొనఁ గల దని యేని నా కఠిన హృదయుఁ డాలోచింప లేక పోయెను. మగ వారికిఁ గనికారము లేదు" అని పూర్ణిమ తన మగనిని నిందించుచుండ నడ్డు వచ్చి, తప్పు! అలాగున నన రాదని సూచించుచు ముక్కుపై వ్రేలుంచుకొని, చిత్ర యదం తయుఁ దన నుదుటి వ్రాఁత యని సన్నలతో సూచించెను. నీ భర్త దే యూ రని పూర్ణిమ యడుగఁ జిత్ర మైనూరు దెసఁ జూపెను. మైనూరునకు నీ వరిగితివా! యని పూర్ణిమ పృచ్ఛింప నరిగితి నని తల యాడించుటతోఁ జిత్ర తెలియఁ జేసెను. అతఁ డగుపింప లేదా యని మరలఁ బూర్ణిమ ప్రశ్నింప లే దన్నట్లు తల యాడించి చిత్ర కన్నుల నీ రుంచెను. అతని పే రైనం దెలిసినచో నతని వెదగింప

వచ్చెను. పాప మీయామె యెట్లు తెలియఁ జేయఁగల దని పూర్ణిమ చెలికత్తెలతో ననఁ జిత్ర, పూర్ణిమ చేయి పట్టుకొని యరచేతిలో నొకొక్క యక్షరముగా 'శ్యామసుందర మూర్తి' అను నక్షరములు వ్రాసెను. మూఁగ దాని కక్షరము లెట్లు వచ్చె ననియు, శ్యామసుందరమూర్తియే యామె భర్తయా యనియుఁ బూర్ణిమ నివ్వెఱపడి చాలు మొగ మొగా దిగఁ జూడ సాగెను. చిత్ర నవ్వుచుఁ దన తనయుని మొగము భర్త మొగము నే పోలి యుండు నని సంజ్ఞలు చేసి తెలియఁ జేసెను. మెఱుపు మెఱసినట్లు పూర్ణిమ బుద్ధి నొక యూహ స్ఫురించెను. ఆఁ! ఆ మనోవ్యాధి కిదియే కారణ మయి యుండునా? మామగారికిఁ గూడ నీ విషయము తెలిసియుండునా? మమ్ము మోసపుచ్చి యుందురా మామగారు ? అను చింత లామె హృదయమును గలఁతపెట్ట నారంభించెను. దీనురాలగు చిత్రపైఁ బూర్ణిమ కెంత కనికార మున్నను దన కామె సవతి యయి యుండు నేమో యను తలంపా యువతి నసూయా పరవశురాలుగాఁ జేసెను. ఇందలి నిజ మెట్లు తెలియునా యని యామె యాలోచింప సాగెను, అంతతో వారి ప్రసంగ మాఁగిపోయెను. సాయంత్ర మగు నప్పటికిఁ జిత్ర స్వస్థురాలయ్యెను. ఆ రాత్రి చిత్రకు నిద్దురపట్టెను గాని పూర్ణిమ చెంతఁ జేరలేక పోయెను.

మఱునాఁటి యుదయము గోపాలరా జంప ననంతాచార్యులుగారు పూర్ణిమా మందిరమున కరు దెంచెను. అతఁడు వచ్చినంతనే పూర్ణిమ మఱి యే ప్రసంగమును

జేయక యతనిం జిత్రా నికేతనమునకుం దోడుకొని పోయి చిత్రను దత్కుమారునిం జూపెను. అనంతాచార్యులు చిత్ర నొకసారి మాత్రము చూచియుండెను; కాని, చిత్రకుఁ గలిగిన మార్పుచేత నా దీనురాలి నాతఁడు పోల్చుకోలేక పోయెను; మఱి యా వ్యక్తి నెక్కడనో చూచి యున్నట్టు లనుమానపడెను. పూర్ణిమ, యాతనిం దన మేడమీఁదికిఁ బిలుచుకొని పోయి కూర్చుండఁ జేసి "స్వామీ! ఆ బాలుని మోమునం దెవరిలక్షణములు గాన్పించుచున్నవో యానవాలుపట్టితిరా!" అనియడుగ నాచార్యులు గారు కళవళపడి యానవాలు పట్టినాను అని పల్కెను. "ఆమె భర్త పేరును మీశిష్యుని పేరునొక్కటియే. ఆయన లక్షణము లీబాలునందచ్చొత్తినట్లున్నవి. పతి విడువ నామె యతనిని వెదకుచు మైసూరు వచ్చియున్నది. దాని పతి మైసూరు వాసి యఁట. ఇదంతయు నేమి? నా డెందమునఁ జిన్నుదరికొన్నట్లున్నది. దీనంగల రహస్యము మీ రెఱింగినచో నా కెఱుకపఱిచి యీ యనుమానమును దీర్ప వేఁడెద" నని పూర్ణిమ బాష్పపూరితనయనయయి యాచార్యుల పాదములపైఁ బడెను. అతఁ డాబిడ నోదార్చి, "అమ్మా! మనుష్యునిఁ బోలిన మనుష్యు లుండరా! సనామధేయులు నెందరో యుందురు. ఒక్క యూరిలో నొక్క పేరుగల వారు నుందురు. మీరు తొందరపడి హృదయము చెదరఁ గొట్టు కోరాదు. శ్యామసుందరుఁ డట్టి వాఁడు కాఁడని నే విశ్వసించెదను. ఈ సాయంత్రము మీ మామగారిక్కడికి వత్తురు. రామచంద్ర భట్టూరినుండి వచ్చి యున్నాఁడు.

మీ నాన్నగా రోడయెక్కి కలకత్తా నగరమున కరిగిరఁట. భట్టుగూడ సాయంత్ర మిచ్చటికి వచ్చును. వారు వీరిం జూచెదరు. ఆ భట్టతి చతురుఁడు; నిజ మిట్టె కనిపెట్టఁగల మేధావి. నిజ మప్పుడు బయలుపడక తప్పదు. మీ రనవసరమగు చీకాకును గలుగఁ జేసికో వలదు'' అని యాచార్యులుగా రప్పటికిఁ దగిన మాటలాడి యామె నోదార్చెను; కాని, యాతనికిని బూర్ణిమకుఁ గలిగిన యనుమానమే కలిగి తనలోఁ దాను విచారింప సాగెను. ఆయన పలుకులచే నించుక యూరడిల్లి పూర్ణిమ తన హృదయ తాపము వెలిఁబుచ్చక యోర్చుకొని మెలఁగఁ దొడంగెను.

చిత్ర కించుక నీరసము తప్ప మఱి యెవ్విధమయిన చీకాకును లేక తేఱుకొనెను. బాలుఁడు పూర్ణచంద్రుని భాతి వెలుంగుచు నా మందిరమందును, బూదోఁట యందును, బూర్ణిమతోను, దత్సఖులతోడను నాటలాడుచుఁ దిరుగుచు ముద్దు ముద్దు మాటలతో వారి నలరించుచుండెను. అంతలో గోపాలరాజును, భట్టును లోపలికి వచ్చిరి. పూర్ణిమ, చిత్రా చరిత్రమును సమగ్రముగ వారితోఁ జెప్పి చిత్రను గొడుకును నక్కడికి రప్పించెను. అల్లంత దూరమునుండి చిత్ర గోపాలరాజుం జూచి పోల్చి ప్రఫుల్ల వదన కమలయై కొడుకు నెత్తుకొని యొక్క పరుగున నతఁ డున్నచోటికి కరుదెంచి బాలు నాతని పాదముల పయిం బడవైచి తాను నాతనికిఁ బ్రణామము గావించి తన సంతోషమును జూపులతోను, సంజ్ఞలచేతను దెలియఁజేసెను. భట్టామెను పోల్చి పట్టెను. గోపాల

రా జొందిన యచ్చెరువునకు మేర లేదయ్యె. పొంగి పొరలి వచ్చు పౌత్రీ వాత్సల్యము నాఁపుకోలేక యా యమీరా రా బాలుని సందిటం బట్టుకొని నునుబుగ్గల ముద్దులచే ముద్రించెను; ఆనందబాష్పముల రాల్చెను. "అయిన మీరా రీమెను, బాలకుని నెఱుంగుదురు కాఁబోలును?" అని పూర్ణిమ మామగారి నడిగెను. ఆపె కనుఁ గొలఁకుల నుండి యశ్రుబిందువులు జాలువాఱఁ దొడఁగెను. చిత్రా సంతోషమునకును, బూర్ణిమా సంతాపమునకును బారము లేక పోయెను. గోపాలరా జాపె ప్రశ్నకు వెంటనే బదులు చెప్ప లేక యెట్టకేలకు మాట తెమల్చుకొని, మెల్లగా, "అమ్మా! నే నొక రాత్రి బెంగళూరి నుండి వచ్చుచు దోపిడిగాండ్ర చేతులలోఁ బడి తప్పించుకొని యొక పల్లెఁ జేరితిని. అట నా దొంగల మొనగాని యింటికి శరణార్థినైతిని. ఆ వఱ కక్కడ నీ యువతి బందియై యున్నది. ఆ రాత్రి తన సంజ్ఞలచే నా యాపదను సూచించి యటనుండి తప్పించి తెచ్చినది. పిదప మే మా దొంగల నందఱను రాజోద్యోగుల కొప్పగించి దగ్గఱ యూరిం జేరితిమి. అప్పటి కీ సతి గర్భవతియై యుండెను. నా ప్రాణ సంరక్షకురాలు గావున నీమె కా పల్లెటూరిలోఁ దగిన వసతులు కూర్చి నా కృతజ్ఞతఁ జూపించు కొంటిని. నీమె కొక పుత్త్రుఁడు పుట్టి నట్లును విరువురు సురక్షితులయి యున్నట్లును నా పల్లెటూరి గృహస్థు నాకుఁ దెలియఁ జేసెను. మరలఁ గొంత ధన మంపితిని. ఇది నాకు నీమెకును గల పరిచయము" అని చెప్పి యా ప్రసంగమును బ్రసంగాంతరమునకుఁ ద్రిప్పివేసి మఱి యెద్దియుఁ

ప్రశ్నింప నవకాశము కోడలి కొసంగఁ డయ్యె. అతని హృదయమున నాలోచనా తరంగము లుప్పతిల్లి యల్ల కల్లోలము పెట్టసాగెను. చిత్ర నచ్చటినుండి యింకొక చోటికి కనుప కున్నచోఁ బూర్ణిమకు సంతోషము మూర మగు నని యతఁడు నిశ్చయించుకొనెను. ఎక్కడి కెట్లు లంపించుట? చిత్ర యింకను బాగుగాఁ దేరుకోలేదు. ఏమి చేయుటకును దోఁచకతఁడు భట్టువైపు చూచెను. భట్టన్ని విషయములలో భట్టిని మించిన మహామంత్రి. నిమిషములో రాజుగారి హృదయ స్థితియుఁ దత్వమును గుర్తించెను. ఆచార్యుల వారి కదంతయు నగమ్య గోచరముగా నుండెను. పూర్ణిమ కను మానము సమూలముగాఁ బోక, యం దేదో నిగూఢ రహస్య స్థితి గలదని స్థిర మయ్యెను. ప్రసంగాంతరమునకు దింపి మటుమాయఁ జేయఁబూనిన మామగారి యెదుట వంతకంటె నెక్కువగా నా విషయమున మాటలాడిన మఱి ప్రయోజనము లేదని యెంచి పూర్ణిమ యే మాటయు నాడక మేడమీఁది కరిగి, శ్యామసుందరుఁడు వచ్చుదాఁకఁ జిత్రి నచ్చోటనే యెట్లులయిన నుంచవలయు నని కృత నిశ్చయ యయ్యెను. బాలుని, భట్టును దోడ్కొని గోపాల రాజు కావేరీ తీరమున కరిగెను. గురువుగారు సంధ్యావంద నము గావించుకొనఁ గావేరి కరిగిరి.

# 19

## శ్యామసుందరుని కుటుంబము

గోపాలరాజును, భట్టును స్థితిగతులను బాగుగ విమర్శించిరి. ఆ బాలునిం జిత్రను దగినంత శీఘ్రముగా నెయ్యోడకే నంపివేయ వలయుననియు, శ్యామసుందరుఁడు వచ్చి చిత్రా పూర్ణిమలను జూడకముందే తా మాతనిని సంధించి కార్యక్రమము నిర్ణయింపవలయు ననియు నిశ్చయించిరి. భట్టును నాచార్యులుగారును నొకరు తప్పి యొకరు రాసాయంత్రము కావేరీ తీరమున శ్యామసుందరుని రాకను గనిపెట్టుచు నుండి యతఁడు వచ్చి నంతనే చెప్పవలసిన మాటలు సెప్పి తాము దలఁచిన కార్యక్రమమున కొప్పింప వలయునని దృఢపఱిచిరి. భట్టునకు మాత్రము గోపాలరాజుగారి దారి రుచింప దయ్యె. అయినను నతఁడొఁగా దనక యతని యిష్టము చొప్పుననే తా నిష్టపడినట్లు నటించెను. తండ్రి శ్యామసుందరునితో సంప్రతింపక ముందు, శ్యామసుందరునకుఁ జిత్రను దత్పుత్త్రినిం జూపవలయునని భట్టు తలంచెను. ఇరువురును బాలుని లాలించుచు నింటికి వచ్చిరి. గోపాలరాజు రాత్రి రచ్చట వేఁగించి యుదయమున మైసూరున కరిగెను.

రెండు మూఁడు దినము లే వింతలును లేక కడచి పోయెను. ఒకనాఁడు సాయంత్రము పూర్ణిమ వీణ వాయించుచు నొక పాటపాడెను. చిత్ర కా పాట పరిచితమయిన పాట. శ్యామసుందరుఁడు తన కుటీర ప్రాంతమునఁ దనతో

విహరించుచున్నప్పుడు తన్ను రాధఁగాను శ్యామసుందరుని శ్రీకృష్ణునిగాను స్ఫురింపఁ జేయుచు బృందావనమున కా యడవిని, యమునా స్రవంతి కచ్చటి చిఱు స్రవంతిని బోల్చి చెప్పిన పాటయే యీ పాట. అది వినినంతనే చిత్ర యులికి పడి సంజ్ఞ చేసి యీ పాట నీ కెవరు నేర్పి రని పూర్ణిమ నడిగెను. "ఇది నా పతియగు శ్యామసుందరమూర్తి రచించి నాకు నేర్పెను" అని పలికి పూర్ణిమ చిత్ర మొగమునఁ జూడ్కులు నిలిపెను. చిత్ర చిత్రాకారమును వహించెను. ఆమె కన్నులనుండి యశ్రు బిందువులు జాఱుచుండెను. చిత్ర, పూర్ణిమను జూచునప్పటి చూపుల కెంతో యర్థమున్న దనవచ్చును. పూర్ణిమయు నామె వాలకమును గనిపెట్టి, 'నీ వీ పాట నీ వఱకెక్కడనైనను వినియుంటివా?' అని చిత్ర నడిగెను. ఆమె తలయూఁచి, బాలుని దేసఁ జూపించి, "వీని తండ్రి వ్రాసిన దీ పాట" అను నర్థము వచ్చు సన్నలఁ జేసెను. పూర్ణిమకుఁ బూర్తిగ నను మానము దీఱిపోవుటకును, జిత్రకు వింత యనుమాన ముదయించుటకు నా పాట కారణ మయ్యెను. ఇరువురికి వేఱు వేఱు భావములు హృదయములం దల చూపసాగెను. గాన మంతతో నాఁగిపోయెను. ఆ రాత్రి యొకరితో నొకరు మాటాడఁజాలక పోయిరి; కాని, బాలునియందు మాత్రము వాత్సల్య మిద్దఱకు నుద్దిగానే యుండెను. పూర్ణిమను వదలి యీ బాలుఁ డొక నిమిషమయిన నెవ్వరికడ నుండకుండెను. మఱునాఁటి యుదయము పూర్ణిమ, తన మనస్సు నొక విధముగాఁ గుదురు పఱుచుకొని చిత్ర కడకేగి యక్కా!

లోనికి రమ్మని పిలిచి తన చీర గట్టించి తనతో సమానముగా నగ లిచ్చి యలంకరించి నిలువు టద్దమున కెదురుగ నామెతో నిలుచుండెను. బాలుని సంతోషమునకు మేర లేదు. రెండమ్మలు, రెండమ్మ లని కేకలు పెట్టసాగెను. దేహచ్ఛాయ లించుక భేదముగా నుండుట దక్క నాకారములం దిసుమంతయు భేదము గానరాదయ్యె. ఇరువురు నా పోల్కి కచ్చెరువందిరి. "అక్కా! మన మిద్దర మిట్లు లక్కసెల్లెండ్ర వలె నుండుట కేమి కారణము? మన మక్కసెల్లెండ్రము గాము; మే నత్త మేనమామ కూఁతుండ్రము గాము. మన కిట్టి పోల్కి యెట్లు వచ్చినది? నా కట్టి బంధుగు లెవ్వరును లేరు. మా చిన్న నాయన యుద్ధములోఁ బోయెను. ఇదేదో పూర్వ జన్మ సంబంధ మయి యుండునా?" అని పూర్ణిమ పలుకఁ జిత్ర వలవల నేడ్చి, పూర్ణిమను కౌఁగిలించుకొని తన్ను విడువ వలదని సంజ్ఞలతో బ్రతిమాలుకొనెను. "నిన్ను నేఁటికిని విడువను. నీవు నా సోదరి వని యెంచెదను. నా పినతండ్రి కొక కూఁతురుండి యామెయే నీ వయి యిచ్చట నా యొద్ద నిట్లు కూరుచున్న నే నెంత యానందించి యుందును! పుట్టుకచే నట్టి యదృష్టము లేకున్నను, నేఁటినుండి మన మిరువురమును దోఁబుట్టువుల వలె మెలంగుదము. నీ బిడ్డఁడు నా బిడ్డఁడు. నా యిల్లు నీ యిల్లు. ఊరడిలుము" అని పలుకుచుఁ బూర్ణిమ చిత్ర నాలింగనము చేసికొని యోదార్చెను. మామగా రూరినుండి వచ్చువేళ యగుటచే దిగ్గన నటనుండి లేచి పూర్ణిమ, చిత్రను దాని కుటీరమునకుఁ గొంపోయి విడిచి మరలి వచ్చి చావడిలోఁ గూర్చుండి

"యి దంతయు నింద్రజాలమా! ఇం దెంతేని సత్య మున్నదా!" అని చెక్కిటఁ జేయి చేర్చుకొని విచారింపసాగెను.

అంతలో వాకిట గుఱ్ఱపు డెక్కల చప్పుడు విన వచ్చెను. ఉలికిపడి లేచి పూర్ణిమ దేవిడి గుమ్మము దెస దృష్టిసారించి చూచెను. శ్యామసుందరుఁడు గుఱ్ఱమునుండి దిగి వచ్చుచు నామెకుఁ గనుల విం దొనర్చెను. సర సర నెదు రేగి నవ్వుచు శ్యామసుందరుని బలుకరించి కై దండ యొసంగి లోనికిఁ దోడి తెచ్చి పూర్ణిమ, యతని పాగా నంగర ఖా నందుకొని యొక చోట నుంచి నీళ్లు తెచ్చి యతని కాళ్లు కడిగి తడియొత్తి, యతఁడు మొగము కడుగుకొన నంగ వస్త్రముతో మోము దుడిచి యుచితాసనంబునఁ గూర్చుం డఁ జేసి తాళవృంతమును బట్టుకొని యా మాటయు నీ మాటయు నడుగుచు విసరుచుండెను. శ్యామసుందరుఁ డన్ని టికి సమాధానమును చెప్పుచుండెను. ఆ తరుణమున, 'నమ్మా!' యని పిలుచుచుఁ జిత్రా తనయుఁ డచ్చోటికిఁ బరుగెత్తి వచ్చెను. బాలుఁ డగుపించి నంతనే పూర్ణిమ విసనకఱ్ఱ నతనిచేతి కిచ్చి నవ్వుచు, 'బాబూ! ఇటు రమ్ము' అని చిన్నవాని కెదురేగి యెత్తుకొని భర్త సన్నిధికిఁ దెచ్చెను. శ్యామసుందరుఁడు నవ్వుచు, 'నెఱజాణవు. ఇంతలో నింత బాలకుని గంటివే!' అని యడిగెను. పూర్ణిమ, 'ఔను. వీనిం గని నాల్గు నాళ్ళయినది. మీరు వచ్చునప్పటి కేదయిన నొక వింత చెప్పవలయును గదా, వినుఁడు' అని చిత్ర వచ్చిన దాదిగా జరిగిన సమాచార మంతయుఁ బూసగ్రుచ్చినట్లు వచించెను. శ్యామసుందరుని

యవస్థ వర్ణ నాతీతముగా నుండెను. ఎంత యాఁపినను నాఁగక యతని కనుఁగొలుకులనుండి యశ్రువులు జల జల రాలఁ దొడఁగెను. పరవశుఁడై యాతఁ డా బాలు నాతో కడనుండి తీసికొని యక్కునఁ గదియించుకొని ముద్దాడుచు నపార సుఖ సుధా తరంగ మాలికలఁదేలి యాడుచుండెను. ఱెప్ప వేయక తన మోముఁ జూచుచున్న పూర్ణిమం బూర్ణ దృష్టిం జూడ నోడి తల వాంచి, "యేదీ యా దీనురాలు!నా హృదయానంద నిదాన మా మూఁగ బాలిక యేదీ? ఎచ్చట నున్నది!" అని పూర్ణిమ నడిగెను. బాలుఁ డెన్నాళ్ళనుండి యో చనవు గల వానివలెఁ గన్నతండ్రి కౌఁగిలిలో నంటుకొని స్పర్శ సుఖానుభూతి నొందుచుండెను. పూర్ణిమ డెందము చేయిపెట్టి కలఁచిన ట్లయ్యెను; పలు వికారములకు లోనయ్యెను. పూర్ణిమా సతి యావేగము నంతయు నణఁచికొని మఱి మాటాడ నేరక సర సరఁ గుటీరమున కరిగి చిత్రను దోడ్తెచ్చెను. చిత్ర ద్వారము కడ కేతెంచి యంత ర్భాగంబునం దన తనయు నెత్తుకొని ముద్దులాడుచున్న శ్యామసుందరుం గాంచి కెవ్వునఁ గేక వైచి యొక్క పరుగునఁ బోయి యతని పాదముల పయిం బడియెను. శ్యామసుందరుని కొడలితెలివి జాఱిపోయెను. బాలు నటు నిలువఁ బెట్టి యతడు చిత్రం బట్టి యెత్తి గాఢాలింగనము చేసికొనెను. బాలుఁడును, బూర్ణిమయు నివ్వెఱపాటుతో నటు చూచుచుండిరి. కొన్ని నిమిషము లానం దావేగముచేఁ జిత్రా శ్యామసుందరులు మేనులు మఱచి యట్టులేయుండిరి. ఆ దే లోకమో వారికిఁ దెలియరాదయ్యె. చిరకాల విరహ

దుఃఖము పటాపంచ లయి పంచ బంగాళీ మయి మటు మాయ మయి పోయెను. ఆనంద విలాసము కోటి కెక్కెను. పూర్ణిమ యనుమానము దీఱిపోయి యసలు సంగతి ప్రత్యక్ష మయ్యెను. ఆమె హృదయము బగ్గున మండెను. అసూయయుఁ గ్రోధానలమును నామెం బూర్ణ రూపమునఁ జుట్టి వేసెను. గిఱ్ఱున నచ్చోటినుండి మరలి మేడమీఁది కేగి తన గదిలో నేలంబడి కన్నులు వాచిపోవునట్లు లామె యేడువ సాగెను. ప్రపంచ మంతయు నంధకార బంధురమయి సర్వ శూన్య మయినట్లు లామెకుం దోఁచెను. ఆహా యెట్టి చిత్ర సంఘటనము!

ఆనం దావేగ మడఁగిన పిదపఁ జిత్ర, శ్యామసుంద రుని కౌఁగిలినుండి లేచి, చారెఁడు కన్నులం దము విలోకించుచుఁ జెంత నిలుచుండిన ప్రియపుత్త్రి నెత్తుకొని ముద్దులాడి పతి యొడిలో నుంచి కన్నీరు నించెను. బాలు నందు కొని శ్యామసుందరుఁడు చిత్ర వంకఁ జూచి, "చిత్రా! ఏడువకు మేడువకుము. నీ కష్టములు గట్టెక్కినవి. దుర్విధి నిన్నిట్టి కష్టములకు లో పఱచినది. నా తండ్రి యానతిని మీఱఁజాలక నీ సంగతి యాయన కడ నెత్తలేక యేమి యుం దోఁపక విరహవ్యాధిచే వేఁగి వేఁగి, తుద కచ్చము గ నిం బోలియున్న యమ్మచ్చె కంటిం బరిణయ మైతిని. నేఁ జేసినది తప్పే. అయినను బరాధీనుఁడ నగుట నన్ను నీవు మన్నింపవలయును. దానిం జూడ నిన్నుఁ జూచిన ట్లుండుటయు దీనికిం గారణ మయ్యెను. అంతే కాని నిన్ను దిగనాడి భోగాపేక్షచే న కార్యంతం జెట్ట పట్టలేను. దానిని దొలు

తొల్తం గాంచినప్పుడు సర్వాభరణ భూషితవై చిత్రా! నీ విచ్చటికి వచ్చితి వనుకొంటిని; పూర్ణిమ మాటలాడి నప్పుడు నీకు మాటలు వచ్చె ననుకొంటిని; ఆమె వీణ వాయించి పాడిన తటి నీకే దేవతయో యట్టి శక్తి గలుగ వర మొసంగి యనుగ్రహించె నని యెంచితిని. నా తప్పు మన్నించెదవా? చిత్రా! నా తప్పు మన్నింతువా? పాపము! నీ వెంత కష్టపడితివో, యెంత దుఃఖించితివో, క్రూరాత్ముఁ డని నన్నెంత దూరితివో, యీ యిరువది యోజనము లెట్లు లొంటరిగాఁ బయనము సేసితివో, యెట్టి కడగండ్ల నొందితివో! నే నేమి సేయుదును? కృతఘ్నుఁడను గాను; కట్టిడి మానిసిని గాను. నిన్నుఁ దలంపని నిమిషము లేదన్న నతిశయోక్తి కాదు. నిన్ను గుఱించి చంద్రన్నకు జాబు వ్రాసినాఁడను. నీవు నెలతప్పితి వనియు నపకీర్తికిఁ బాల్పడితి వనియు, నడి కోర్వలేక నన్ను వెదక నూరు విడిచి బయలుదేఱితి వనియుఁ జంద్రన్న తెలియఁబఱిచి నాఁడు. ఆహా! ఆనాఁడే నేడ్చిన యేడుపా సర్వాంతర్యామి యగు సర్వేశ్వరునికే యెఱుక. అది మొద లెందఱినో నిన్న న్వేషింపఁ బంపితిని. ఒక్కఁడును నీజాడఁ దెలుపఁజాలఁ డయ్యె. ఈ రెండేండ్లను నేను జీవచ్ఛవము నయి యుంటిని; నిను వెదకి కానక వచ్చితిని. ఈ నాఁటికి నా మొఱ చెవి సోకి దైవము నిన్ను నా కంటఁబెట్టెను. నా యారాట మడంగెను. కృతార్థుఁడ నైతిని. ఈ పుత్త్రాలింగ నానందము నాకీ నాఁటికి లభింపఁజేసిన దైవమును, నా హృదయారాధిదేవతవైన నిన్ను నాదరిఁ జేర్చిన నా యిలువేల్పును నే

నెన్ని విధములఁ నుతించినను దనివి దీఱదు. ఇంక మి మ్మొక్క నిమిష కాలమయిన నెడఁబాసి యుండను. చిత్ర! నా నేరమును మఱచి నన్ను మన్నింతువా!" అని శ్యామసుందరుం డింక నేమో పలుకుచుండఁ జిత్ర యతని వారించి కన్నులు తుడుచుకొనెను. తా ననుమాన పడిన సంగతి నిశ్చయ మని చెప్పుచు శ్యామసుందరుఁడు, తన్ను మన్నింపుమని వేఁడుకొన్నంతనే, చిత్ర దుఃఖము మఱు మాయ మయ్యెను. ఆమె మగనిమాట కడ్డము వచ్చి, తనకు దుఃఖము గాని, కోపముగాని లే దనియు, జరిగినది సర్వేశ్వ రేచ్ఛచే జరిగిన దనియు, మఱి యావిషయమున నేమియు నలజడి పడవ ద్దనియు సంజ్ఞలచే నతనికిఁ దెలియఁజేసి పాదములపై వ్రాలెను. శ్యామసుందరుని యానందమునకుఁ బట్టఁ బగ్గములు లే వయ్యెను. అతఁడు చిత్ర నెత్తి కొడుకు నామెను కౌఁగిలించుకొని ముద్దాడి, "చిత్రా! నీవు సుగుణాలగనివని నే నెఱుంగుదును. నీవంటియిల్లాలు లభించుటకే నెంత తపంబుఁ బూర్వజన్మంబునఁ గావించితినో యూహింప లేకున్నాను. నీకును, మన ప్రేమ ఫలమగు నీ చక్కనయ్యకు నీ నాఁడు మొదలెట్టి లోపమును రానీను. నమ్ముము" అని యామెచేతిలోఁ జేయివేసెను. అంతఁ జిత్ర, మేడ పై భాగము వైపుచూపి, పూర్ణిమ నోదార్చి ప్రసన్నురాలను జేసి రమ్మని సంజ్ఞలతో మగనిని వేడుకొనెను. శ్యామసుందరుఁ డందుల కంగీకరించి, లేచి యా సతీసుతులను గుటీరమునకుఁ బంపి, తాను పూర్ణిమ ననునయించుటకై మేడ పై క్కెక్కి పూర్ణిమా గది కరిగెను.

పూర్ణిమ, తన గదిలో పట్టెనేలను బండుకొని యేడ్చు చుండెను. ఆమెం జూచి శ్యామసుందరుఁడు దిగులుపడి, యామె చెంతకుఁ బోయి ప్రక్కను గూర్చుండి, మీఁదఁ జేయి వేసి యామె గడ్డము పట్టుకొని, 'పూర్ణిమా! నన్ను మన్నింపవా?' అని యడిగెను. పూర్ణిమ, చట్టున లేచి దుఃఖము పొంగి పొరలి రా నేడ్చుచు, 'నేను మిమ్ము మన్నించుటా? తప్పు. మీ భార్యను, గుమారునిం బెట్టుకొని మీరు హాయిగా నుండుఁడు. మీ దారికి నేను రాను. మీరు నన్ను మోసము చేసితిరి. నా గతి యింక దుర్గతియే' అని వెక్కి వెక్కి యొక్కొక్కమాటగా ననెను. 'పూర్ణిమా! అట్లన రాదు. నీ గతి తోడిదే నాగతియు, నా దీనురాలి గతియు నని తలంపుము. మా యుదంత మంతయు నీకు వినిపించెదను. అంతయు విని నేను శిక్షార్హుఁడ నని నీకుఁ దోఁచెనేని నీ యిష్టము వచ్చిన శిక్ష విధింపుము. నీకా హక్కు గలదు. తొలుత నేను మిత్రులతో ధర్మవర ప్రాంతమున కేగి చిత్రను గాంచితిని. చంద్రన్నయను నొక బాలునివలన నామె యుదంతమును విని జాలి గొని యామెతోఁ బరిచయము గలుఁగఁ జేసికొని యీశ్వరసాక్షిగా నామెను నా ప్రాణేశ్వరిం జేసికొంటిని. చిత్ర, చిత్రప్రతిభ గలది; మూఁగది; అమాయికురాలు, అగతిక. ఆమెను ద్రోహము చేయఁ దలంప లేదు. దుర్విధిచే నామెకుఁ దెలుపక యకస్మాత్తుగా నా తండ్రివెంట మైసూరు రావలసి వచ్చినది. ఆయన నిర్బంధముచేతనే నిన్నుఁ జూడ నా నాఁడిచ్చటికి వచ్చితిని. అచ్చముగా నామెవలెనేయున్న నిన్నుఁ జూచి యాశ్చర్యసంభ్రమం

బులచేఁ బులకిత గాత్రుఁడ నైతిని, ఆమె నన్యాయము చేయఁ దలంపలేదు. నిన్ను మోసగింపఁ దలంపలేదు. నీ రూపమే దీనికిఁ గారణము. నీవుచూచినను, బొమ లెత్తినను, నేటు తిరిగినను, నవ్వినను, సిగ్గునఁ దలవంచుకొన్నను, జిత్రయే యనుకొంటిని; నీవుమాటలాడినప్పుడు, వీణవాయించి పాడినతఱిని, నే దేవతా వరప్రసాద మహిమచేతనో చిత్రకు వాగింద్రియము వశ మయి, గాన విద్యా విశారదత్వ మలవడియె ననుకొంటిని. నీ సన్నిధిని వీడి మైసూరున కే నరిగినంత నీవు చిత్రవు గావనియు, నిన్నుఁ బెండ్లాడఁ గోరుట మీ యిరుపురిని మోస పుచ్చుటయే యనియు నెంచి నేఁ దెలిపెదనన్న కాలమునకు నా యభిప్రాయము మీకుఁ దెలుప నేరనైతిని. నీ వింకొకనిం బెట్టపట్టనుంటి వని నా తండ్రి చెప్పిన తఱి, నయ్యో నా చిత్రా రూపిణి పరాధీనయయినచో, నా లోచన చందన రసము పర హస్తగత మయినచో మఱి నేఁ జూడఁ జాలఁ గదా! యని యాలోచించి నీ కడకు వచ్చితిని. నీ సన్నిధి నున్నప్పుడు చిత్రయు, నీవును వేఱను తలంపు లేని వాఁడ నగుటచే నా నాఁడు నీ వాడిన యమృతోక్తుల కలరి యొడలు మఱచి నినుఁ గౌఁగిటఁ గదియించు కొంటిని; ముద్దాడితిని. అట్టి సమయమున నీ జనకుఁ డిచ్చోటి కరుదెంచెను. జ్ఞాపక మున్నదా పూర్ణా! అంతగా నిన్ను మర్యాదా కోటిం బ్రవే శింపఁజేసి పిదపఁ బెండ్లాడ ననుట ద్రోహము గాదా! నా గౌరవమునకును లాఘవము రాదా! విధి నిర్ణీత మిట్టు లున్న దని మఱుమాటాడక నీ పాణిని గ్రహించితిని. అది వన లత. నీ వుపవన లతవు. అది యడవి మల్లె, నీ వుద్యాన మల్లికవు.

ఇరువురు నాకు రెండు ప్రాణములు. మన ముప్వురకును బంచ ప్రాణ రూపి యయి యా బాలుఁడు వెలుఁగొందు చున్నాఁడు; పరమేశ్వరుఁ డిన్నాళ్ళకు నాయందుఁ గటా క్షించి మన ప్రాణము లన్నియు నొక్కచోఁ గూర్చినాఁడు. అప్ప డప్పుడు నా పరాకునకు నీవు కారణ మడుగుచుంటివి. ఇప్పుడు నీ కది బోధపడి యుండును. దాని నన్యాయము సేయ నా మన సొప్పదు. నీవు సుముఖురాలవు గాకున్న నాకు బ్రదుకు లేదు. చిత్ర కిప్పుడే నీవు నా భార్య వన్న సంగతి విశదమయినది. అది యిసుమంతయు నొచ్చుకో లేదు. నిన్నోదార్పుమని నన్నుఁ బంపినది. నీవు నామె నెడసేయక నీ తోఁ బుట్టువు వలెఁ జూచుకొనుము. నీ యిష్టము ననుసరించి మే మిరువురమును దిరుగువారము. నా పుత్త్రిని నీ కిచ్చి వేసితిని. నీవు సుగుణ కలాపవు; నాప్రార్థన మువన్యథాకరింపవని నమ్మెదను. నీ యధరమ్మునఁ జిఱు నగవు దొలుకాడు నేని మన ముప్వురి జీవితములును సుఖ పరిణామము లగును. నీవు కోపము వీడవేని యేది యెట్టు లగునో యగమ్య గోచరముగా నున్నది. నీ యిష్ట మేమో యున్న దున్నట్లు వచింపుము "

అని శ్యామసుందరుఁడు పూర్ణిమ నోదార్చి లాలించి యడుగ నామె, డెందము పదిల పఱుచుకొని, "మీ రన్నట్లు కులగోత్రము లెఱుంగని యొక యాటవిక కాంతను నా సోదరి యనుకొని దాని పొత్తున నెట్లు కాపురము సేయఁ గలను! మీ యాన జవదాఁటఁ జాలక నే నంగీకరించినను లోక మే మనుకొనును? నలుగురిలోఁ దల యెత్తుకొని తిరుగఁ గలమా!" యని పలికెను. "పూర్ణా! అది కుల గోత్రములు

లేనిది గాదు. అదియు మనజాతి రాజ రత్న శలాకయే. నేఁ డొంటరిగ నామెను వరించునప్పుడు మీరే జాతి వారని సైగల మూలమున నన్నడిగినది. మైసూరు రాజ కుటుం బస్థుఁడ నని నే నన్నప్పు డామె మోము వికసించెను, తానును దజ్జాతిం జేరిన దాన ననియే సూచించినది. కావ లయు నన్ని ంకఁ గొన్నాళ్లు చిత్రను మనము రహస్యముగా నౌకచో నుంతము. ఈ ప్రాంతములయందు వారి కుటుంబ మును గూర్చి వాకబు చేసినచో నిజము తెలియక పోదు. చిత్ర తండ్రి టిప్పుసుల్తాను కడ నౌక సేనాధ్యక్షుఁడుగా నుండె నని చంద్రన్న యను నౌక బాలుం డా నాఁడు నాతోఁ జెప్పియున్నాఁడు. మా భట్టు నిక్కార్యము నకై నియమింతము. ఏమందువు!" అని శ్యామసుందరుఁ డడుగఁ బూర్ణిమ, 'తమ చిత్తము. మామగారీ పూట యేలొకో రారైరి; సాయంత్రము దప్పక వత్తురు. వారు పెద్దలు. వారు సెలవిచ్చిన చొప్పున మనము నడుచుకొనుట మనకు విధి' అని బదులు చెప్పెను. పూర్ణిమ దుఃఖ ముపశ మిల్లెను. ప్రసన్న వదనయై లేచి తా నొందిన యసూయా క్రోధములకుఁ దన్ను మన్నింప శ్యామసుందరు నామె వేఁడు కొనెను. శ్యామసుందరుఁ డామె చేయి పట్టుకొని లేచెను. వారిద్దఱును జిత్రా మందిరమునకు వచ్చి నిలిచిరి. పూర్ణిమ చిత్రకడ కేగి యామెం గవుంగిలించుకొని, "సోదరీ! మన మిద్దఱ మొక్క దేహ మొక్క ప్రాణముగా నుండఁగ వల యును. నీ పయి నాకిసు మంతయు నీసు లేదు. మన శుభ ములకు నుపాస్య మీ యొక్క దైవమే. బాలుఁడు గోపాల

శ్రీకృష్ణుఁడు మన కిద్ద్వరికిని ముద్దు బిడ్డఁడు. నీవు నా సోదరివే. నిన్ను విడువనని నే నిచ్చినమాట తిరుగను" అని పల్కెను. చిత్ర కృతజ్ఞతకు నానందమునకు మితిలేక పోయెను. అమృతమయములగు పూర్ణిమా వాక్యములు విని శ్యామసుందరుఁడును మైమఱచెను. శ్యామసుందరుఁడు కొడుకు నెత్తుకొని కుటీరమునుండి బయలు వెడలెను. చిత్రాపూర్ణిమ లిర్వం కల రుక్మిణీ సత్యభామలం దలపించుచు వచ్చుచుండిరి. అంత వఱకు లేఁత వంకాయల బేరములో మునిఁగి, యేర్చి గంపెఁడు కాయలం గొని పట్టించుకొని యనంతాచార్యులు గారు లోనికి వచ్చిరి. ఆ వెనుక నవ్వుచు రామచంద్రభట్టు వడి వడి వచ్చి, "యాచార్యోత్తమా! అ ద్దెస నవలోకింపుఁడు. శ్యామసుందరుని రాక ప్రతీక్షింప మిమ్ముఁ గావేరీ తీరమున నుంచినందులకు విధి చక్కఁగా నిర్వర్తించితిరి. చిత్రా స్వాతీమధ్య గతుఁడై విరాజిల్లు సుధాకరు ననువునఁ జిత్రాపూర్ణిమానుగతుఁడై శ్యామసుందరుఁ డదె వచ్చుచున్నాఁడు పదండు" అని యాచార్యుని లోనికిం గొంపోయెను.

# 20

## సదాశివ రఘురామ రాజులు

దుర్గాంబను దోచుకొని నాఁటిరాతిరి రామయ్య భీమయ్యలు, రాలనక ముండ్లనక నడచి యొకయూరు చేరుకొని మఱునాఁడు తెంగభూరికిఁ బోయి రక్షకభటులకుఁ దొంగల గుట్టుమట్టులు చెప్పిపోవుట మా పాఠకు లెఱింగినదే

కదా! అక్కడినుండి యొక యద్దెబండిలో దుర్గాంబను గూర్చుండఁబెట్టి రామయ్య భీమయ్యలు కొన్ని దినములకు ధర్మవరమును జేరిరి. అటనుండి వేఱొక బండిమీఁదఁ దత్ప్రాంతాటవిని మనకుఁ బరిచితమగు పల్లె కరిగిరి. దుర్గాంబ కా స్థలము గాంచినంతనే దుఃఖము పొంగి పొరలి రాఁ దొడఁగెను. గ్రామమును దాఁటి వా రూఁట కాలువ గట్టునకు వచ్చిరి. అక్కడి గుట్టమీఁద నున్న రావిచెట్టుం జూచి ధుర్గాంబ హోరున నేడువ సాగెను. రామయ్య భీమయ్య లోదార్చిరి. తుదకు వారు చంద్రప్రొద్దు వేళకుఁ జిత్రా కుటీరమున కేతెంచిరి. ఆ కుటీరము దుర్గాంబ దృష్టికి వింతగా నుండెను. ఏదో కొంత మార్పు గలిగె నని యామె యనుకొనుచు వాకిట నిలిచెను. కుటీర ద్వారము మూసి వెలుపల గొళ్ళెము పెట్టఁబడి యుండెను. అప్పుడే పశువుల దోలుకొని ముసలి బోయవాఁడు కుటీరమునకు వచ్చుచుండెను. దుర్గాంబ వాని నానవాలు పట్టి పలుకరించెను. అస్తమించు ప్రొద్దునకుఁ జేయి మాటు పఱిచి యా వృద్ధు దుర్గాంబను బరికించి చూచి స్మృతి తెచ్చుకొని వింతపడి, 'అమ్మా! నీవు మా దుగ్గమ్మవు కావా?' అని యడిగి కన్నుల నీరు పెట్టుకొనెను. 'ఔను గంగయ్యా! ఆ నిర్భాగ్యురాలను నేనే. నా పిల్లలేరీ! ముదసలి యేదీ? అని దుర్గాంబ గద్గద స్వరమున నడిగి యత్యాతురముతో వాని మొగముఁ జూచుచుండెను. 'అమ్మా! పది పండ్రెండు పంటలయినది మీ రాలుమగ లెక్కడికి బోయితిరో తెలియరాక పోయె. అయ్యో! తల్లీ! మీరు బ్రతికి యున్నారని మే మనుకో

లేదు. ఆహా! ఆ నాఁడు గాలివాన పెట్టిన రాత్రి నాకు నోరాడదు తల్లీ!'' అని ముసలిబోయ వలవల నేడ్చి క్రిందఁ జితికిలఁబడెను. దుర్గాంబకుఁ బై ప్రాణములు పైనే యెగిరి పోయిన ట్లయ్యెను. రామయ భీమయలు వాని నోదార్చిరి. పిదప వాఁ డేడ్చుచు "అమ్మా! ఆ రేయి మీ యింటిపైని బిడుగుపడినది. కొడుకు చనిపోయినాఁడు. కూఁతురు మూఁగ దయిపోయినది'' అని తొట్రుపడు మాటలతో వాక్యము ముగించి వాఁ డేడ్చెను. దుర్గాంబ వాక్య ప్రథమ భాగమును విన్నంతనే, 'అయ్యో! అయ్యో!' అని కూలఁబడియెను. మూర్ఛయామెను ముంచి యెత్తెను. ఎవ రెన్ని యుపచారములు చేసినను మఱి యామెకుఁ దెలివి రాలేదు.

బోయ, కుటీరము తలుపు తెఱచి దుర్గాంబకుఁ బ్రక్క వేసెను. రామయ్య భీమయ్యలు దుర్గాంబం దెచ్చి యా ప్రక్కపయిం బరుండఁబెట్టి యుపచారములు సేయుచుండిరి. ఆ రాత్రి యంతయు వారికి నిదుర లేదు. ఆమెకుఁ దెలివి రా లేదు. మఱునాఁ డా యభాగిని కన్ను దెఱచెను. ప్రపంచ మంతయు నా సతీమతల్లికి శ్మశాన ప్రాయముగా నుండెను. ఒకటి రెండు నెలలకుఁగాని దుర్గాంబకుఁ బ్రపంచ జ్ఞానము గలుగదయ్యెను. తెలివి వచ్చిన పిదప నడప దడప నామెకు మిక్కుటముగా జ్వరము వచ్చుచుండెను. చుట్టు పట్టుల దిన మొక్కరుగాఁ గూలియునాలియుఁ జేసి డబ్బు తెచ్చి రామయ్య భీమయ్యలు బోయవాని తోడ్పాటుతో దుర్గాంబను సంర క్షించుచుండిరి. దుర్గాంబ లేచి నడయాడునాటికిఁ బదునా లుగు మాసములు పట్టినది. తరువాత గంగయ్య వలనఁ

జిత్రా చరిత్రమును విని దుర్గాంబ మరల మనోవ్యాధికి లోనయ్యెను. దుఃఖములు తఱుగని తంపియై కడలి కెరటములవలె నెడతెఱపిలేక వచ్చి యా యిల్లాలిని ముంచివేసెను. ఉక్కు గుండు వంటి దుర్గాంబ చిక్కి శల్య మయ్యెను. ఇంక సౌఖ్య మన్నది స్వప్నమందుఁ గూడఁ గాన రాదని యామె వివశయై పోయెను. అట్టి సమయమందును నాశ వీడదు. కష్టములు ప్రవాహరూపమున నతిత్వరిత గమనంబున వచ్చి పడుచున్నను వానిని దాఁటి యాశ, ముందునకుఁ బరువెత్తుచునే యుండును. దుర్గాంబ, చిత్రను వెదుకవైనూరునకుఁ బోవ సమకట్టెను. రామయ్య భీమయ్యలామె కక్కార్యంబునఁ దోడుపడ నంగీకరించిరి. కాని, దుర్గాంబ కొడల జవసత్వములు గలుగలేదు. ఒకవారమామె కొంత నెమ్మదిగా నున్న రెండువారము లామె జ్వరమున వేఁగుచుండెను. సముద్ర తరంగములం బడిన లఘు పదార్థము వానిచే నొడ్డుఁ జేరుటయు, లోని కీడ్వఁబడుటయుఁ గాంతేము. అట్టు లున్నది దుర్గాంబ యవస్థ. విధిలేక యామె మఱి రెండు మాసము లా కుటీరముననే యుండక తీరినది కాదు.

ఇట్టు లుండ నొక నాఁటి సాయంకాలమున కా కుటీరమున కిరువురు రాజపురుషు లరుదెంచిరి. రామయ్య వారిని దూరమునఁ గాంచి యెదురేగి వా రెవ్వరో తెలిసికొని పరుగెత్తుకొని వచ్చి, "తల్లీ! దుర్గాంబ! అయ్యగారును, వారి యన్నగారును వచ్చినారు" అని చెప్పెను. దుర్గాంబ కా మాట యథార్థమని తోఁచక గుమ్మము చెంతకు వచ్చి

వంతలో "అయ్యో! దుర్గా! దుర్గా! మన యవస్థ యింతకు వచ్చెనా!" అని యొక పురుషుఁడు గడపలోనికి వచ్చి కూలఁబడెను. అపెయు నతని చరణ సన్నిధిని జతికిలఁ బడి హోరున నేడ్చెను. ఆ యేడ్పులోను నించుక పదునాజింట నొకపాలు సంతోషము గూడ మిళితమయి యుండెను.

## 21

### సదాశివ రఘురామ రాజులు. 2

టిప్పు సుల్తానుని సేనాధిపతియగు సదాశివరావు నాంగ్లేయులు మదరాసు గొంపోయి యచ్చటినుండి కలకత్తా కాతనిం దోడుకొనిపోయిన సంగతి మనకుఁ దెలియును. అతని పట్టుదల యేనాఁటికి నొక్కతీరున నుండుటయు నాలు బిడ్డలనైన నఁ దలంపక దైవ మెట్లు చేసిన నట్లు జరుగఁ గల దని మోఱకుఁ దనము దాల్చి యుంటయు గమనించి దొర లాతనిం గలాగ కైదులో నుంచి తగిన వసతులు గూర్చి కాపాడుచుండిరి. ఒక నాఁటి రాతిరి సదాశివరావు నిదు రించుచు నొక స్వప్నమును గాంచెను. ఆ కల తెల్లవాఱు వఱకును సందర్భయుక్త మగు నొక కథవలె నాతని నానం దాంబుధి నోల లాడించెను. ఆంగ్లేయుల నిర్బంధము నుండి త న్నొక యాప్తపురుషుఁడు వచ్చి విడిపించి తోడ్కొని పోయినట్లును, దొంటివలెఁ దన బంధుమిత్రులతోఁ దాను హాయిగ నున్నట్లును, నెవ్వఁడో చిన్ని బాలుఁడు తాతాయని తన దాడిని దువ్వుచున్నట్లును, "నీ కష్టములు గట్టెక్కి నవి. వెట్టిపట్టు విడువుము; దేశకాలోచితములయి యుద్దేశ

ములు నూలుచుండ వలయును. లే లె మ్యింటికి రమ్ము" అని యెవరో తన్ను లేపు చున్నట్లును నతఁడు స్వప్నము గాంచెను. అతఁ డులికిపడి లేచి నలువలంకులఁ బరికించి చూచెను; గాని యొకరును గాన రారైరి. తెల్ల వాఱెను. ప్రాతః కాలమున నంత స్పష్టముగా వచ్చిన స్వప్నము మిథ్య కాదని సదాశివుఁ డుత్సాహపూరిత హృదయుఁడై కాల్య కృత్యములఁ దీర్చుకొని యాలోచించుచు నొకచోఁ గూరుచుండెను. ఆలోచన లల్లిబిల్లిగా నాతని బుద్ధి నల్లుకొన సాగెను. అందు వింతయైన మార్పు గానవచ్చెను. "సుల్తాను పోయినాఁడు. రాజ్యము మన బంధువుల కధీన మయినది. నే నీ కారాగారమున నిట్టి గట్టి మొుఱకు పట్టు పట్టి యెవ్వరి కే ముపకారము గావింపఁ గలను! ఛీ, ఛీ గతించిన దేదో గతించినది. దానితో నింకేమి యుఁ బ్రయోజనము లేదు. ఈ సారి యా దొర బిడ్డలును వచ్చిరేని వారి యిష్టానుసార మొడంబడి యీ పాటి కిల్లు సేరెదను. ఆహా! నా పసిపాప లేమయిరో? పరమ గుణధన్య నా భార్య యెట్టులు వారిం గాపాడఁ గలుగు చున్నదో! ఎవ రెట్టు లున్నారో! ఎంత మతిమాలిన పట్టు పట్టుకొని వ్యర్థముగా నింత కాలము కారాగారంబునఁ బడియుంటిని" అని తలంచు కొనునప్పు డా యుద్ధవీరు నినుపగుండె క్రమక్రమముగాఁ గరఁగి కన్నులు చెమ్మగిల్లెను. ఒండు రెం డశ్రు బిందువులు రాలి ముది చెక్కులపయిం బడెను.

అంతలో సదాశివరా వున్న గది తలుపు తెఱవఁ బడెను. ఇరువురు దొరలును నొక హిందువుఁడును న చ్చో

టికి వచ్చిరి. వారిం గాంచి సదాశివరావు కళవళపడెను. "సోదరా! సదాశివా! తుదకు నీకీ గతియా ప్రాప్తించినది!" అనుచు నా హిందువు (రఘురామరాజు) సదాశివునిం గౌఁగిలించుకొని యేడువసాగెను. సదాశివుని కింక స్వప్నకథ జరుగుచుండె ననియే తోఁచెను; కాని, భాతృశరీర స్పర్శంబున నతని బుద్ధి మాంద్యము చెదరి తెల్వివచ్చి యా మహాపురుషుఁడు తనయగ్రజుఁడగు రఘురామ రాజగుట గుఱుతించి లేచి యతని పాదములపైఁబడి బాష్పధారలచే వాని నభిషేకించెను. రఘురామరాజు తమ్మునిం గ్రుచ్చి యెత్తి కవుంగిలించుకొని యతని కన్నీరు దుడిచి తన యశ్రువులు తుడుచుకొని తన ప్రక్క నాతనిం గూర్చుండఁ బెట్టుకొని యోదార్చెను. ఆ సౌభ్రాత్రమును దిలకించి దొర లచ్చెరువు పడిరి.

"అన్నా! నీవు పితృసమానుఁడవు. నీ మాట వినని దోషముచేతనే నే నిన్ని యిక్కట్టులకుం గుఱి యయితిని. నీ మాట త్రోసివేసిన కారణంబునఁ గుపితుండవై నా కెఱిఁగింపక కుటుంబముతో హైదరాబాదు నీ వరిగితివి. నే నొంటరినై దుర్జాతులయిన మన జ్ఞాతుల బాధలు పడఁజాలక భూమియుఁ బుట్టయుఁ దోటయు దొడ్డియు వారికి దుంబాలా విడిచి, కసుగందును, మీ మఱఁదలను దోడుకొని తెలుగు దేశమునకు వలస పోయి యొక కుగ్రామ ప్రాంతమున నొక కుటీరము గట్టుకొని యందుఁ గాపుర ముంటిని. సుల్తాను బెంగళూరు విడిచి యంతలో శ్రీ రంగ పట్టణమున నివసింప సాగెను. నే నా కుగ్రామము విడిచి

శ్రీరంగపట్టణ ప్రాంతమునకు రా దలంచు నంతలోనే సుల్తానున కాంగ్లేయులతో నాలుగు దటస్థించెను. ఆంగ్లేయులు కోట ముట్టడించి లగ్గలు పట్టుచుండిరి. దుర్గద్వారములు మూసి మేమెల్లర మతి జాగరూకులమై సంరక్షించుచుంటిమి. ఎవడో తుంటరి యాంగ్లేయుల కడ లంచము దిని పాణిద్వార మొకరాత్రిరి వేళఁ దెఱచి తెరువుచూపెను. ఆ సమయమునకు నా దురదృష్ట వశమున నా కవ్వలకుఁ బోవలసి వచ్చినది. నేను దిరిగి వచ్చుసరికిఁ గోటలోని కాంగ్లేయులు చొచ్చిరి. ఆ రెండు నిమిషములు సుల్తాను మహలు వీడి నే నేగియున్నందున నేనే దొరలకు లోనికి రాఁ దెరువు చూపితి నను నపకీర్తి నాపైఁ బడెను. సుల్తానుని కోపమును వివేకమును నీ వెఱుఁగనివి కావు. అతఁడు నన్నుఁ గోయంబత్తూరు కొండకోటలోఁ గైదు చేయించెను. నా యుదంతము మనవి చేసికొనుటకుఁ గూడ సమయము చిక్కదయ్యె. సుల్తాను దొరలతో సంధి చేసికొనెను. నే నేడేండ్లు దిక్కుమొక్కు లేక యా కొండకోటలోఁ బడియుంటిని. నే నక్కడ నున్నప్పుడు హార్బర్టను నొక శ్వేతజాతి యువకుని బందిగా నచ్చటికి సుల్తాను బంపినాఁడు. హార్బర్టు మిక్కిలి మంచివాఁడు. నాకు నాతనికిని జెలిమి గలిగెను. ఇంతలో సుల్తానుని పయిని మరల దొరలు దాడి వెడలిరని తెలియవచ్చెను. కోయంబత్తూరులో నున్న సుల్తానుని సేనలు మమ్ముఁ దోడ్కొని శ్రీరంగపట్టణమునకు బయలుదేఱినవి. త్రోవలో సమయము చూచి వారి చేతిలోనుండి నేఁ దప్పించుకొనుటయే కాక, నా మిత్రుఁడగు హార్బర్టను

గూడఁ దప్పించితిని. అతని నాంగ్లేయ సేనాధిపతుల కడ విడిచి వారి సాహాయ్యమున నేను సుల్తానుని సన్నిధి కరిగితిని. అది మంచి రద్దియయిన యుద్ధసమయము. సుల్తానునకు నేను నేరగాఁడను గా నన్ను సంగతి యంతకు ముందే విశదమయి యుండుటచే నన్నాతఁడు చూచినంతనే యెదురు వచ్చి, తన యపరాధమును మన్నింపు మని వేఁడుకొనెను. యుద్ధానంతరము మనకు జయము చేకూఱెనేని సదాశివరావే సుల్తానుఁడు, సుల్తానుఁడే సదాశివ రా వనునట్లు నిన్ను బహూకరింతు నని సుల్తానుఁడు ప్రమాణము చేసినాఁడు. ఆతని ప్రక్కను వీరావేశముతో నా యోపిన కొలంది పోరి శత్రు సేనలను నేలకుం గోలకుఁదెచ్చి ప్రభువువలన మెప్పు గాంచితిని. అయినను విధి దుర్బలమయినప్పు డన్నా! మన మేమి సేయఁగలము! శత్రు ప్రహారమ్ములచేఁ దూలి రణరంగంబున నేను మూర్ఛపడితిని. సుల్తానుఁడు మడిసెను. హార్బర్టు మైత్రి యెట్టిదో చూడుము. జయ మాంగ్లేయుల వరించిన పిదప నన్ను వెదకి పల్లకిలో నుంచి యా మిత్రశేఖరుఁడు తన బసకుఁ గొంపోయి పరిచర్యయుఁ జికిత్సయుఁ జేయించి వీరి కొప్పగించి సీమకుఁ బోయినాఁడు. మదరాసునకు నన్ను దోడ్కొనిపోయి యెనిమిది మాసములు నాకుఁ జికిత్స చేయించి యారోగ్యము చేకూర్చి తా మింతవఱకు నాకు హితోపదేశము సేయుచు నీ యిరువురు హార్బర్టు బంధువులు నా యాత్మ బంధువులయి రక్షించుచున్నారు. వీరి నే నెంతో తూలనాడితిని. నాఁటికిని నేఁటికిని వీరికి నాకును మాంట పొందలేదు. వీరు నన్ను వీడలేదు.

నే నిల్లు విడిచి పది వత్సరము లయిపోయినది. నా యిల్లా లును బిల్లలు నే మయిరో తెలియదు. అన్నా! పూర్ణిమ క్షేమముగా నున్నదా? దానికిఁ బెండ్లి చేసితివా? నేను మఱి చూడలేక పోయినాను. ఘాతుకుఁడను, క్రూరుఁడను, వాత్సల్య శూన్యుఁడను" అని సదాశివరావు చిన్న బాలుని వలె వెక్కి వెక్కి యేడువ సాగెను. రఘురామరాజు తమ్ముని కి సంభవించిన కష్టములు వినుచుఁ గన్నీరు గార్చుచు ధైర్య మవలంబించి యతని నోదార్చి లన చరిత్ర మంతయుఁ తమ్మునికిఁ జెప్పి పూర్ణిమను గోపాలరాజుగారి కుమారుఁడగు శ్యామసుందరమూర్తి కొసంగినట్లును, వారు సుఖముగా నున్నట్లును జెప్పెను. సదాశివునికిఁ గొన్ని ప్రాణములు కుదురు సేరుకొన్న ట్లయ్యెను. రాజు లిరువురును జార్లెస్ ఫిలిప్సుల నెంతయుఁ బొగడిరి. సదాశివరావు మార్వ్సుకు వా రెంతో యాశ్చర్యము నానందము ననుభవించిరి.

ఆ మఱునాఁడు ప్రియపడి దొరలతో మైత్రిచేసికొని, తన్మూలమున వారివలనఁ గొన్ని బహుమానములు గైకొని, యొక వార మయినంత నోడ యెక్కి సదాశివ రఘురామ రాజులు గొన్నాళ్ళకుఁ జెన్నపురిం జేరిరి; అటు విడిచి కతిపయ ప్రయాణము చేసి ధర్మవర ప్రాంతాటవిక గ్రామంబున కరుదెంచి చిత్రా నికేతనమున కేగిరి. వెను కటి ప్రకరణమున వచ్చిన వారు వారే యని పాఠకు లూహిం చియే యుందురు. దుర్గా సదాశివరావులు పదేం డ్లెడఁబాసి పలు బాధలకు లోనయిరి పసిపాపలకుఁ గలిగిన గతికి దుఃఖిం చిరి; చిత్రాన్వేషణ మవశ్య కర్తవ్యముగా నెంచిరి. మఱి

నాఁడు రామయ్య భీమయ్యలు వెంటరా వా రందఱును మైసూరునకుఁ బయనము సాగించిరి.

# 21

## చిత్రకు మూఁగతనము పోయెను

చదువరులారా! మన మింకఁ జిత్రా వృత్తాంతము నరయవలసి యున్నది. సాయంత్ర మగునప్పటికి మైసూరు నుండి గోపాలరాజు గారును, భట్టుగారి భార్య సీతయు, నామె ధాత్రి శ్యామలయు నుత్తరవాహిని కేతెంచిరి. జరిగిన యుదంత మంతయు గోపాలరాజుగారికి విశద మయ్యెను. భట్టు, అనంతాచార్యులుగారు, శ్యామసుందరుఁడు, గోపాలరాజును నుత్తరవాహినీ తీరమునఁ జాల రాతిరి యగు వఱకును మాటలాడిరి. చిత్రా యుదంతము దెలియవచ్చు వఱకు నామెను మైసూరులో భట్టుగారి గృహంబున నుంచుట కేర్పాటు చేయఁబడెను. ప్రాతఃకాలముననే ప్రయాణమని నిశ్చయించిరి. భట్టు రహస్యముగాఁ జిత్రయొక్క పుట్టుపూర్వోత్తరములు తెలిసి నంతవఱకు శ్యామసుందరు నడిగి తెలిసికొనెను. అందఱు నింటికి వచ్చి తమ నిశ్చయమును జిత్రాపూర్ణిమల కెఱింగించి భుజించి శయనించిరి.

చుక్క పొడిచెను; కోడి కూసెను. చిత్ర, లేచి తోఁట లోని కేగి తిరిగి వచ్చి శ్యామసుందరుని గది కెదురుగఁ జాగిలపడి మ్రొక్కి లేచి తన కుటీరమువైపు చూచెను. ఏమున్నది? తన పంచప్రాణ రూపి యగు బాలుఁడు పండుకొని యున్న యా బహిర్మందిరమునకు నిప్పంటుకొని

మంట లాకాశము నంటుచుండెను. చిత్రకుఁ బై ప్రాణములు పైనే యెగిరి పోసాగెను. ఆ దీనురా లొక్కపరుగునఁ గుటీరమువైపు పరుగెత్తుచుండ, "అమ్మా! అమ్మా!" అని బాలుఁ డేడ్చుచు నామె కాళ్ళలోఁ బడెను. చిత్ర గొడ లంత జల్లు మనెను; పోయిన ప్రాణములు మరల వచ్చినట్టులు పట్టరా నంత యానందము గలిగెను. ఆమె, బాలునిం గ్రుచ్చి యెత్తి యక్కునఁ గదియించుకొని యొక్క పరుగున మందిర ద్వారము కడకరుదెంచి కెవ్వున నొక్క కేక వైచెను. 'హా! శ్యామసుందరమూర్తీ!' యను పిలు పప్రయత్నముగా నామె నోటినుండి వెడలెను. పదేండ్లనుండి యెట్టి కారణముచే నామె వాగింద్రియము నిలిచి పోయెనో మరల హఠాత్తుగా నట్టి కారణము చేతనే విడివడెను. ఆమె కదంతయు స్వప్న ప్రాయముగా నుండెను. ఇంతలో రామచంద్రభట్టు తలుపు తెఱచుకొని యచ్చటికి వచ్చి యచ్చెరు వొందెను. "శ్యామసుందరమూర్తీ!" అను చిత్ర పిలుపును, ద్వార పాలకుఁడు లేచి, నిప్పు, నిప్పంటుకొన్న దని యఱచిన యఱపును, నగ్ని చిటపట ధ్వనులును బై యంతరువునఁ బండుకొన్న వారి నందఱను మేల్కొల్పెను. గోపాలరాజు, శ్యామసుందరుఁడు, పూర్ణిమయు, నామె సఖులును దిగి వచ్చిరి. అనంతాచార్యులు గారును లేచి వచ్చిరి. సీతయు, శ్యామలయు నవ్వుచు నట కేతెంచిరి. అందఱ కచ్చెరువు గొలిపిన దేమనఁగాఁ జిత్ర చక్కగా నప్పటి యుదంతము ముచ్చటింపఁ గలుగుటయే.

చిత్ర నందఱును లోపలికిఁ గొంపోయిరి. తనతల్లి మాటలాడుచు, నా తండ్రి నా చిన్ని బాబు, కన్న బాబు, నా గోపాలకృష్ణమూర్తి యని కోకిల లులుకఁ బలుకుచుఁ దన్ను ముద్దులలో ముంచి వేయు చున్నప్పుడు బాలునికిఁ గలిగిన యానందము వర్ణింప నలవిగాదు. "ఆ! హా! హా! అమ్మ! అమ్మ!" అని పూర్ణిమ దెసను గోపాలరాజు వైపును శ్యామసుందరుని వైపును నతఁడు నవ్వుచుఁ జప్పటులు గొట్టుచుఁ జూడఁ దొడఁగెను. చిత్ర యొక శయ్యపైఁ గూరుచుండి బాలు నొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని తా నాఱేఁ డేండ్ల బాలిక ననియు, బాలుఁడు తన చిన్నితమ్ముఁడే యనియు నెంచెను. ఈ నడుమ జరిగిన దంతయు స్వప్న ప్రాయమయి యామెకుఁ దోఁచెను. శ్యామసుందరుని సంతోషమునకుఁ బారము లేదు. చిత్ర సర్వాంగ సుందరి. అనుపమాన లావణ్యవతి, సుశీల, ముద్దరాలు, ప్రాణాధికముగా మగనిని ప్రేమించిన సతీమతల్లిక. ఆమె కొక్క మూఁగతనమే లోపముగా నుండెను. అ దెట్లు వచ్చెనో యట్టులే పోయెను. మృదుమధుర కోమల స్వరమ్మున నామె యప్పుడు తన జననీ జనకుల యుదంతముఁ దన చరిత్రము నుపన్యసించెను. అది యందఱకును సుప్రభాత మయ్యెను. అనుమానము లన్నియుఁ బటాపంచ లయ్యెను. ఆమె నెచ్చట నుంచుటకును మఱి యవసరము లేక పోయెను. పూర్ణిమ సోదరీ! నా తప్పు క్షమింపుమని చిత్రపాదములపై వ్రాలెను. చిత్రయు నామె నగ్గించి కౌఁగిలించి ముద్దు పెట్టుకొనెను. చిత్రకుఁ జెఱుత తనమునఁ బోయిన వాణీ ప్రసాదమును

మఱల( బ్రసాదింపుడని కోటి వేల్పులకు మ్రొక్కిన శ్యామ సుందరుని మ్రొక్కులు ఫలించెను. ఆ యిల్లంతయు నానంద రస నివాస మయ్యెను.

అంత నా నందము నుద్ధృతము తగ్గిన పిదప గోపాల రాజు కుటీరమున కెట్లు నిప్పంటు కొనె నని ప్రశ్నించెను. దాని కెవ్వరును బదులు చెప్పలేక పోయిరి. భట్టు నవ్వుచు లేచి నిలువంబడి, "అయ్యా! నే నొక సాహస కార్యము తలపెట్టి కృతార్థుఁడ నయినందులకు నా యిలు వేల్పుల నెంతయుఁ గొని యాడు చున్నాఁడను. నిన్న సాయంత్రము చిత్ర మూఁగతనముం గూర్చి శ్యామసుందరమూర్తి నడిగి తిని. చిత్రయు నామె తమ్ముఁడును జిలుత తనంబున నొంట రిగాఁ దమ కుటీరమున నుండు నప్పు డొక నాఁటి రేయి గాలి వాన వచ్చి యా పర్ణశాల పయిం బిడుగు పడి తగులఁ బడుటయు నందామె తమ్ముఁడు మరణించుటయు వెంటనే యామె వాగింద్రియము నిలిచి పోవుటయు మున్నగు నంశ ములు నా మిత్రుఁడు చెప్పి నాఁడు. అట్టి స్థితి మరలఁ గలిగి సంక్షోభ మపరిమితముగాఁ గలిగినచో నీమె కానాఁడు పోయిన మాట లీ నాఁడు మరల వచ్చునేమో యనుతలంపు మెఱపు మెఱసినట్లు స్ఫురించినది. దాని కేమి సేయవలయు నని యాలోచించి రాత్రియే యొక ఘక్కి నిశ్చయించి వీధి వసారాలోఁ బండుకొని జాగరణము చేయుచు సమయము నకు నిరీక్షించు చుంటిని. తెల్లవాఱు జామునఁ జిత్ర లేచి తోఁట వైపున కరిగెను. అదే యదనని యెంచి వెంటనే కుటీరములోని కేగి బాలని నిద్రించుచున్నవాని నట్టులే

ప్రక్కతో నెత్తుకొని తెచ్చి నా ప్రక్కపయిని బరుండఁ బెట్టి యీ కుటీరమునకు నిప్పంటించితిని. పిల్లవానిని లేపి యేవేవో మాటలు చెప్పుచు నెత్తుకొని చిత్ర రాకను నిరీక్షించుచు నిటు నటు ప్రచారము సేయుచుంటిని. చిత్ర వచ్చి శ్యామసుందరుని గది కెదురుగఁ గూర్చుండి చాగిలి మ్రొక్కి లేచి కుటీరమువైపు చూచెను. అప్పటికి మంటలు మింటం బర్వుచుండెను. ఆమె కెవ్వునఁ గేక వైచి కుటీరమువైపు వచ్చుచుండ నదిగో మీ యమ్మ పొమ్మని బాలునొక్క దెబ్బ చుఱుమునఁ గొట్టితిని. వాఁ డేడ్చుచు నమ్మా యని చిత్ర కాళ్ళలోఁ బడెను. నేను రివ్వునఁ దలుపు దెఱచుకొని లోపలికిఁ బోయితిని. అంతలోనే "శ్యామసుందర మూర్తి!" అను నక్షరములు స్పష్టముగాఁ జిత్రా దేవి కంఠము నుండి వెడలి నాకు వినిపించినవి. నా యెత్తు ఫలించి నందులకు బ్రహ్మానందము నంది తలుపు తీసికొని యట కేగితిని. ఇంతలో మీ రందఱును వచ్చితిరి. నా తంత్ర మంతయు సీతకును, శ్యామలకును రాత్రియే చెప్పితిని. నా జాగరణకు వారును దోడుపడిరి. ఎట్లులయిన నేమి కృతార్థుఁడ నైతిని" అని నవ్వుచుఁ బలికి కూర్చుండెను. శ్యామసుందరుని కన్ను దమ్ము లానందాంబు కణపూరితము లయ్యెను. తన ప్రాణ మిత్రుని పాదముల వ్రాలి, మిత్రమా! నీ యుపకార ఋణ మెన్ని జన్మము లెత్తినను దీర్చుకోలేను. సురాచార్యుఁడు గూడ బుద్ధికి సమయస్ఫూర్తికిని నీకు సాటిరాడు. నీకుఁ బది వేల రూకలు బహుమాన మిచ్చినాను. మాఱు మాటాడక నాయందు సోదర వాత్సల్యముంచి నీ వివి గైకొన వలెనని

వేఁడుకొనెను. పూర్ణిమ తన మెడలోనున్న వజ్రాలహారము తీసి సీతమెడలో వైచెను. గోపాలరాజును జాల సంతోషించెను. అనంతాచార్యులుగారు భట్టు బుద్ధి విశేషములఁ గూర్చి వెనుకటి సంగతు లుదాహరించుచు నుపన్యసించెను. ఆ దిన మంతయుఁ జిత్రాచిత్ర చరిత్ర కథాశ్రవణంబులతో నత్యానందముగాఁ గడచి పోయెను. ఫలితాంశ మేమనఁ జిత్ర పూర్ణిమ లేకగర్భ జనిత లగు సోదరీమణులు. కవబిడ్డలు విధివశమున శ్యామసుందరమూర్తి యదృష్టవశమున నామణులతనికి లభించిన వని యెల్లరును సంతోషించిరి.

## 23

### పూర్వోదంతములు

కొన్ని దినము లందఱు నుత్తరవాహినీ తీరంబున నుండిరి. పదంపడి గోపాలరాజు వారి నెల్లరం దోడ్కొని మైసూరున కేగెను. చిత్రాపూర్ణిమలతోను దన పుత్రి రత్నముతోను, మిత్రరత్నముతోను శ్యామసుందరమూర్తి తన దివ్య భవనంబున హాయిగాఁ బ్రొద్దులు పుచ్చుచుండెను. కాని, యతనికిని దక్కిన వారికిని గథానకమున నొకింత లోపము గన్పట్టుచునే యుండెను. మా పాఠకులు గూడ నట్టిలోపమును గమనించి యుందురు.

మధ్యాహ్నము నాలుగు గంటలు కొట్టు తఱిని గోపాలరాజుగారు కచ్చేరి సావడిలోఁ గొల్వుటీటి రైతులతో నేవో వ్యవహారపు మాట లాడుచుఁ దీఱిక లేకుండెను. ఆలోచనాధీన మయియున్న యాతని మనస్సునకు వాకిట గలిగిన

గుఱ్ఱపు డెక్కల చప్పుడులును పుట్టించెను. అతఁడు లేచి ద్వారము వద్ద కేగి చూచెను. రెండు గుఱ్ఱముల బండి వాకిట నిలిచెను. అందుండి యిరువురు పురుషులును నొక కాంతా మణియు దిగిరి. వారియం దొక్కరిని బోల్చి, "బావగారు! దయచేయ వలయును. సుదినము సుదినము" అని గోపాల రా జాహ్వానించెను. తక్కిన యిరువురం జూచి యతఁడు తెల్లపడెను. అంత నా పరిచిత పురుషుఁడు నవ్వుచు, "బావ గారు! ఇతఁడు నా తమ్ముఁడు సదాశివరావు, ఈమె యాతని ధర్మపత్ని. వీ రిరువురును బూర్ణిమం గన్న తలిదండ్రులు" అని పలికెను. గోపాలరాజు "చిత్రకూడ నిక్కడ నున్నది" అని సదాశివరాజును గౌఁగిలించుకొనెను. ఉచితజ్ఞులగు పరి చారకులు లోపలి కా యుదంతము నెఱిఁగింపఁ బరువిడిరి. ఇరువురు వియ్యంకుల నిరుగేలం బట్టుకొని గోపాలరా జంత ర్మందిరమున కరుగుదేర నంతలో మేడ కిరుగెలంకుల నున్న మెట్లపయినుండి స్త్రీలు పురుషులును వడివడి నరుగు దెంచిరి. అందఱకు ముందు శ్యామసుందరుఁడు తన నందను నెత్తుకొని వచ్చి బాలుని రఘురామరాజుగారి చేతి కిచ్చెను. చిత్రాపూర్ణిమలు దుర్గాంబ యొడిలో వాలిరి. మాతృ పరి ష్వంగ సుఖ మా యువతుల నానంద పరవశలఁ జేసివేసెను. అందఱు నక్కడనే కూర్చుండి యా యానందోత్సవమునఁ బాల్గొనిరి. బాలుఁ డందఱికిని వినోదంగు చుండెను. కొంత సేపటి కా యిల్లు కిలకిల లాడసాగెను. వర్ణనాతీత మయిన యప్పటి సంఘటనము నెవఁడు వర్ణింపఁ బూనఁ గలఁడు! అంతవఱకు వారు వా రనుభవించిన దుఃఖము లెల్ల నిమిష

మాత్రములో మటుమాయ మయ్యెను. అమృత వర్షమున నార దడిసినట్లు లాకుటుంబ మంతయు హాయి ననుభవించెను. చూపతెవ్వరు? రామచంద్రభట్టు, సీత, శ్యామల, సుందరమ్మ, దుర్గాప్రసాదుడు, అనంతాచార్యులు, వేంకటేశ్వరులు, వాసుదేవ మూర్తియు నాతని తల్లియును, చౌడప్పశాస్త్రియు నాతని భార్యయుం జిన్నికొమరుడును, రామయ్య, భీమయ్యలు, చంద్రన్న, గోపాలరాజుగారి యింటి పరిచారకులు, దాసీజనము, పూర్ణిమాసఖులు, రైతులు మున్నగువారు. అప్పుడు వారువారు వారి వారికి జేసిన యుపకృతులుగ్గడింపఁ బడియెను. తగిన సత్కారము లందఱు నందిరి. శ్యామసుందరుఁడు తన కొసంగిన పదివేలు రూకలును భట్టు, వాసుదేవమూర్తి కిచ్చివేసెను. రామయ్య భీమయ్యలకు మాన్యము లీయఁబడెను. ఈశ్వరు నద్భుత చిత్ర ఘటనల కెల్లరు నత్యాశ్చర్య పరవశు లయిరి. భట్టుగారి బుద్ధి వైభవమున కెల్లరు నతని ననేక భంగుల నుతించిరి.

సాయంత్రమయ్యెను. అర్ధచంద్రు డాకసమున రాజిల్లు చుండెను. రాత్రి భుజించి యందఱును మేడ డాబా మీఁదఁ గూరుచుండి మన నవలకు సందర్భించు వారి వారి కథల నొకరి నొక రడుగుచుఁ జెప్పుచుఁ గొంతసేపు గడపిరి. తరువాతఁ జిత్ర, దుర్గాంబ నుద్దేశించి, కన్నుల నీరుంచి, "అమ్మా! ఆ నాఁటి సాయంకాలము గుట్టలరావి క్రింది కరిగిన దానవు మ రెప్పటికిని రాకపోయితివే! కారణ మేమి! నీ కేమి యిక్కట్టులు కలిగెను! ఈ పదేండ్లును మమ్ము వీడి మా యయ్యను బాసి పలు కడగండ్ల పాలయి యెక్కడ

నెవ్విధముగా నుంటివి?" అని ప్రశ్నించెను. దుర్గాంబ తెలుపఁ జొచ్చెను.

"తల్లీ! చిత్రా! మతిమాలిన దానను. నన్నే నే నిందించు కొందును. మీ బాబయ్యగారు దొరల పటాలములోఁ గలిసి యీ దారి నేదో యత్యవసర మయిన పని మీఁదఁ బోవుచున్నారనియు నొక్కసారి వచ్చి నన్నుఁ జూచి పొమ్మనియు వారు బంపినట్లు లొక హిందువు, సిపాయి నాఁటి ప్రొద్దుపోవు వేళ రావిక్రిందికి వచ్చి నాతోఁ జెప్పెను. ఆ మాట నిజమే యనుకొని యీ తుంటరి వెంట నరక్రోసు దూరము నడిచి వెళ్ళితిని. ప్రొద్దు పోయినది. నలువురు తుంటరు లొక డోలీ చెంత నిలువంబడి యుండిరి. వారిం జూచినంతనే యది మోసమని తెలిసికొని వారి పాదములపైఁబడి యేడ్చి నన్ను నా పిల్లలతోఁ గలుపుఁ డని యెంతో వేఁడు కొన్నాను. ఆ మొఱకులకు దయ గలుగ దయ్యె. వారు, నన్ను బలవంతముగాఁ గాలుసేతులు గట్టి యీ డోలీలోఁ బడవైచి కొంత దూరము మోసికొని పోయి బిమ్మట నొక గుఱ్ఱపు బండీలో నుంచి తీసికొని పోయిరి. మాకుఁ బటాల మొక మజిలీ ముందుగా నడచుచుండెను. ఎవరు న న్నేమియు నత్యాచారము సేయలేదు; పాలు, పండ్లు, రొట్టెలు తెచ్చియిచ్చి గౌరవ బుద్ధితోనే చూచుచుండిరి; కాని, నా కేమియుఁ దోఁచలేదు. నే నేడ్చిన యేడుపు గంగా కావేరియుఁ బట్టదు. తుదకు నన్ను మదరాసు తీసికొని పోయి యక్కడి నుండి నావ యెక్కించి బొంబాయికిం గొంపోయి కోటలో నుంచిరి. కన్నులు వీడని కనుగం

దును బూర్ణిమను, మీా పెత్తండ్రికిని భార్యకును బెంపక మిచ్చివేసి, నిన్నును నీ తమ్మునిని—" అని దుర్గాంబ వల వల నేడ్చెను. చిత్రాపూర్ణిమలు గొల్లు మనిరి. సదాశివుఁడును రఘురామరాజును రోదనము చేసిరి. మిగిలినవారు, వారి నూరడించిరి. మఱి కొంత సేపటికి హృదయము నెమ్మది పఱుచుకొని దుర్గాంబ తన చరిత్ర సందర్భము నందుకొనెను. "తల్లీ! నిన్నును నీ తమ్మునిని నమ్ముకొని దిక్కుమాలిన యీా యడవిలోఁ బడి విరహానలంబున వేఁగుచు నొంటి ప్రాణముతో నున్న నాకు దైవము మీాతోఁ గూడ నెడఁబాటు కలిగించి నా హృదయమును అంపముతోఁ గఱకఱఁగోసెను దొరలు నన్నెంపుల కచ్చటికిఁ దెచ్చిరో నాకుఁ దెలియదు. సేనలోనున్న హిందువులకు వండి పెట్టుట తప్ప నాకు మఱేమియు బాధలేదు. ఆ కోటనుండి నేను వెలుపలకుఁ బోవుటకు మాత్రము వీలు చిక్కనీయరైరి. అట్టులా నగరంబున నిద్రాహారములు సరిగా లేక చూడ చుట్టమును మ్రొక్క దేవుఁడును లేక జీవచ్ఛవమనై యెనిమిదేండ్లు పడియుంటిని.

ఒక రోజు మధ్యాహ్నము మన రంగమ్మపేట జ్ఞాతి, మాధవరావుగా రక్కడ నా కగుపించిరి. నాకుఁ బంచప్రాణములు చేరి వచ్చినవి. సిగ్గు, జంకు, భయము నన్నెంత బాధించినను దెగించి యాతనిం బిలిచి, నా స్థితిగతులఁ గూర్చి ముచ్చటించి నన్నెట్టులయిన నా పిల్లలతోను, భర్తతోను జేర్పుఁడని పాదములపై బడి వేఁడుకొంటిని. అతఁ డేమియు నెఱుఁగని వాసింబోలె వింతపడి తగిన సాయము చేసెదనని

వచించి వెంటనే కచ్చేరికి వెళ్లి యొక విడుదల చీటి తెచ్చెను. మఱునాఁడు నావ యెక్కించి నన్ను మహారాష్ట్ర దేశమున నావ దింపి నాటు త్రోవను మైసూరు తీసికొని వచ్చెను. అంతవఱకు నతని ప్రవర్తన మెంతయుఁ బాగడఁ దగియుండెను. రంగమ్మపేట వచ్చి యొక్కపూట తనయింట నుండి వెళ్లవలయునని మాధవరావు కోరెను. నే నంగీకరించి వాని యింటికి వెళ్ళితిని. అతని యన్నయు, భార్యయు, సంతానము సమూలముగా నశించెను. అతని భార్యయుఁ గాలము చేసెను. మాధవరావొక్కఁడే యొక్క కొమ్మతో నున్న చెట్టువలె నుండెను. నాఁటి సాయంత్రమే నేను ప్రయాణమైతిని. అప్పుడతఁ డిట్లు చెప్పెను. "నీ పతి యుద్ధములో మరణించెను. నా సతి కలరాలోఁ జని పోయెను. నీ పిల్లలను వెదకించి రప్పించెదను. నాకుఁ బిల్లలు లేరు. నీవు నా యొద్ద నుండిపో. నీపిల్లల నా పిల్లలుగాఁ జూచుకొందును. మన మిరువురము సుఖమో దుఃఖమో పంచుకొని సంసారము చేయుదము" అని మెల్ల మెల్లగాఁ దన దోసకారి తనమును బయలుపెట్టెను. అప్పుడతనిపై నా కనుమానము గలిగి యొకొక్క ప్రశ్న వేసి, నా కన్ని యిక్కట్టులు కలుగుట కతఁడే కారణమన్న సంగతి యతని నోటనే వెలువడం జేసితిని. అప్పటి కేమియు బదులు చెప్పక యా యూరినుండి శ్రీరంగ పట్టణమున కేగు నొక కుటుంబముతో, వాని కెఱుంగ రాకుండఁ జేరి సాయాహ్నంబున బయలు వెడలి పోయితిని. పట్టణమునఁ గాలిడి నాలుగడుగు లైన నే నింక వేయక ముందే నలువురు పురుషులు నన్ను వెన్నంటిరి.

వారిం దప్పించుకొని యొక్క పరుగున వీధిలోనికి వచ్చితిని. ఆ దురాత్ములు నా జాడ కనిపెట్టి యొక సందులో నన్నరి కట్టిరి. 'రక్షింపుఁడు మహాత్ములారా!' అని యొక్క యఱ పఱచి నేను వారి చేతులలోనే మూర్ఛిల్లితిని. నాకుఁ దెలివి వచ్చు నంత బిస్తోలు ధ్వనుల వింటిని. కన్నుఁదెఱచి చూచునంత నొక శ్రీమంతుని కుమారుఁ డెదురుగఁ గూర్చుండి నాకుఁ బరిచర్య చేయించుచుఁ గాన వచ్చెను. ఆ రాజ పుత్త్రుఁడు నన్నేమో యడిగెను గాని నే నప్పు డేమియుఁ జెప్పఁ జాలక యలజడి నొంది నిద్రించితిని. తెల్ల వాఱు జామునఁ దలుపు తెఱచుకొని వీధి గుమ్మములో నడుగు పెట్టి నంతనే రాత్రి నన్ను వెన్నాడి పట్టుకొన్న తులు వలు నలువు రొక్కసారి నా నోరుమూసి నన్ను మోసికొని పోయి యొక డోలీలోఁ గాలుసేతులు గట్టి పడవైచి రాజమ్మ పేట తోఁటలో బందీ చేసిరి."

అని దుర్గాంబ చెప్పుచుండ శ్యామసుందరుఁడు నాచా ర్యులుగారును దుర్గాప్రసాదుఁడును భట్టు నొక్క వాక్కునఁ 'దల్లీ! మీరా యీ నాఁ డట్టి యిక్కట్టుల పాల్పడితిరి?' అని యచ్చెరువు పాటుతో ననిరి. "అమ్మా! ఆ యమీరు బిడ్డఁడే నీ కిప్పు డల్లుఁ డయినాఁడు. శ్యామసుందరుఁడును మేము నా నాఁడు తుంటరులం దఱిమి నిన్నుఁ దోడ్తెచ్చి మరలఁ గోల్పోతిమి" అని భట్టు వచించెను. 'అటు పిమ్మట నే మయ్యె నమ్మా' యని చిత్రాపూర్ణిమ లడుగ దుర్గాంబ మరల సందర్భము నెత్తుకొని యిట్లు చెప్పఁ దొడం గెను.

'అమ్మా! ఆ తోఁటలో నొక వారము గట్టి నిర్బంధ
మున నుంటిని. ఒక రోజు సాయంత్రము నా కడగండ్ల
కెంతయు దురపిల్లి, 'నా పతియు సంతానము నే మయిరో
యే నాఁటికైన వారితోఁ గలిసి సుఖించుభాగ్యము నా
కున్నదా?' అని నే ననుకొనుచుండ 'నమ్మా! ఉన్నది.
ఉన్నది!' అను నుపశ్రుతి వినిపించి నన్నొక్కింత సంతసింపఁ
జేసెను. తోఁట గుమ్మము కడకు మాధవరావు వచ్చి,
'ఉన్నదా?' అని నన్నుఁ గూర్చి రామయ్య నడుగ నతఁ
'డమ్మా? ఉన్నది. ఉన్నది' అని జవాబిచ్చిన మాట యది.
అంతట నా కాపాటి సంతసము గూడఁ దూలిపోవునట్లు
గంజాయి ద్రావి, మైకమెక్కియున్న మాధవరా వచ్చో
టికి వచ్చెను; తన మనస్సులోనున్న దుర్భావ మంతయు
మఱి యొకపరి వెడలఁ గ్రక్కెను. నయమున భయమునను
నా చేత నగునంత వఱకు నాతనిని మంచిదారికిఁ దేఁ బ్రయ
త్నించి దాని కనుగుణముగ మాటలాడితిని. అతఁడును
వినివి యొక్కింత దారికి వచ్చి నీకుఁ గొంత తడ విచ్చితిని.
ఆలోచించుకొనుమని వచించి యటువాసి చనియె.

ఆ రాత్రి యీ నా ప్రాణబంధు సోదరుఁడు, రామయ్య
నా కుటీరమునకు వచ్చి, మీ బాబయ్యగారిని దా నెఱుఁ
గుదు ననియు, దన కంత దనుక నే నెవతెనో తెలియ
దనియు, సాయంత్రము మాధవరావు నాతోఁ గావించిన
ప్రసంగమును, నే నిచ్చిన జవాబులును విని నిజస్థితిని దెలిసి
కొంటిననియు, నప్పుడే తన కుటుంబము నంతయుఁ గన్నవా
రింటికిఁ బంపితిననియు, మాధవరావుకడ మఱి కొలువుసేయ

నొల్లననియు, వాకిట మంచి బండి సిద్ధముగా నుంచితి వనియుఁ, దన తమ్ముం డీ భీమయ్య తోడు గలఁ డనియు, భయపడ వలదనియు బోధించి, నా పిల్లలతో నన్నుఁ గలుపక తాను దన పిల్లలను జూడనని ప్రమాణము సేసి నన్నా బండిలోఁ గూర్చుండఁ బెట్టి యతిత్వరితగతిని బ్రయాణము సేయించెను. రెండు మూఁడు మజిలీ లే యడ్డును లేక యరిగితిమి. సాయంత్రమునకు బెంగళూరు చేరుకోవలెనని మే మొక మజిలీ పయనము సేయుచుండ నా పాలిటి యభాగ్య దేవత గాలివాన రూపమునఁ బ్రత్యక్షమై ప్రయాణము సాగనీయ దయ్యె. మే మొక కాలుడవిని నిలిచిపోతిమి. వాన నిలిచిపోయిన పిమ్మట బండికట్టుకొని మేము పదిబారలు పోయితిమో లేదో, దోపిడి గాండ్రు లెటూలున నీ నా ప్రాణబంధు సోదరుల తలలు పగులఁ గొట్టి నన్ను బండిలోనుండి లాగి తమ గూడెములకు మోసికొని పోయి యొక కారాగారమును మీఁటిన యింటఁ బడవైచిరి" అని పలుక నెల్లరు నా హాహా! యని విధిని దూరి రామయ్య భీమయ్యల నగ్గించి జాలిపడిరి. "ఆ చెఱ యెట్లు విడిపించుకొని వచ్చితివి తల్లీ!" యని తనయ లిర్వురును బాష్పపూరిత నయనలై యడుగ దుర్గాంబ 'రామయ్యా! నీ చరిత్రము నీవు చెప్పు'మనెను. రామయ్య చెప్పసాగెను.

"నేనును సోదరుఁడును దలలు పగుల నెత్తుటి వెల్లువలో మునింగి యుండ బాటసారు లెవ్వరో ధర్మాత్ములా వేళ కచ్చటికి వచ్చి మ మ్మా బండిలో వేసికొని బెంగళూరునకుఁ గొంపోయి ధన్వంతరివంటి మహా వైద్యశిఖామణి

కొప్పగించిరి. పదునైదు దినములలో నమ్మహాత్ముఁడు మమ్మారోగ్యవంతులుగాఁ జేసెను. ఆయనకే తగుపాటి వెలకు మా బండిని నెద్దులను విక్రయించి, మేము దుర్గాం బకుఁ జేసిన ప్రమాణమును బట్టి యామెను వెదకుట యే ముఖ్య ధర్మమని నిశ్చయించి యన్నిటికి ననువయిన వని మే మన్నదమ్ములము జడదారి వేసములు వేసికొని యా చుట్టుపట్టుల నున్న గ్రామము లన్నియుఁ దిరిగితిమి. మా తల్లి దుర్గమ్మ మాకగుపింపలేదు; కాని యొక రాత్రి యొక బాలిక నత్యాచారముచేయఁ బూనిన గ్రామ్మాణ కులపాం సను నొకని మట్టు పెట్టి యా యమ్మాయిని విడిపించితిమి. ఇంతలో నా దురాత్ముని సేవకు లార్వురు మా పయింబడిరి. అందు మే మిర్వురం జావ మోదితిమి. మాకు మిగిలిన వారితోఁ బోరు భరమగుచుండ నెవ్వరో రాజపురుషులు గుఱ్ఱముల మీఁద నక్కడికి వచ్చి మమ్మా యాపదనుండి తప్పించిరి. పిదప మే మా బాలిక, నామె వెంట వచ్చిన బాలుని దోడ్కొని చేరువనున్న గ్రామమునకేగి యచ్చట నొక స్వాములవారి కొప్పగించి మా దారిని మేము పోయితిమి.''

అని యనుచుండ, సీతమ్మ, వేంకటేశ్వరరావును రామయ్య భీమయ్యలను దేటిపాటఁ జూచి, 'వీరే మమ్మా రాతిరి సత్రమునఁ గాపాడిన యాపద్బాంధవులయి యుం దురు' అని పల్కిరి. ''జగడము వేళకు వచ్చిన రాజబంధు వులము నేనును జిరంజీవియు నని చెప్పుట కెంతో సంతో షించుచున్నాను'' అని గోపాలరాజుగారు నవ్వుచుఁ బలి

కిరి. అన్నా! నీ యుపకార ఋణము నే నెట్లు తీర్చుకోఁ గలను? ఈ రామయ్యభీమయ్యలు మీకే కాక నాకుఁ గూడ నకారణ బంధువులయిరి" అని భట్టు, శ్యామసుంద రునితో ననెను. 'సందేహము లేదు. నేనుగూడ వారి కింకఁ గృతజ్ఞురాలనే, అని శ్యామల పలికెను. తరువాత రామయ్య దుర్గమ్మను విడిపించిన దాదిగాఁ గల కథను వచించెను. "అమ్మా! నీ వా వీరాసామి చెఱఁబాసిన మఱునాఁడో మూఁడవనాఁడో నేనును మామగారు నక్కడఁ జిక్కు కొంటిమి. అహా, ఏమి చిత్రము!" అని చిత్ర పలికెను.

అట్లు పై డాబామీఁద మన వా రందఱును ముచ్చ టించుచుండ రాజమార్గమునుండి, అయ్యో! చచ్చితిని చచ్చి తినని యొక కూ క్రందనము వినవచ్చెను. నిమిషములో నం దఱును గ్రిందికి దిగి వచ్చిరి. గోపాలరాజుగారు మున్నగు పురుషు లొక్కుమ్మడి రాజమార్గమున కేగిరి. వీరిరాకఁ జూచి హంతకులు పాఱిపోయిరి. రాజమార్గమున నెత్తురు గ్రక్కుకొనుచు నొక పురుషుఁడు పడి యుండెను. నలువు రును వానిం బట్టుకొని చావడిలోనికిఁ దెచ్చిరి; మొగము మీఁద నీళ్లు చల్లి నోటిలోఁ గొన్ని నీళ్లు పోసిరి. పాపము! ఆ దీనుఁడు కన్నుదెఱచెను. బాగుగాఁ బరిశీలించి భట్టును శ్యామసుందరుఁడును, "రంగారావు, రంగారావు" అని పల్కిరి. రంగారావు పేరు వారికిఁ గొందఱి కతి పరిచిత మయి మఱపురానిది. సీతకు, శ్యామలకు, భట్టునకు, శ్యామ సుందరునకుఁ దుదిని జిత్రకుఁగూడ వాఁ డెంతో యుపకారము చేసినాఁడు. అందఱును వానిం బోల్చిరి. ఇతఁడే నాకు

మామగా రొసంగిన కాసులసంచి దొంగిలించి నన్ను ద్రోహము చేసినవాఁడని చిత్ర వాని దుండగమును దెలిపెను. అంతలో నిరువురు పురుషులు లోపలికి వచ్చి, గోపాల రాజాదుల నుద్దేశించి, "స్వామీ! వీఁడా! వీఁడు మహాపాతకులలో నగ్రగణ్యుఁడు. వీఁడు చేయని పాపము లేదు. మా గ్రామముల కొక సిద్ధుఁడ నని వచ్చి స్వర్ణమును జేసెద ననియుఁ బూజలోఁ బెట్టి వృద్ధిపఱిచెద ననియు నమ్మించి బుస్తెలు పూసలు దోఁచి యెందఱనో పేదలను బకీరులఁజేసి యీ నగరమునకు వచ్చి దాఁగినాఁడు. వీని పోకడ తెలిసికొని యీ యూరు వచ్చి మూఁడుదినముల నుండియుఁ గాచికాచి, నేఁడు వీఁడు వేశ్యామందిరమున దొరకుటచే చెప్పకేమి గట్టిగా మర్దించినాము. తమరు మమ్మేమి సేయించినను సరే" అని పలికిరి. వారిని సమాధాన పఱిచి గోపాలరాజుగారు పంపివేసిరి; రంగారావునకు సకులోపచారములు చేయించిరి. రెండు గడియలలో వాఁడు తేఱుకొనెను; చుట్టుపట్టులఁ దేఱి పాఱఁ జూచెను. అందఱును దనవలన నింతో యెంతో యపకృతి నొందిన వారే. ఏమి చేయఁగలఁడు? ఇంక బుద్ధిగా బ్రతికెదనని ప్రమాణము చేసి తన్ను విడిచిపెట్టుఁడని గోపాలరాజుగారిని వేఁడుకొనెను. ఎవరును వానిని హింసింప వలయుననక కనికరించి విడిచిపెట్టిరి. తలవేల వేసికొని వాఁడు కర్ణాట దేశము వీడి యఱవదేశమునకు బ్రదుకఁ బోయెను.

# 24

## "ముగింపు"

స్నానములు చేసి ధౌత పరిధానములుగట్టి మన కథా పాత్రము లన్నియు సౌధోపరి భాగంబున కేగెను. పూర్ణిమా హిమాంశువు గగన తలంబున వెలింగి పోవు చుండెను. చంద్రికా కలాపము సాంద్రమై ప్రపంచము నమృతస్నానము చేయించుచుండెను. చందనాచల వాత పోతమ్ములు చలచల్లగా మెలమెల్లగా సురభిళములయి వీచు చుండెను. డాబామీఁద దివ్యమంటపమునఁ దూర్పు మొగముగా వేణుగోపాలకృష్ణుని రూప పటము సర్వాభరణ భూషితమై పుష్పదామాభి శోభితమయి విరాజిల్లు చుండెను. త దుభయ పార్శ్వంబులందును రాధారుక్మిణులు చిఱునవ్వు మోములతోఁ జెలంగుచుండిరి. ధరా రమాపరావతారిణులగు నా రాధారుక్మిణులతోఁ గూడి భక్తజనతావన కార్య దీక్షా పరతంత్రములగుఁ గటాక్షమ్ముల వెదచల్లుచు, న య్యనంత కళ్యాణగుణగణాలంకరిష్ణుండగు శ్రీకృష్ణుఁడు, నభినవ జరధర శ్యామాభిరామ సుందమూర్తి, నాఁడు సకల కళా ప్రపూర్ణుఁడగు సుధాకరున కెదురుగ శోభిల్లుచుండెను. 'యథారాజా, తథాప్రజా' యనుసూక్తి నుద్భోధించుచుఁ ద చ్చరణ తలాసనాసీనుడై మన కథా నాయకుఁడు శ్యామసుందరమూర్తియు, రాధారుక్మిణులఁ దలపించు పూఁబోణులు చిత్రాపూర్ణిమ లిరుగెలంకులఁ గొల్వఁ ద దానంద స్వరూపియయి చిన్నిబాలుఁడు గోపాలకృష్ణుఁ డంక తలంబున నధి

వసింప నత్యంత భక్తిశ్రద్ధలతో షోడశోపచార విధుల భట్టాచార్యులు పూజసేయింప సహస్ర నామార్చనము గావించి యదుకుల భ్రాజిష్ణుని శ్రీకృష్ణుం బూజించి సేవించెను. చిత్రాపూర్ణిమా రమణీమణులు స్వామికి హారతి యిచ్చిరి. పూర్ణిమయు శ్యామసుందరుఁడును జిత్రతోఁ గంఠస్వరములు గలిపి మంగళ హారతులు పాడిరి. మీఁద వివరించిన స్త్రీ పురుషులా యానందోత్సవమును గనులారఁ గాంచి ముదంబుధిం దేలియాడిరి. తే తని వెలుంగు వెల్లికలలోఁ గూరుచుండి, దుర్గాంబయు సదాశివరావును, రఘురామ రాజును, గోపాలరాజును, నా జగన్నాటక సూత్రధారునిం గన్నుల కఱవు దీఱఁజూచుచు, నతనిం బోలి చిత్రాపూర్ణిమలం గూడి తమకుఁ గన్నుల పండువు సేయుచున్న శ్యామసుందరుం జూచుచుఁ దనివి పొందలేక పోయిరి. చిన్నబాలుఁ డా జాబిల్లి వెన్నెల వెలుఁగులలో నా జలి వెలుఁగులద్వార నెక సక్కెములాడు నెమ్మోముననఁ జిఱునవ్వు వెన్నెలలు చిందులు ద్రొక్కఁ బులకండపుం బలుకులఁబోలు తన ముద్దు పలుకుల నందఱకు వీనుల విందొనర్చుచు, నొక్కొక్కరి కడ కరుగుచు మోములు చూచి నవ్వుచు బొట్టులు పెట్టుచుఁ బ్రసాదంబు లొసంగుచుఁ బరమానందమును బంచి పెట్టెను.

పూజ ముగిసిన యనంతరము వీణలు ధరించి, సీతయుఁ బూర్ణిమయు జంటఁ గలిసి యొకరి కొక రీడు తీయక తత్కాలోచిత రీతిని నతి మధుర మధురములగు తమ గాత్ర స్వరంబు లా జంత్ర స్వరంబులఁ గలిపి గాన

సుధా లహరి నెల్లర యుల్లంబులఁ బల్లవింపఁ జేసిరి. మంగ
ళము పాడిరి.

రెండు సంవత్సరములకు మును పీ నాఁడే మా బాలకు
లీ సౌధముననే క్రింది యంతరువున నీ యుత్సవమును దిల
కించి యుండిరి. నాఁ డేదినము? నేఁ డేదినము? శ్యామసుంద
రుని పత్ను లిర్వురుం గవల పిల్లలుగా దుర్గాంబికా గర్భ
మునఁ బుట్టిన దే దినము? ఇక్కథానకమున కభిధాన
మేమి? అది చిత్రాపూర్ణిమ!

“ శ్రీ శ్యామసుందరార్పితము ”



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | అచ్చు | | సవరణ |
|---|---|---|---|---|
| 3 | 9, 17 | రకు | — | ఠకు |
| 4 | 1 | రకు | — | ఠకు |
| | 7 | నశ్యం | — | నస్యం |
| 5 | 6 | జెప్పి | — | జెప్పియాయన |
| 16 | 20 | రము, | — | రము. |
| 22 | 8 | చూతుపు | — | చూతువు |
| 23 | 19 | రాజబాట | — | రాచబాట |
| 24 | 7 | దోస్రాఙ | — | దోస్త్రాఙ |
| 27 | 20 | దీసి. | — | దీసి, |
| 29 | 17 | మాధ్రవ | — | మాధ్వ |
| 32 | 19 | గాపున | — | గావునఁ డిప్పు |
| 36 | 3 | దమతమ | — | దమ |
| 39 | 21 | మహామ | — | మహాత్మ |
| 40 | 16 | మఱుఁడు | — | మఱునాఁడు |
| | ,, | కాల | — | కాల్య |
| 62 | 6 | విధివేక | — | విధిలేక |
| 70 | 13 | ప్రశ్నించిన అంత | — | ప్రశ్నించినంత |
| 100 | 20 | మపేక్షితమె | — | మపేక్షితమై |
| 101 | 8 | నామంబు | — | నామనంబు |
| 108 | 8 | యాకళ్యాణ | — | యీకళ్యాణ |
| 108 | 19 | నారోగ్యర్తిం | — | నారోగ్యక్తిం |

| పుట | పంక్తి | అచ్చు | | సవరణ |
|---|---|---|---|---|
| 109 | 18 | తొలుకరి | — | తొలకరి |
| | ,, | పాటలు | — | పాటులు |
| 110 | 19 | కుటుంబములో | — | కుటుంబములలో |
| 115 | 10 | కలిమియో, | -- | కలిమియో-లేమియో, |
| 117 | 6 | శ్రేణినొక | — | శ్రేణిని |
| 118 | 7 | తారలుగా | — | తారములుగా |
| 121 | 5, 7 | భటును | — | భట్టును |
| 128 | 4 | మిమ్ము | — | మమ్ము |
| 137 | 8 | తోడుకొని | — | యామెను దోడుకొని |
| 145 | 19 | పరితాం | — | పరితాపాం |
| 146 | 15 | బిడ్డి | — | బిడ్డ |
| 148 | 8 | అమాయకు | — | అమాయికు |
| 156 | 13 | మృధు | — | మృదు |
| 157 | 24 | సేసియంత | — | సేసినంత |
| 180 | 1 | వెలుక | — | వెనుక |
| 182 | 8 | మూఁక | — | మూఁగ |
| 183 | 7 | నీ కౌనంద | — | నా కౌనంద |
| 187 | 10 | బోలె | — | బోలి |
| 188 | 8 | చేయించెచు | — | చేయించెను. |
| 190 | 16 | నొక్కటిగ | — | నొకొక్కటిగ |
| 192 | 22 | కమీల | — | మీల |
| 194 | 17 | పదప | — | పిదప |
| 208 | 24 | సము | — | సావాసము |
| 205 | 17 | కాఁపుడులు | — | కాఁపులు |

